తాళ్ళపాక పదసాహిత్యము - సంపుటము - 29

# శృంగార సంకీర్తనలు



అన్నమాచార్య ప్రాజెక్టు
తిరుమల తిరుపతి దేవస్థానములు.

శ్రీరస్తు

# శ్రీ తాళ్లపాక
# అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు

పరిష్కర్త :

**గౌరిపెద్ది రామసుబ్బశర్మ**

తాళ్లపాక పదసాహిత్యం - సంపుటం -29

# శృంగార సంకీర్తనలు

(తాళ్లపాక అన్నమాచార్య విరచితములు)



ప్రచురణ

అన్నమాచార్య ప్రాజెక్టు

తిరుమల తిరుపతి దేవస్థానములు

1999

# విన్నపము

*ఇందరికి అభయంబు లిచ్చు చేయి*
*కందువగు మంచిబంగారు చేయి ॥*

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని, మాహాత్మ్యాన్ని, తత్త్వాన్ని 32,000 అధ్యాత్మ, శృంగార సంకీర్తనలుగా రచించినవాడు తాళ్లపాక అన్నమాచార్యులు. ఇందులో మనకు సుమారు 13,000 సంకీర్తనలు మాత్రమే లభించాయి. వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు పదకవులే ! తాళ్లపాక కవులు క్రీ॥శ॥ 15-16 శతాబ్దాలకు చెందినవారు. వీరి స్వస్థలం ఆంధ్రప్రదేశ్‌లోని కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్లపాకగ్రామం.

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో వైష్ణవమత ప్రచారం కోసం తిరుమలను కేంద్రంగా చేసుకొని శ్రీ వేంకటేశ్వరాంకితంగా వేలకొలది సంకీర్తనలను, ఇతర సాహిత్య ప్రక్రియలను రచించినవారు తాళ్లపాకకవులు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవలో తరించిన ధన్యమూర్తులు.

తాళ్లపాక పదకవిత్రయంగా కీర్తిగడించిన తాళ్లపాక అన్నమాచార్యుల, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్యల సంకీర్తనల రాగిరేకులు తిరుమలలో శ్రీవారి ఆలయంలో 'తాళ్లపాక అర'లో లభించాయి.

తాళ్లపాక కవుల సంకీర్తనల భాండాగారం గూర్చిన మొదటి శాసనం క్రీ॥శ॥ 1530 సంవత్సరంలో కనిపిస్తుంది. తదుపరి క్రీ॥శ॥ 1545, 1547, 1554, 1558 సంవత్సరాల నాటి శాసనాల్లోను సంకీర్తనభాండాగారం గూర్చిన ప్రస్తావన కనిపిస్తుంది. ఇవి తిరుమల తిరుపతి దేవస్థానాల శాసనాలు.

తిరుమల తిరుపతి దేవస్థానములవారు క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి తాళ్లపాక కవుల సంకీర్తనల ముద్రణకు పూనుకొన్నారు. క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి క్రీ॥శ॥ 1992 సంవత్సరం వరకు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాల ముద్రణలో వివిధ దశలు కనిపిస్తాయి.

1922 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానాలవారు రాగిరేకుల్లోని తాళ్లపాక కవుల సంకీర్తనలను వ్రాతప్రతుల్లో వ్రాయించటానికి పూనుకొన్నారు.

1935-38 సంవత్సరాల్లో తాళ్లపాక కవుల లఘుకృతులు, తాళ్లపాక కవుల సంకీర్తనలు సంపుటాలుకొన్ని వెలువడ్డాయి.

1947-65 సంవత్సరాల్లో తాళ్లపాక కవుల అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు కొన్ని సంపుటాలు ముద్రించబడ్డాయి.

1947-1965 సంవత్సరాల మధ్యకాలంలో నిరాఘాటంగా కొనసాగిన తాళ్లపాక పదకవుల సంకీర్తనల ముద్రణ తరువాత ఒక దశాబ్దంపాటు కొనసాగలేదు.

1975-1986 సంవత్సరాల మధ్యకాలంలో తాళ్లపాక పదకవుల సంకీర్తనలు కొన్ని సంపుటాలు వరకు, మరియు అధ్యాత్మ సంకీర్తనలు కొన్ని సంపుటాలు పునర్ముద్రింపబడ్డాయి.

తదుపరి 1992 సంవత్సరంలో ఒక సంపుటం ముద్రింపబడినది.

ఇంతేకాక తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్ర, తాళ్లపాక కవుల ఇతర సాహిత్య ప్రక్రియలను ఈ దశల్లోనే తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రించింది.

ఈ వివిధ దశల్లో తాళ్లపాక పదకవుల సంకీర్తనలను రాగిరేకులనుండి పరిష్కరించిన మహాపండితులు కీ॥శే॥ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, పండిత విజయరాఘవాచార్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, పి.టి. జగన్నాథరావు, గౌరిపెద్ది రామసుబ్బశర్మ, శ్రీయుతులు ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారలు.

తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించినప్పటినుండి తాళ్లపాక అన్నమాచార్య సంకీర్తనలకు దేశవ్యాప్తంగా విశేషవ్యాప్తి ఏర్పడింది. తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు సాహితీవేత్తలకు, సంగీత విద్వాంసులకు వరకవిత్వ వాణీవీణా నినాదాలైనాయి. ఈ సంకీర్తనలు భక్తులకు మోక్ష మార్గాన్ని తెలిపే విశిష్టరచనలు. పరిశోధకులకు, సాహిత్యచరిత్రకారులకు కొంగుబంగారమై విలసిల్లుతున్నాయి. తాళ్లపాక కవుల సంకీర్తనలకు సంగీత, సాహిత్య, భక్తలోకంలో నేడున్న ఆదరణ ఎనలేనిది.

ఈ ఆవశ్యకతను గుర్తించి వివిధ దశల్లో పరిష్కరింపబడి, ముద్రించబడిన తాళ్లపాకకవుల సంకీర్తనలను ఒక్కసారిగా సమగ్రరీతిలో ముద్రించడానికి తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం సంకల్పించింది.

ప్రథమతః తాళ్లపాక కవుల సంకీర్తనలను సమగ్రంగా 29 సంపుటాలుగా లోకానికి అందిస్తున్నాం.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళిక రూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త) విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందం గారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యూమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) డా॥ ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరెక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A.,Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం. తిరుపతి) హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాము.

దీని తర్వాత తాళ్లపాక కవుల లఘుకృతులు, ఇతర కావ్యాలు వెలువరించడానికి ప్రణాళిక సిద్ధంచేస్తున్నాం.

ప్రస్తుతం వెలువడుచున్న తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు శ్రీ వేంకటేశ్వర స్వామివారి కృపా కటాక్షంచే భక్తజనామోదం పొందగలవని విశ్వసిస్తున్నాం.

**M.K.R. వినాయక్**
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు

# నివేదిక

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో భక్తి, ప్రపత్తి, దేహాత్మైక విచారాదులను తెలిపే అధ్యాత్మసంకీర్తనలు; జీవాత్మ, పరమాత్మల ఐక్యాన్నిచాటే అమలిన దివ్య శృంగార సంకీర్తనలు రచించినవారు తాళ్లపాక కవులు. సకల దేవతా స్వరూపమైన శ్రీ వేంకటేశ్వరస్వామి తత్త్వాన్ని ఎన్నోవేల సంకీర్తనలద్వారా లోకవిదితంచేసి ఆత్మకల్యాణంతోపాటు లోక కల్యాణం సాధించిన వారు తాళ్లపాక అన్నమాచార్యులు, వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు. శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వంగా భావించి ఉభయ విభూతినాయకుడైన ఆ స్వామి కల్యాణగుణాలను ఎన్నోవేల సంకీర్తనల్లో కీర్తించారు. శరణాగతి తత్త్వాన్ని ప్రబోధించారు.

క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి నందకాంశ సంభూతుడుగా తాళ్లపాక అన్నమాచార్యులు జన్మించాడు. తన పదహారవయేట శ్రీ వేంకటేశ్వరుని సాక్షాత్కారం పొంది స్వామి ఆదేశంతో సంకీర్తనరచనకు శ్రీకారం చుట్టి ఆనాటినుండి జీవితాంతంవరకు దినమునకు ఒక్క సంకీర్తనకు తక్కువ కాకుండా సంకీర్తన రచన సాగించాడు. పల్లవి, చరణాలతో కూడిన సంకీర్తన రచనకితడు మార్గదర్శకుడై 'పదకవితాపితామహుడ'ని కీర్తి గడించాడు. అన్నమయ్య పదాలలో సంగీతం, సాహిత్యం, భగవద్భక్తి త్రివేణీ సంగమంలా మేళవించాయి.

శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వమూర్తిగానే కాకుండా వివిధ ఆగమ సంప్రదాయాల్లో వినుతుడైన వైభవమూర్తిగా కూడా అన్నమయ్య కీర్తించాడు. ఆంధ్రవాగ్గేయకారుల్లో అనేక వైష్ణవ క్షేత్రాలను సందర్శించి ఆయాక్షేత్ర మూర్తులపై వివిధ సంకీర్తనలను రచించిన ఘనత తాళ్లపాక అన్నమాచార్యులదే!

అన్నమయ్య భగవత్తత్త్వాన్ని అనేక జానపద గేయరీతుల్లో రచించి సామాన్యులకు అందించే ప్రయత్నంచేశాడు. అన్నమయ్య గ్రాంథిక, శిష్టవ్యావహారిక, వ్యావహారిక భాషాశైలులలో సంస్కృతాంధ్ర సంకీర్తనల్ని రచించాడు. జానపదుల జీవద్భాషను సర్వతంత్ర స్వతంత్రంగా వాడి సంకీర్తనల రచనాశైలిలో తర్వాతి వాగ్గేయకారులకి మార్గదర్శకుడైనాడు.

అన్నమయ్య పదాలు శ్రీ వేంకటేశ్వరముద్రాంకితాలు. వీరి బాటను అనుసరించిన వారు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, తాళ్లపాక చినతిరుమలాచార్యులు.

ఇహపర శ్రేయోదాయకమైన తాళ్లపాక అన్నమాచార్యులు, ఇతర తాళ్లపాకకవుల సంకీర్తనలను భక్తజనానికి అందించాలని తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో సంకల్పించి అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించింది. అప్పటినుండి అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే గానంచేయబడిన తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు ఆంధ్ర ప్రదేశ్‌లోనే కాక, ఆంధ్రేతర రాష్ట్రాలలో కూడా బహుళ ప్రచారం, ప్రాచుర్యం పొందాయి.

అన్నమాచార్య ప్రాజెక్ట్ తాళ్లపాక అన్నమాచార్య, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనల ప్రచారం-పరిశోధన -రికార్డింగ్ శాఖల సమన్వయంతో వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే వేలకొలదిగా సంగీత సభలు, పరిశోధకులచే సాహితీసమావేశాలు నిర్వహించింది, మరియు తాళ్లపాక కవుల సంకీర్తనలను ఆడియో క్యాసెట్లుగా విడుదలచేసి బహుజనామోదం పొందింది.

తిరుమల తిరుపతి దేవస్థానంచే 1949 సంవత్సరం నుండి ప్రతి సంవత్సరం అన్నమాచార్య వర్ధంతి ఉత్సవాలు, 1978 సంవత్సరం నుండి అన్నమాచార్య జయంతి ఉత్సవాలు జయప్రదంగా నేటికీ నిర్వహింప బడుచున్నవి. మరియు అన్నమాచార్య సంకీర్తనోత్సవాలు కుగ్రామ స్థాయినుండి మహానగరాలస్థాయివరకు జరుగుచున్నాయి. అన్నమాచార్య ప్రాజెక్ట్ వివిధ విశ్వవిద్యాలయాల

సమన్వయంతో తాళ్లపాక కవుల సాహితీ సదస్సులు నిర్వహిస్తున్నది. తిరుమల తిరుపతి దేవస్థానం 1978సం॥ నుండి తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సాహిత్యంపై వివిధ విశ్వవిద్యాలయాల్లో పరిశోధన చేసేవారికి ఉపకారవేతనం ఇచ్చి ప్రోత్సహిస్తున్నది. ఈ ప్రణాళిక క్రింద ఇప్పటివరకు దాదాపు 50 సిద్ధాంతవ్యాసాలు సమర్పింపబడ్డాయి.

తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలపట్ల నానాటికీ పెరుగుచున్న ప్రజాదరణ, మరియు 1935వ సంవత్సరం నుండి వివిధ దశల్లో ముద్రింపబడిన తాళ్లపాక అన్నమయ్య, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్య సంకీర్తనల సంపుటాలు ఏనాడో చెల్లిపోయిన కారణంగా నేడు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు సమగ్రంగా పునర్ముద్రించవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

పూర్వముద్రణ సంపుటాల్లోని పూర్వపరిష్కర్తల పీఠికలు యథాతథంగా ముద్రింపబడుచున్నాయి. పరిష్కర్తచే పీఠికలో సూచింపబడిన సంపుటాల సంఖ్యలు పూర్వముద్రణకు సంబంధించినవి. తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రితమవుతున్నందువల్ల ముద్రణ, పాఠకుల సౌకర్యార్థం క్రమపద్ధతిలో వుండాలనే వుద్దేశ్యంతో పూర్వముద్రణ సంపుటాల సంఖ్యలు మార్చబడినవి. సంపుటాల సంఖ్యల మార్పులు ప్రత్యేకంగా పట్టికలో చూపబడింది.

తిరుమల తిరుపతి దేవస్థానానిక రాగిరేకుల్లో లభించిన తాళ్లపాక కవుల సంకీర్తనలు మొత్తం నేడు ముద్రించబడుచున్నందువల్ల సమగ్రమనే పదం సూచికంగా వాడబడింది.

భక్తిభావ విలసితాలైన తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలను సమగ్రంగా ముద్రించుటకు ఆమోదించిన తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తృత్వమండలి అధ్యక్షులు శ్రీకలిదిండి రామచంద్రరాజాగారికి, మరియు ధర్మకర్తృత్వమండలి సభ్యులకు మా హార్దిక కృతజ్ఞతాంజలి.

ఈ సంపుటాల ముద్రణకు అధికారికమైన ఆమోదాన్ని తెలిపిన తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.కె.ఆర్.వినాయక్ I.A.S. గారికి కృతజ్ఞతాంజలి.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళికరూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త), విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందంగారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యూమానిటీస్ & ఎక్స్టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A., Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) మా హార్దిక కృతజ్ఞతాంజలులు.

ఈ సంపుటాల ముద్రణలో సాంకేతికపరమైన సహకారాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రణాధికారి శ్రీ ఎం. లక్ష్మణరావుగారికి, వారి సిబ్బందికి, తి.తి.దే పౌరసంబంధ శాఖాధికారి శ్రీ పి. సుభాష్‌గౌడ్ గారికి కృతజ్ఞతాంజలులు.

డా॥ మేడసాని మోహన్ M.A., Ph.D
డైరక్టర్
అన్నమాచార్య ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

తేది : 10-2-98

# తాళ్లపాక పదకవుల సంకీర్తనల సంపుటాలు

## సంఖ్యా వివరణ పట్టిక - 1998

| సంపుటాలు | మునుపటి సంఖ్య | ఇప్పటి సంఖ్య | సంకీర్తనాచార్యుని పేరు |
|---|---|---|---|
| అధ్యాత్మ సంకీర్తనలు | 1 | 1 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 2 | '2 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 3 | 3 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 10+11(1,2భాగాలు) | 4 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 12 | 5 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 4 | 6 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 13 | 7 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 14 | 8 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 15 | 9 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు | 16 | 10 | తాళ్లపాక చినతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 17 | 11 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 18 | 12 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 19 | 13 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 20 | 14 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 21 | 15 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 22 | 16 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 23 | 17 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 24 | 18 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 25 | 19 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 26 | 20 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 27 | 21 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 28 | 22 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 29 | 23 | తాళ్లపాక అన్నమాచార్యులు |

| | | | |
|---|---|---|---|
| శృంగార సంకీర్తనలు | 30 | 24 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 31 | 25 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 32 | 26 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 33 | 27 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 34 | 28 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 35 | 29 | తాళ్లపాక అన్నమాచార్యులు |

* తాళ్లపాక పదసాహిత్యం మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రణచేయబడుచున్నది. ఈ సందర్భంగా సంకీర్తనల సంపుటాల సంఖ్యలు క్రమపద్ధతిలో ఉండాలనే వుద్దేశ్యంతో మార్పులు చేయబడి, పై పట్టికలో చూపబడినవి. పై పట్టికలోని మునుపటి సంఖ్య వరుసలో సూచింపబడిన 33, 34, 35 సంపుటాలు ఇంతవరకు ముద్రింపబడలేదు. ఇప్పుడు ప్రథమంగా ప్రచురింపబడుతున్నాయి. అయినప్పటికి ప్రస్తుతం 1998 సం॥లో క్రొత్తగా 1వ సంపుటం నుండి ఇవ్వబడిన క్రమ సంఖ్యలు ఈ ప్రథమ ముద్రణ సంపుటాలకు చేర్చబడినవి. వివిధ దశలలో 5, 6, 7, 8, 9 సంపుటాలు ప్రస్తుతం 1, 2, 3 సంపుటాలుగా గ్రహింప వినతి. వివరములకు ఆయా సంపుటాల పీఠికలు చదువగలరు. ఈ మార్పును సహృదయ పాఠకులు గమనించగలరు.



# అన్నమయ్య పదకవితలు
# శ్రీనివాస పదవిన(ను)తులు

**అఖిల భువన జన్మ స్థేమ భంగాదిమూలే**
**వినత వివిధ భూతవ్రాతరక్షైక దీక్షే**
**శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే**
**భవతుమమపరస్మిన్ శేముషీ భక్తిరూపా**

(భగవద్రామానుజాచార్యులు)

పై శ్లోకంలోని నాల్గవ పాదంలో పేర్కొనబడిన "శేముషీ భక్తిరూపా" అన్న భావంలోని తాత్పర్యం అన్నమాచార్యుల వారికి సమగ్రంగా సమన్వయిస్తుంది. పద కవితారూపతపస్సుగా తన శేముషీవైభవమును పర్యవసింపజేసి కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామిని ప్రసన్నంచేసుకో గలిగాడు అన్నమయ్య. "హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ సురుచి భ్రాజితమైన మానససరస్ఫూర్తిన్ విరాజిల్లు" - అన్న పోతన గారి సూక్తి కనుగుణంగా అన్నమయ్య రచించిన ఒక్కొక్క సంకీర్తనము ఒక్కొక్క భక్తి రస సరోవరంగా పేర్కొనవచ్చు. అసంఖ్యేయ కల్యాణగుణ గణౌఘమహార్ణవుడైన శ్రీ వేంకటేశ్వరుని తత్త్వమహత్త్వాలను, దివ్యలీల భూతిని అక్షరరూపంగా భక్తలోకం ఆరాధించుకొనే అవకాశం కల్పించిన మహాభక్తుడు అన్నమయ్య. అరవిందాక్ష పదారవిందమకరందాసక్తి - పుష్కలంగా కలిగి ఆ దివ్యానందమకరందాన్ని తనివిదీరా తాను ఆస్వాదించడమే కాక భావితరాల భక్తులకు అట్టి మహద్భాగ్యం కలిగించిన భాగవతోత్తముడు అన్నమయ్య.

## సంకీర్తన ప్రాదుర్భావము

భారతదేశం వేదభూమి. వేదం స్వరనాదశబ్దప్రధానం. పరిణతతత్త్వజ్ఞులైన మహర్షుల అనుభూతుల అక్షరరూపమే వేదం. చిత్తవృత్తికి తన్మయత్వం,

మధుర స్పందన, ఆనందదీప్తి కలిగింపగల శక్తి శబ్దానికీ, నాదానికీ ఉంది. లయాత్మకమైన శబ్ద, నాద స్వరాల సమ్మేళనం శ్రవణేంద్రియం ద్వారా అంతరంగాన్ని ప్రవేశించినంతనే హృదయం ఒక మధురస్ఫూర్తికి లోనవుతుంది. ఈ మధురస్ఫూర్తియొక్క పరిణామమే రసానందం. సంగీతసాహిత్యాలకు అనంతరసానందం కలిగించే మహత్తరశక్తి ఉంది. సాహిత్యం ఆలోచనామృత శీలురను అలరిస్తే, సంగీతం ఆబాలగోపాలాన్ని ఆనందింపజేస్తుంది. అన్నమాచార్యుల వారు సంగీత సాహిత్య తత్త్వాలను సమగ్రముగా అధ్యయనం చేసిన మహామనీషి. తొలితెలుగు వాగ్గేయకారులైన అన్నమయ్య మధుర భక్తి, శరణాగతి వంటి ప్రపత్తి మార్గాలను తన సంకీర్తనలలో ప్రతిపాదిస్తూ వేంకటేశ్వరోన్ముఖంగా తన పదకవితారూపతపఃప్రస్థానం సాగించాడు. ఫలం సాధించాడు.

సంస్కృతంలో శాఙ్గదేవుడు పేర్కొన్న ఈ క్రింది లక్షణాలన్నీ అన్నమయ్యలో పుంజీభూతంగా ఉన్నాయి.

*" వాఙ్మాతురుచ్యతే గేయం ధాతురిత్యభిధీయతే*
*వాచం గేయంచ కురుతే యఃస వాగ్గేయకారకః*
*శబ్దానుశాసనజ్ఞాన మభిధాన ప్రవీణతా*
*ఛందః ప్రభేద వేదిత్వమలంకారకౌశలమ్*
*రసభావపరిజ్ఞానం దేశస్థితిషుచాతురీ*
*అశేష భాషావిజ్ఞానం సకలశాస్త్రేషు కౌశలమ్*
*తూర్య త్రితయ చాతుర్యం హృద్యశారీరలాలితా*
*లయతాలకలాజ్ఞానం వివేకోనేకకాకుషు*
*ప్రభూతప్రతి భోద్భేద భావత్వం సుభగ గేయతా*
*దేశిరాగేష్వభిజ్ఞానం వాక్పటుత్వం సభాజ్యతే*
*రోషద్వేషపరిత్యాగః సార్ద్రత్వముచితజ్ఞతా*

*అనుచ్ఛిష్టోక్తి నిర్బంధో మాత్వధాతు వినిర్మితి:*
*పరచిత్త పరిజ్ఞానం ప్రబంధేషు ప్రగల్భతా*
*ద్రుతగీత వినిర్మాణం పదాంతరవిదగ్ధతా*
*త్రిస్థానగమక ప్రౌఢిర్వివిధాలప్తి నైపుణమ్*
*అవధానం గుణైరేభిర్వరో వాగ్గేయకారక:*

(సంగీతరత్నాకరము)

అన్నమయ్య సంస్కృతంలో "సంకీర్తన లక్షణము" రచించినాడు. పెదతిరుమలయ్య ఆ లక్షణమునకు వ్యాఖ్యానము కూడ రచించినట్లు తెలియుచున్నది. కాని నేడివి అలభ్యములు. ఈ లక్షణ గ్రంథమును చినతిరుమలయ్య తెలుగులోనికి అనువదించి యున్నాడు. మాత్రాచ్ఛందోబద్ధమైన మనోజ్ఞ శబ్దభావసమ్మేళనముతో సంకీర్తన రచన చేశాడు. మార్గదేశిచ్ఛందో గంధబంధురములైన ఈ కీర్తనలలోని ఛందోగమ నములను విశ్లేషించుటకు ఒక పరిశోధన సిద్ధాంతవ్యాస పర్యంతము కృషి చేయవలసి యున్నది. పద్య రచన - పదరచన ఒక దానికి మరొకటి ఎంత సమీపమున నుండునో, సన్నిహితముగా నుండునో నిరూపించిన ద్రష్ట అన్నమయ్య. ఈ సంపుటంలోని 140 వ సంకీర్తన ఈ విధంగా సాగుతుంది.

*చిన్నదాన నంటా నీవు సిగ్గు వడేవే*
*చన్నులను (నొ) రసి మోవి చవి చూపఁగదవే ॥*
*చేరి చూడఁగఁ జూడఁగా చీఁకటి వెలుగందురు*
*పేరఁబెట్టితే పాలే పెరుగందురు*
*కోరి కాచుకుండితే చిగురులే చేగలందురు*
*వోరుపుతో నాతని వూడిగాలే సేయవే ॥*

ఈ కీర్తన నిర్మాణము "ఆఁటవెలఁది" ఛందమునకు దగ్గరగామన్నది.

చిన్నదావననుచు సిగ్గను వడియేవు
చన్నులొరపి మోవి చవిని చూపు
చేరి చూడ చూడ చీకటి వెలుగం(ద్రు
పేర(బెట్టి పాలె పెరుగటం(ద్రు"

236 వ సంకీర్తనమున :
"చెప్ప(బోతే వెరగయ్యీ చెలిమేలు దా(చరాదు
వుప్పతిల్లు రతులను వోలలాడుమనవే ॥
కుప్పలాయ( బులకలు కోమలి చెక్కుల వెంట
రెప్పలనే యలపు( దేరీ నిదివో

అను నిర్మాణము "ఉత్సాహవృత్తము" నకు సమీపమున నున్నది.

"చెప్పబోవ వెరగునయ్యె చెలియమేలు దాచరా
దుప్పతిల్లు రతుల తోడవోలలాడ(గా
కుప్పలయ్యె( బులకలెల్ల కోమలాంగి చెక్కులన్
రెప్పలందు నలపు దీరె ..................

ఈ విధముగా మార్గ, దేశి సం(ప్రదాయములకు చెందిన అసంఖ్యాకమైన ఛందోరీతులు అన్నమయ్య సంకీర్తనలలో పొడసూపుతాయి. శబ్దస్వరూపమును, శబ్దగమనమును, శబ్దార్థముల విన్యాసములను బహుధా పరిశీలించిన అన్నమయ్య ఛందోగమనమును తన అదుపు, ఆజ్ఞలలో నుంచగలిగాడు. అందుకే పదకవితా పితామహుడైనాడు.

## సంకీర్తన ప్రాశస్త్యము

కలియుగమున భగవంతుని సంప్రీతుని గావించుటకై యజ్ఞయాగా లవసరం లేదు. జపతపాదులు కూడా పనిలేదు. కేవలం త్రికరణ శుద్ధి భగవద్గుణనామసంకీర్తనం చేస్తేచాలు. ఈ దృష్టితోనే శంకరభగవత్పాదులవా భగవద్రామానుజుల వారు, ఎందరో ఆళ్వార్లు, ఆచార్యపురుషులు అపారం స్తోత్ర సాహిత్యం సృష్టించారు. అన్నమాచార్యుల వారు సమాజంలోని దీనుల అర్థార్థులు, జిజ్ఞాసువులు, ప్రపన్నులు - ఐన వారి కోసం అందరికీ అందుబాటు ఉండే వ్యావహారికంలో సంకీర్తన రచన చేశాడు. ఈ క్రింది శ్లోకాలన్నీ సంకీ వాఙ్మయప్రాశస్త్యాన్ని ఉటంకిస్తున్నాయి.

*1* *నాహం వసామి వైకుంఠే ।*
*నయోగి హృదయేషుచ ।*
*మద్భక్తా యత్రగాయంతి ।*
*తత్రతిష్ఠామి నారద ॥*

*2* *హరే రామ హరేరామ*
*రామ రామ హరేహరే !*
*హరే కృష్ణ హరే కృష్ణ*
*కృష్ణ కృష్ణ హరేహరే*
*ఇతి షోడశకం నామ్నాం*
*కలికల్మషనాశనమ్*
*నాతః పరతరోపాయః*
*సర్వ వేదేషు దృశ్యతే*

*(కలిసంతరణోపనిషత్తు)*

*3* *నామ సంకీర్తనం యస్య*
*సర్వపాపప్రణాశనం* *(భాగ - 12 - 13 - 23)*

*4 ఏతావతా౽ల మఘనిర్హరణాయ పుంసాం*
*యత్కీర్తనం భగవతో గుణకర్మనామ్నాం (భాగ - 6 - 3 - 24)*

*5 సతతం శ్రీహరి సంకీర్తనం - తత్*
*వ్యతిరిక్త సుఖం వక్తుం నాస్తి*

ఇట్టి సంకీర్తన వాఙ్మయవైశిష్ట్యమును సమగ్రముగా, సాంగోపాంగముగా అవగాహనము చేసికొన్న అన్నమయ్య తెలుగు సాహితీజగత్తులో తానే ప్రప్రథమముగా ఈ కైంకర్యమునకు పూనుకున్నాడు. సంస్కృతమున జయదేవుడు, తమిళమున ఆళ్వార్లు - అన్నమయ్యకు ఈ ఉత్తేజం కలిగించారు. ప్రాచీనతమ వాఙ్మయంలో భక్తితత్త్వాన్ని గురించి ఉటంకించబడిన సందర్భాలు అన్నమయ్యను బాగా ప్రభావితం చేసి ఉండాలి. తన ప్రజ్ఞా పాటవప్రాభవాలన్నీ భక్తికి ఉన్ముఖంగా పర్యవసింపజేసిన భక్తశిఖామణి అన్నమయ్య.

1. *అథాతో భక్తిం వ్యాఖ్యాస్యామం :*
   *సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా (నారద భక్తిసూత్రములు)*
2. *అనన్య మమతా విష్ణౌ మమతా ప్రేమ సంగతా*
   *భక్తి రిత్యుచ్యతే భీష్మప్రహ్లాదోద్ధవ నారదైః (నారద పాంచరాత్రము)*
3. *మనోగతిరవిచ్ఛిన్నా హరౌ ప్రేమ పరిప్లుతా*
   *అభిసంధివినిర్ముక్తా భక్తిర్విష్ణువశంకరీ (నారద పాంచరాత్రము)*
4. *"భక్తిరస్యభజనం, ఏతదిహాముత్రోపాధి*
   *నైరాశ్యే నాముష్మిన్ మనఃకల్పమ్*
   (గోపాల పూర్వతాపిన్యుపనిషత్తు)
5. *యా ప్రీతిరస్తి విషయేష్వవివేక భాజాం*
   *సైవాచ్యుతే భవతి భక్తిపదాభిధేయా*

*భక్తిస్తు కామ ఇవ తత్కమనీయరూపే*
*తస్మాన్మమే రజని కాముకవాక్య భంగీ*
*(ద్రమిదోపనిషత్సారసంగ్రహము)*

6. *దర్శనం పరభక్తిస్యాత్ పరజ్ఞానంతు సంగమః*
*పునర్విశ్లేష భీరుత్వం పరమాభక్తిరుచ్యతే (యమునాచార్యులు)*

7. *మద్గుణ శ్రుతిమాత్రేణ మయి సర్వ గుణాశ్రయే*
*మనోగతిరవిచ్ఛిన్నా యథాగంగాంభ సోంబుధౌ*
*లక్షణం భక్తియోగస్య నిర్గుణస్యహ్యు దాహృతమ్*
*అహైతుక్యవ్యవహితా యా భక్తిః పురుషోత్తమే*
*(శ్రీమద్భాగవత తృతీయస్కంధము)*

భక్తి సిద్ధాంతమును గూర్చి పైఁజెప్పబడిన సందర్భములన్నియు అన్నమయ్య సంకీర్తన వాఙ్మయమునకు అనుసంధేయములే యగుచున్నవి. కొన్ని నిర్వచనములు ఆధ్యాత్మ సంకీర్తనలకు, కొన్ని శృంగార సంకీర్తనలకు సమన్వయించుకొనవచ్చును.

ప్రత్యేకించి ఈ సంపుటము శృంగారకీర్తనములతో నున్నది. ఇందలి కీర్తనములలో సకల జీవనాయికల విరహతాపాలు, విప్రలంభాలు, శృంగారభంగిమలు అక్షరరూపం ధరిస్తాయి. ఒక విధంగా భాగవతంలోని గోపికాభక్తితత్త్వాన్నే అన్నమయ్య శృంగార సంకీర్తనలలో ఆవిష్కరించాడు. "పుమాన్ విష్ణురితి ఖ్యాతః స్త్రీప్రాయమితరం జగత్" అన్న సూక్తికనుగుణంగా ప్రతి జీవనాయిక ఒక గోపికయై వేంకటేశ్వరుణ్ణి ఆరాధిస్తుంది. జీవనాయికా గోపికల శృంగారహావభావాలన్నీ సప్తగిరినాథునకున్ముఖంగా పర్యవసిస్తాయి.

*"తావావిదన్ మయ్యను షంగబద్ధ*
*ధియః స్వమాత్మా నమదస్త భేదమ్*

*యథా సమాధౌ మునయోఽబ్ధితోయే*
*నద్యః ప్రవిష్టా ఇవ నామరూపే*

తా : గోపికలు నా యందే బుద్ధినిల్పి మత్పరలై నా తోడిదే లోకంబుగా నుండిరి. అందువలన వారికి స్వదేహ విషయస్పృహ కలుగదు. సమాధిస్థితిలో ఆనందించు మునుల వలె, సముద్రగతములైన నదుల వలె మద్గత చిత్తలైన గోపికలకు వారి వారి నామరూపప్రత్యయములుండవు.

ఈ సంపుటమునందలి 139 వ సంకీర్తనమునందు నాయిక తన సింగారము నంతయు నాయకుఖైన వేంకటేశ్వరుని కర్పించుట పై గోపికా చిత్తతాత్పర్యము వలెనే యున్నది.

*"నెలఁత సింగారము నీ భాగ్యమాయ*
*తలఁపు లీడేరె మీకుఁదగుఁదగు నయ్యా ।*
*భామ చనుఁగవ నదె బంగారు వాన గురిసీ*
*తేమలెక్కి మోవి వెంటఁదేనెఁగారీని*
*మోమునఁ జంద్రకళలు ముంచి కారుకమ్మీని*
*నీ మోహము తెప్పలపై నించి తేలించ వయా ॥*
*మొనసి పెలవులను ముత్యాల పంటలు నిండె*
*తనువున వలపులు దైలు వారీని*
*ఒనరిన యారు పొంత మన్నవి వళి తరంగాలు*
*యెనసె నీ వేడుకలు యీఁదులాడించవయా ॥*
*ముంచిన చక్కఁదనాన మోహనరసము లుబ్బీ*
*నించెను కాఁగిటను పన్నీరు బుగ్గలు*
*యెంచఁగ శ్రీ వేంకటేశ యీకె నిట్టె యేలితివి*
*అంచల నీరతు లోలలాడించవయా ॥*

భాగవతములోని గోపికా మధురభక్తి భావనకు అందమైన అలంకారిక సుగంధాన్ని సంతరించాడు అన్నమయ్య. నాయిక తన అనన్య లావణ్యవయోవిశేషవైభవాన్నంతా కూడ నాయకునకు త్రికరణశుద్ధిగా సమర్పించింది. ముంచిన చక్కదనాలతో మోహనరసపరవశయైన నాయికను వేంకటేశుడు మన్నించి రతులనోలలాడించాడు.

భాగవతంలోనే గోపికా భక్తిని గూర్చి మఱియొక సందర్భంలో

*తన్మనస్కా: తదాలాపా:*
*తద్విచేష్టా: తదాత్మికా:*
*తద్గుణానేవ గాయంత్యో*
*నాత్మాగారాణి సస్మరు:*

తా: గోపికల మనస్సులు, చేష్టలు, మాటలు, నటనలు, సమస్తములైన ఆలోచనలు కృష్ణుని యందే లీనమై యుండెను. నిరంతర తదేక కృష్ణ చింతనామతులై తమ యిండ్లను గూడ మరచిరి.

ఈ సంపుటంలోని 161 వ సంకీర్తనంలో అన్నమయ్య ఈ భావాన్ని మనోజ్ఞంగా ఆవిష్కరించాడు.

*"ఇందాకా రతికేలికి నెదురు చూచితివి*
*పొందులొనగూడె గదె పూఁచినట్టు నీకు ॥*
*మంతనాన నాతనితో మాటలెల్లా నాడితివి*
*సంతోసమాయఁ గదవే సకియ నీకు*
*చెంతనుండి చేతులారా సేవలెల్లాఁ జేసితివి*
*పంతములు చెల్లెఁగదె పడఁతుల లోనను ॥*
*తిలకించాతనితోడఁ దేరకొన నవ్వితివి*
*తలఁపు లీడేరెఁగద తరుణి నీకు*
*వలపించి యిట్టికైవసము సేసుకొంటివి*

*వెలసెఁ గదవే నీ వేడుకలన్నియును ॥*
*రాఁపుగ శ్రీ వేంకటేశ ! రతులెల్లాఁ జే కొంటివి*
*కాఁపురము దక్కెఁగదె కలికి నీకు*
*యేఁపున నోలలాడితి వెనసి కాఁగిటిలోన*
*నీ పగటు మించెఁగదె నేఁడితని యెదుట ॥*

నాయిక యొక్క మాటలు, చేతలు, తలపులు, నవ్వులు - సమస్త భావపరంపరలను వేంకటేశ్వరుడు కైవసం చేసుకొన్నాడు.

కామవాసనా బంధురమైన శృంగారము లౌకికలంపటత్వమును కలిగించును కాని భగవత్ర్పసన్నత కలిగింపగలదా? యని పలువురి సందేహము. కామవాసనయైనను భగవద్బంధురముగా పర్యవసించినచో తప్పక ముక్తిభాజనమగునని భాగవతము వక్కాణించుచున్నది.

*"న మయ్యా వేశితధియాం కామః కామాయ కల్పతే*
*భర్జితాః క్వథితాధానాః ప్రాయోబీజాయ నేష్యతే*

*(భాగవతము - 10-22-30)*

*"మత్కామా రమణం జారం మత్స్వరూపా విధోబలాః*
*బ్రహ్మామామపరం ప్రాపుస్సంగాచ్ఛత సహస్రశః*

*(భాగవతము 11 - 12 - 12)*

తా: నా యందు (భగవానుని యందు) చేర్చబడిన కామ భావన లౌకిక కామము వలె గాక పరిణామ క్రమమున కామాది రహితమగును. వేయించబడిన విత్తనమునందు అంకురశక్తి నశించినట్లు, నాయందున్ముఖమైన కామాది చిత్త వృత్తులు కామరాహిత్యమునకే దారి తీయును.

గోపికల కామభావనలోని అంతరార్థమిది. పోతన గారు కూడా "కామోత్కంఠత గోపికల్" - అన్న చోట ఈ సిద్ధాంతమునే ప్రతి పాదించినాడు. ఈ సైద్ధాంతిక విశ్లేషనపట్ల సమగ్రముగా ఆకళింపు కలిగిన అన్నమయ్య ఈ

సంపుటంలోని 76 వ కీర్తనలో నాయిక మానసిక భంగులు వర్ణిస్తున్నాడు. తన అంతరంగంలో ఎందు చూచినా వేంకటేశ్వర చింతనం తప్ప అన్యం లేదు. మనోగతమైన కదలికలు, కవళికలూ - అన్నీ ఆ స్వామికే అర్పణం - అన్న తన్మయీ భావన ఈ కీర్తనలో రసోచితంగా ఆవిష్కరింపబడింది.

"నన్నుఁ జూచి నా లోనే నవ్వు వచ్చీని
యెన్నిక నో చెలులాల యేమి సోద్యమే ॥
యెచ్చరించి సారెసారె నెలయించీ మనసు
పెచ్చురేఁగి తమకము పెనచీ మనసు
తచ్చి యాతని పొందులు తలఁపించీ మనసు
యిచ్చట నో చెలులాల యేమని చెప్పుదునే ॥
యెదురు చూపించి బయలీఁదించీ మనసు
కదిసేటి యాసలఁ గరఁగించీ మనసు
గుదిగొని రతులెల్లాఁ గోరించీ మనసు
యిదివో చెలులాల యేమి సేతునే ॥
చెప్పరాని ప్రియములు చెప్పించీమనసు
ముప్పిరి వావలపులు ముదిరించీ మనసు
అప్పుడు శ్రీవేంకటేశుఁ డాతఁడే వచ్చి నన్నేలె
యిప్పుడు నో చెలులాల యేమందునే ॥

"అసంశయం మహాబాహూ మనోదుర్నిగ్రహం -" అన్నట్లుగా చాంచల్య భూయిష్ఠమైన మనస్సు యొక్క సకలాలోచనాతరంగాలను వేంకటేశ్వరుని వశంచేసిన నాయిక తన్మయత్వం పై కీర్తనలో చక్కగా విశ్లేషింపబడింది. ఈ సంపుటంలో అన్నమయ్య చెన్నకేశవుడు, రాముడు, కృష్ణుడు, బాలకృష్ణుడు - మొ॥ మూర్తులను శృంగారమధురభక్తిరసావేశంతో కీర్తించాడు. ఎన్నో లౌకిక భావాలకు అలౌకిక దీప్తి సంతరించాడు. లోకవృత్తాన్ని, లోకధర్మాన్ని ద్రష్టగా,

పదకవితాస్రష్టగా ఆలోకనం చేసి అవన్నీ సప్తగిరీశ్వర సముఖం చేరేటట్లుగా చేశాడు.

రైతు జన జీవనానికి సంబంధించిన సన్నివేశాలతో నాయిక వివిధావస్థలను సమన్వయం చేసి రచించిన ఈ శృంగారకీర్తన అన్నమయ్య సకలోహావైభవ సనాథత్వాన్ని చాటుతూ ఉంది.

*"ఎంత భాగ్యవంతుఁడవో యిన్నియును నొవగూడె*
*మంతవాన నీకె నిట్టె మప్పంచవయ్యా ॥*
*చెలిమి చేటఁడు చల్లె చెలియ నీమీఁదను*
*కలికి తనాలు నీకు గంపలఁబెట్టె*
*వలపులు నీ యెదుట వాములుగాఁగూడ పెట్టె*
*యెలమి నీ కోరికె లీడేరె నయ్యా ॥*
*నగవులు మూటగట్టె నలినాక్షి నిన్నుఁజూచి*
*పగటుఁ జేతలు నీకు బండ్లఁబెట్టె*
*మొగమిచ్చ లెల్లా నీ ముందర దొంతి వేరిచె*
*తగులాయములు నీకు దలకూడెనయ్యా ॥*
*వావులు గాదె బోసె వనిత నీ పొందుసేసె*
*మోవిపన్నులు నీ మీద మోపు గట్టెను*
*యీ వేళ శ్రీ వేంకటేశ యీకె యలమేలుమంగ*
*దేవులాయ నీ వేడుక తిరమాయనయ్యా ॥*

చేట, గంప, వాములు, బండ్లు, మూఁట, దొంతి, గాదె, మోపు - ఇవన్నీ రైతుల జీవనంతో ముడివేసుకున్న పదాలు.

**తరువాతి కవులపై అన్నమయ్య ప్రభావం**

16 వ శతాబ్దంలో ప్రముఖులైన ప్రబంధకవులు, తరిగొండ వెంకమాంబ వంటి భక్తకవయిత్రులు, క్షేత్రయ్య మొ॥ పదకవులు అన్నమయ్య కూర్చిన శబ్ద

బంధాలతోనో, భావపరంపరలతోనో, ఆలంకారిక విశేషాలతోనో ఉత్తేజం పొందిన వారే. ఈ అంశంపై ఒక సిద్ధాంతవ్యాసానికి కావలసినంత సామగ్రి ఉంది. క్వాచిత్కంగా కొన్ని ఉదాహరణలు పొందుపరుస్తాను.

ప్రబంధనాయికలందరూ నాయకుని పై మక్కువ పెంచుకొని విరహవేదన ఎక్కువైనపుడు తాపాన్ని భరింపలేక చంద్రుని, గంధవహుని, మన్మథుని నిందాలాపాలు చేస్తూ ఉంటారు. చంద్రోపాలంబనము, మన్మథోపాలంబనము వంటి శీర్షికలతో కవితా శిల్పబంధురములైన ఎన్నో పద్యాలు ప్రతి ప్రబంధంలోనూ కనిపిస్తాయి. ఇట్టి ఉపాలంబనమునకు సంబంధించిన ఒక కీర్తన ఈ సంపుటంలో ఉంది.

*"కొమ్మ వలపులకెల్లా గురి యీతడు*
*నెమ్మది నెచ్చరించరే నెరవేరీఁబనులు ॥*
*చందమామ నననేల చల్లగాలి దూరనేల*
*చెంది పతిఁ దోడితేరే చెలులాల*
*గందమెంత మెత్తేరే కప్పురమేల చల్లేరే*
*పొందు సేసి యీతనినే బోదించరే ॥*
*వలరాజు దిట్టనేల వసంతుని గొడవేల*
*చెలువునికిఁ జెప్పరే చెలులాల*
*కలువలెందుకు వచ్చు కడు బన్నీరేమిటికి*
*తలపించి యీతనికే దయవుట్టఁ జెప్పరే*
*కాంతనూరడించనేల కన్నవారినాడనేల*
*చెంతఁ బతిఁ గొసరరే చెలులాల*
*ఇంతట శ్రీవేంకటేశుఁడీకె నేలె దానె వచ్చి*
*పంతాన నిద్దరిని (కి) సోబానఁ బాడరే ॥  (116 వ కీర్తన)*

ఈ సంకీర్తనలోని భావవామనుడే అనేక ప్రబంధాలలో శిల్పత్రివిక్రముడై

రసజ్ఞలోకానికి సాక్షాత్కరిస్తాడు. ఆంధ్రకవితా పితామహుని దగ్గర నుంచి అనేకమంది ప్రబంధకవులు ఈ అంశంలో అన్నమయ్య నుండి ఉత్తేజం పొందిన వారే.

**రామరాజ భూషణుడు :**

"లలనా జనాపాంగ లలితసుమ చాపా" - అన్న అన్నమయ్య లాలిపాటలోని శబ్దబంధం వైపు ఆకృష్టుడైన రామరాజభూషణుడు "లలనాజనాపాంగ వలనావసదనంగ తులనాభికాభంగ దోఃప్రసంగము" - అన్న శిల్ప సుందరమైన సీసపద్యాన్ని రచించాడు. ఈ సంపుటం లోని

*"చెలికత్తె లిందరును సేసేరు విన్నపాలు*
*నెలంత చక్కఁదనాలు నీకే తగునయ్యా ॥ (337 వ కీర్తనం)*

*అన్న కీర్తనం లోని భావాన్ని రామరాజభూషణుడు మనోజ్ఞగా ఈ క్రింది పద్యంలో మలిచినాడు.*

*"కమనీయాకృతి యోగ్యకీర్తనములన్ గన్పట్టు నాశ్యామ, నా*
*సుమబాణాంబక, యా యమూల్యమరాళి,*
*యా చొక్కంపు పూబంతి యా*
*సుమనోవల్లరి యా సుధాసరసి యా*
*సొంపొందు డాల్దీవి యా*
*కొమరుం బ్రాయపురంభ యా చిగురుటా*
*కుంబోడి నీకేతగున్*

*(వసుచరిత్ర - 2వ ఆ - 52)*

**తెనాలి రామకృష్ణుఁడు**

అన్నమయ్య ఒకానొక సందర్భంలో విష్ణుదేవుని విరాడ్రూపాన్ని వర్ణిస్తూ ఈ సమస్త భూమండలాన్ని ఆ విశ్వరూపుని పాదరేణువుగా వర్ణిస్తాడు.

*"చేరి పారేటి నదులు శ్రీపాద తీర్థమే*
*భారపు ఈ భూమి తన పాదరేణువే*

తెనాలి రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యంలో దశావతారవర్ణన ఘట్టంలో త్రివిక్రమావతారాన్ని ఈ విధంగా వర్ణిస్తాడు.

*" దండిత బలివై, జగములు*
*నిండ బెరుగుచున్న వేళ నీ యడుగున భూ*
*మండల మతి సూక్ష్మాకృతి*
*కొండిక మచ్చయను బోలె కొమరొందు హరీ !*

శ్రీమన్నారాయణుడు త్రివిక్రముడై సమస్తలోక పరివ్యాప్తస్వరూపుడైనపుడు యావద్భూమి ఆ స్వామి పాదంలో ఒక పుట్టుమచ్చ లాగా ఉందట.

**తరిగొండ వెంకమాంబ :**

అన్నమయ్య తిరుమల గిరులపై రచించిన

*"కట్టెదుర వైకుంఠము కాణాచైన కొండ*
*తెట్టెలాయ మహిమలే తిరుమలకొండ*
*వేదములే శిలలై వెలసిన దీ కొండ*
*ఏదెస పుణ్యరాసులే యేరులైనదీ కొండ*
*గాదిలి బ్రహ్మాదిలోకముల కొనల కొండ*
*శ్రీదేవు డుండేటి శేషాద్రి ఈ కొండ ॥*

అన్న సంకీర్తనంలోని భావాన్నే తరిగొండ వెంకమాంబ భంగ్యంతరంగా ఈ క్రింది సీసపద్యంలో వర్ణిస్తుంది.

*"శృంగారరాయని చెలువు మీఱిన కొండ*
*ఫణిరాజు పేరిటి పసిడి కొండ*
*ఘోరపాపమడంచు కోనేర్లు గల కొండ*
*తలఁచిన మోక్షంబు తగులు కొండ*

*చిలుకలు కోయిలల్ చెలగి కూసెడు కొండ*
*మృగజాతి కోట్లెల్ల మెలగు కొండ*
*పుష్పజాతుల విష్ణుఁ బూజింపఁగల కొండ*
*కల్పవృక్షములైదు కలుగు కొండ*
*అమరవరులకు నాధారమైన కొండ*
*ఆళువార్లకుఁ బ్రత్యక్షమైన కొండ*
*అలరఁ జూచిన బ్రహ్మాండమైన కొండ*
*ఏమి కనఁగొంటి శ్రీ వేంకటేశు కొండ*

భాగవత కవయిత్రియైన తరిగొండ వెంకమాంబ ఇంకా కొన్ని సందర్భాలలో అన్నమయ్య వర్ణనల పట్ల మొగ్గు చూపుతుంది.

## నందకాంశసంభూతుడు

అన్నమాచార్యుల వారు శ్రీహరి ఖడ్గమైన నందకాంశంతో అవతరించాడని ప్రతీతి. ఖడ్గాంశతో జన్మించి, తన వాక్ ఖడ్గంతో జీవుని అంతశ్శత్రువులను చెండాడగలిగిన సంకీర్తన వాఙ్మయం సృజించినాడన్నమయ్య. శంకరభగవత్పాదులవారు వివేకచూడామణిలో ఒక చోట ఇలా వ్రాశారు.

*"బ్రహ్మానంద నిధిర్మహోబలవతా హంకార ఘోరాహినా*
*సంవేష్ట్యాత్మని రక్షతే గుణమయైశ్చండై స్త్రిభిర్మస్తకైః*
*విజ్ఞానాసిమహాత్మనా శ్రుతిమతావిచ్ఛిద్య శీర్షత్రయమ్*
*నిర్మూల్యాహిమిమం నిధిం సుఖకరం ధీరోఽనుభోక్తుంక్షమః*

శంకరభగవత్పాదుల వారు పేర్కొన్న అట్టి మధురభక్తి ధారావిలసితమైన విశిష్టవిజ్ఞానఖడ్గాన్ని ధరించి అజ్ఞానసర్పాన్ని ఖండించి, శ్రీ వేంకటేశ్వరబ్రహ్మానంద భాండాగారమును సాధించి సంకీర్తన మణులను భక్తలోకానికి పంచి పెట్టిన వాగ్గేయకార ధీరాగ్రేసరుడు అన్నమాచార్యులు వారు.



శ్రీరస్తు

# శ్రీ తాళ్ళపాక

# అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు

## 29 వ సంపుటము

స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౩౪౬ అగు నేఁటి క్రోధి సంవత్సరమందు, తాళ్ళపాక అన్నమాచార్యులు అవతరించిన పదారు యేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను, అది మొదలుగాను శాలివాహనశక వరుషంబులు ౧౪౨౪ అగు నేఁటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బహుళ ౧౨ *నిరుధానకు తిరువేంగళనాథునిమీఁదను అంకితముగాను తాళ్ళపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగార సంకీర్తనలు.

**రేకు 1901** **ముఖారి**

ఎ. ఎన్ని వేసాలు సేసేరు యెఱఁగనంటా నాతో
సన్నలనే యిందాఁకా సాములు జరపరా ॥ పల్లవి ॥

ఆ (అ?) ద్దములు చూచుకొంటా నాకె నీవు నవ్వుకొంటా
యిద్దరును నుండరా యేకతానను
సుద్దులు చెప్పుకొంటాను సొమ్ములు వెట్టుకొంటాను
గద్దెమీఁదఁ గూచుండి కాఁపురాలు సేయరా ॥ ఎన్ని ॥

గందములు వూసుకొంటా కాఁగిటఁ బెనఁగుకొంటా
సందడివలపులెల్లాఁ జల్లరా మీరు
అంది విడే లిచ్చుకొంటా ఆయాలు గరఁగుకొంటా
పెందలకాడను మీరు పెండ్లిండ్లాడరా ॥ ఎన్ని ॥

సరసము లాడుకొంటా సారె మోవు లానుకొంటా
విరులవేట్లాడరా వేడుకతోను
ఇరవై శ్రీవేంకటేశ ఇట్టె నన్నేలితిగాక
సారిది మీలో మీరు చుట్టములే కారా ॥ ఎన్ని ॥ 1

## పాడి

[1] ఎక్కడ చూచినఁ దానె ఇంతులతో మెరసీని
చుక్కలూరి చెన్నునిఁ జూడరమ్మ చెలులు ॥ పల్లవి ॥

చెక్కుల జవ్వాదితోడ చిం(చెం?) ద్రికదట్టితోడ
చొక్కమైన మాణికపు సొమ్ములతోడ
వెక్కసపు రాజసాన వేడుకకాఁడై యున్నాఁడు
చుక్కలూరి చెన్నునిఁ జూడరమ్మ చెలులు ॥ ఎక్క ॥

చక్కని మొగమువాఁడు జాజుల దండలవాఁడు
వుక్కుమీరిన నవ్వుల వుయ్యారివాఁడు
అక్కజపు సతులచే నాటపాటలు వినీని
చుక్కలూరి చెన్నునిఁ జూడరమ్మ చెలులు ॥ ఎక్క ॥

పెక్కువరా లిచ్చుకొంటా బిరుదులు చూపుకొంటా
అక్కజపు శ్రీవేంకటాద్రిపై నుండి
యిక్కువతోఁ గొలువు సేయించుకొంటా నున్నాఁడు
చుక్కలూరి చెన్నునిఁ జూడరమ్మ చెలులు ॥ ఎక్క ॥ 2

## శ్రీరాగం

ఎంత నేరుచుకొంటివే ఇంతిరో నీవు
వింత లిందరి ముందర వెలఇంచితివౌనే ॥ పల్లవి ॥

---
1 ఈ పాట అంతా ఒకే ప్రాసతో నడచినది. చుక్కలూరి చెన్నుఁడు అన్నిచరణముఁ లో ˘చ్చుట కారణము కావచ్చు.

బెల్లాలవంటి మాఁటలు పెదవులపై నాడి
పెల్లున మగని వలపించితివౌనే
వల్లెవేసినటువలె వాడికలు పచరించి
కొల్లగా నాతని దక్కఁగొంటివి నీవౌనే ॥ ఎంత ॥

పువ్వులచేనెత్తినట్లు పొసఁగ వావులు చెప్పి
చివ్వనఁ దమకము రేఁచితివౌనే
వువ్విళ్ళూర మేనుసోఁక వొద్ద నిట్టె కూచుండి
యివ్వల నాతని సాదించితివౌనే ॥ ఎంత ॥

వెన్నెలగాసినట్ల వేడుకచూపులు చూచి
యెన్నికరతుల నెలయించితివౌనే
అన్నిటా శ్రీవేంకటేశుఁ డాతఁ డిట్టె నన్ను నేలె
చెన్నుగ నీ విట్టె చాయసేసుకొంటివౌనే ॥ ఎంత ॥ 3

## భైరవి

చెలులాల బుద్ధు లేమి చెప్పరే మీరు నాకు
కలిగె నాతని పొందు కాణాచిగా నాకు ॥ పల్లవి ॥

మొగము చూచినప్పుడే మొనపెఁ జొట్టరికము
నగితేనే వలపులు నాటుకొనెను
తగిలి వద్దఁ గూచుంటే దైవారె వావులు
బిగిసి వట్టి సిగ్గులు పెంచనిఁకనేఁటికే ॥ చెలు ॥

సరసమాడి నప్పుడే సతమాయ నమపులు
తెరలోనికి వచ్చితే తేరెఁ బనులు
పరపుపై నెక్కితేనే బలువాయ సంగాతాలు
విరతి నిఁకఁ బంతాలు నెరపఁగనేఁటికే ॥ చెలు ॥

వీడె మందుకొన్నప్పుడే వేడుకలెల్లా నీడేరె
జోడుగా మాఁటాడితేనే చొక్కి మనసు
యీడనె శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
యేడలేని తరితీపు లెంచ నిఁకనేఁటికే ॥ చెలు ॥ 4

## వరాళి

చక్కనిజాణ యిన్నిటా జవరాలు
చొక్కెరబొమ్మవంటిది జవరాలు ॥ పల్లవి ॥

కన్నులఁ దప్పకచూచి కప్పురాన నిన్ను వేసి
సన్నసేసీ నదివో జవరాలు
వెన్నెలనవ్వులు నవ్వి వేడుక నీకుఁ బుట్టించి
చన్నుల నొరసీ నిన్ను జవరాలు ॥ చక్క ॥
తెరమఱఁగుననుండి తేవెగార మాఁటలాడి
సరివెనఁగీ నీతో జవరాలు
విరులు నీపైఁ జల్లి వింతసేఁతలెల్లాఁజేసి
సరసములు నెరపీని జవరాలు ॥ చక్క ॥
తమకము నీకు రేఁచి దయవుట్ట సేవసేసి
సముకాన గొసరీని జవరాలు
అమర శ్రీవేంకటేశ యన్నిటా నీవుగూడఁగా
జమళిరతుల జొక్కీ జవరాలు ॥ చక్క ॥ 5

## రామక్రియ

ఈతఁడువో రాముఁడు యేకాంగవీరుఁడు
యేతలఁ జూచినఁ దానే (నై?) యిరవుకొన్నవాఁడు ॥ పల్లవి ॥

చిఱుతప్రాయమునాఁడు శివునివిల్లు విఱిచి
మెఱసి సీతఁ బెండ్లాడి మించినవాఁడు
తఱిఁ బదునాలుగువేలదానవుల నిమిషాన
జఱసి తానొకఁడే చదిపినవాఁడు ॥ ఈతఁ ॥

వోడక విల్లెక్కువెట్టి వూరకె వొక్కమ్మునను
యేడుదాళ్ళు ధరఁగూల నేసినవాఁడు
జాడగాఁ గొండలచేత జలనిధి గట్టించి
వేడుకతో లంకమీఁద విడిసినవాఁడు ॥ ఈతఁ ॥

రావణ కుంభకర్ణాది రాకాసుల బరిమార్చి
యీవల నయోధ్యపట్న మేలినవాఁడు
శ్రీవేంకటాద్రిమీఁదఁ జేరి మాల్యవంతమున
వేవేలుచందములను వెలసినవాఁడు ॥ ఈతఁ ॥ 6

**రేకు 1902** **కాంబోది**

ఏమని చెప్పఁగవచ్చు యీ మగువ నేరుపులు
వేమరు దరితీపుల విందులు వెట్టీని ॥ పల్లవి ॥

చెలి నీపై వలపుసేసలు చల్లీ నదె
చెలరేఁగి చెలరేఁగి చే సన్నల
యెలమితోఁ బెండ్లి వాయిద్యాలు వాయించీ నదె
మొలనూలున గట్టిన మురిపెపుగంటల ॥ ఏమ ॥

తొయ్యలి యడియాసల దోమటి దొడికీనదె
వొయ్యనొయ్యనే మోవి వొడఁబాటుల
నెయ్యపుఁ జాట్టరికాలు నీకే నేరిపీ నదె
కొయ్యకలిచూపుల కసరులను ॥ ఏమ ॥

కమ్మనికాఁగిట (టఁ ?) బూజగుండలు మోచీనదె
సమ్మతించి సమ్మతించి చనుగుబ్బల
ఇమ్ముల శ్రీవేంకటేశ యీకెను నీవు గూడఁగా
దొమ్మిరతి చెమటలతోడ నీళ్ళాడీని ॥ ఏమ ॥ 7

## హిందోళం

ఇంతగలితే నీవు యేకతానకు రారాదా
వింతలెల్లా నింతి నీకు విన్నవించీఁగాని ॥ పల్లవి ॥

కోరి సేవలుసేయఁగా గుబ్బలు దాఁకించెనంటా
గోర నేల గీరేవు కోమలిని
కూరిమిఁ జూచిన చూపు గురుతులు మోఁచెనంటా
సారె సారె చెలినేల జంకించేవు ॥ ఇంత ॥

గక్కన విడెమియ్యఁగా కళలు రేఁగెనంటా
చక్కని యీపె నేల సాదించేవు
మక్కువతో మాఁటాడఁగా మనసు గరఁగెనంటా
చొక్కుచునేల మానముసోఁకఁ దిట్టేవు ॥ ఇంత ॥

కలసి నవ్వఁగాఁ దమకము లుప్పతిలెనంటా
పలుమారు నెంత కొంగువట్టి తీసేవు
యెలమి శ్రీవేంకటేశ యిట్టె యీకె నేలితివి
నిలుచుండఁగానే యెంత నివ్వెరగందేవు ॥ ఇంత ॥ 8

## రామక్రియ

చూడఁగదవయ్యా యీపె జాటుఁదనాలు
వేడుకతో దైవారీ వేసా లీడ నెంతో ॥ పల్లవి ॥

బిగువుఁ జన్నుల నొత్తి పెనఁగులాడీ నీతో
మగువ దంటతనము మరి యంతో
నగుతానే కొనగోరు నయమున సోఁకించీ
తగులైన నీపై తమి తనకెంతో ॥ చూడఁ ॥

కరములు చాఁచి చాఁచి కడు నిన్నుఁ జెనకీని
యిరవైన గర్వ మీపె కింక నెంతో
తురుములోని విరిదండ తోడనే నీ మెడవేసీ
సొరిది నీతోఁ జేసిన చుట్టరిక మెంతో ॥ చూడఁ ॥

సారె సారె నీ మోవిచవులు నిన్నడిగీని
మేరమీరి యీకె మందెమేళ మెంతో
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
కోరి నీవద్దఁ గూచుండీ కోమలియాస యెంతో ॥ చూడఁ ॥ 9

## సౌరాష్ట్రం

నీ వెఱఁగవా తగవు నేము చెప్ప నేమున్నది
మావంటి చెలులను మన్నించుటగాక ॥ పల్లవి ॥

చేయి వట్టితే పతితో సిగ్గులు వడుదురా
ఆయ మెరిఁగి సరసమాడఁ గదవే
నీయందు బత్తిసేసితే నివ్వెరగందుదురా
చాయలా సన్నలా పొందు జరపుటగాక ॥ నీవె ॥

తప్పక చూచితేను తలవంచుకొందురా
చెప్పినట్టెల్లా నీవు సేయఁగదవే
కొప్పు దువ్వి పెనఁగితే కొంచించి లోఁగుదురా
ముప్పిరి నియ్యకొని ముంచి నగుటగాక ॥ నీవె ॥

కూరిమిఁ గాఁగిలించితే గుట్టుసేసుకొందురా
సారె సారె వలపులు చల్లఁగదవే
కోరి శ్రీవేంకటేశుఁడు కూడఁగా నెలయింతురా
చేరి సేవలెల్లా నిట్టే సేయుటగాక ॥ నీవె ॥ 10

## వరాళి

ఔనే జాణవౌదువు అన్నిటా నీవు
నానెఁగదవే సెలవినవ్వుల నీ సన్నలు ॥ పల్లవి ॥

చూడఁజూడ సూట్లు సుదతి నీ చూపులు
వాడ వాడ వలపులు వాడికలు
కూడఁగూడ గురుతులు కొనగోరి చెనకులు
యేడఁ[1]గోలదనివెట్టే మిట్టి చతురతలు ॥ ఔనే ॥

వండ వండనట్లు వడి నీతరితీపులు
వుండనుండ వేడుకలు వునుకులే
పండఁబండ మచ్చికలు పానుపుపై నీ రతులు
నిండుకొనెఁగదె నీ నేరుపుల కథలు ॥ ఔనే ॥

పెంచఁ బెంచఁ బెరిగీని పెద్దలై నీ చన్నులు
ముంచ ముంచ నూరీ నీ మోవి తేనెలు
యెంచఁగ శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్ను నేలె
మించెఁగదవె నేఁడు మిక్కిలి నీ కతలు ॥ ఔనే ॥ 11

## వాదరామక్రియ

ఇంతేసి రట్టు గలదా ఇల్లాండ్లకు
యెంతైనా గుట్టుతోనే యెనయవలెఁ గాక ॥ పల్లవి ॥

---

1. కోలదనివెట్టు = దీర్ఘముగా శబ్దించు (ప్రకరణములో) స్తుతిచేయు కావచ్చు.
కోల=దీర్ఘము, ఆయతము ఇత్యాదిగా కిట్టెల్. 'ధ్వని' శబ్ద భవము 'దని

మొగము చూపి చూపి మోహములు వెడరేఁచి
మగనితో నెంతేసి మాఁట లాడేవే
నగి నగి వలపులు నానఁబెట్టి యంతలోనే
పగటున నెంతేసి బయలీఁదించేవే ॥ ఇంతే ॥

చెనకి చెనకి మరి చిగురుఁజేతుల మొక్కి
వినయాన నెందాఁకా వేఁడుకొనేవే
పెనఁగి పెనఁగి సారె బిగువుఁ జన్నుల నొత్తి
కనుమాయలనె యెట్టు గరఁగించేవే ॥ ఇంతే ॥

కొసరి కొసరి వావిఁగొనగోరు సోఁకించి
పసలుగా మే నేల పచ్చిసేసేవే
యెసగ శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్నుఁగూడె
పొసఁగ నీవేమిటికి పొందులు చూపేవే ॥ ఇంతే ॥ 12

**రేకు 1903 లలిత**

కొత్తపెండ్లికొడుకవు కొంకనేల నిఁక నేఁడు
చిత్తగించి రతులను చెలరేఁగవయ్యా ॥ పల్లవి ॥

కలువరేకులవంటి కన్ను లాపె చూచీ నిన్ను
నెలకొని యెదుటను నిలువవయ్యా
తలకొని తేనెపెదవు లాపె విలిచీని
పలుమారు నూఁకొని పలుకవయ్యా ॥ కొత్త ॥

మొనసి చందురువంటి మొగమాపె నవ్వీని
చనవిచ్చి వలపులు చల్లవయ్యా
గునిసి కొండలు (ల?) వంటి గుబ్బ లాపె చెనకీని
కనుఁగొని వేడుకతో గాఁగిలించవయ్యా ॥ కొత్త ॥

చిగురుటాకులవంటి చేతు లాపె ముక్కీని
సొగిసి మన్నన లిచ్చి చూడవయ్యా
నిగిడి శ్రీవేంకటేశ నిన్ను నిట్టె పెండ్లాడె
మగువ నన్నిటా నీవు మన్నించవయ్యా ॥ కొత్త ॥ 13

## హిందోళ వసంతం

ఎఱఁగవా ఆపె మాకు నేలికసాని యౌత
గుఱిసేసి నన్ను నేల గుట్టుతో మెచ్చేవే ॥ పల్లవి ॥

సేసవెట్టి పెండ్లాడినచెలి గాచుకుండఁగాను
ఆసగించే వదేమే నీ వాతనికిని
మోసపోక తమలోన మొగములు చూచుకోఁగా
లాసి లాసి నీవెంత వలపు చల్లేవే ॥ ఎఱఁ ॥

మేనమఱఁదలయిన మెలుఁత దండ నుండఁగా
నానఁ బెట్టుక నీవేమి నవ్వు నవ్వేవే
పానుపున నిద్దరూ పవళించియుండఁగాను
పూని పట్టి నీ వెట్టు పొంచి మాఁటలాడేవే ॥ ఎఱఁ ॥

పట్టపుదేవు లయిన భామ సతమై యుండఁగా
వెట్టికి నీవేల వచ్చి వీడె మిచ్చేవే
అట్టె శ్రీవేంకటేశుఁడూ వాపె సన్నసేసుకోఁగా
పొట్టఁ బొరుగు నీవేమి పొత్తు గలసేవే ॥ ఎఱఁ ॥ 14

## పాడి

వెలఁది యీకె ఇదిగో వీఁడిగో పెండ్లికొడుకు
యెలమి నుపచారాలు ఇన్నియునుఁ జేయరే ॥ పల్లవి ॥

అంబుజపాణికిని హారములు గట్టరే
బింబాధరికిఁ గొప్పు వెట్టఁగదరే
కంబుకంఠికిని కప్రపు బొట్టు వెట్టరే
అంబరమధ్యకును ఆరతులు యెత్తరే ॥ వెలఁ ॥

కలువకంటికి మంచికాటుక వెట్టఁగదరే
తలిరుఁబోణికి పూలదండ వేయరే
మలయజగంధికి బొమ్మలపెండె మందియ్యరే
అలినీలవేణికి నట్టె సింగారించరే ॥ వెలఁ ॥

కరిగమనకును బాగాలు చేతి కొసఁగరే
హరిమధ్య కొడ్డాణ మమరించరే
ఇరవుగా శ్రీవేంకటేశ్వరునిఁ బెండ్లాడె
తరుణికి నితనికి తగు పీఁట వెట్టరే ॥ వెలఁ ॥ 15

## ముఖారి

మగవాని మాయలు మరి యెందుకైనా వచ్చు
వెగటు గాకుండాఁ జెలి విన్నవించుకోవే ॥ పల్లవి ॥

మాఁటలాడవచ్చుఁగాని మనసు దెలియరాదు
నాఁటఁ జూడవచ్చుఁగాని నవ్వించరాదు
సూటి చూపవచ్చుఁగాని చొచ్చి గురివేయరాదు
తేటగా నాతని బుద్ధి తెలుసుకోవే ॥ మగ ॥

మోము చూడవచ్చుఁగాని మోహము వుట్టించరాదు
కామించఁగవచ్చుఁగాని కరఁచరాదు
సాముసేయవచ్చుఁగాని చలము సాదించరాదు
గామిడ యీతనిబత్తి గనుకొనవే ॥ మగ ॥

తలఁపించవచ్చుఁగాని తరితీపు రేఁచరాదు
కలయఁగవచ్చుఁగాని గద్దించరాదు
యెలమి శ్రీవేంకటేశుఁ డింతలోనే నన్నుఁ గూడె
సొలసి యాతని పొందు సోదించుకోవే ॥ మగ ॥

## భైరవి

ఇంతలోనే వలపు నీవేల దాఁచేవే
అంతటి విభుఁడు నీకు నాసనేయఁగాను ॥ పల్లవి ॥

తప్పక చూచి చూచి తలవంచుకొనేవేమే
ఇప్పుడు నీపతి సన్నలెల్లాఁ జేయఁగా
చిప్పిల నవ్వులు నవ్వి సిగ్గువడే వదియేమే
చొప్పుగా నీ కాతఁడు సుద్దులు చెప్పఁగాను ॥ ఇంత ॥
వీడె మిచ్చి ఇచ్చి నీవు వెరగునొందేవేమే
జాడతో నాతఁడు సరసములాడఁగా
పాడి పాడి లోలోనె భావము గరఁగేవేమే
యీడు జోడై యాతఁడు నీ ఇచ్చలో నుండఁగాను ॥ ఇంత ॥

కోరి చెనకి చెనకి గుట్టున నుందానవేమే
యీరీతి శ్రీవేంకటేశుఁ డేలఁగాను
చేరి వద్దఁ గూచుండి చెమరించే వదియేమే
తారుకాణగా నాతఁడే తమి రేఁచఁగాను ॥ ఇంత ॥ 17

## దేసాళం

ఎంత నేరుచుకొంటివే యేతులు నీవు
వింతలెల్లాఁ జూచి నాకు వెరగయ్యీ నిపుడు ॥ పల్లవి ॥

వేడుకతో సారెసారె విన్నపాలు సేసేవు
　　వాడికగా నీ కతఁడు వలచునంటా
పాడి పాడి తానాలు పచారించి చూపేవు
　　జాడతో నాతఁడు మెచ్చి సంతోసించునంటాను ॥ ఎంత ॥

కడఁగి వద్దఁ గూచుండి కవకవ నవ్వేవు
　　య్యెడయ కాతఁడు చనవిచ్చునంటాను
అడియాలముగ గోర నంటి యంటి చెనకేవు
　　కడు నాతఁడు మరిగి కైకొనునంటాను ॥ ఎంత ॥

చన్ను లొరసుకొంటాను సరుసఁ గొప్పు దువ్వేవు
　　నిన్ను నతఁడు కాఁగిటను నించునంటాను
ఇన్నిటాను శ్రీవేంకటేశుఁడు నన్నేలినాఁడు
　　సన్నసేసే వాళ్ఁడు సమ్మతించునంటాను ॥ ఎంత ॥

**రేకు 1904**　　　　**వరాళి**

చెల్లునే నీకిఁకఁ జేసే చేఁతలెల్లాను
　　మొల్లమి నాకతఁడేల మొగమోడకుండీనే ॥ పల్లవి ॥

చెప్పిన బుద్దు లాతని చెవిలోనే వుండఁగాను
　　కప్పురగందుల నేల కైకొనీనే
తప్పని బాసలు నీవాతనిచేఁ జేయించుకోంగా
　　చొప్పుగా వాడలోవారిఁ జూడనేల చూచీనే ॥ చెల్లు ॥

వదల కాతని నీ వసము సేసుకుండఁగా
　　యెదుటివారితో మరియేల నవ్వీనే
కదిసి యాతనితో నేకతాలు నీ వాడఁగాను
　　మదిరాక్షులతో నేల మాఁటలాడీనే ॥ చెల్లు ॥

యేపొద్దూ నాతని నీవు యెదఁబెట్టుకుండఁగాను
పైపై నెవ్వరి కేల బాఁతి పడీనే
యేపున శ్రీవేంకటేశుఁ డీతఁ డిట్టె నన్ను నేలె
'చేపట్టి నీయె(య?)ప్పణేల సేయకమానీనే ॥ చెల్లు ॥ 19

గౌళ

అందుకే వెరగయ్యీ నా కప్పటనుండి
సందడివలపు నాపైఁ జల్లితి వదేమయ్యా ॥ పల్లవి ॥

సేయఁగల వూడిగాలు సేసి ని న్నాపె మెప్పించె
రేయిఁ బగలునుఁ దమిరేఁచె నీకును
మాయదారి చేఁతల నీ మనసెల్లాఁ గరఁగించె
యీయెడ మా యింటికి నేఁ డెట్టు వచ్చితివయ్యా ॥ అందు ॥
ఆడఁగల మాఁటలెల్లా నాడి నిన్నుఁ జొక్కించె
వాడికలెల్లాఁ జేసి వలపించెను
వేడుకలు నీకుఁ జూపి వినోదాలు మరిగించె
యీడ మాతో సరసము లెంతేశాడేవయ్యా ॥ అందు ॥

నవ్వఁగలట్టల్లా నవ్వి నంటున నిన్నుఁ దేలించె
చివ్వనఁ బెనఁగి సంతోసింపించెను
రవ్వగా శ్రీవేంకటేశ రతి నన్ను నేలితివి
ఇవ్వల నెన్ని చనవు లిచ్చి మన్నించేవయ్యా ॥ అందు ॥ 20

ఆహిరి

చిత్తము రా విభునికి సేవసేయఁగదవే
హత్తి యాతఁడే మన్నించీ నన్నిటాను చెలియా ॥ పల్లవి ॥

మచ్చికతో మాఁటాడితే మనసు గరఁగుఁగాక
తచ్చి తచ్చి దూరితేను తమి రేఁగునా
మెచ్చి మెచ్చి పొగడితే మిక్కిలి వేడుకొఁగాక
పచ్చిగా నేరా లెంచితే పైకొన సొగసునా ॥ చిత్త ॥

ననుపునఁ జెనకితే నవ్వ నిచ్చవుట్టుఁగాక
పెనఁగులాడఁగఁబోతేను ప్రియము లౌనా
వినయాలే సేసితేను వింత రతు లబ్బుఁగాక
గునిసి కొసరితేను కోరిక లీడేరునా ॥ చిత్త ॥

ఆసతోఁ జూచిన చూపు లాయములు సోఁకుఁగాక
వాసితో సిగ్గువడితే వహి కెక్కునా
సేసవెట్టి నిన్నుఁ గూడె శ్రీవేంకటేశుఁడు నేఁడు
మూసిపెట్టితే వలపు మొదలనే దాఁగునా ॥ చిత్త ॥ 21

## లలిత

ఏమయ్యా నీ సుద్దులు యెట్టు దెలియఁగవచ్చు
వేమరును మన్నించేవు వేడుకతో నన్నును ॥ పల్లవి ॥

పిలిచి న న్నాదరించి పెండెము చేతి కిచ్చేవు
తొలు తెవ్వతె వెట్టిన తొడవో యిది
తలఁచుక వచ్చి నాకు తమ్ములమిడవచ్చేవు
పొలఁతి యవ్వతె తొల్లి పుక్కిటఁ బెట్టినదో ॥ ఏమ ॥

పట్టుమని పూవులబంతి మీఁద వేసేవు
ముట్టి యెవ్వతె కొప్పున ముడిచినచో
పెట్టెఁడేసి చీరలు ప్రియముతో నిచ్చేవు
గట్టిగా నెవ్వతె యివి గట్టి విడిచినవో ॥ ఏమ ॥

చప్పరమంచముపై నీ సరుసఁ బెట్టుకొనేవు
చిప్పిల నెవ్వతె నీతోఁ జెందియున్నదో
యిప్పుడే శ్రీవేంకటేశ యెనసి మోవి యిచ్చేవు
ముప్పిరి నెవ్వతె యాని పిప్పిగాఁ జేసినదో ॥ ఏమ ॥ 22

## సాళంగనాట

ఎంత రట్టు సేసేవు యెమ్మెకాఁడ
యింత బత్తి గలిగితేను ఇంటికి రావయ్యా ॥ పల్లవి ॥

అందుకోలు వలపుల ఆసోదకాఁడ
విందుల మోవితేనెల వేడుకకాఁడ
సందడిసేసలు చల్లే జాజరకాఁడ
మందపట్టు మాఁటలేల మాయింటికి రావయ్యా ॥ ఎంత ॥

తరితీపు నవ్వుల దాయగాఁడ
విరుల వేట్లాడేటి వినోదకాఁడ
పెరరేపు సన్నల బేరగాఁడ
మరిగితే నేమాయ మా యింటికి రావయ్యా ॥ ఎంత ॥

నిక్కి నిక్కి చూపుల నేస్తకాఁడ
మిక్కుటపుఁ బ్రియముల మేలగాఁడ
పక్కన నన్నేలినట్టి పంతగాఁడ
యెక్కువ శ్రీవేంకటేశ యింటికి రావయ్యా ॥ ఎంత ॥ 23

## నాదరామక్రియ

ఎన్నట్టి(టి?) పొందో తనకు యెరుకలు సేసీ నీకు
మున్నిటి వలపు నీవూ ముంచి చల్లవోయీ ॥ పల్లవి ॥

దొంతరపూవుల వేసీ తొయ్యలి మేడపైనుండి
వింత వింత మాఁటలాడీ వినవోయీ
పంతమున మోవి చూపి బయలు నోరూరించీ
సంతోసాలు నీకు రేఁచీఁ జవిగొనవోయీ ॥ ఎన్న ॥

చిమ్మనఁ గోవులఁ జిమ్మి చేతఁ జూపీ బాగాలు
పమ్మి పచ్చడముకొంగు పట్టవోయి
కమ్మటిఁ చెక్కుసన్నలు కానుకలు వట్టి నీకు
నమ్మికగా మోము చూచి నవ్వు నవ్వవోయీ ॥ ఎన్న ॥

నిచ్చెన వేసుకవచ్చి నిన్ను వొడివట్టి తీసీ
కుచ్చి యాకెఁ గాఁగిలించుకొనవోయీ
యిచ్చట శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
హెచ్చిన దేవులనని యిఁకఁ జెప్పవోయీ ॥ ఎన్న ॥ 24

**రేకు 1905** **ఆహిరి**

ఏల కాపుసేసేవు యింతుల నీవు
తాలిమిఁతోఁ గాఁగిలించిఁ దయఁజూడరాదా ॥ పల్లవి ॥

మన్ననగల యాఁటది మంతనాలు సారె నాడు
వన్నెలాఁడియైనది వలపించును
కన్నులకలికి వేడుకలు దైవారఁగఁ జూచు
అన్నిటాఁ జక్కనిదైతే నాసలెల్లా రేఁచును ॥ ఏల ॥

కూరిమిగలుగుకాంత కొనగోరఁ జెనకును
వోరుపు గలిగినది వొడివట్టును
గారవపుఁ జేఁతలది కడు వినయాలు సేసు
కోరి వచ్చినది మంచిగుణాలు నెరపును ॥ ఏల ॥

మిక్కిలిచుట్టమైనది మెరయించుఁ బొందులెల్లా
వెక్కసపుటా సలది వేఁడుకొనును
అక్కున శ్రీవేంకటేశ యలమేల్మంగ నేలేవు
నిక్కము రతుల కీలు నీవే యెరుఁగుదువు ॥ ఏల ॥ 25

## గౌళ

ఎంతదడవు వినేవు యెటువంటి [1]నీ వేడుక
సంతోసించి కాఁగిలించి చనవియ్యరాదా ॥ పల్లవి ॥

సన్నపుటెలుఁగునను సరిఁ బాడుకొంటాఁ జెలి
వన్నెగాఁ దంత్రులు మీఁటి వాయించీ వీణె
చిన్ని చెక్కులవెంట చెమరించి దప్పిగొనె
మన్నించి నీ పుక్కిటితమ్మల మిడరాదా ॥ ఎంత ॥

నిగ్గుదేర మెచ్చుకొంటా నీ నాటకసాల చూచి
వుగ్గళించి తాళము లొత్తీ సతి
అగ్గమై బుసకొట్టి యలసి వున్నది యిట్టె
దగ్గరి నీ వురము గందము మెత్తరాదా ॥ ఎంత ॥

పలుమారు నోరునిండాఁ బద్యాలు చదువుకొంటా
పొలఁతి నీ బిరుదులు పొగడీఁ దాను
నెలవై శ్రీవేంకటేశ నీరతుల గుబ్బతిలె
అలమేలుమంగకు నొయ్యనే విసరరాదా ॥ ఎంత ॥ 26

## బౌళి

అలమేలుమంగపతి యాతఁడౌ త య (యె?) ఱఁగవా
బలిమి చేఁతల నెంత పచ్చిదేరేవే ॥ పల్లవి ॥

1. 'ఎటువంటిది వేడుక' కావచ్చు.

తళుకునఁ జూచేవు తత్తరాన లాచేవు
పలుకులఁ గొసరేవు పతిని నీవు
సెలవుల నవ్వేవు చేతఁ బాపట దువ్వేవు
కలికితనాల నెంత కతకారివే ॥ అల ॥

హత్తి సేవల సేసేవు అట్టె పువ్వుల వేసేవు
గుత్తపు గుబ్బలఁ బతి గుచ్చి యెత్తేవు
బత్తి చూపి సొలసేవు పలుమారు మలసేవు
చిత్తిణి గుణాల నెంత చిమ్మిరేఁగేవే ॥ అల ॥

వావు లెల్లాఁ జెప్పేవు వలపుల గుప్పేవు
శ్రీవేంకటేశుఁ గడుఁ జెక్కు నొక్కేవు
భావించి కేల మొక్కేవు పాదమునుఁ దొక్కేవు
కావిరి రతుల నెంత కాఁగిటఁ గూడేవే ॥ అల ॥ 27

## దేసాళం

ఈడు జోడు లాయను మీ యిట్టిచుట్టరికములు
వేడుకతో నీవూ నీకె వెలసితి రిపుడు ॥ పల్లవి ॥

పిలుచుక వచ్చి నీకుఁ బీఁటవెట్టి విడెమిచ్చి
చెలి విన్నపము లెల్లాఁ జేసుకొనెను
చెలరేఁగి నీవూ నట్టె చిత్తము గరఁగి యాకె -
తలఁపులో మెలఁగేవు తగు మీ యిద్దరికి ॥ ఈడు ॥

వినయాలు నీకుఁ జేసి విందువెట్టి తమిరేఁచి
చెనకి నిన్నొడఁబాటు సేసుకొనెను
చనవిచ్చి నీవందుకు సంతోసించి మరి యాకె -
కనుసన్న మెలఁగేవు కంటిమి మీపొందులు ॥ ఈడు ॥

పరపుపైఁ బెట్టి నీకు పాదాలొత్తి బత్తి చూపి
సిరులఁ గాఁగిట లోను సేసుకొనెను
అరిది శ్రీవేంకటేశ అలమేలుమంగ యీకె -
సరవినే మెలఁగేవు సమము మీ తలఁపు ॥ ఈఁడు ॥ 28

## పాడి

ఇదివో తారుకాణాయ ఇట్టె వచ్చి కూడితివి
వదలకున్నది నీవు వలచితివంటాను ॥ పల్లవి ॥

యేడలేని యాసలతో యెదురుచూచీఁ జెలి
వాడికతో నీ వింటికి వచ్చేవంటాను
వీడెము చేతఁబట్టుక వేళ గాచుకున్నది
వేడుకతోఁ దనపొందు వెలయించేవంటాను ॥ ఇది ॥

పలుమారు నీ రూపే భావించుకున్నది చెలి
నిలిచి నీ వందుకు మన్నింతు వంటాను
తలఁచి నీపేరు నోరఁ దడవుకొంటా నున్నది
కలకాలమును నీవు కరుణింతువంటాను ॥ ఇది ॥

కూటమికి నీరాక కోరుక వున్నది చెలి
నీటునఁ దనుఁ గాఁగిట నించేవంటాను
యీటున శ్రీవేంకటేశ యీకె యలమేలుమంగ
చోటిచ్చుకున్నది రతిఁ జొక్కించేవంటాను ॥ ఇది ॥ 29

## లలిత

[1]వింటిరటె యీ సుద్దులు వెలఁదులాల
జంటగా రాముఁడు ముందె జనియించినాఁడట ॥ పల్లవి ॥

---

1. ఇది అధ్యాత్మ కీర్తనలలో నుండ దగినది.

పొంచి కంసుని వధించి భూ భార మడఁచఁగ
అంచెలఁ గృష్ణదేవుఁడు అవతారమందె నిదె
మంచివేళ శ్రావణమాస బహుళాష్టమిని
యెంచఁగ నడురేయి రోహిణి నక్షత్రమున ॥ వింటి ॥

పాండవుల రక్షింప బలుకౌరవులఁ జంప
అండనే వసుదేవునియందు జనియించె నిదె
దండి మధురలోపలఁ దగ రేపల్లె లోపల
గండుమీరి పెరిగీని గారాబమునను ॥ వింటి ॥

దానవుల నడపగ ధర్మములు నిలుపఁగ
పూని దేవకీదేవి పుత్రుఁడై పొడమె నిదె
ఆనుక శ్రీవేంకటాద్రి నలమేల్మంగయుఁ దాను
నానాజీవులఁ గాచి యున్నతి మించినారు ॥ వింటి ॥ 30

**రేకు 1906 శంకరాభరణం**

[1] ఎచ్చుటఁ జూచిన నితఁడై కృష్ణుఁడు
మచ్చిక నలమేలుమంగతో వెలసీ ॥ పల్లవి ॥

కొట్టరో వుట్టులు గోపాలబాలులు
యిట్టె కృష్ణుని యెదుటను
పట్టరో వారలు పాలు నేతికిని
గట్టిగ జోరునఁ గారీ నవిగో ॥ ఎచ్చు ॥

కూడరో మూఁకలు కోలలవారలు
వేడుకఁ గృష్ణుని వెంటవెంట
ఆడుచు మెసఁగరో ఆడుఁకులుఁ జక్కిలాలు
వాడల వాడల వరుసతోను ॥ ఎచ్చు ॥

1. ఈ పాటకూడ బాలకృష్ణలీలలు చెప్పుచు ఒకపాటి అధ్యాత్మకీర్తనయే.

నిక్కి తీసుకోరో నెఱవాదికాండ్లు
మక్కువఁ గృష్ణుని మఱఁగునను
యెక్కరో శ్రీవేంకటేశు కొండమీఁద
పెక్కు మరుగులు పెరుగులు నివిగో ॥ ఎచ్చ ॥ 31

## నాదరామక్రియ

ఎంత యెమ్మెలఁ బొరలేవేమే నీవు
మంతుకెక్క నిన్నాతఁడు మన్నించీనంటాను ॥ పల్లవి ॥

కప్పురపుఁబలుకు లెన్ని గాదెఁబోసేవే
కొప్పు చీఁకట్లెంతేసి కూడపెట్టేవే
ముప్పిరి నవ్వు లెందాఁకా మూటగట్టేవే
చొప్పు లెత్తి నిన్నాతెఁ (తఁ(?)డు చూచీనంటాను ॥ ఎంత ॥

వేడుకసరసా లెన్ని వెదవెట్టేవే
తోడనే వలపు లెన్ని తూరుపెత్తేవే
మేడెపుఁజూపు లెంతేసి మేళవించేవే
జోడుగూడి నిన్నాతఁడు చూచీనంటాను ॥ ఎంత ॥

చక్కఁదనా లెన్నేసి పచారించేవే
పెక్కుతరితీపు లెన్ని పెరరేఁచేవే
యిక్కడ శ్రీవేంకటేశుఁడే నలమేలుమంగను
చొక్కించి నన్నేలె నిన్నుఁ జూచీనంటాను ॥ ఎంత ॥ 32

## గౌళ

ముందు వెనక లెంచవు మురిపెములే చూపేవు
యిందరిలో నీ యాస ఇంకా నెంత చూపేవే ॥ పల్లవి ॥

చన్నులపై కొంగు జారి సన్నలేమి సేసేవే
కన్నుల మించీఁ గాటు కెక్కడ చూచేవే
చిన్ని మోవిఁ దేనె చిందీ సిగ్గుతో నేల నవ్వేవే
యిన్నేసి కలికితనా లెంత నేరిచితివే ॥ ముందు ॥

చెక్కులఁ జెమట గారీ శిరసేమి వంచేవే
వుక్కుగోరివాఁ డేమౌనో వొరయకువే
పుక్కిటితమ్మ మెదిగీ పూఁచి మాటలే లాడేవే
యెక్కడలేని పగటు లెంత నేరిచితివే ॥ ముందు ॥

బలిమి గుచ్చెల వీడీ పాదమేల తొక్కేవే
యెలమిఁ బువ్వులు రాలీ యేల మొక్కేవే
అలమేల్మంగపతి నన్నలమె శ్రీవేంకటేశుఁ -
డేలయింపులాఁడివి నీవెంత నేరిచితివే ॥ ముందు ॥33

## సామంతం

ఇదివో మేలుసుద్ది మీ కిన్నిటా విన్నవించితి
మదిలోన మఱవక మన్నించు మనెను ॥ పల్లవి ॥

కలికి కన్నుల దొక కతకారి । నీకు
వలచితినని చెప్పె వాడలోన
మొలక చన్నులది ముద్దులాడి । నిన్నుఁ
బిలిచి లె(తె?)మ్మని యంపెఁ బ్రియముతో నన్నును॥ ఇది ॥

చక్కెర మోవిది యా జవరాలు । నీకు
మొక్కితి నను మనెను మోహమున
చెక్కుటద్దాలది కడుఁజేఁతలాఁడి । తొల్లె
మిక్కుటపు వయసెల్లా మీఁదెత్తితి ననెను ॥ ఇది ॥

నీలపుఁ గుంతలాలది నెరవాది। నీకు -
నాల నని యెరిఁగించె నందరిలోన
యాలీల శ్రీవేంకటేశ యింటికి వచ్చేలితివి
చాలా నలమేల్మంగకు సవతి నే నౌనను ॥ ఇది ॥ 34

## దేసాళం

అలమేలుమంగవు ని న్నాతఁ డేమి యెఱఁగఁడా
యెలమి నీయెడ కాతఁ డిచ్చకుఁడేకదవే ॥ పల్లవి ॥

తప్పక చూచినవాఁడు తగులకేలమానీనే
కప్పుర మిచ్చినవాఁడు కైకొనఁడటె
చెప్పి పంపినట్టివాఁడు చేరి యింటికి రాఁడటె
యిప్పు డింత విరహాన నేల పొరలేవే ॥ అల ॥

వీడె మిచ్చినట్టివాఁడు వేడుకేల మరచీనే
వాడికైనవాఁడు నీకు వలవఁడటె
ఆడుకోలు మాఁటవాఁడు అన్నిటా లాలించఁడటె
యేడలేని తమకాన నేల పొరలేవే ॥ అల ॥

ఆస కొలిపినవాఁడు అట్టె కాఁగిలించఁడటె
సేసవెట్టినట్టివాఁడు చెనకఁడటె
వాసెరిఁగి నిన్నుఁ గూడె వచ్చి శ్రీవేంకటేశుఁడు
యీ సుద్దికి నవ్వి నవ్వి యేల పొరలేవే ॥ అల ॥ 35

## సౌరాష్ట్రం

ఇద్దరి నేరుపులును యిందులోనె కానవచ్చె
చద్ది వేఁడివలపులు సతమాయ మీకును ॥ పల్లవి ॥

కన్నులనె మాటలాడీఁ గలికి నీతో
యిన్నిటా జాణవు నీవు యెఱఁగరాదా
చన్నులనే కానుకిచ్చీ సారెసారెకు
చెన్ను మిగులఁగ నీవు చేయి చాఁచరాదా ॥ఇద్ద ॥

మోవినే విందులువెట్టీ ముద్దరాలు
వావాతఁ జవిగొని వలవరాదా
చేవల్లఁ గొలుపుసేసి సేస చల్లీని
సేవగొని నీవందుకు శిరసొగ్గరాదా ॥ ఇద్ద ॥

చెక్కులనే నీడ చూపీఁ జెలియ నీకు
చక్కఁదనాలు చూచుక చనవీరాదా
మొక్కీ శ్రీవేంకటేశ మునివేళ్ళనే
మక్కువఁ గూడితివిట్టె మన్నించరాదా ॥ ఇద్ద ॥ 36

**రేకు 1907 కాంబోది**

వట్టి సిగ్గులఁ బొరలి వాసుల నలయనేల
చుట్టరికము చెప్పితే చొక్కుచు మన్నించునే ॥ పల్లవి ॥

సేవలు సేసితేను చిత్తము గరఁగదా
వావులు దెలిపితేను వద్దికి రాఁడా
మోవి చూపి మాఁటాడితే ముచ్చటలు గలయవా
యీవల నేపొద్దూ బతి యెదుటనే వుండవే ॥ వట్టి ॥

సరుసఁ గూచుండితేను సరసము లబ్బవా
మరిగించి నవ్వితేను మారు నవ్వఁడా
వరుసతోఁ జెనకితే వలపులు రేఁగవా
యెరవుసేయక పతి యెదుటనే వుండవే ॥ వట్టి ॥

తప్పక చూచితేను తలఁపునఁ బట్టదా
కప్పుక పెనఁగితేను కాఁగిలించఁడా
యిప్పు డిద్దరూఁ గూడితి రిదే మంచిదిగాదా
యెప్పుడూ శ్రీవేంకటేశు యెదుటనే వుండవే ॥ వట్టి ॥ 37

## శ్రీరాగం

ఇంతి వొయ్యారంబు లివి నీకు నడ్డమా
సంతతపు వేడుకలు సలుపవలెఁగాక ॥ పల్లవి ॥

సతమైన కాఁగిటికి చనుఁగొండ లడ్డమా
ఇతవులై మనసు లెనయించుఁగాక
రతివేళ చేఁతలకు రాజసము లడ్డమా
కతలుగా మర్మములు గరఁగించుఁగాక ॥ ఇంతి ॥

పెనఁగులాటలకు మరి పెనుసిగ్గు లడ్డమా
చెనకించి సదమదము సేయుఁగాక
మొనయుఁ గనుచూపులకు మొరఁగు లవి యడ్డమా
చొనిపి కంతువలెల్ల సోదించుఁగాక ॥ ఇంతి ॥

నిండుఁ గూటంబులకు నివ్వెరగు లడ్డమా
రెండు వంకలనుఁ దమి రేఁచుఁగాక
అండనే శ్రీవేంకటాద్రీశ కూడితివి
వెండియును మీమేలు వెలయవలెఁగాక ॥ ఇంతి ॥ 38

## పాడి

ఇటువంటి నీ సుద్దులు యెంతని పొగడవచ్చు
తటుకన నీకు నిందరము మొక్కేమయ్యా ॥ పల్లవి ॥

వచ్చి వచ్చి వనితకు వలపులు రేఁచితివి
గచ్చులుసేసి మనసు గరఁచితివి
మచ్చికతో నవ్వుతానే మరిగించుకొంటివి
ఇచ్చట నీ నేరుపులు యేమి చెప్పేమయ్యా ॥ ఇటు ॥

మంచివానివలెనే మాటలఁ జొక్కించితివి
లంచముగ మోవిచ్చియ(యె?) లయించితివి
అంచల సన్నలుసేసి యాసలు వుట్టించితివి
యెంచరావు నీ నేరుపు లేమి చెప్పేమయ్యా ॥ ఇటు ॥

చెనకుచుఁ గొప్పు దువ్వి చెలిమికాఁడ వైతివి
వినయానఁ గాఁగిలించి వెలయించితి
యెనసితివి శ్రీవేంకటేశ యలమేల్మంగను
ఇనుమడి నీ నేరుపు లేమి చెప్పేమయ్యా ॥ ఇటు ॥ 39

## లలిత

తెలిసితి నల్లనాఁడే తేటతెల్లమిగాను
వెలసిన నీ గుణాలు వింతలుగాఁ జూచేనా ॥ పల్లవి ॥

యెన్ని లేవు నీ సుద్దులు యిసుక పాఁతరలు
పున్నమ వెన్నెల పాళ్ళు బూమి మీఁదను
నన్ను నెంత చోదించేవు నమ్మితి నప్పుడే నేను
అన్నిటా నీ సరపాల కొఁ గాదనేనా ॥ తెలి ॥

పట్టరావు నీ చేఁతలు బయులువందిరులు
దట్టపు జడివానలు తలఁచరావు
గట్టిగా నేమి చూపేవు కంటి నప్పుడే నేను
యిట్టె నీ వింటికి రాఁగా నియ్యకొనకుండేనా ॥ తెలి ॥

తావుకొన్న నీ రతులు తంగేటి జున్నులు
కావేటి కాలువలు కలకాలము
యీవేళ శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
నీవే నన్ను నేలితివి నే నిఁక మఱచేనా ॥ తెలి ॥ 40

## సాళంగం

తప్పక చూడవయ్యా తలయెత్తి యీకె దిక్కు
వొప్పు లన్నియును నీ యువిదకే కలిగె ॥ పల్లవి ॥

చక్కని చందమామ సతిమోము
చిక్కని తేటవెన్నెల చిరునవ్వు
జక్కవల సొబగులు చన్నులు
అక్కజపు సింగారము లతివకే కలిగె ॥ తప్ప ॥

గండుఁ దుమ్మిదల పిండు కలికి కొప్పు
పండుఁ బగడపు జోక పసనిమోవి
మెండైన నిగ్గుటద్దాల మించు జెక్కులు
దండిగల యందము లీ తరుణికిఁ గలిగె ॥ తప్ప ॥

గొప్ప తమ్మిరేకు లీ కొమ్మ కన్నులు
చెప్పరానిచిగురు లీ చిన్నిపాదాలు
'ఒప్పు డిట్టె శ్రీవేంకటేశ నిన్ను రతిఁగూడె
మెప్పించె నీవింత లలమేల్మంగకే కలిగె ॥ తప్ప ॥ 41

## పాదరామక్రియ

ఇంకా నేమి గావలెనే యిన్నిటా సంతోసించితి
వుంకువ లిచ్చి యేరీతి నొడఁబరచీనే ॥ పల్లవి ॥

వింటిఁగదవే తన వేడుకైన సుద్దులెల్లా
కంటిఁగదే తనరూపు కనుఁగొనల
అంటిఁగదవే తొల్లె యన్నిటా తా జాణఁడని
వొంటినుండి మరియేల వొడఁబరచీనే ॥ ఇంకా ॥

చొక్కితిఁగదవే తనసురతపు వేడుకల
మొక్కితిఁగదవే తనకు ముందే చేతుల
నిక్కితిఁగదే తాను నేరిపిన చేఁతల
వొక్కమాఁటే నన్ను నెంత వొడఁబరచీనే ॥ ఇంకా ॥

నమ్మితిఁగదవే యిట్టె నయముల వాస(సు?)ల
కమ్మితిఁగదవే తను కాఁగిటిలోన
యెమ్మెల శ్రీవేంకటేశుఁడే నలమేలుమంగను
వుమ్మడిఁ దా నిప్పుడేల వొడఁబరచీనే ॥ ఇంకా ॥ 42

రేకు 1908 ముఖారి

అది యెవ్వతె తాను అలమేల్మంగను నేను
పొదిగి దాఁచకువే నీపూనిక మెచ్చేఁగాని ॥ పల్లవి ॥

పొలఁతి నీ కెవ్వతె బుద్దులు చెప్పినది
నలువున నాపతితో నవ్వుమంటాను
తెలుపఁగదవే దాని దీమస మెంతో
చలములు నీతో మరి సాదించేఁగాని ॥ అది ॥

నీ కెవ్వతె యీ చేఁతలు నేరిపినది
జోకతో నా రమణుని సొలయుమని
నాకుఁ జూపవే దాని విన్నాణ మెంతో
మైకొని నీతో మరి మాఁటలాడేఁగాని ॥ అది ॥

వోడక యెవ్వతె నీ కీ వుపదేశ మిచ్చినది
యీడ నాశ్రీవేంకటేశు నెనయుమని
వాడలో నెంచవే దాని వాసి యం (యెం?) తో యాతఁడు
కూడె నన్ను నీతో మరి గుట్టు చెప్పేఁగాని ॥ అది ॥ 43

## వరాళి

ఎఱఁగ మిన్నాళ్ళు మీ యిద్దరి సరితెలును
గుఱుతాయ నేఁడు మాకు గుట్టెల్లాఁ దెలిసెను ॥ పల్లవి ॥

మెచ్చి మెచ్చి నీతోను మేలమాడీ సారె సారె
మచ్చిక నీ కీపె మేనమామ కూఁతురా
రచ్చలోన నిన్నుఁ గడు రాకొట్టి పిలువవచ్చీ
పచ్చిగా నీకెప్పుడూను పాయరాని చుట్టమా ॥ ఎఱఁ ॥

చేరి చేరి బుద్దులెల్లాఁ జెప్పవచ్చీ నీకును
కోరి పెండ్లాడినయట్టి కొలము నాల
కూరిమితో నీవద్దఁ గూచుండి నవ్వులు నవ్వీ
నేరుపుతోఁ దగులైన నేస్తపు జవరాలా ॥ ఎఱఁ ॥

పొంచి పొంచి మోవి తేనె పొత్తు గలసీ నీతో
వంచనతోఁ దా నీకు వాడిక కాంతా
యెంచఁగ శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
కొంచక నన్నేలితివి కొమ్మ వేడుకకత్తే ॥ ఎఱఁ ॥ 44

## దేసాళం

ఏల నన్ను నొరసేవు యేమయ్యా నీవు
మేలులోనిదానిఁగాక మెరమెచ్చుదానవా ॥ పల్లవి ॥

వింతలేక నీకు నేను వినయాలే సేతుఁగాక
పంతమాడేదాననా పలుమారును
కాంతుఁడవు నిన్నుఁ జూచి కన్నుల మొక్కుదుఁగాక
జంతతనముల నిన్ను సాదించేదాననా ॥ ఏల ॥

పొసఁగఁగ మాఁటలాడి పొందుసేసేదానఁగాక
కొసరేటిదాననా గుంపించి నిన్ను
సుసరాన నిచ్చకమై (మే?) చూపేటిదానఁగాక
అసురుసురై బొమ్మల నద్దలించేదాననా ॥ ఏల ॥

కప్పురము నోరి కిచ్చి కాఁగిలించేదానఁగాక
తప్పులెంచేదాననా దంటతనాన
యిప్పుడు శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
వొప్పుగ నన్నేలితివి వొడ్డుకొనేదాననా ॥ ఏల ॥ 45

## గుజ్జరి

వాకిలి దెరవయ్యా వద్ద నెవ్వరున్నా నేమి
యీకడ నిన్నేమీనన దీఁకనేల సిగ్గులు ॥ పల్లవి ॥

మచ్చికతో జవరాలు మాఁటలాడేనంటా వచ్చి
కచ్చుపెట్టెప్పటనుండి కాచుకున్నది
విచ్చనవిడిని నీకు వీణె వినిపించేనంటా
అచ్చపు వేడుకతో నాయిత్తమై యున్నది ॥ వాకి ॥

వింత వింత చవులతో విందుచెప్పేనంటా వచ్చి
పంతముతో నక్షతలు పట్టుకున్నది
కాంత నీ యరత నుండి కతలు చెప్పేనంటా
అంతరంగమునఁ గోరి యాసగించుకున్నది ॥ వాకి ॥

బత్తితోడ నీకు నిట్టె పాదాలొత్తేనంటా వచ్చి
కొత్తగా నలమేల్మంగ కోరుకున్నది
ఇత్తల శ్రీవేంకటేశ యిందువచ్చికెఁ గూడితి
సత్తుగా[1] నీచేఁతలెల్లా సమ్మతించి యున్నది ॥ వాకి ॥ 46

## బౌళి

కక్కసించఁబోతేను కలుచపడు వలపు
వొక్కటై నీవుండితేనే వోజకు వచ్చీఁదానే ॥ పల్లవి ॥

సొంటులు సోదించనేల సొలసి పలుకనేల
ఇంటికి వచ్చెఁగా యాతఁ డెందున్నా నేమే
కంటకము లాడకువే గక్కన విడెమియ్యవే
జంటవాయకుండితేనే చాయకువచ్చీఁదానే ॥ కక్క ॥

గుట్టు లరయఁగనేల కూరిమి గొసరనేల
పట్టెఁగా నీ కొం గతఁడు బత్తితోడను
వట్టి యెగ్గు లెంచకువే వచ్చి పాదము లొత్తవే
చుట్టరికమే చూపవే సూటికి వచ్చీఁదానే ॥ కక్క ॥

చొప్పులు వెదకనేల చూపుల జంకించనేల
ఇప్పు డిట్టె కూడీఁగాని ఇతవెరిఁగి
అప్పఁడు శ్రీవేంకటేశుఁ డలమేల్మంగవు నీవు
తెప్పలుగా మో వియ్యవే తీరుపువచ్చీఁదానె ॥ కక్క ॥ 47

## కాంబోది

ఎంత సిగ్గరికత్తెవు యేమే నీవు
వింత వింత వాసులేల వెదచల్లేవే ॥ పల్లవి ॥

1. "సత్తు" సత్య శబ్ద భవము కావచ్చు. అర్థమూ అదే.

వలచిన రమణుఁడు వావి నీకుఁ జెప్పితేను
కలికి కన్నులనేల గద్దించేవే
కలువపూవుల వేసి కతలు ని న్నడిగితే
సెలవుల నవ్వులేల చిందేవే ॥ ఎంత ॥

చవులుగా మోవి చూపి సన్నలు నీకుఁ జేసితే
జవళి బొమ్మలనేల జంకించేవే
తివురుచు నీ చన్నులది క్కతఁడు చూచితేను
రవళి సణఁగులేల రాలిచేవే ॥ ఎంత ॥

చుట్టరికమున నిన్ను సోఁకఁ గాఁగిలించుకొంటే
వొట్టుగా చేతులనేల వొడ్డుకొనేవే
యిట్టె శ్రీవేంకటేశుఁ డేలె నలమేల్మంగవు
గుట్టున నేరుపులేల కుమ్మరించేవే ॥ ఎంత ॥ 48

రేకు 1909 సామంతం

ఇంతసేయకుండితేను యీపెకు వలతువా
వింతలుగాఁ గానవచ్చె వేడుక మీ కతలు ॥ పల్లవి ॥

తెరమరఁగున నుండి తేనెగార మాఁటలాడి
కరఁగించీ నిన్ను నెంత కలికో కాని
సొరిదిఁ జెలుల చేత సూడిదెలు సొరె నంపి
మెరవుసేయదు నీకు నెక్కడిదో కాని ॥ ఇంత ॥

తొలుకరి మెరుఁగై తొంగి తొంగి నిన్నుఁ జూచీ
యెలయింపులాఁడి యీపె యెవ్వతో కాని
చిలుకకు నీపేరు చెప్పి చెప్పి పిలిపించీ
సొలసి సొలసి యెంత చుట్టమో కాని ॥ ఇంత ॥

ముసుఁగు వెట్టుక వచ్చి ముచ్చటల నీతో నవ్వీ
వసుధ నీకెంత చనవరియో కాని
వెస నలమేలుమంగ విభుఁడ శ్రీవేంకటేశ
యెసగ నన్నేలితివి యీకె యేమౌనో కాని ॥ ఇంత ॥ 49

## ఆహిరి

ఇదివో విన్నవించితి మిన్నిటా జాణవు నీవు
మదిరాక్షి మే లెరిఁగి మన్నించఁదగును ॥ పల్లవి ॥

చెలి నీవు వచ్చేవంటా సిగ్గుల ముగ్గులు వెట్టి
తళుకుఁజూపుల తమ్మిదండలు గట్టి
పలచని చెమటల పన్నీరు చిలికించి
వెలయ మోవి తేనెల విందాయితము సేసె ॥ ఇది ॥

దొరయ చెక్కుటద్దాల తోరణములుగా గట్టి
గరిమఁ దొడ లరఁటి కంబాలు సేసె
నిరతిఁ బులకలనే నించె ముత్తేలకుచ్చులు
పరగ గుబ్బలనేపైఁడికుండ లెత్తెను ॥ ఇది ॥

కమ్మని మేని తావుల గంద మట్టి యమరించె
పమ్మి పలుకుల కప్రబాగాలు గూర్చె
ఇమ్ముల నలమేల్మంగ యీకె శ్రీవేంకటేశ్వర
నెమ్మిఁ గూడితి వింతలో నీవే యింటికి వచ్చి ॥ ఇది ॥ 50

## వాదరామక్రియ

కంటిరటె చెలులాల కన్నులపండుగ లివి
వెంట వెంట వచ్చెనమ్మ వెస నీకె సుద్దులు ॥ పల్లవి ॥

సన్నపుఁ జెమట లుబ్బి చన్నులపై జాలువారె
కన్నులఁ దేటలుదేరె కాంతకును
చిన్ని పెదవులవెంట చిరునవ్వు లిదె వూరె
యెన్నఁ గతలాయనమ్మ ఇప్పు డీకె సుద్దులు ॥ కంటి ॥

కడువేడుకలతోడ కళలు మోమున నిక్కె
తడఁబాటు కోరికలు తలకెక్కెను
పడఁతి కాతనిపేరు పైపై పెదవులఁ జిక్కె
అడియాలా లాయనమ్మ అట్టె యీకె సుద్దులు ॥ కంటి ॥

చెక్కటికిఁ జేయి వచ్చె సిగ్గులు లోలో హెచ్చె
మిక్కుటపుఁగొప్పు వీఁపుమీఁదికి వచ్చె
యిక్కడ శ్రీవేంకటేశుఁ డిదె యలమేలుమంగ
దక్కఁగూడె నౌనమ్మ తగు నీకె సుద్దులు ॥ కంటి ॥ 51

**వరాళి**

ఇంత జాణవుగాఁగానే యింతులు వలచిరి
సంతోసించి రీడనున్న సతులెల్లా నిన్నును ॥ పల్లవి ॥

ఆయములెత్తి యాడి యతివ నిన్ను దూరితే
చాయగా పాటుసేసుకొని సారె నవ్వేవు
నీయందు నేరాలు మోపి నీకుఁ దారుకాణించితే
యీాయకోలు సేసుకొని ఇచ్చగించేవు ॥ ఇంత ॥

వొల్లనే యానలు వెట్టవొద్దని పెనఁగితేను
చెల్లుబడిసేసుకొని చేయివట్టేవు
పల్లదాన వెంగేలకు పలుమారు మొక్కితేను
వెల్లవిరిసేసుకొని వేడుకపడేవు ॥ ఇంత ॥

అందరిలో నిమ్మపంట నట్టె నిన్ను వేసితేను
చందములుసేసుకొని సమ్మతించేవు
కందువ శ్రీవేంకటేశ కలికి నిన్నొరసితే
చెందికూడి యదే గురిసేసుకొనేవు ॥ ఇంత ॥ 52

## ముఖారి

ఆఁటదాని కింతగద్దా అగడు సేసెఁగాక
జాటరి దీనివిద్యలు చూడరమ్మా సతులు ॥ పల్లవి ॥

చిగురుఁ బెదవిమీఁద చిన్నిముద్దుమాఁట లాడీ
మగనితో నించుకంతా మరఁగులేక
తెగనివలపు చల్లి తీగె నవ్వులు నవ్వీ
సొగిసే దీని వుదుటు చూడఁ గొత్తలాయను ॥ ఆఁట ॥

తమ్మికన్నులు దెరచి తళుఁకుఁ జూపులఁ జూచీ
కమ్మటఁ బతి యెదుట గర్వమునను
సొమ్ములెల్లాఁ జూపుకొంటా జోలి మొక్కులు మొక్కీ
యెమ్మెలదీనివేసాల కేమందు నేను ॥ ఆఁట ॥

కావరపు గుబ్బలు సోఁకఁగ సేవలెల్లాఁ జేసీ
శ్రీవేంకటేశుఁ డెదుట సిగ్గువడక
వావితో నన్నితఁ డేలె వట్టిసన్నలు తాఁ జేసీ
భావించి దీని గజరు పచ్చిఁ దోచె నిపుడు ॥ ఆఁట ॥ 53

## మాళవిగౌళ

ఎంతసేసినా నీకు యెరవులవాఁ డితఁడు
సంతతము తొల్లి నాకు చనవిచ్చినాఁడు ॥ పల్లవి ॥

తెరమఱఁగున నుండి తేనెగార మాఁటలాడి
మరిగించితి వవునే మగని నీవు
సరసము లాడుకొంటా సన్నలు సేసుకొంటా
తరితీపుల నితనిఁ దగిలించుకొంటివే ॥ ఎంత ॥

వొంటినుండి యేకతాన వొడఁబరచి పరచి
వెంటఁ దెచ్చుకొంటివౌనే విభుని నీవు
నంటులు చూపుకొంటా నవ్వులు నవ్వుకొంటా
ఇంటిలో గూడితివౌనే యీతనితోను ॥ ఎంత ॥

గుఱుతులు మేన నించి గుబ్బల నూఁది యూఁది
కఱఁగించితివౌనే కాంతుని నీవు
యెఱిఁగి శ్రీవేంకటేశుఁ డీతఁడే నన్ను నేలె
మఱి నీవితని ఛిక్కు మళ్ళిచూడనేఁటికే ॥ ఎంత ॥ 54

**రేకు 1910 గౌళ**

చెల్లునమ్మా ఆతనికి సేసేటి చేఁతలెల్లా
కొల్లున నవ్వేఁగదమ్మా గోవిందదేవుఁడు ॥ పల్లవి ॥

పీడెపుఁ బెదవులతో వినోదా లాడుకొంటా
వాడ వనితలనెల్లా వావు లడిగీ
వాడికలు సేసుకొని వలపులు పైఁ జల్లీ
కోడెకాఁడు గదవమ్మా గోవిందదేవుఁడు ॥ చెల్లు ॥

దంటమాఁటలెల్లా నాడి తమిరేఁచుకొంటాను
పొంటులు సోదించీఁ దాను సుదతులను
అంటిముట్టి చనుఁగవలందు గురుతులునించీ
గొంటరివాఁడు గదమ్మా గోవిందదేవుఁడు ॥ చెల్లు ॥

వల్లెవాటుఁ బయ్యెదతో వరుసలు బెట్టుకొంటా
చల్లనికాఁగిటఁ గూడీ సతులనెల్లా
తెల్లమి శ్రీవేంకటాద్రిఁ దిరుపతిలో నున్నాఁడు
కొల్లకాఁడు గదవమ్మా గోవిందదేవుఁడు ॥ చెల్లు ॥ 55

## బౌళి

అప్పటనుండి నాకు నందుకే వేఁడుకోఁబట్టె
ముప్పిరి వేవేలకును మొక్కేఁ జూమ్మీ నేను ॥ పల్లవి ॥

మేలమాడేవేళ నిన్ను మీరి నే నేమంటినో
బేలనై నీతో నెంత పెనఁగితినో
చేలికొంగు నీవంటఁగా చెయ్యేడఁ దాఁకించితినో
కేలెత్తి నీకిదివో మొక్కేఁ జూమ్మీ నేను ॥ అప్ప ॥

నీ కూడిగముసేయఁగా నిన్నఁ గా లేడ సోఁకెనో
ఆకుమడిచియ్యఁగా నిన్నంటెనో గోరు
దాకొని నీతో నవ్వఁగా తమ్ముల మేడఁ జిందెనో
యీకడ మొక్కేఁ జూమ్మీ యెరఁగను నేను ॥ అప్ప ॥

చెనకి కాఁగిలించఁగా చెమ టెంత వడిసెనో
యెనయఁగా నీ చన్ను లెంత వొత్తెనో
నిను, శ్రీవేంకటేశుఁడ నేఁ జేసిన చేఁతకెల్లా
మునుపనే వినయాన మొక్కేఁ జూమ్మీ నేను ॥ అప్ప ॥ 56

## సామంతం

ముసి ముసి నవ్వులతో మోములు వంచుకోకురే
పసలుగా వేడుకతో పతిసేవ సేయరే ॥ పల్లవి ॥

నెయ్యముగల చోటికి నేరమి రాదు
యియ్యకోలై పొసఁగితే నెగ్గులేదు
చెయ్యారఁ జెనకితేను సిగ్గులెడయు
యెయ్యడా వలపుజాడ లెరుఁగుకోరే ॥ ముసి ॥

ననిచినవారు పెనఁగులాడరు
మనసులు గలసితే మరఁగేడది
చనవులు మీరితేను జారుఁ జలము
గొనకొన్న వలపుల గురుతు లివిగోరే ॥ ముసి ॥

బత్తి సేసితేఁ జలము పరిసిపోవు
పొత్తు గలసితే పొరపొచ్చ మేడది
యిత్తల శ్రీవేంకటేశుఁ డిటు మిమ్ము నేలినాఁడు
హత్తిన వలపుజాడ లని యెంచుకోరే ॥ ముసి ॥ 57

## పళవంజరి (రం?)

కాఁపురాలు సేసేవారి గాకుసేయఁ దగునటే
మాపుదాఁకా నీవెంత మలసేవే యెదుట ॥ పల్లవి ॥

మచ్చిక నే నితనితో మాఁటపలుకు లాడఁగా
ఇచ్చటికి వచ్చి నీవేమి వినేవే
అచ్చులాన నిద్దరమూ నాసతోడఁ గూచుండఁగా
కచ్చుపెట్టుక నీవేల కాచుకవుందానవే ॥ కాఁపు ॥

ననుపున మాలో నేము నవ్వుకొంటా నుండఁగాను
పనివూని నీవేల తప్పక చూచేవే
పెనఁగి వొండొరులము ప్రియములు చెప్పుకోఁగా
వెనుకొని నీవేల వెరగువడేవే ॥ కాఁపు ॥

అక్కజపురతుల నే మట్టె వోలలాడఁగాను
యెక్కడనుండో నీవు యెట్టు వచ్చేవే
ఇక్కువ శ్రీవేంకటేశుఁ డేలఁగా నే మెచ్చితేను
చక్కటి నీ వెందాఁకా నెచ్చరికలు సేసేవే ॥ కాఁపు ॥ 58

## బౌళి

నాకే మేలువాఁడనంటా నమ్మిక లిచ్చేవు నీవు
నీకు దేవినై వుందాన నే నెదురాడేనా ॥ పల్లవి ॥

కన్నుల చూపులనే కరగించె నాకె నిన్ను
సన్నలా చాయలాఁ గొంత చల్లె వలపు
కిన్నెర మీఁటులు మీఁటి గిలిగించె నింతవడి
యిన్నిటా నాపె పొందులు యెట్టు మరచేవయా ॥ నాకే ॥

మంతనపు మాఁటలనే మరిగించె నాకె నిన్ను
వింత వింత నవ్వులనే వీడు దోడాడె
చెంతనుండి వీడె మిచ్చి చిమ్మిరేఁచె నీ మనసు
యెంతైనా నాపె పొందులు యెట్టు మరచేవయా ॥ నాకే ॥

మిక్కుటపు సేవలనే మెప్పించె నాకె నిన్ను
తక్కక రతులనే దక్కఁగొనెను
అక్కరతో నన్నేలితి వప్పటి శ్రీవేంకటేశ
యెక్కడా నాపె పొందులు యెట్టు మరచేవయా ॥ నాకే ॥ 59

## కాంబోది

ఎగ్గు సిగ్గు లెఱఁగరు యెదుట నెవ్వరున్నాను
బెగ్గిలక తమకమే పెంతురుగాని ॥ పల్లవి ॥

అలతురు సొలతురు అంగనలఇనవారు
వలచిన పతితోను వద్దననేలే
పిలుతురు సన్నసేసి పెనఁగులాడుదురు
చెలులాల యెరుకలు సేనుకొన నేలే ॥ ఎగ్గ ॥

కన్నుల జంకింతురు కాఁగిలించుకొందురు
మన్ననగలవారిని మానుపరాదే
చన్నులు మోపుదురు సారె మర్మా లంటింతురు
కన్నెలాల మీరు వారిఁ గనుఁగొన నేలే ॥ ఎగ్గ ॥

మోములు చూచుకొందురు ముచ్చటతో నవ్వుదురు
కాముకుల రవ్వసేయఁ గారణమేమే
యీమేర శ్రీవేంకటేశుఁ డిందిరయుఁ గూడినారు
భామలాల మీరింత పచారించ నేలే ॥ ఎగ్గ ॥ 60

**1911 వ రేకు నుండి 1920 దాక గల 10 రేకులు లేవు.**

**రేకు 1921 రీతిగౌళ**

సిగ్గులువడఁగనేల సెలవి నవ్వఁగనేల
వొగ్గి విడె మందుకోవే వుబ్బుతోడను ॥ పల్లవి ॥

వాడికగల సతికి వలపు లీడేరును
వేడుకలే పెంచితే వెలయుఁ దమి
కూడఁగూడఁ గోరికలు కొనలుసాగు
చూడవే విభుని దిక్కు సూటితోను ॥ సిగ్గ ॥

పెనఁగులాడఁగానే ప్రేమములు నిండుకొను
చెనకగానే రతి చిమ్మిరేఁగును
చనవునఁ గొసరితే చవివుట్టు సరసము
మనసిచ్చి యితనితో మంతనము లాడవే ॥ సిగ్గ ॥

యెడయక వద్దనుంటే యెక్కుడొఁ జుట్టరికము
జడిగొన్నకాఁగిళ్ళు సతముసేసు
అడరి శ్రీవేంకటేశుఁ డంతలోనే నిన్నుఁ గూడె
కడఁగి మోవి చూపవే కందువ లీడేరును ॥ సిగ్గు ॥ 61

## కుంతలవరాళి

ఏలితివి నన్నుఁ దొల్లె యింతగా మన్నించితివి
ఆలించి నా విన్నపము లవధరించవయ్యా ॥ పల్లవి ॥

కోపగించరాదు నీతో గుంపెన చూపఁగరాదు
వైపుగా నిచ్చక మాడవలెఁగాని
రాఁపులఁ బెట్టఁగరాదు రట్టుసేసి చూపరాదు
చేపట్టి నీవే కృపసేయవయ్యా ॥ ఏలి ॥

కన్నుల జంకించరాదు కడుఁ దమకించరాదు
వన్నెగా బత్తి నెరపవలెఁగాని
సన్నలఁ గొసరరాదు సారెకుఁ బెనఁగరాదు
అన్నిటా నీవే నన్ను నాదరించవయ్యా ॥ ఏలి ॥

పాడి పంతా లెంచరాదు పైపై సిగ్గువడరాదు
వాడికగాఁ గాఁగిలించవలెఁగాని
కూడితివి నన్ను నిట్టె గురిగా శ్రీవేంకటేశ
వేడుకతో వరమిచ్చి వెలయించవయ్యా ॥ ఏలి ॥ 62

## లలిత

ఎటువంటి నేరుపరి యెంతటి జాణ
తటుకన నీగుణాలే తడవీ నే పొద్దును ॥ పల్లవి ॥

కసుఁగందని మాఁటలఁ గడు సరస మాడుతా
ముసి ముసి నవ్వులతో మురిసీఁ జెలి
వసివాడని చేఁతల వలపులు చల్లుకొంటా
కొసరుచు ముద్దులు గునిసీ నీయెదుట ॥ ఎటు ॥

వులివచ్చి తమకాన నుమ్మగిలుకొంటాను
ములువాఁడి చూపుల మురిసీ నాపె
గిలుకు మట్టెల మోఁత కెరలించుకొంటాను
పిలిచి తా రతులకుఁ బెనఁగీ నీ యెదుట । ఎటు ॥

నినుపు నివ్వెరగుల నీట్లు చూపుకొంటాను
మునిముంగిట సిగ్గుల మురిసీఁ దాను
యెనసితివి శ్రీవేంకటేశ నన్ను నింతలోనె
వినయాన మాతోనే వెలసీ నీయెదుట ॥ ఎటు ॥ 63

## దేసాళం

ఈతనికి మేలుదాన విన్నిటా నీవు
చేతికి లోనైవున్నాఁడు సేసవెట్టవే ॥ పల్లవి ॥

కొసరి కొసరి పతిఁ గొంగువట్టి దూరుకొంటా
యిసుకపాఁతరలు యేల త్రవ్వేవే
పొసఁగి యాతఁడు నీతోఁ బొందుసేయవచ్చినాఁడు
పసలుగా విడె మిచ్చి పాదా లొత్తవే ॥ ఈత ॥

చుట్టి చుట్టి యాతని మై సొంట్లు సోదించుకొంటా
యిట్టె సముద్రాన కేతా లెన్ని వెట్టేవే
చుట్టపు వరుస నీకు సొమ్ములియ్య వచ్చినాఁడు
గుట్టుతోడఁ బాన్పుపై గూచుండఁబెట్టుకోవే ॥ ఈత ॥

నిక్కి నిక్కి తానూ నీవూ నీటుతోఁ బెనఁగుకొంటా
దక్కి బయలువంది లెందాఁకాఁ బెట్టేవే
ఇక్కడ శ్రీవేంకటేశుఁ డీతఁడే నిన్నుఁగూడె
మొక్కి మొక్కి మెచ్చి మెచ్చి మోవి తేనె లియ్యవే ॥ ఈత ॥ 64

## పాడి

ఆ సరిం(గిం?) చి నాఁటదాని నలఇంచరా దండురు
సేసిన నావిన్నపాలు చిత్తగించు మిఁకను ॥ పల్లవి ॥

కచ్చుపెట్టి యాపె నీకుఁ గాచుకవుండఁగానే
వచ్చితి విప్పుడు నావద్దికి నీవు
ముచ్చటతో నప్పటి నీమోము చూడఁగానే
మచ్చికసేసి నాతో మాఁటలాడేవు ॥ ఆస ॥

కూరిమితో నాపె నీకొంగు వట్టుకుండఁగానే
చేరి నాతో నవ్వేవు సెలవులను
సారె సారె నీ యెదుట సన్నలు సేయఁగానే
గారాన నన్ను నిట్టె కాఁగిలించేవు ॥ ఆస ॥

చేతులారా నాపె నీపై సేసలు చల్లఁగానే
యేతుల సరసమాడే విప్పుడు నాతో
కాతరాన శ్రీవేంకటేశ న న్నేలితివి
నీతో నాపెఁ గూడఁగానే నీ మోవి నా కిచ్చేవు ॥ ఆస ॥ 65

## బౌళి

ఎన్నఁడు నేరుచుకొంటి విటువంటి వేడుకలు
అన్నిటా నీ సుద్దులు యెంతని మెచ్చేమమ్మా ॥ పల్లవి ॥

పచ్చిదేరె జంకెనలపై పూఁతలు
తచ్చన మరఁగుల పాదపు వాఁతలు
కుచ్చియెత్తె గోరి చెనకుల చేఁతలు
హెచ్చి నీవిభునివద్ద నేమి చూపేవమ్మా ॥ ఎన్నఁ ॥

పొరుగు పోరచి పొలపుల తక్కులు
గరువముతోడి కనుఁగవ మొక్కులు
సరసపు మాఁటల బచ్చన తెక్కులు
అరుదుగా నీ కిన్నియు నమరె నోయమ్మా ॥ ఎన్నఁ ॥

తనిసిన నవ్వులతో తరితీపులు
చినుకుఁ జెమట చెక్కుచేతి దాపులు
ఘనశ్రీవేంకటేశు రేఁచిన రేఁపులు
యనసిన యుతనితో నివి దగునమ్మా ॥ ఎన్నఁ ॥ 66

**రేకు 1922 వసంతవరాళి**

ఏకతాన మీయిద్దరి యేలాటము లెట్టివో
నీకు వలచు నాతఁడు నెమ్మది నుండఁగదే ॥ పల్లవి ॥

పెనఁగుతా రమణుఁడు ప్రియము చెప్పీ నీకు
వినవే యాతనిమాఁట వేడుకతోను
మునుకొని పొరెరారె మొగము దప్పక చూచి
యెనసీని చేతులెత్తి యిఁక మొక్కవే ॥ ఏక ॥

కొప్పు దువ్వి బుజ్జగించి కొంగు వట్టుకున్నాఁడు
చెప్పినట్టు సేయవే చెలువునికి
చిప్పిల మర్మములంటి చెక్కు నొక్కి వేఁడుకొనీ
ఇప్పు డిట్టె కానిమ్మని ఇయ్యకొనవే ॥ ఏక ॥

కడు బత్తితోడుత కాఁగిలించుకొనీ నిన్ను
వొడికమున నొక్కటై వుండవే నీవు
యెడయక శ్రీవేంకటేశుఁ డింతలో నిన్నేలె
వొడఁబడికతో రతి నోలలాడవే ॥ ఏక ॥ 67

## తోండి

తారుకాణించుకోవయ్య తరుణి తోడుత నీవు
నేరమిగా దండుకేమి నీ విన్నిటా జాణవు ॥ పల్లవి ॥

పమ్మి యాపెతో నీవు పక్కన నవ్వితివంటా
కొమ్మ చెలులతో నాడుకొంటా నున్నది
సమ్మతించి యాపె నీతో సన్నలుసేసీ (సే?) నంటా
ఇమ్ముల( దనలోనే వూహించుకొంటానున్నది ॥ తారు ॥

నిక్కి చూచి వుంగరము నీ వాపె కిచ్చితివంటా
పక్కన నట్టే మచ్చెము పట్టుకున్నది
అక్కడనే విడెము నీ కాపె వొసగినదంటా
ముక్కుపై వేలిడుకొని మోనమున నున్నది ॥ తారు ॥

చాపలాన నాపె మోవి చవి నీవు గొంటివంటా
ఆపనులకే నివ్వెరగై వున్నది
యేపున శ్రీవేంకటేశ యీకె నిట్టె యేలితివి
ఆపె నీకు దేవులంటా నాదరించుకున్నది ॥ తారు ॥ 68

## పాడి

కాఁగిటిలోదానికింకా నెడమాఁట లేల
[1]లోఁగనేల పతియిచ్చలోనే రమ్మనవే ॥ పల్లవి ॥

---

1. 'లోఁగనేల పతి యిచ్చతోనే రమ్మనవే' కావచ్చు.

యెనసి వుండినదాని కెగ్గులు వట్టఁగ నేల
చనవరి దానికి సాదించ నేల
మనసొగ్గినదానికి మరి పెనఁగఁగ నేల
ననిచిన పతితోను నగును రమ్మనవే ॥ కాఁగి ॥

సేసవెట్టినదానికి సిగ్గులు వడఁగ నేల
ఆసగలదానికి నలయ నేల
వాసివంతులదానికి వట్టి విచారము లేల
యీసరిఁ బతి పెండ్లిపీఁ టెక్కును రమ్మనవే ॥ కాఁగి ॥

వావి గూడినదానికి వక్కణ లడుఁగ నేల
కైవసమైనదానికి కాతర మేల
దేవులయినదానికి తెరమరఁ గిఁక నేల
శ్రీవేంకటపతి వచ్చెఁ జేకొను రమ్మనవే ॥ కాఁగి ॥ 69

## సామంతం

ఎంతని పొగడేమమ్మా యీతని గుణాలు నేము
సంతోసాలే నెరపేటి జాణఁడే నీ మగఁడు ॥ పల్లవి ॥

యెనసిన కాంత దను నెంత కొసరినాను
చనవిచ్చుఁగాని మరి సాదించఁడు
వెనుకొని మరి యెన్నివిన్నపాలు సేసినాను
వినుఁగాని యెఁ (యెం?)తైనా వేసారఁడు ॥ ఎంత ॥

సన్నలా చాయలా నెట్టు సణఁగులు రాలిచినా
మన్నించుఁగాని మరి మచ్చరించఁడు
కన్నులఁ దప్పక చూచి కడు నెంత వొరసినా
వున్నతితో నవ్వుఁగాని వుప్పతించఁడు ॥ ఎంత ॥

కూరిమి గొసరుకొంటా కొంగువట్టి తీసినాను
కోరిక చెల్లించుఁగాని గుంపించఁడు
యీరీతి శ్రీవేంకటేశుఁ డింతి నిన్ను నిట్టె కూడె
నేరుపుతో నేలుగాని నీతోఁగూడి పాయఁడు ॥ ఎంత ॥ 70

## గౌళ

తలఁచిన తలఁపులు తలకూడెను
కలకాలమును మీకు కాఁపుర మీడేరెను ॥ పల్లవి ॥
[1]ఇంతి, నీవు వచ్చేవంటా నెదురుచూచె నిందాఁకా
చెంత సగినా లడిగె జలరేఁగి
సంతోసాన నీ గుణాలె సారె బొగడె మాతోను
వింతలేక యింతలోనె విచ్చేసితి వీడకు ॥ తలఁ ॥
కన్నులు మూసి తెరచి కలలుగనె లోలోనె
నిన్నుఁ బిలువ చెలితో సన్నలుసేసె
వన్నెగా లేకలు వా (వ్రా ?) సె వడి నీకుఁ గొంతవడి
యెన్నికగా విచ్చేసితి వింతలో నిక్కడికి ॥ తలఁ ॥
వేడుకతో మదనుని వేఁడుకొనె నీ రాకకు
కూడే తలపోఁతలే కోరుకుండెను
తోడనె శ్రీవేంకటేశ తొల్లె తెరలో నేలి
యీడుజోడై విచ్చేసితి వీకె యింటిలోనికి ॥ తలఁ ॥ 71

## కాంబోది

మగువలకు బలిమి మంచితనమె
చిగురు నవ్వులతోడఁ జిత్తగించి వినవే ॥ పల్లవి ॥

1. ఒక నాయిక అనుభవించిన విరహావస్థను ఒక చెలి స్వామితో చె[illegible]ట్లు భావించుకొనవలసి యున్నది ఈ పాటలో.

చన వెంత గలిగినా సంగాతము లమరును
మనవి యొనగూడితే మచ్చిక రేఁగు
వినయము సతమైతే వేడుక లగ్గలమౌను
యెనసి నీ రమణుని యిచ్చనే మెలఁగవే ॥ మగు ॥

సరసము లితవైతే సంతోసములు మించు
వొరిమ గలిగితేను వుబ్బు మనసు
సరవితోటి వలపు చవులెల్లాఁ బుట్టించు
సిరుల నీపతికిని సేవలెల్లాఁ జేయవే ॥ మగు ॥

వావులు దొరసితేను వాడికలు తానే వచ్చు
కైవసమై యుండితేనే ఘనమౌఁ దమి
చేవదేర నిన్నుఁ గూడె శ్రీవేంకటేశ్వరుఁడు
యీవల నీమగఁ డీతఁ డెన్నఁడూ బాయకులే ॥ మగు ॥ 72

**రేకు 1923 ఆహిరి**

ఏమి గారణమె తమ కిద్దరము నొక్కటె
ప్రేమము లిరు దెసలాఁ బెనఁగొనఁగాను ॥ పల్లవి ॥

సేసవెట్టి పతిఁజూచి సిగ్గున నే నుండితేను
వాసించు పువ్వులకేల వాఁడి వచ్చెనే
ఆసతోఁ దెరమాఁటున నట్టె నే నుండితేను
మూసి చిలుకలకేల మొగా లెత్తినాయెనే ॥ ఏమి ॥

తనియక లోలోనే తలపోసుకొంటేను
వనము కోవిలకేల వాకు వెళ్ళెనే
చెనకఁగా వాసితోడ శిరసు వంచుకొంటేను
వొనరఁ జల్లగాలికి నుడుక నేమిటికే ॥ ఏమి ॥

గక్కన శ్రీవేంకటేశుఁ గాఁగిలించుకొంటేను
నెక్కొని చిత్తమునకు నివ్వెరగేలే
చక్కఁగా నాతనితోను సరసము లాడితేను
వెక్కసపు రతులేల వెల్లివిరిసీనే ॥ ఏమి ॥ 73

## భైరవి

నీవే మంచితనాలు నెరప నేరుతువమ్మా
సేవసేసి రమణుని చిత్తము వచ్చినట్లు ॥ పల్లవి ॥

యిచ్చకము లాడితేనే యితవులైయుండు; నౌనె
హెచ్చి వెంగేలాడితేను యియ్యకోలౌనా
అచ్చముగ మొక్కితేను అట్టె దయవుట్టు; నౌనె
విచ్చనవిడిఁ దిట్టితే వేడుకలౌనా ॥ నీవే ॥
మొగమెత్తి చూచితేను మోహములు రేఁగు; నౌనె
తగిలి తలవంచితే తమి వుట్టునా
నగవులు నవ్వితేను ననిచివుండు; నౌనె
బిగిసి వూరకుండితే ప్రియము గలుగునా ॥ నీవే ॥

పాయక పక్కనుండితే భావము గరఁగు; నౌనె
చాయల సన్నలవల్లఁ జవి వుట్టునా
చేయార శ్రీవేంకటేశుఁ జెందినది మే; లౌనె
కాయకపు సరసాలు కందువలంటీనా ॥ నీవే ॥ 74

## వరాళి

ఎఱుఁగుదు నీమనసు యేల దాఁచేవు
మెఱసి యాపె నీకు మేలుదిగాదా ॥ పల్లవి ॥

చూపెట్టుక నాతో మరి సుద్దులు చెప్పేవుగాని
ఆపెతో నిపుడు మాఁటలాడి రారాదా
యేపున మూపటంత మాయింటికి వత్తువుగాని
యేపొ ద్దాడకుఁ బోఇ నీ విట్టె రారాదా ॥ ఎఱుఁ ॥

పైకొని ఇచ్చోట నాకు బాగా లిచ్చేవుగాని
ఆకెను ననుసరించి యట్టె రారాదా
వాకుచ్చి నా చెలువము వదలకెంతువుగాని
జోకతోడ నాపె మోము చూచి రారాదా ॥ ఎఱుఁ ॥

యెడయక నన్ను నేఁడే యేలేవుగాని ఇంతలో
నడుమ నాపెతోఁ గొంత నవ్వి రారాదా
కడఁగి శ్రీవేంకటేశ కాఁగిలించి తయ్యాఁగాని
చిడుముడి నాపెతోడాఁ జెప్పి రారాదా ॥ ఎఱుఁ ॥ 75

## ముఖారి

నన్నుఁ జూచి నాలోనే నవ్వువచ్చీని
యెన్నిక నో చెలులాల యేమి సోద్యమే ॥ పల్లవి ॥

గొచ్చరించి సారె సారె నెలయించీ మనసు
పెచ్చురేఁగి తమకము పెనచీ మనసు
తచ్చి యాతని పొందులు తలఁపించీ మనసు
యిచ్చట నో చెలులాల యేమని చెప్పుదునే ॥ నన్నుఁ ॥

యెదురు చూపించి బయలీఁదించీ మనసు
కదిసేటి యాసలఁ గరఁగించీ మనసు
గుదిగొని రతులెల్లాఁ గోరించీ మనసు
యిదివో చెలులాల యేమి సేతునే ॥ నన్నుఁ ॥

చెప్పరాని ప్రియములు చెప్పించీ మనసు
ముప్పిరి నా వలపులు ముదిరించీ మనసు
అప్పుడు శ్రీవేంకటేశుఁ డాతఁడే వచ్చి నన్నేలె
యిప్పుడు వో చెలులాల యేమందునే ॥ నన్నుఁ ॥ 76

## మంగళకౌసిక

సుదతుల మెల్లాను సోబానఁ బాడేము
యెదుటనున్న మము నేలితి వపుడే ॥ పల్లవి ॥

నిండు నిధానము నెలఁత జవ్వనము
కొండలుఁ గోట్లు కుచములు
పండువెన్నెలలు పలచని నవ్వులు
అండనే కలిగెఁ బెండ్లాడవయా ॥ సుద ॥

[1] కనక వసంతము కామిని సరసము
ఘనమగు నీలపుగని కొప్పు
చినుకుఁ దేనియలు చెలఁగేటి పలుకులు
అనువుగ దొరకెఁ బెండ్లాడవయా ॥ సుద ॥

ముంగిట సంపద ముదిత సింగారము
తంగేటి జున్ను బిత్తరి మోవి
చెంగటఁ గలిగెను శ్రీవేంకటేశుఁడ
అంగవించి పెండ్లాడవయా ॥ సుద ॥ 77

## రామక్రియ

ఏల సిగ్గులు వడేవు ఇందరి ముందరా నీవు
తాలిమితో నీవలపు తప్పకొనఁ గదవే ॥ పల్లవి ॥

---

1. కనక వసంతము = బంగారు పండించే వసంతము అని అర్థము కావచ్చు. ఇక్కడ భోగములే బంగారు.

విచ్చన విడాయ నీకు విభుఁ డింటికి రాఁగాను
నచ్చుకొట్టనేల యిఁక నవ్వఁగదవే
యిచ్చె నీకుఁ జన వాతఁ డిఁకనేల కొంకేవు
పచ్చిదేర నీ యెమ్మెలు పచారించఁగదవే ॥ ఏల ॥

పంతమెల్లాఁ జెల్లె పతి పక్కఁ బెట్టుకొనఁగాను
చెంతనున్న చెలులతోఁ జెప్పఁగదవే
మంతనమాడీ నతడు మరి నీవాడినట్టాను
చింతదీరఁ గాఁపురాలు సేయఁగదవే ॥ ఏల ॥

యీడేరితివి శ్రీవేంకటేశుఁడు ని న్నేలఁగాను
వేడుకతో వరములు వేఁడఁగదవే
వాడిక నితఁడు నావద్దికి వచ్చి మన్నించె
జోడయి నీ వొక్కమనసున నుండఁగదవే ॥ ఏల ॥ 78

రేకు 1924 శంకరాభరణం

ఎంత వేడుకలో యిద్దరివి
బంతినే కన్నులపండుగలాయ ॥ పల్లవి ॥

సొలపు మాఁటలు సుదతి యాడఁగా
కలకల నవ్వీఁ గాంతుఁడు
అలముచు సొరెకు నాకె వెనఁగఁగా
వలపుల చెమటలు వడిసీ నితఁడు ॥ ఎంత ॥

బొమ్మజంకెనలు పొలఁతి చూపఁగా
నమ్మికలిచ్చీ నాయకుఁడు
తమ్ములు మాకె ముదమున నడుగఁగా
కమ్మిక చిత్తము గరఁగీ నితఁడు ॥ ఎంత ॥

బడి బడిఁ జన్నులు (ల?) పడఁతి యొత్తఁగా
అడరీ శ్రీవేంకటాధిపుఁడు
అడియాలపురతు లాపె గొసరఁగా
కడుఁదమకంబునఁ గదిసీ నితఁడు ॥ ఎంత ॥ 79

## ఆహిరి

చక్కనివాఁ డాతఁడు జాణవు నీవు
అక్కరతో నాతని యానతి వినవమ్మా ॥ పల్లవి ॥

వల్లెవాటు వేసుకొని వాఁడె నిలుచున్నవాఁడు
యిల్లిదె వీడెమంపె నీ కిందవమ్మా
చొల్లెపుఁ జాత్తులతోడఁ జూచీ నిన్నప్పటనుంటి
యెల్లచందాలా దగు మీ యిద్దరికి నమ్మా ॥ చక్క ॥

నెత్తి కొప్పువాఁడు మంచినీలపుఁ గొంతులవాఁడు
బత్తితో గంద మంపెను పట్టవమ్మా
చిత్తము నీపైఁ బెట్టి సెలవుల నవ్వీవాఁడె
హత్తి యాతనితో మాఁటలాడవమ్మా ॥ చక్క ॥

కుప్పెఁ కటారముతోడి కోడెవయసువాఁడు
కప్పురము నీకు నంపెఁ గైకొనవమ్మా
అప్పడు శ్రీవేంకటేశుఁ డదె వచ్చి నిన్ను నేలె
చిప్పిల విన్నపాలెల్లాఁ జేసుకోవమ్మా ॥ చక్క ॥ 80

## కాంబోది

ఇంతులకు నేరుపులు యిచ్చకములే కాఁబోలు
చెంత నిన్నిటాను మెరసితివే నీవు ॥ పల్లవి ॥

యెచ్చరించి మొక్కి మొక్కి యెలయించేవు పతిని
అచ్చమైన నెరజాణ వౌదువే నీవు
పచ్చిచేఁతలెల్లాఁజేసి పచారించేవు వలపు
మెచ్చులాడి వన్నిటాను మేలే నీవు ॥ ఇంతు ॥

వినయములెల్లాఁ జేసి వేడుకలు వుట్టించేవు
చెనకి యింకాఁ గొత్తలు సేతువే నీవు
ననుపున మోవి చూపి నానఁబెట్టే వాసలు
మినుకులాఁడివి కడుమేలే నీవు ॥ ఇంతు ॥

చేకొని పాదాలొత్తి చిప్పిలించేవు మనసు
దాకొని యీ పని కెంతదానివే నీవు
యీకడ శ్రీవేంకటేశుఁ డెనసె నన్నును నిన్ను
మేకులాడివి నవ్వేవు మేలే నీవు ॥ ఇంతు ॥ ౭[illegible]

## రామక్రియ

ఆతఁ డిదె నీవిదె ఆరడియాల
రాతిరిఁ బగలు నిట్టె రతి నోలలాడవే ॥ పల్లవి ॥

సలిగె గలిగితేను చలము సాదించనేల
చెలిమి సతమైతేను సిగ్గులేల
తలఁపు లొనగూడితే తారుకాణ మరి యాల
మలసి విభునితోను మాఁటలాడఁగదవే ॥ ఆతఁ ॥

ఆసలు నిజమైతేను అలయఁగ మరి యాల
బాసలు దప్పకుండితే పదరనేల
వాసులు రూడికెక్కితే వరుస లెంచఁగనేల
సేసవెట్టినపతికి సేవలెల్లాఁ జేయవే ॥ ఆతఁ ॥

తగులాయమైతేను తరితీపు లవి యాల
మొగమిచ్చుకు లోనైతే మొరఁగులేల
నగుతానే వేడుకొని నంటుసేసి నన్నుఁ గూడె
నిగిడి శ్రీవేంకటేశునికి మొక్కుమొక్కవే ॥ అతఁ ॥ 82

## నాదరామక్రియ

ఎట్టు సమకూడెనో మీకు నిద్దరికిని
చుట్టరికములలో [1] నీ చుట్టరికము ॥ పల్లవి ॥

కొమ్మ మనసులోపలి కోరికలు
చిమ్ముల నీ కాఁగిటిలో చేరికలు
కుమ్మరింపుఁ జూపుల కొమ్మెరుఁగులు
నెమ్మది మరుతంత్రాల నెక్కొన్న కరఁగులు ॥ ఎట్టు ॥

వలపుల కతలతో వాడికలు
వెలసిన వొడఁబాటు [2] వేడికలు
మలసిన సరసపు మచ్చికలు
అలవాటైన రతుల అచ్చికబుచ్చికలు ॥ ఎట్టు ॥

తనిసిన కాఁగిటిలో తాలిములు
మినుకు టానందముల మేలిములు
నినుఁ బెండ్లాడిన యీకె నిచ్చపొందులు
మునుపె శ్రీవేంకటేశ మోవి తేనె విందులు ॥ ఎట్టు ॥ 83

## దేవగాంధారి

ఇన్ని చందాలకు గురి యీవనితయై వున్నది
యెన్నుకొని వేడుకతో నేలుదువుగాని ॥ పల్లవి ॥

---

1. 'చుట్టరికములలోని చుట్టరికము' అని కూడ వ్రాయవచ్చు కాని, పలువిధములైన చుట్టరికములలో ఈ చుట్టరికము విశిష్టమైనదని తెలుపుటకు ఇట్లు విభజించితిని.
2. 'వాడికలు' ప్రాసకొరకు 'వేడికలు' అయినదేమో లేకున్న 'వేడుకలు' కావలె.

నేరి నీవు పెంచిన చిలుక గాదుసుమీ
పేరుకొని నీ దేవులు పిలిచీఁగాని
కూరిమి నీవనములో కోవిల గాదుసుమీ
సారెకు నాకె నిన్నుఁ గొసరి పాడీఁగాని ॥ ఇన్ని ॥

తొలుత నీకొలఁకుల తుమ్మెదలు గావుసుమీ
సొలసి చూచిన యాపె చూపులుగాని
చలాన నీపై వాలిన జక్కవలు గావుసుమీ
కులికి నిన్నొరసేటి గుబ్బలుగాని ॥ ఇన్ని ॥

తతి నీపావురాల రొద లివి గావుసుమీ
రతి నాపె మదనమంత్రములుగాని
యితవుగా శ్రీవేంకటేశ యింతిఁగూడితివి
మతకారి గాదుసుమీ మంచి రాయంచగాని ॥ ఇన్ని ॥ 84

రేకు 1925 శ్రీరాగం

ఎటువంటి కూరిములు యెటువంటి ముచ్చటలు
ఇటువంటివెల్లా మీకు నిద్దరికే తగును ॥ పల్లవి ॥

నీవు పరాకైవుండఁగా నిమ్మపంటఁ గొని వేసి
మోవి చూపె నాకె నీపై మోహ మెట్టిదో
వోవరిలోఁ బవ్వళించి వున్న నిన్ను లేపి నీకు
వేవేగను విడె మిచ్చె వేడుక యదెట్టిదో ॥ ఎటు ॥

కొలువులో నీవుండఁగా కొనగోర నిన్ను నూఁది
పిలిచె రతికేలికిఁ బ్రియ మెట్టిదో
నలిరేఁగి మరపుతో నాటకసాల చూడఁగా
పలుకుఁ గప్పుర మిచ్చె బత్తి యెట్టిదో ॥ ఎటు ॥

కూడి చొక్కివుండఁగాను గుబ్బచన్నుల ని న్నొత్తి
యీడుగా నవ్వులు నవ్వె ఇంపు లెట్టివో
జోడై శ్రీవేంకటేశ సుదతి నిన్ను మెప్పించె
యీడనే యిన్ని చందాల ఇత వెట్టిదో ॥ ఎటు ॥ 85

## ఆహిరి

ఇందుకుఁగా నెగ్గు దప్పు లెంచకువయ్యా
సందడించీ నా మోహము జంటలై యీరీతిని ॥ పల్లవి ॥

విన్నవించే నా మాటలు వినయ మెంత చూపినా
కన్నులచూపులై నిన్నుఁ గాఁడి పారీని
పన్నుక నా నుదురు నీ పాదాలకు మొక్కినాను
నిన్ను నా చక్కఁదనము నివ్వెరగందించీని ॥ ఇందు ॥

సారె నా చేతులు నీతో సరసము లాడినాను
వారక నాగోళ్ళు నీపై వాఁడిమీరీని
నేరుపుతో నా సెలవి నీతో నెంత నవ్వినాను
కూరిమి నా పెదవులు కొసరింపిచీని ॥ ఇందు ॥

పుడమి నా కాఁగిలి నీ పొందు లెంత సేసినాను
వడిఁ జన్నులు కొండలవలె నొత్తీని
యెడయక శ్రీవేంకటేశ నీ దేవులనైతి
వుడివోనిరతులు నిన్నుబ్బురేఁచీని ॥ ఇందు ॥ 86

## గుమ్మకాంభో (బో?)ది

ఇట్టె విన్నవించరే ఇంతులెల్లా నాతనితో
దట్టమైన నా వలపు తానే యెరుఁగును ॥ పల్లవి ॥

కన్నుచూపుల నున్నవి కాంక్షలు
చన్నులపై న సి జవ్వనము
సన్నలలోనే వున్నవి సరసములు
యెన్నరాని నావలపు యేమని చెప్పుదునే ॥ ఇట్టి ॥

పెదవిపై నున్నవి ప్రియములు
మదిలోన నున్నవి మమతలు
పొదలి మేన నున్నవి పులకలు
యెదుటి నావలపులు యేమని చెప్పుదునే ॥ ఇట్టి ॥

చెక్కులపై నున్నవి చెమటలు
మొక్కులలో నున్నవి ముదములు
వొక్కటై శ్రీవేంకటేశుఁ డున్నాఁడు తానె కాఁగిట
యిక్కువ నావలపులు యేమని చెప్పుదునే ॥ ఇట్టి ॥ 87

## భైరవి

సుదతి చందము నీవే చూడవయ్యా
అదివో యిద్దరూ మాఁటలాడుకోరయ్యా ॥ పల్లవి ॥

తలపోయుఁ గొంతవడి తరుణి నీ గుణములు
చెలఁగి తమకమునఁ జెమరించును
పలుమారు నీమీఁది పదములు వాడుకొని
అలరి యాపె సుద్దు లెం తడిగేవయ్యా ॥ సుద ॥

పనివూని నీ సుద్దులు పడఁతులతోఁ జెప్పును
ననుపు నీ చేఁతలకు నవ్వు లోలోనె
వొనరఁ బానుపుమీఁద నుండి నీ కెదురుచూచు
యెనయఁగ నాపె కత లిటువంటియ్యా ॥ సుద ॥

నీ రతులు భావించి నెమ్మిఁ జిత్తము గరఁగు
కోరికలు నీపైఁ బెట్టి గుబ్బతిలును
చేరి యింతలో నీకెను శ్రీవేంకటేశ కూడితి -
వీ రీతిది నీ దేవులు యెరుఁగుకోవయ్యా ॥ సుద ॥ 88

## దేసాళం

ఇంతట మెచ్చఁగదవే ఇద్దరూ మీరు
మంతనానఁ గూడితిరి మచ్చిక దైవారను ॥ పల్లవి ॥

తరుణి నామాట నీకు తారుకాణ వచ్చెనా
సిరుల నీఇంటికి విచ్చేసె నితఁడు
సరుగ నీమనసుకు సంతోసమాయనా
మరిగి ని న్నిన్నిటాను మన్నించె నితఁడు ॥ ఇంత ॥

సాకిరి నేఁ బెట్టినట్టె సరివచ్చెనా నేఁడు
మేకొని యీతఁడు నీకు మేలువాఁడాయ
యీకడ నీ కోరికలు యింతట నీడేరెనా
చేకొని నీ చెప్పినట్టె సేసె నిదె యీతఁడు ॥ ఇంత ॥

నే నిచ్చిన నమ్మికలు నీకు నీడువచ్చెనా
పూని శ్రీవేంకటేశుఁ డిప్పుడు గూడెను
తానకమై మీపొందులు తగులము లాయనా
నానారీతుల నీతో ననిచినాఁ డీతఁడు ॥ ఇంత ॥ 89

## ముఖారి

చూడఁ చిన్నదాన వింతే సుద్దులు కోటానఁగోటి
యేడేడ నేరుచుకొంటివే వో కలికి ॥ పల్లవి ॥

కిన్నెరమీటులలోని గిలిగింతలు । నీ -
వన్నెల కనుచూపుల వలవంతలు
యెన్నరాని యిచ్చకపు టెలయింతలు
యెన్నఁడు నేరుచుకొంటివే వో కలికి ॥ చూడఁ ॥

సారెకు నెడవాయని సరసములు । నీ -
తారుకాణ సన్నల తమకములు
గారవించి బుజ్జగించే గమకములు
యేరీతి నేరుచుకొంటివే వో కలికి ॥ చూడఁ ॥

కందువ శ్రీవేంకటేశు కలయికలు । నీ -
యందమైన సమరతి యలయికలు
పొందుల మునినుంగిలి పొలయికలు
యెందెందు నేరుచుకొంటివే వో కలికి ॥ చూడఁ ॥ 90

**రేకు 1926** **హిజ్జిజి**

చెప్పరే బుద్ధు లాపెకు చెలులాల
వొప్పుగాని గుట్టుతోడ నుండుటే మే లనరే ॥ పల్లవి ॥

వావులు గలయఁజెప్పి వద్ద వచ్చి కూచుండి
నా విభునితో నేల నవ్వీనే తాను
పావురాలఁ బలికించి పాలిండు (డ్ల ?) చూపి మోపి
చేవమీర వలపెంత చిమ్మీరేఁచీనే ॥ చెప్ప ॥

కలువల గొని వేసి కప్పురము పైఁ జల్లి
చెలరేఁగి సన్నలేల సేసీనే తాను
చిలుకల గానుకిచ్చి చేరి యనఁగి పెనఁగి
యెలమిఁ దమకమెంత యేసపెట్టీనే ॥ చెప్ప ॥

చేతులు సారెకుఁ జాఁచి సేవ లెన్నియైనాఁ జేసి
పోతరించి రతికేల పొంచీనే తాను
యీతఁడె శ్రీవేంకటేశుఁ డేలె నన్నుఁ గూడిమాడి
ఆతలఁ దా నందాఁకా నాసలు సేసీనే ॥ చెప్ప ॥ 91

## ఆహిరినాట

ఏమని నుతింతునమ్మా యిట్టి నీ చక్కదనము
కాముని బలము లొక్క గాడిఁగట్టితివానే ॥ పల్లవి ॥

చెలి నీ కొప్పుననైతే చీఁకట్లు గమ్మీని
లలి సెలవినే వెన్నెలలు గాసీని
తళుఁకు గనుచూపుల తమ్మిరేకు లుప్పతిలీ
కలికి మోమునఁ జంద్రకళలు దేరీని ॥ ఏమ ॥

సతి నీ ముక్కున మంచి సంపెంగవాసన మించీ
తతి నీ యారునఁ దుమ్మిదలు మూఁగీని
యితవై నీ యడుగుల యేనుగుల చొప్పు దొట్టీ
కతకారి నడుము సింగముఁ బోలీని ॥ ఏమ ॥

వనిత నీ దంతముల వజ్రాలగని మించె
పనివూని మోవిఁ బుట్టె పచ్చి చిగురు
యెనసి శ్రీవేంకటేశుఁ డిట్టె నిన్నుఁ బెండ్లాడఁగా
యినుమడి నీ సింగార మిటు నీకు నమరె ॥ ఏమ ॥ 92

## ఆహిరి

ఆసతో నన్నిమాఁటలు నాడితి నిన్ను
మూసిన ముత్తెమువలె మొక్కే నే నీకును ॥ పల్లవి ॥

బత్తితో నాడినమాఁట భావములు గరఁగించు
కొత్తమాఁట వేడుకతోఁ గొసరింపించు
పొత్తులమాఁట కమ్మటిఁ బూని యడిగింపించు
యిత్తల నామాఁటలు నీకెటువలె నుండెనో ॥ ఆస ॥

లాలనతోడిమాఁట లాచి పెనఁగింపించు
న సెలవుల నవ్వింపించు
మేలుమీఁదిమాఁటలు సమేళములు పెడరేఁచు
యీలీల నామాఁటలు నీ కెటువలె నుండెనో ॥ ఆస ॥

ఇచ్చకమయినమాఁట ఇయ్యకోలుగాఁ జేసు
మచ్చికగలుగుమాఁట మన్నింపించు
అచ్చముగ నన్నేలితి వన్నిటా శ్రీవేంకటేశ
యిచ్చయిన నామాఁటలు నీ కెటువలె నుండెనో ॥ ఆస ॥ 93

## వారాయణి

ఎందాఁకా సింగారించే వింటిలోనను
అంది నిన్నుఁ బెండ్లాడే యాసతో నున్నాఁడు ॥ పల్లవి ॥

పలుకవే జవరాల పతితోడను
నెలకొని నీ యెదుట నిలుచున్నాఁడు
చిలుకవే నగవులు సెలవులను । నీ -
కలయికలకు నిదె కాచుకున్నాఁడు ॥ ఎందాఁ ॥

వొసఁగవే విడె మిట్టి వుబ్బురేఁగను
కొసరుచు నినుఁ [1]గనుఁగొంటా నున్నాఁడు
పొసఁగవే యాతని పొందులను
వసమై నీ కాఁగిటికి వలచివున్నాఁడు ॥ ఎందాఁ ॥

1. ఈ ఒక్క 'గను' ఎక్కువగా తోచుచున్నది.

వొరయవే చన్నుల నీ వుదుటు చూపి
గరిమ నిన్నేలె శ్రీవేంకటేశ్వరుఁడు
దొరయవే రతులను తోడఁదోడను
సొరిది నీ చేఁతలకుఁ జొక్కివున్నాఁడు ॥ ఎందాఁ ॥ 94

## గండక్రియ

వేడుకగలట్టెల్లాను వినోదింతువుగాక
యీడు జోడై వుండి మరి యెరవు లేమిటికే ॥ పల్లవి ॥

కనుఁగొనవలెనంటే కనురెప్ప లలసీనా
జునుఁగ కితని మోము చూతువుగాక
పెనచి మాఁటాడితేను పెదవు లరగీనా
మనసు ఎచ్చినట్టెల్లా మాఁటలాడఁగదవే ॥ వేడు ॥

చిన్ని నవ్వు నవ్వితేను సెలవులు వేసరీనా
యిన్నిటా నీ నేర్పు మెరయింతువుగాక
సన్నసేసితే రతుల చవులు దరగీనా
వున్నతి నీ కొనగోర నొరయఁగఁగదవే ॥ వేడు ॥

కదిసితే కాఁగిటిలో గట్టిచన్నులు గందీనా
గుదిగొన నితనిఁ గూడుదుగాక
చెదరక నిను నేలె శ్రీవేంకటేశుఁ డితఁడు
వదలీనా తురు మిఁక వంచి మొక్కఁగదవే ॥ వేడు॥ 95

## వాదరామక్రియ

తనకేమే సారె సారెఁ దడపీ నన్ను
పనిలేదా పాటలేదా [1] పంతగారివాఁడు ॥ పల్లవి ॥

---

1. 'పంతగాఁడు' కు 'పంతగార' అని కన్నడము. దానిపై మరల ... అను ...హుబ్రీహి వింత.

మోవరాని చన్నులు మోఁచుక నే నుండఁగాను
వావు లేమి చెప్పీనే వద్దకు వచ్చి
చేవదేరి మోవిపండు చిప్పిలి తేనెగారఁగా
పూవులనేల వేసీనే పో(?)ద్దుపోనివాఁడు ॥ తన ॥

మొగము అద్దముతోడ ముచ్చటాడఁగాను
నగనేల వచ్చీనే నాతోఁ దాను
వెగ్గలైన నాతురుము వీఁపువెంట జారఁగాను
మగిడి యేమి చూచీనే మాయదారివాఁడు ॥ తన ॥

చక్కఁదనమెల్లా నామై చలపట్టుకుండఁగాను
యిక్కడ శ్రీవేంకటేశుఁ డేల ముట్టీనే
వుక్కుమీరి జవ్వనము వొడిగట్టుకుండఁగాను
కక్కసించి కూడె (డీ?) నేమే కతకారివాఁడు ॥ తన ॥

**రేకు 1927** **మాళవిగౌళ**

రమ్మనవే యిఁకనేల రవ్వసేయక
పమ్మికొన్న తమకము పారిపోవనిచ్చునా ॥ పల్లవి ॥

తనియని నా మనసు తనుఁ గోరకుండునా
చెనకి నా ప్రియములు చేకొనుఁగాక
మునుకొన్న చూపులు మోము చూడకుండునా
యెనసి నా చేఁతలకు నియ్యకొనుఁగాక ॥ రమ్మ ॥

కోమలపు నా వయసు కొంగు వట్టించకుండునా
దీమసానఁ గూడ సమ్మతించుఁగాక
దోమటి నా వలపులు తొలఁగఁగ నిచ్చునా
నా మాటలు దోయక నన్ను నేలుఁగాక ॥ రమ్మ ॥

కందువ నావలపులు కలయఁబెట్టకుండునా
ఇందరిలో నాకుఁ జనవిచ్చుఁగాక
పొందులు శ్రీవేంకటేశుఁ బొనుఁగఁగ నిచ్చునా
చెందె నన్ను నిఁక నిట్టె చెలఁగించుఁగాక ॥ రమ్మ ॥ 97

## బౌళి

నీ సుద్దు లేమిచెప్పేవు నే నెరఁగనా
ఆసవెట్టి'నన్ను నింత ఆదరించేవుగాక ॥ పల్లవి ॥

తారుకాణం (ణిం?) చితే యిట్టె దంటవై యేమి చూచేవు
కోరి యాపె విడె మందుకొనవా నీవు
సారె సారె నందుకుఁగా చలమేల సాదించేవు
చేరి యాపెఁ గొనగోరఁ జెనకవా నీవు ॥ నీసు ॥

మచ్చెము నీమై యుండఁగా మరియేల జంకించేవు
నచ్చుకొట్టి యాపెతోడ నవ్వవా నీవు
నిచ్చెలుల నడిగించి నిజమెంత నెరపేవు
పచ్చిదేర నాపె పక్కఁ బండుండవా నీవు ॥ నీసు ॥

తోడ దిష్టము చూపితే దొమ్మిఁ గాఁగిలించేవు
జోడై యాపె మోవి చవిచూడవా నీవు
యీడనే శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
వాడిక నాపెకుఁ దొల్లి వలవవా నీవు ॥ నీసు ॥ 98

## సామంతం

ఎంతకెంత సేసేవు యేమే నీవు
సంతోసాన నీ వాతని చనవు చేకొనవే ॥ పల్లవి ॥

చుట్టరికము లాతఁడు చూపి మోపీఁ (పి?) జె (చె?) ప్పఁగానే
ముట్టకుమంటావేల మొక్కు మొక్కేవే
నెట్టుకొని యాసతోడ నీ మొగము చూడఁగానే
దిట్టతనమున నేల తెరవేసుకొనేవే ॥ ఎంత ॥

వొడివట్టుకొని పతి వొడఁబరచుకోఁగానే
విడిపించుకోరా కెంత వేఁడుకొనేవే
తడయక నీ నోరిలోఁ దమ్ములము వెట్టఁగానే
చిడుముడి నీవేల చేయి చాఁచేవే ॥ ఎంత ॥

యెనసి శ్రీవేంకటేశుఁ డిక్కువ లంటఁగానే
చెనకనియ్యక యాల చెక్కు నొక్కేవే
పెనఁగి రతుల నీకుఁ బ్రియములు చెప్పఁగానే
ననిచి సిగ్గుల నేల నవ్వి కాఁగిలించేవే ॥ ఎంత ॥ 99

## దేవక్రియ

సొలయక మలయక సోఁకనాడక
వలపులే చల్లి కైవశము సేసుకోవే ॥ పల్లవి ॥

ప్రియములు చెప్పితేను బెరసి మతి గరఁగు
నయములు నెరపితే నమ్మిక వుట్టు
దయవుట్ట మెలఁగితే తగులు నాదరింపులు
క్రియతో నాతని రతికేలికి బిలువవే ॥ సొల ॥

చెప్పినట్టి సేసితేను చేఁతలెల్లా నీడేరు
వొప్పుగా మాఁటాడితేను వొడఁబాటౌను
చిప్పిల నవ్వు నవ్వితే చెలఁగి వేడుక వుట్టు
యెప్పుడు నీ వితనికి నిచ్చకమే సేయవే ॥ సొల ॥

పాయక వద్ద నుండితే పాదుకొను మచ్చికలు
చాయ దప్పక కూడితే సంతోసాలౌను
యీయెడ శ్రీవేంకటేశుఁ డిన్నిటా నిన్ను మన్నించె
సేయఁగల సేవలెల్లాఁ జేసి మెప్పించుకోవే ॥ సొల ॥ 100

## ఆహిరి

నెలఁత నింతటఁ గరుణించవయ్యా
కలికి గుబ్బచన్నులు కానుకగా నిచ్చీని ॥ పల్లవి ॥

వెక్కసపుఁ దమకము విన్నవించ సిగ్గువడి
చెక్కు చెమటలు గోరఁ జిమ్మీ నీపై
చొక్కిన నివ్వెరగులు చూపి సొలయఁజాలక
ముక్కున నిట్టూర్పులు ముంచి పోసీని ॥ నెలఁ ॥

వుప్పతిలు విరహము వోలి నెచ్చరించరాక
కొప్పులో వాడుఁబువ్వులు గుప్పీ నీపై
దప్పిదేరే యలపులు తారుకాణించనోపక
లప్పలచిట్లు గందాల లాచివేసీని ॥ నెలఁ ॥

మునుపటి నీ పొందులు ముదులకించఁగలేక
ననలైన పులకలు నాఁటించీనీపై
యెనసితివి శ్రీవేంకటేశ యిప్పుడే యీకెను
వినయాన మోవితేనె విందులు సేసీని ॥ నెలఁ ॥ 101

## మధ్యమావతి

మగువకు నిన్నియును మంచివై యుండఁగవలె
తగులై యుండఁజేయరే తరుణులాల ॥ పల్లవి ॥

సుదతికిఁ దుమ్మిదలు చుట్టములై యుండవలె
పొదిగి తామరలు కొప్పున నించరే
వదలక చందురుని వసముసేసుకోవలె
పదిలానఁ గలువల పానుపు వరచరే ॥ మగు ॥

మందానిలుఁ డింతకి మరి చలువగావలె
గందము మేను నిండాఁ గడు మెత్తరే
చెంది కోవిలలతోడఁ జెలిమిసేసుకోవలె
చందముగాఁ జిగురాకు చప్పరలు గట్టరే ॥ మగు ॥

కలికికి మదనుఁడు కాఁపుగా నుండఁగవలె
చిలుకల వా (వ్రా?) సిన చీర గట్టరే
యెలమి శ్రీవేంకటేశుఁ డీఁకె నింతలోఁగూడె
వెలయవలె సోబాన వేడుకతోఁ బాడరే ॥ మగు ॥ 102

**రేకు 1928 రామక్రియ**

నీవు మొదల నన్నిటా నెరజాణవు
పూవువంటిదాన నాతోఁ బొందుసేసే విపుడు ॥ పల్లవి ॥

చన్ను లంటఁగ వచ్చేవు సరసము లాడేవు
యెన్నిసేసినా నిన్ను నేమనేమయ్యా
సన్న లూరక సేసేవు జవ్వాది మేనఁ బూసేవు
చిన్నదాన నన్నుఁ గాకుసేయ నేఁటికయ్యా ॥ నీవు ॥

ఇట్టె నాపై నొరగేవు యెంగిలి మో వె[1]డిగేవు
బెట్టుగా నీతో నెందాఁకాఁ బెనఁగేమయ్యా
చుట్టి యేకతాలాడేవు సొమ్ములు మేనఁ బెట్టేవు
గుట్టుతోడిదాన నింత గొర బేఁటికయ్యా ॥ నీవు ॥

1. 'మోవి + అడిగేవు' వ్యావహారిక సంధి.

పచ్చిగాఁ గాఁగిలించేవు పానుపుపైఁ గూడేవు
మచ్చికాయ నీతో నిఁక మరఁగేలయ్యా
కచ్చుక శ్రీవేంకటేశ గందవొడి చల్లేవు
ఇచ్చకురాలఁ గొసరు లిఁక నేఁటికయ్యా ॥ నీవు ॥ 103

## సామంతం

ఈకె గలుఁగఁగ గదా యిన్నియును వెలవెట్టి
దాకొని వొండొకటితో దారుకాణ లాయనే ॥ పల్లవి ॥

పొలఁతి మోమునఁ బోలు పున్నమచందురుఁడు
కలికి కన్నులఁ బోలు కలువ లివి
నిలువుఁ దురుముఁ బోలు నెమ్మదిఁ దుమ్మిదగుంపు
యెలమి మదనుసిరు లెంతనోము నోఁచెనే ॥ ఈకె ॥

వనిత బొమ్మలఁ బోలు వరుసఁ జెరకుటిల్లు (వి?)
చనుగుబ్బలనుఁ బోలు చక్రవాకాలు
తనువునఁ బోలును తాలిమితోఁ జిగురాకు
యెనలేని మరుసిరు లెంత నోము నోఁచెనే ॥ ఈకె ॥

యింతి పిరుఁదులఁబోలు యీతని బండి కండ్లు
చెంతఁ బాదాలఁబోలు చెందామరలు
సంతోసాన శ్రీవేంకటేశ్వరుఁడు గాఁగిటఁ గూడె
యింతటాఁ గంతుని సిరు లెంతనోము నోఁచెనే ॥ ఈకె ॥ 104

## పాడి

మేలు మేలు యీ మెలుఁత చందములు
పోలిక లొకటైె పొదలీ నీకు ॥ పల్లవి ॥

తరుణి నిన్నుఁ గడుఁ దగులఁగ నాడీ
తిరమగు వావులు దెలిపీని
గరిమల నినుఁ దమకంబులు రేఁచీ
పొరుగున నెన్నటి పొందో కాని ॥ మేలు ॥

చనవులు సేసుక సరిఁ గూచుండీ
ననుపులు మిగులఁగ నవ్వీని
మనసు గరంగఁగ మర్మము లంటీ
తనియ ది దెంతటి తగులోకాని ॥ మేలు ॥

కొలువులు సేయుచు కుచములు నొరసీ -
సలిగెతో సేసలు చల్లీని
యెలమిని శ్రీవేంకటేశ నన్నేలితి -
విల నినుఁ దా నెపు డెనసీనోకాని ॥ మేలు ॥ 105

## ఆహిరినాట

ఎంతైనా నాతోడిసరే యెఱఁగదుగాక తాను
ఇంతులాల యీపె యెమ్మె లేమని చెప్పుదమే ॥ పల్లవి ॥

కొప్పునఁ జెరివినవి కొత్తగేదంగిరేకులు
చిప్పిల జవ్వాది జారీఁ జెక్కులవెంట
కుప్పళించుకొన్న దిదె గుబ్బలపై గందవొడి
ఇప్పు డిదె యీపె యెమ్మె లేమని చెప్పుదమే ॥ ఎంతై ॥

సందిఁ గట్టుకొన్నవి చంద్రవంక తాయతులు
అందపు వల్లెవాటు పయ్యెద బుజాన
కందువ మొసలిమీఁద కస్తూరి గీరు నామము
యిందరిలో నీపె యెమ్మె లేమని చెప్పుదమే ॥ ఎంతై ॥

పాదమునఁ బెట్టినది పైఁడిబొమ్మలపెండెము
మోదానఁ గట్ట గంటల మొలనూలు
పొదిసేసి నన్ను నేలె పొంచి శ్రీవేంకటేశుఁడు
యీదెస నీపె యెమ్మెలు యేమని చెప్పుదమే ॥ ఎంతై ॥ 106

## గౌళ

ఆయలేవే నీ పగటులన్నీఁ గంటిని
యీయెడ మెంతైనా నాతో నీడు వచ్చేవా ॥ పల్లవి ॥

పుక్కిటి తములముతో పొంచి పొంచి విభునికి
యెక్కడలేని కతలు నేమి చెప్పేవే
చెక్కు చెమ టాతనిపైఁ జిందఁగానే యంటిముట్టి
గక్కన నెంతేసి వూడిగములు సేసేవే ॥ ఆయ ॥

కొప్పు పువ్వులు పతిపై కులికి రాలుచుకొంటా
యిప్పు డెంత చెనకులా నెలయించేవే
రెప్పల చూపులఁ జెలరేఁగి కోమలపు మోము
కప్పుకొని యెందాఁకా నేఁకరి చూచేవే ॥ ఆయ ॥

గట్టి చన్నులు శ్రీవేంకటేశ్వరు దాఁకఁగాను
యిట్టునట్టు జవ్వాది యేమి పూసేవే
నెట్టన న న్నితఁడేలె నే నలమేలుమంగను
చుట్టరికముల నీవు సుద్దు లేమి చెప్పేవే ॥ ఆయ ॥ 107

## ముఖారి

మఱఁగులు వెట్టకువే మాతో నీవు
యెఱఁగ వచ్చిన పనికేల దాఁచేవే ॥ పల్లవి ॥

సెలవుల నవ్వులనే సిగ్గులు వెల్లివిరిసె
పులకల వలపులు పొడచూపెను
చెలప చెమటలనే చిత్తపుకరఁగు చూపె
తలఁపులో భావ మిఁక దాఁచ నేఁటికే ॥ మఱి ॥

కన్నుల తేటలలోనే కానవచ్చె వేడుకలు
తిన్నని నిట్టూరుపులఁ దెలిసెఁ దమి
పన్నిన నివ్వెరగులఁ బచ్చిదేరెఁ గోరికలు
యిన్నిటా నీ భావ మిఁకనేల దాఁచేవే ॥ మఱి ॥

వెడజారుఁ దురుమున వెలసె నీ కూటములు
తొడరి మోముకళల దొట్టె ననుపు
అడరి శ్రీవేంకటేశుఁ డలమేల్మంగ నిన్నేలె
యెడయని నీ భావము యేల దాఁచేవే ॥ మఱి ॥ 108

## రేకు 1929 దేవగాంధారి

నీ తలనే వేగినా నీవేల సిగ్గువడేవే
యీతల నీ విభునితో నెట్టున్నాఁ జెల్లునే ॥ పల్లవి ॥

మనసులోపలియాస మర్మములు వెడరేఁచి
పెనఁగించి ప్రియులను బెరయించును
తనువుపై జవ్వనము తమకములు వుట్టించి
చెనకించి సేయరాని చేఁతలు సేయించును ॥ నీత ॥

యిక్కువైన వలపులు యెంతటివారికైనా
చొక్కించి యెదురులు చూపించును
మక్కువైన మాఁటలు మరి చవులు వుట్టించి
వొక్కటిసేసి రతుల నోలలాడింపించును ॥ నీత ॥

యేకతపు సరసాలు యిద్దరిఁ గాఁగిటఁ గుచ్చి
చేకొని చుట్టరికముసేయించును
తూకొని శ్రీవేంకటేశుతోడి నవ్వు లిట్టె నిన్ను
యీకడఁ బెండ్లాడించె ని న్నింకా నీడేరించును ॥ నీత ॥ 109

## పాడి

ఊరకున్నాఁ బోనీదు వుడివోని జవ్వనము
తారుకాణ లివి నీకు దాఁగవచ్చునటరే ॥ పల్లవి ॥

కనుచూపులు సోఁకితే కలయికలు రేఁచును
మనసు లెనసితేను మర్మము లంటు
చెనకులు వేడుకైతే సేసిన చేఁతలు చెల్లు
పెనచితే నొందొకటి పెనులంకెలే ॥ ఊర ॥

యెడమాఁటలు వింటేనే హెచ్చుఁ దరితీపులు
బడివాయకుండితేఁ జొప్పఁడు జెలిమి
వొడఁబాటు గలిగితే నొనగూడుఁ గాఁగిళ్ళు
తడయ కొండొకటికిఁ దగులాయమే ॥ ఊర ॥

నవ్వులకు లోనైతే నాము లెక్కు వలపులు
వువ్విళ్ళూరఁ బెనఁగితే నుబ్బించు మేను
ఇవ్వల శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నిన్ను నేలె
నివ్వటిల్ల నొండొంటితో నెరవైన జంటలే ॥ ఊర ॥ 110

## లలిత

మొదలనే యాతనికి మోహపు దేవులవు
వదలక ఇచ్చలోనే వచ్చి చొక్కించరాదా ॥ పల్లవి ॥

తప్పులెంచనే లతనిఁ దగిలి వేఁడుకోనేల
ఔప్పుగా నోరుపుతోడ నుండఁగరాదా
అప్పటి జంకించనేల ఆసలు కొలుపనేల
చెప్పి చూపి కూరిములే చెల్లించఁగరాదా ॥ మొద ॥

పెనఁగనేల ఆనలువెట్టి పిలువఁగనేల
ననుపున విభునితో నవ్వఁగరాదా
మొనగోర నూఁదనేల మొక్కులు మొక్కఁగనేల
యెనసి చెప్పినట్టల్లా నియ్యకొనరాదా ॥ మొద ॥

చేరి చెనకఁగనేల సిగ్గులు వడఁగనేల
మేరతోఁ గాఁగిటఁ గూడి మెప్పించరాదా
యీరీతి శ్రీవేంకటేశుఁ డిచ్చగించి నిన్ను నేలె
సారెకు నీమోవి యిట్టె చవి చూపరాదా ॥ మొద ॥ 111

## కాంబోది

ఇట్టి చక్కఁదనాలెల్లా నిందే కానఁగవచ్చె
చుట్టిచు ట్టీపె వొరపు చూడరమ్మ చెలులు ॥ పల్లవి ॥

నగితే వెన్నెలగాసీ నలినాక్షి సెలవుల
నిగిడి చూచితే మించీ నీలాలరంగు
మొగమెత్తితేఁ దొలఁకీ మోవి మదనకళలు
సొగిసి యీపె వొరపు చూడరమ్మ చెలులు ॥ ఇట్టి ॥

మాటలాడితే మెరిచీ మాణికాలు నోరునిండా
పాటించితే నిలువెల్లా బంగారు నిగ్గు
పాటవాడితేఁ బెదవిఁ బచ్చితేనె లూరీని
జూటరి యీపె వొరపు చూడరమ్మ చెలులు ॥ ఇట్టి ॥

పెనఁగితే నురమునఁ బెరిగీని జక్కవలు
చ(చె?) నకితే గొనగోళ్ళఁ జెందీ వజ్రాలు
యెనసె శ్రీవేంకటేశుఁ డీకెఁ గడు మన్నించి
జానుఁగ కీపె వొరపు చూడరమ్మ చెలులు ॥ ఇట్టి ॥ 112

## శ్రీరాగం

సవతిపై మచ్చరాన సాదించకువే యాతని
కవగూడీ నీమీఁద కడు బత్తిగలఁడు ॥ పల్లవి ॥

ఆనలు వెట్టకువే ఆతఁడు వేఁడుకోఁగాను
మానవే నీ చలపాది మంకుఁదనాలు
వీనులు మూసుకోకువే వెస నొడఁబరచఁగా
కానిమ్మని యియ్యకోవే కాఁగిలించీ నిన్నును ॥ సవ ॥

బొమ్మల జంకించకువే పొంచి నీకొంగు వట్టఁగా
కమ్మటిఁ జూపకువే నీ గబ్బితనాలు
చిమ్మకువే కొనగోళ్ళచేత నిన్ను నంటఁగాను
సమ్మతించి యందుకోవే చక్కవిడె మిచ్చీని ॥ సవ ॥

పట్టి పెనఁగుకువే పైకొని లాలించఁగాను
చుట్టమవై యిఁకనేలే జూటుఁదనాలు
ఇట్టె శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నిన్నుఁ గూడె
నెట్టుకొని పెట్టుకోవే నీకిచ్చిన సొమ్ములు ॥ సవ ॥ 113

## వరాళి

ఎట్టి సంతోసపు సుద్దు లిటు వినవే చెలియ
గట్టిగా నాతని మేలు కానవచ్చె నిదిగో ॥ పల్లవి ॥

సరివచ్చెఁ గదె మన సగినాలు
వరుస నావున్నాఁడకు వచ్చె నాతఁడు
నిరతి నేఁ గన్నకల నిక్కలాయనే
సరసములాడి నాకుఁ జనవిచ్చె నిపుడు ॥ ఎట్టి ॥

తారుకాణలాయఁగదె తలపోఁతలు
చేరి యాదరించి బత్తిసేసె నాపైని
యీరీతి ఫలించెఁగదె హెచ్చి నా నోము
గారవాన నిదె నాకుఁ గయివసమైనాఁడు ॥ ఎట్టి ॥

ప్రతివచ్చెఁ గదవె నా పలుకు లివి
గతియై యీతఁడు నన్నుఁ గరుణించెను
రతికెక్కెఁ గదవె కాఁపురము లెల్లాను
యితవై శ్రీవేంకటేశుఁ డేలె నిట్టె నన్నును ॥ ఎట్టి ॥ 114

## రేకు 1930 సామంతం

అప్పటనుండి వెరగయ్యీ మి మ్మిద్దరిఁ జూచి
వొప్పుగా సంతోసాల నోలలాడేమయ్యా ॥ పల్లవి ॥

పెక్కుసింగారాలతోడి పెండ్లికూఁతురు నీకు
యెక్కడఁ గలిగె నానతియ్యవయ్యా
మిక్కుటపు చేఁతల మేనమరఁదలు నేఁడు
వెక్కాని సరసమాడ నీ భాగ్యమాయనయ్యా ॥ అప్ప ॥

రచ్చకెక్కినటువంటి రాణివాసము నీకు
మెచ్చుగా నెందుండివచ్చె మేలు మేలయ్యా
విచ్చనవిడియైనట్టి వేడుక నగళ్ళవారు
అచ్చమై నీసేవసేయ నందమాయనయ్యా ॥ అప్ప ॥

కా(పురము నేరిచిన కలికిగేస్తురాలు
దా(పురమై కాచుకుండెఁ దగవౌనయ్యా
యేపున నన్నేలితివి యిట్టె శ్రీవేంకటేశ
ఆపే నొకతె గలిగె నమరు నీకయ్యా ॥ అప్ప ॥ 115

## పాడి

కొమ్మ వలపులకెల్లా గురి యాతఁడు
నెమ్మది నెచ్చరించరే నెరవేరీఁ బనులు ॥ పనులు ॥

చందమామ ననేల చల్లగాలి దూరనేల
చెంది పతిఁ దోడితేరే చెలులాల
గంద మెంత మెత్తేరే కప్పుర మేమి చల్లేరే
పొందుసేసి యాతనినే బోదించరే ॥ కొమ్మ ॥

వలరాజుఁ దిట్టనేల వసంతుని గొడవేల
చెలువునికిఁ జెప్పరే చెలులాల
కలువ లెందుకు వచ్చు కడు బన్నీ రేమిటికి
తలపించి యాతనికే దయవుట్ట జెప్పరే ॥ కొమ్మ ॥

కాంత నూరడించనేల కన్నవారి నాడనేల
చెంతఁ బతిఁ గొసరరే చెలులాల
ఇంతట శ్రీవేంకటేశుఁ డీకె నేలె దానె వచ్చి
పంతాన నిద్దరిని (కి?) సోబానఁ బాడరే ॥ కొమ్మ ॥ 116

## దేశాక్షి

తోడఁ బెండ్లికూఁతురా తొల్లి తా నేమైనాను
యేడనైనాఁ దన పొందు లెచ్చరించ వచ్చీని ॥ పల్లవి ॥

---

1. ఆపెయున్ అనుటకు వ్యావహారిక రూపము.

యేకతాన నితఁడు నే నిట్టె కత చెప్పుకోఁగా
వాకిట నదెవ్వతె వాయించీ వీణె
చేకొని లోకములోన సిగ్గరియాఁట దానికి
కాకరితనాల నింత గయ్యాళించఁ దగునా ॥ తోడఁ ॥

వెన్నెల బాయిట నేను వేడుకతో నుండఁగాను
సన్నల నదెవ్వతె చల్లీఁ బన్నీరు
మిన్నక దొరతనాన మెలఁగేయాఁట దానికి
పన్నుకొని యారజపు పనులేలే తనకు ॥ తోడఁ ॥

యింటిలోన శ్రీవేంకటేశుఁడు నన్నేలఁగాను
వెంటవ చ్చిదెవ్వతె విడె మిచ్చీని
నంటున వాసితోడ ననిచినాఁట దానికి
దంటతనమున నింత తగులఁగ నేఁటికి ॥ తోడఁ ॥ 117

## గౌళ

ఈకె తొల్లి నీకు మొక మెరిఁగినది గాఁబోలు
వాకిటికి వచ్చె నీవు వలపించుకోవయ్యా ॥ పల్లవి ॥

సళుపుఁ జూపులు నీపైఁ జల్లుకొంటా మదిరాక్షి
నిలుచున్న దిదిగో నీ యెదుట
పిలువని పేరఁటము పెండ్లిబండి యెక్కవచ్చె
తిలకించి చూడవయ్యా దిష్టించి నీవు ॥ ఈకె ॥

చీటికిమాటికి నీతో చిరునవ్వు నవ్వుకొంటా
మాటలాడీ నిదిగో మందె మేళాన
పోటి గరితె తనాన బువ్వము గలయవచ్చె
చోటిచ్చి తొడపైఁ బెట్టి సుద్దు లడుగవయ్యా ॥ ఈకె ॥

సారెకు శ్రీవేంకటేశ చన్నుల నొరసుకొంటా
గోర నూఁదీ నిదిగో కూడితివంటా
పోరచి చుట్టమై నీచేఁ బోఁక వెట్టించుకోవచ్చె
బార చాఁచి కాఁగిలించి పక్కఁబెట్టుకోవయ్యా ॥ ఈకె ॥ 118

## వరాళి

గుట్టు గొంత వలదా కోమలులకు
మట్టుమీరి వలపులు రట్టుసేయ నేఁటికి ॥ పల్లవి ॥

చక్కఁబెట్టుకోవే కొప్పు జాణతనా లేమాడేవు
ఇక్కడఁ బతి ముందర నేఁకారుకొంటా
పక్కనఁ జన్నుల మీఁది పయ్యెద గప్పుకోఁగదే
నెక్కొన నిందరిలోన నివ్వెరగు లేఁటికి ॥ గుట్టు ॥

తుడుచుకోవే చెమట తొంగి యేమి చూచేవు
వుడివోని తమి నువ్విళ్ళూరుకొంటా
వెడవెడగాఁ బోఁకముడి వీడెఁ గట్టుకోవే
ఆడియాసలనే పరాకయ్యే వదేఁటికి ॥ గుట్టు ॥

సరులు దిద్దుకోవే సన్నల నేమి మొక్కేవు
పెరరేఁచి తమకము పేరించుకొంటా
యిరవై శ్రీవేంకటేశుఁ డీతఁడే నన్నుఁ గూడె
తరి నీవూఁ బెండ్లాడవే తలపోఁత లేఁటికి ॥ గుట్టు ॥

## మాళవి

పూఁచి పూఁచి నీ గుణాలే పొగడేఁ గాక
దాఁచుకొని చెలులతోఁ దడవకుండేనా ॥ పల్లవి ॥

నివ్వటిల్ల నందరిలో నీకు వేడుకైతేఁజాలు
యెవ్వతెఁ దెచ్చుకొన్నా నితవే నాకు
వువ్విళ్ళూర నీమనసు వొడఁబడితేఁజాలు
యివ్వల నీ చేఁతలకు నెగ్గుపట్టేనా ॥ పూఁచి ॥

చక్కఁగా నీ కిటువలె సంతోసమైతేఁజాలు
యెక్కడ నుండి వచ్చినా నితవే నాకు
పెక్కువిధముల నీకుఁ బెద్దరికమైతేఁజాలు
తక్కక నీ యాచారాలు తప్పువట్టేనా ॥ పూఁచి ॥

వింతలుగా నీకింత వినోదమైతేఁజాలు
యెంత సరసమాడినా నితవే నాకు
పొంతనే శ్రీవేంకటేశ పొసఁగి న న్నేలితివి
రంతుల నీ త[illegible]ము రచ్చవేసేనా ॥ పూఁచి ॥ 120

**రేకు 1931** **దేసాళం**

ఇచ్చకము సేసితేను ఇయ్యకోవద్దా
పచ్చిదేర నవ్వితేను పదరుదురా ॥ పల్లవి ॥

విరులు ముడిచేనంటా విభుఁడు కొప్పువట్టితే
సరుగన నీ విట్లా జంకింతురా
పరగ హారాలు గట్ట బయ్యెద దీసితేను
వొరసి చేతుల నిట్టె వొడ్డించుకొందురా ॥ ఇచ్చ ॥

చల్లఁ గావలసి మేన సారెఁ బన్నీరు చల్లఁగా
పెల్లున నాతనితోడ బెనఁగుదురా
వొల్లనే కుచ్చెల జారకుండా మొలనూలిడితే
వుల్లసాలాడుకొంటా వొట్లు వెట్టుదురా ॥ ఇచ్చ ॥

సిగ్గు దేరవలెనంటా చెలితో మాఁటాడరాఁగా
వెగ్గళించి తామరను విసరుదురా
అగ్గమై శ్రీవేంకటేశుఁ డాదరించి నిన్నుఁ గూడె
నిగ్గుల నీ వింతలోనే నివ్వెర గందుదురా ॥ ఇచ్చ ॥ 121

## వరాళి

మిక్కిలి కోమలమైన మెలుఁత యీకె
మక్కువ లీడేర్చి యిట్టె మన్నించరాదా ॥ పల్లవి ॥

చెమ్మఁ జెమటలతోడ చిటపొట మనఁగాను
యిమ్ములఁ బాదాలొత్తె యీకె యిందాఁకా
నెమ్మదిఁ దాళగతులు నీకెందాఁకా నాలించేవు
కమ్మి యలపెల్లాఁ దీర గాఁగిలించరాదా ॥ మిక్కి ॥

కందువఁ బయ్యదకొంగు గళబెళమనఁగాను
ఇందరితోఁ గుంచ వేసె నీకె యిందాఁకా
సందడిలో నారవళే సారెకు నేమి వినేవు
అందపు నీ మోవి ఇచ్చి ఆదరించరాదా ॥ మిక్కి ॥

కడు సకినల సజ్జ కవకివమనఁగాను
యెడపక నిన్నుఁ గూడె నీకె ఇందాఁకా
అడరి శ్రీవేంకటేశ యలమేలుమంగ తానే
తడవెంత దలఁచేవు దయతో మెచ్చరాదా ॥ మిక్కి ॥ 122

## పాడి

ఇంతటఁ గరఁగవద్దా యిచ్చగించి నీ మనసు
చెంతలఁ జూచినవారి చిత్తాలు గరఁగెను ॥ పల్లవి ॥

చెప్పరాని ప్రియములు చెప్పి నీకు జవరాలు
వుప్పతిల్లుఁ దమితోడ నూరకుండెను
కప్పురపు బొమ్మ నీకుఁ గానుకగాఁ జేతికిచ్చి
దప్పిదేరి సిగ్గుతోడ దలవంచుకొనెను ॥ ఇంత ॥

సేయరాని వూడిగాలు సేసి సేసి కాతరాన
పాయరాక తొడమీఁదఁ బవ్వళించెను
కాయజకేలికి నిన్ను గమ్మరఁ బిలువఁబూని
ఆయడ చిరునవ్వుతో నట్టె గుక్కుకొనెను ॥ ఇంత ॥

చూపరాని మోహమెల్లాఁ జూపి నిన్ను మెప్పించి
దాపుగా నీరెంటెములో దాఁ జొచ్చెను
యేపున శ్రీవేంకటేశ యీకె యలమేల్మంగ
నీపొందు సేసి తన నేరుపు మెరసెను ॥ ఇంత ॥ 123

## ఆహిరి

ఇదివో నాతలపోఁత లిన్నియు విన్నవించితి
యెదుట గాచుకుందాన యెరవు లేదిఁకను ॥ పల్లవి ॥

సేవలు సేసితే నీవు చేకొని మన్నింతువని
వావులు చెప్పితేను వలతునని
భావించి చూచితేను బత్తి నాపైఁ జేతువని
నీవద్ద గాచుకుందాన నీ చిత్త మిఁకను ॥ ఇది ॥

సంతతముఁ గొలిచితే చనవెల్లా నిత్తువని
చెంత మొక్కితేఁ గోరిక చెల్లింతువని
మంతనము లాడితేను మచ్చికసేతువని
యింతటఁ గాచుకుందాన నీడేరించు మిఁకను ॥ ఇది ॥

సెలవుల నవ్వితేను చేతికి లోనౌదువని
సొలసితే నన్ను దయఁజూతువని
అలమి శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
యెలమి గాచుకుందాన యేలుము నన్నిఁకను ॥ ఇది ॥ 124

## సౌరాష్ట్రం

మంచి గుణములుగల మగువల సాజ మిది
యెంచుకొని దయతోడ నేలుకొనవయ్యా ॥ పల్లవి ॥

మనసు నమ్మిన సతి మరి యనుమానించదు
ననిచిన వనిత పెనఁగులాడదు
యెనసిన జవరాలు యెరవులుసేయదు
పనుపడి రతులకు బాఁతిపడుఁగాని ॥ మంచి ॥

మరిగిన యాఁటది మరి పాయనేరదు
దొరసిన యిల్లాలు దూర దెంతైనా
సరి నిచ్చకపులేమ జరపులఁ బెట్టదు
యిరవైన కాఁపురాన కేఁకారుఁగాని ॥ మంచి ॥

తగులైన కామిని తప్పులేమీ నెంచదు
మొగమిచ్చకపు ఇంతి వెగటాడదు
నిగిడి శ్రీవేంకటేశ నీదేవు లలమేల్మంగ
సొగిసి యీకూఁటముల జొక్కించుఁగాని ॥ మంచి ॥ 125

## సాళంగం

[1]విన్నవిఁ-గన్నవిఁ గావు వేడుక నీపగట్లు
పున్నమ వెన్నెల-సొళ్ళు పొలఁతి నీ సుద్దులు ॥ పల్లవి ॥

---

[1] 'విన్నవియున్, కన్నవియున్' అనుదానిలో 'యు'లోపముతో సంభవించిన రూపము కావచ్చు.

సారె నేమి బులిసేవే సరసుని యెదుటను
కేరి కేరి నవ్వేవేమే కెలసుకొంటా
వూరకే పెనఁగేవేమే వొడివట్టి తీసుకొంటా
ఆరజపు చేఁత లివి అట్టె నీకేతగునే ॥ విన్న ॥

సన్నలేమి సేసేవే సరి నెదురుగానుండి
చన్నులేమి చూపేవే జంకించుకొంటా
విన్నపాలేమి సేసేవే వేసాలు సేసుకొంటా
వన్నెవెట్టుమేకు లివి వడి నీకే తగునే ॥ విన్న ॥

చేతులేమి చాఁచేవే శ్రీవేంకటేశ్వరు మీఁద
కాతరించేవేమే యాఁకారుకొంటా
యీతఁడే నన్నేలినాఁడు యిందరిలో మన్నించి
యేతరితనాలే పెంచే విది నీకే తగునే ॥ విన్న ॥ 126

**రేకు 1932** **వరాళి**

ఎఱఁగ మిన్నాళ్ళదాఁకా మీకె సుద్దులు
మెఱసె నీ కాఁపురము మేలయ్యె నీకు ॥ పల్లవి ॥

నెక్కొని యీకె బత్తితో ని న్నింటికిఁ బిలిచీని
చిక్కించుక నీకు విందు చెప్పీఁ దాను
పెక్కువినయాలతోడఁ బెనఁగీఁ జేతులు వట్టి
చొక్కముగ నెన్నాళ్ళ చుట్టమోకాని ॥ ఎఱఁ ॥

సరుసఁ గూచుండి తన చనవులు నెరపీని
వరుసవెట్టుక నవ్వవచ్చీ నీతోను
విరులు ముడిచీ నీకు వీఁపునఁ జన్నులు మోవ
సొరిది దా నెటువంటి చుట్టమోకాని ॥ ఎఱఁ ॥

తొలుసారె నీమోము తొంగి తొంగి చూచీని
కలికితనాల మొక్కి కాఁగిలించీని
యెలమి శ్రీవేంకటేశ ఇట్టె నన్ను నేలితివి
సొలసీఁ దానూ నెంత చుట్టమోకాని ॥ ఎఱఁ ॥ 127

## పాడి

పట్టరాకుంటే వయసు పాఁతరఁబెట్టి దాఁచుకో
ఇట్టె బట్టబయలేల యీఁదవచ్చేవే ॥ పల్లవి ॥

కూరిమి గొసరుకొంటా కొంకక నాపతితోడ
సారెకు నాడేవేమే జాణతనాలు
నేరుపుగలదంటాను నిండువావి సేసుకొని
పోరచి వలపులేల పొత్తు గలపేవే ॥ పట్ట ॥

బడివాయ కాతనితో పచ్చిమాఁట లాడుకొంటా
నడుమ నప్పటి నేమి నవ్వు నవ్వేవే
బెడిదపు వినయాలు పెదవిపైఁ బెట్టుకొని
బుడి బుడి యాసలేల పోఁగువేసేవే ॥ పట్ట ॥

కుమ్మరింపుదమితోడ గుబ్బలనొరసుకొంటా
వుమ్మగిలు రతులేల వొడిగట్టేవే
ఇమ్ముల శ్రీవేంకటేశుఁ డీతఁడే నన్ను నేలె
దొమ్మి చుట్టరికా లెన్ని తొరలించుకొనేవే ॥ పట్ట ॥ 128

## రామక్రియ

గుట్టుతోడ నుండవే కొమ్మలెల్లా మెచ్చేరు
గట్టిగాఁ దానే వచ్చి కరుణించీ నీతఁడు ॥ పల్లవి ॥

నవ్వకువే యంతేసి నయగారి తనముల
తవ్వకువే వలపులు దప్పిగొనీని
రువ్వకువే మాఁటల రొక్కముగా నొక్కమాటే
నివ్వటిల్ల నీకంటె నేరుపరి యీతఁడు ॥ గుట్టు ॥

మొక్కకువే సారె సారె ముదిరీ నీ వావులు
చొక్కకువే కన్నులను సొలపుదేరి
నిక్కకువే యంతేసి నేఁడె నీ సొబగులెల్లా
నెక్కొని నీకంటెను నెరవాది యీతఁడు ॥ గుట్టు ॥

పెంచకువే పంతాలు పెనఁగి పెనఁగి నీవు
వంచకువే నీ శిరసు వట్టి సిగ్గుల
యెంచఁగ శ్రీవేంకటేశుఁ డేలె నన్ను నీ వితని
మించి కూడెవు నికంటె మెటజాణఁ డితఁడు ॥ గుట్టు ॥ 129

## శ్రీరాగం

ఇంకా వినిపించవే యీ కతలు వేడుకయ్యీ
పొంకముగా జెలియా పొద్దువోదు నాకును ॥ పల్లవి ॥

సొలసి తనతో నేను సుద్దులు చెప్పినవెల్లా
తలఁచుక చెప్పెనా తరుణి నీతో
వలుద గుబ్బలఁ జంద్రవంకలు దా నొత్తినవి
తెలిపెనా దాఁచక తేటతెల్లమిగను ॥ ఇంకా ॥

తంతోడ నేకతాన తననాసంది పొందులు
మఱవక యడిగెనా మంచితనాన
మఱి నన్నుఁ గరుణించి మన్నించినీమన్ననల -
గుఱుతు లెఱిఁగించెనా కొంకక నీ కపుడు ॥ ఇంకా ॥

వేడుకతో నేనూఁ దానూ వినోదించిన రతులు
ఆడ నీతోఁ దడవెనా యక్కరతోను
యీడక వచ్చి శ్రీవేంకటేశుఁడు దా నన్ను నేలె
జాడలు నీతో నించెనా సరికి బేసికిని ॥ ఇంకా ॥ 130

## ముఖారి

ఇంతటిదానవౌత యిప్పుడే యెరిఁగితిమి
వింత నీ నేరుపు లెందు వేరే నేర్చుకొంటివే ॥ పల్లవి ॥

చాయలుగా మాఁటలాడి సన్నల నోరూరించి
పాయపు మగని నెంత పనిగొంటివే
కాయజకేలిని మతి గరఁగించి యతనిచే
సేయరాని బాస లెల్లాఁ జేయించుకొంటివే ॥ ఇంత ॥

కంచపుమోవి చూపి కన్నులనే తేలించి
మించి చెలువుని నెంత మెప్పించితివే
వంచనతో మొక్కు మొక్కి వలపులు వెడరేఁచి
మంచితనాననే యెంత మన్నింపించుకొంటివే ॥ ఇంత ॥

వేవేలు చేఁతలు సేసి వేడుకలు వుట్టించి
శ్రీవేంకటేశ్వరు నెట్లు చేకొంటివే
యీవేళ నన్ను నేలె యీతఁడే యింటికి వచ్చి
వావు లాతనికిఁ జెప్పి వలపించుకొంటివే ॥ ఇంత ॥ 131

## శుద్ధ వసంతం

నీ బలిమి నా బలిమి నేఁడే కానఁగవచ్చీ
జాయిల పచారాల జాటుఁదనా లేఁటికే ॥ పల్లవి ॥

యేతు లేమి చెప్పేవే యిందరిముందరా నీవు
ఆతఁడు నీతో సరసమాడు నంటాను
యీతల నీ పతిని మా యింటికిఁ దెచ్చుకోఁగాను
చూతము నీ సలిగెలు చూపఁగరాదా ॥ నీబ ॥

కేరుతా నేమి నవ్వేవే కీలుగంటు జారఁగాను
చేరి నీ మగఁడు బత్తిసేసీ నంటాను
గారవించి నే నీతనిఁ గాఁగిట బిగించఁగాను
ఆరితేరి నీ వప్పుడు ఔఁ గాదనఁగలవా ॥ నీబ ॥

నీ వెంత విఱ్ఱవీఁగేవే నీటులు మెరసుకొంటా
శ్రీవేంకటేశుఁడు నిన్నుఁ జెందెనంటాను
యీవేళ నన్నీతఁడేలె యిట్టె నే బాయకుండితే
మా వలపు దెలుసుక మరి మెచ్చఁగదవే ॥ నీబ ॥ 132

**రేకు 1933** **ముఖారి**

ఎంత బాఁతో యాపె నీకు ఇందుకు దొరకొంటివి
పొంత న న్నొడఁబరచి పొసఁగఁ జెప్పేవు ॥ పల్లవి ॥

చెలరేఁగి యాపె నీకుఁ జేసేటి విన్నపాలెల్లా
పలుమారు నూఁకొని తప్పక వినేవు
యెలమి నప్పటి నీకు నిచ్చేటి కానుకలెల్లా
అలరుచుఁ జేయి చాఁచి యందుకొనేవు ॥ ఎంత ॥

వేడుకతో నాపె నీకు విందులు వెట్టినందుకు
ఆడనుండి సారె సారె నారగించేవు
జోడు గూడి నిన్నుఁ గడుఁ జొక్కించిన రతులకు
యీడకు వచ్చి నాతోను యెంతో కొనియాడేవు ॥ ఎంత ॥

కూరిమితో నాపె నిన్నుఁ గొసరి నవ్వినందుకు
చేరి కాఁగిలించుకొని చెక్కునొక్కేవు
యీరీతి శ్రీవేంకటేశ యింతలో నన్నేలితివి
మేరమీర కాపెతోడ మేలమాడేవు ॥ ఎంత ॥ 13:

## ఆహిరి

ఏమయ్యా తమకించే వెంత యా సోదకాఁడవు
కామించి నే మొక్కితేను కాఁగిలించేవు ॥ పల్లవి ॥

నిమ్మపండ్లు కానుకఁగా నీకు నియ్యవచ్చితేను
అమ్మరో చన్నులేల అంటేవయ్యా
కమ్మరఁ బగడ మిట్టి కప్పముగాఁ బట్టితేను
వుమ్మడి మోవికేల నోరూరేవయ్యా ॥ ఏమ ॥

చొక్కపు పసిఁడిబొమ్మ సూడిదెగాఁ జూపితేను
పిక్కటిల్ల నాతో నేమి పెనఁగేవయ్యా
పక్కన నుడుగరగాఁ బచ్చడము గప్పఁగాను
అక్కరతో బయ్యదకొం గదేల పట్టేవయ్యా ॥ ఏమ ॥

వుంకువ నుంగరము నీ కుచితము దెచ్చితేను
కంకణము నాకేలఁ గట్టేవయ్యా
అంకెల శ్రీవేంకటేశ యన్నిటా నన్నేలితివి
పొంకపురతుల కెంత పొంది మన్నించేవయ్యా ॥ ఏమ ॥ 13·

## గౌళ

ఎక్కడనుండి వచ్చితి వే వూరే నీవు
చుక్కబొట్టు వెట్టుకొని సుద్దులు చెప్పేవు ॥ పల్లవి ॥

ప్రటనుండి సరసాలాడేవు నా పతితోను
చెప్పవే నీ వెవ్వతెవు చెలియా
కొప్పు నిక్కఁబెట్టితివి కొనలు వెళ్ళముడిచి
పిప్పిగట్ట విడేలు పెదవిపైఁ జేసేవు ॥ ఎక్క ॥

లసి నామగనితోఁ జుట్టరికాలు సేసేవు
తెలుపవే నీగుట్టు తెల్లమిగాను
పలచఁగా మేనునిండాఁ బసపు వూసుకొంటివి
వలిపెము గట్టి నీ భావములు చూపేవు ॥ ఎక్క ॥

ట్టి నన్నేలే శ్రీవేంకటేశుతోనే నవ్వేవు
యెట్టిదో నీ దీమసము యెంచవే నాతో
పట్టితి [illegible] డికిట బాగాలూ దెల్లనాకులు
నెట్టనఁ జెవిఁ బుసుఁగు నిండా నించుకొంటివి ॥ ఎక్క ॥ 135

## పాడి

చాటి చెప్పితి మిపుడే సంతమాటే మేలు
వాటముగఁ జెలిమి మఱవకుమయ్యా యిఁకను ॥ పల్లవి ॥

సుదతి కనుచూపులకు సొరిది నొడ్డుకోరాదు
అదరు వెన్నెలనవ్వు కడ్డము లేదు
తుద బొమ్మజంకెనలు తొలఁగ దొబ్బఁగరాదు
ముదురు వలపులు మిగుల ముంచుకొనునపుడు ॥ చాటి ॥

కొనగోరివాఁడి మరి గురిదప్పుకొనరాదు
చెనకుఁ జేఁతల కోరసేయరాదు
మనసు కరఁగింపులకు మరఁగువెట్టఁగరాదు
తనివోని కోరికలు తగులుకొనునపుడు ॥ చాటి ॥

వలుద చనుగుబ్బలకు వడి మాటుకొనరాదు
కలయుకాఁగిటికి తెరఁగట్టరాదు
యెలమి శ్రీవేంకటేశ ఇపు డీకెఁ గూడితివి
కలుగుఁ దమకము లిట్లఁ గరుణించినపుడు ॥ చాటి ॥ 13

## బౌళి

ఆతఁ డేమి సేసినాను అంతా నంత వలపే
కాతరించక మొక్కవే కమ్మర నీ విపుడు ॥ పల్లవి ॥

దగ్గరఁ గూచుండి ని న్నాతఁడు వేఁడుకొనఁగాను
సిగ్గులు వడకువే చెలియా
వెగ్గళించి నిమ్మపంట వేసె నందరిలోనంటా
యెగ్గులుగాఁ బట్టకువే యెదిరించి ఇపుడు ॥ ఆతఁ ॥

వుమ్మగిలు రతులకు నొడివట్టి పెనఁగఁగా
బొమ్మల జంకించకువే పొలఁతీ
కమ్మటి నీ కుచములు కడుఁబిసికెనంటాను
కుమ్మెలువో నూఁదకువే కొనగోర నిపుడు ॥ ఆతఁ ॥

శ్రీవేంకటేశుఁడు నిన్నుఁ జేరి కాఁగిలించుకోఁగా
మోవి గంటిసేయకువే ముదితా
కైవసమై నీ మనసు కరఁగించె నితఁడంటా
వేవేలుగా దూరకువే వేడుకతో నిపుడు ॥ ఆతఁ ॥ 137

## ఆహిరినాట

నన్నెంత లాలించేవు నగుతా నీవు
మన్నించుమనఁగలనా మరుగఁగలఁగాక ॥ పల్లవి ॥

నేరుపుతో మాటలాడి నిన్ను మెప్పించఁగలనా
చేరి నీతోడ బలిమిసేయఁగలనా
సారెకు నిన్ను గద్దించి సరసమాడఁగలనా
మూరెఁడు గొప్పు వంచుక మొక్కఁగలగాక ॥ నన్నం ॥

చాయల సన్నల నిన్ను సాదించఁగలనా
నాయములు వచరించి నవ్వఁగలనా
ఆయాలు సోఁకఁ బెనఁగి అలయించఁగలనా
నాయంత నేనుండి నిన్ను నమ్మగలగాక ॥ నన్నం ॥

కచ్చుపెట్టి నీమతి గరఁగించగలనా
మెచ్చి నీవు వేఁడుకోఁగా మీరఁగలనా
యిచ్చట శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
కొచ్చి యింకా నీపొందే కోరఁగలఁగాక ॥ నన్నం ॥ 138

**రేకు 1934** **భైరవి**

నెలఁత సింగారము నీ భాగ్యమాయ
తలఁపు లీడేరె మీకుఁ దగుఁ దగునయ్యా ॥ పల్లవి ॥

భామ చనుఁగవ నదె బంగారువానగురిసీ
తేమలెక్కి మోవివెంటఁ దేనెగారీని
మోమునఁ జంద్రకళలు ముంచి కారుకమ్మీని
నీ మోహము తెప్పలపై నించి తేలించవయా ॥ నెలఁ ॥

మొనసి సెలవులను ముత్యాలపంటలు నిండె (డీ?)
తనువున వలపులు దైలువారీని
వొనరిన యారుపొంత నున్నవి వళితరంగాలు
యెనసె నీ వేడుకలు యీఁదులాడించవయా ॥ నెలఁ ॥

ముంచినచక్కఁదనాన మోహనరసములుబ్బి
నించెను కాఁగిటను పన్నీరుబుగ్గలు
యెంచఁగ శ్రీవేంకటేశ యీకె నిట్టె యేలితివి
అంచల నీరతు లోలలాడించవయా ॥ నెలఁ ॥ 139

## ముఖారి

చిన్నదాననంటా నీవు సిగ్గువడేవే
చన్నులను (నొ?)రసి మోవి చవిచూపఁగదవే ॥ పల్లవి ॥

చేరి చూడఁగఁజూడఁగా చీఁకటి వెలుగందురు
పేరఁబెట్టితే పాలే పెరుగందురు
కోరి కాచుకుండితే చిగురులే చేగలందురు
వోరుపుతో నాతని వూడిగాలే సేయవే ॥ చిన్న ॥

మరుఁగగా మరుఁగగా మచ్చికవుట్టు నందురు
పెరిగితే పూఁపలే పిందె లందురు
నెరులు గూడఁగా గూడఁగా నిండుఁగొప్పాయ నందురు
సరసము లాతనితో సారె సారె నాడవే ॥ చిన్న ॥

మఱి చెప్పఁగాఁజెప్పఁగా మాఁటలే కత లందురు
తఱచు పొందుసేసితే తగు లందురు
చిఱునవ్వులతో నిన్ను శ్రీవేంకటేశుఁడు గూడె
మెఱసి పెక్కురతుల మెప్పించవే ॥ చిన్న ॥ 140

## సామంతం

ఇంతటిదానవు నీవు యెంతని పొగడవచ్చునే
పొంతఁ గోర కెట్టుందునే పొలఁతి నీ విభుఁడు ॥ పల్లవి ॥

సెలవుల నవ్వు దేరీ చెక్కుల మదము గారీ
నెలఁత నీమాఁటలఁ దేనియ లూరీని
కలికి వన్నిటా నీవు గక్కన నిన్నుఁ జూచితే
వలవ కెట్టుండునే వనిత నీ విభుఁడు ॥ ఇంత ॥

మోమున వెన్నెల గాసీ మూపునఁ దురుము రాసీ
ఆమని చన్ను లురమునందునఁ బైసేసీ
నీ మంచి చక్కఁదనాలు నెమ్మది నెంచి చూచితే
కామించ కెట్టుండునే కాంత నీ విభుఁడు ॥ ఇంత ॥

మోవిపైనే చిగురెక్కీ మొనగోళ్ళఁ జేఁగలెక్కీ
భావించితే హంసగతి పాదాలఁజిక్కీ
యీవేళ శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్నుఁగూడె
సేవగొన కెట్టుండునే చెలియీ (యా?) నీ విభుఁడు ॥ ఇంత ॥ 141

## దేసాళం

కాంతుఁ డిదె నీకొరకే కాచుకున్నాఁడు
సంతోసము లెక్కలేదు జాజర లాడేవు ॥ పల్లవి ॥

శిరసెత్తి చూడఁగదె చెలియ నీ పతి మోము
తిరముగా సిగ్గులేల తెరగట్టేవు
సరసము లాడఁగదె సంగడిఁ గూచుండి నీవు
పెరరేఁచి మోనమేల పేరఁబెట్టేవు ॥ కాంతుఁ ॥

మాటలాడఁగదవె మనసార నాతనితో
మాటుసేసి మోవి యం(యెం?)త మాఁగఁబెట్టేవు
వాటముగా నవ్వఁగదె వలపులు చల్లి నీవు
గాఁటపు నివ్వెరగేల గంపఁబెట్టేవు ॥ కాంతుఁ ॥

చిత్తగించి కూడఁగదె శ్రీవేంకటేశునితోడ
గుత్తపు గుబ్బలనేల గూఁటఁబెట్టేవు
బత్తియెల్లాఁ జూపఁగదె పాదాలొత్తి యిట్టె నీవు
హత్తిన తమకమెంత అంగడివేసేవు ॥ కాంతుఁ ॥142

## హిందోళం

ఇటువలె నుండవద్దా యిరవైన మోహము
తటుకన నీమీఁది తగులెంతోకాని ॥ పల్లవి ॥

సారిది నీమోము సారెఁ జూచియునుఁ దనియదు
తరుణి మాఁటలాడియుఁ దనియదు
సరసము లాడియాడి చాలునని తనియదు
అరుదైన మదిలోని యాస యం(యెం?)తోకాని ॥ ఇటు ॥

నసుపుసేసుక చెలి నవ్వియునుఁ దనియదు
తనువుసోఁకఁ బెనఁగి తనియదు
మునుకొని చేతులెత్తి మొక్కియునుఁ దనియదు
యెనసి నీపై వలపింకా నెంతోకాని ॥ ఇటు ॥

రమణి నీకాఁగిట రతిసేసి తనియదు
తమితో గుబ్బలనొత్తి తనియదు
జమళి శ్రీవేంకటేశ సన్నసేసి తనియదు
అమరిన సంతోసమది యెంతోకాని ॥ ఇటు ॥ 143

## మంగళకౌశిక

ఒడఁబరచఁగనేల వొడివట్టి న న్నింతేసి
వుడివోని సంతోసాన నోలలాడే నిపుడు ॥ పల్లవి ॥

చెంతఁగూచుండినయాపె చేయి చాఁచకుండునా
యెంతవడిదాఁకా మాఁట లేమి చెప్పీనే
వింతదానఁగాను తన వేడుక చెల్లించితే మేలు
చింతదీర మొక్కేను చేతులెత్తి నేను ॥ ఒడఁ ॥

పాదాలుగుద్దినయాపె పక్కఁ బండకుండునా
నాదెసఁ జూచి యెంతనవ్వు నవ్వీనే
కాదనేనా నాకుఁ దనకరుణ గలిగితే మేలు
మోదముతో నింకాను మొక్కేనేఁ దనకు ॥ ఒడఁ ॥

యేకతమాడినయాపె యెంగిలి సేయకుండునా
చేకొని కూడి నన్నెంత చెక్కునొక్కీనే
యీకడ శ్రీవేంకటేశుఁ డెంత మన్నించినా మేలు
కైకొంటి ముమ్మాటికి గక్కన మొక్కేననరే ॥ ఒడఁ ॥ 144

**రేకు 1935** **వరాళి**

వింటిమి కంటిమి తన వేడుకకారితనాలు
ఇంటిలోనఁ దన నేమా లెచ్చరించనేఁటికే ॥ పల్లవి ॥

చుట్టమైనవాఁడు నాకు సొమ్ములందినట్టివాఁడు
అట్టె సుద్దు లేమిచెప్పీ నాడనే వుండి
బట్టబయలుగఁ దనభావము దెలుపుఁగాక
గుట్టుతోడ సిగ్గులెల్లాఁ గుప్పసేయనేఁటికే ॥ వింటి ॥

తలఁపెఱిఁగినవాఁడు దయగలిగినవాఁడు
వలపు లేమి చల్లీని వాకిటనుండి
తళుకొత్త నా మోము తప్పక చూచుఁగాక
మొలకనవ్వులు లోలో మోపుగట్టనేఁటికే ॥ వింటి ॥

చిత్తగించి కూడఁగదె శ్రీవేంకటేశునితోడ
గుత్తపు గుబ్బలనేల గూటఁబెట్టేవు
బత్తియెల్లాఁ జూపఁగదె పాదాలొత్తి యిట్టె నీవు
హత్తిన తమకమెంత అంగడివేసేవు ॥ కాంతుఁ ॥142

## హిందోళం

ఇటువలె నుండవద్దా యిరవైన మోహము
తటుకన నీమీఁది తగులెంతోకాని ॥ పల్లవి ॥

సారిది నీమోము సారెఁ జూచియునుఁ దనియదు
తరుణి మాఁటలాడియుఁ దనియదు
సరసము లాడియాడి చాలునని తనియదు
అరుదైన మదిలోని యాస యం(యెం?)తోకాని ॥ ఇటు ॥

ననుపుసేసుక చెలి నవ్వియునుఁ దనియదు
తనువుసోఁకఁ బెనఁగి తనియదు
మునుకొని చేతులెత్తి మొక్కియునుఁ దనియదు
యెనసి నీపై వలపింకా నెంతోకాని ॥ ఇటు ॥

రమణి నీకాఁగిట రతిసేసి తనియదు
తమితో గుబ్బలనొత్తి తనియదు
జమళి శ్రీవేంకటేశ సన్నసేసి తనియదు
అమరిన సంతోసమది యెంతోకాని ॥ ఇటు ॥ 143

## మంగళకాపిక

ఒడఁబరచఁగనేల వొడివట్టి న న్నింతేసి
వుడివోని సంతోసాన నోలలాడే నిపుడు ॥ పల్లవి ॥

చెంతఁగూచుండినయాపె చేయి చాఁచకుండునా
యెంతవడిదాఁకా మాఁట లేమి చెప్పీనే
వింతదానఁగాను తన వేడుక చెల్లించితే మేలు
చింతదీర మొక్కేను చేతులెత్తి నేను ॥ ఒడఁ ॥

పాదాలుగుద్దినయాపె పక్కఁ బండకుండునా
నాదెస చూచి యెంతనవ్వు నవ్వీనే
కాదనేనా నాకుఁ దనకరుణ గలిగితే మేలు
మోదముతో నింకాను మొక్కేనేఁ దనకు ॥ ఒడఁ ॥

యేకతమాడినయాపె యెంగిలి సేయకుండునా
చేకొని కూడి నన్నెంత చెక్కునొక్కీనే
యీకడ శ్రీవేంకటేశుఁ డెంత మన్నించినా మేలు
కైకొంటి మువ్మాటికి గక్కన మొక్కేననరే ॥ ఒడఁ ॥ 144

**రేకు 1935** **వరాళి**

వింటిమి కంటిమి తన వేడుకకారితనాలు
ఇంటిలోనఁ దన నేమా లెచ్చరించనేఁటికే ॥ పల్లవి ॥

చుట్టమైనవాఁడు నాకు సొమ్ములందినట్టివాఁడు
అట్టె సుద్దు లేమిచెప్పీ నాడనే వుండి
బట్టబయలుగఁ దనభావము దెలుపుఁగాక
గుట్టుతోడ సిగ్గులెల్లాఁ గుప్పసేయనేఁటికే ॥ వింటి ॥

తలఁపెఱిఁగినవాఁడు దయగలిగినవాఁడు
వలపు లేమి చల్లీని వాకిటనుండి
తళుకొత్త నా మోము తప్పక చూచుఁగాక
మొలకనవ్వులు లోలో మోపుగట్టనేఁటికే ॥ వింటి ॥

సేసవెట్టినట్టివాఁడు చెలిమిసేసినవాఁడు
బాసలేమి సేసీని పాన్పుపైనుండి
వాసితో శ్రీవేంకటాద్రివరుఁడు తా నన్నుఁ గూడె
వేసాలతననిజాలు వెదవెట్టనేఁటికే ॥ వింటి ॥ 145

## కాంబోది

తమకించి వట్టి జోలి దవ్వేవుగాక
జమళి నాతఁడు నాకే సతమైయున్నాఁడు ॥ పల్లవి ॥

కొలువులోనుండి పతిఁ గూరిమి గొసరుకొంటా
కలికితనాల నెంత కరఁగించేవే
యెలయింపు సేఁతలు నీ వెంత పచరించినాను
చెలఁగి నీతో పొందులు సేయనిచ్చేనా ॥ తమ ॥

వీడెము పుక్కిటనించి వికవిక నవ్వుకొంటా
వాడికతనాల నెంత వలపించేవే
వేడుకతో నీవెంత వేళ గాచుకుండినాను
యీడు జోడై యతని నీయింటికి రానిచ్చేనా ॥ తమ ॥

అద్దపుఁజెక్కులు చూపి ఆసలు వుట్టించుకొంటా
సుద్దులెల్లాఁ జెప్పి యఁ (యెం?)త చొక్కించేవే
అద్దో శ్రీవేంకటేశుఁ డప్పుడే నా సొమ్మైనాఁడు
తిద్దుకొంటి యతని నీ దిక్కు చూడనిచ్చేనా ॥ తమ ॥ 146

## దేశాక్షి

అలమేలుమంగవు నీ వాతనికి దేవులవు
వెలసి కూడితి విఁక వెరగందేవేమే ॥ పల్లవి ॥

ననిచిన కాంతలకు నవ్వులు వేగమే వచ్చు
మనసులెనసినట్టి మగనితోను
చెనకితేఁ జాలును సిగ్గులు చాలా నిండు
వనితరో నీవేల వంచేవే శిరసు ॥ అల ॥

తగులుగలవారికి తనువెల్లాఁ జెమరించు
జిగిమించ రమణుని చెంత నుండితే
మొగమెత్తి చూచితేను ముంచు మదనకళలు
వెగటుగాఁ దెర యేల వేసుకొనేవే ॥ అల ॥

వావిగల సతులకు వలపులు గడు రేఁగు
శ్రీవేంకటేశుఁడైన చెలువునొద్ద
చేవదేరఁ బెనఁగితే చిన్నలెల్లాఁ గానవచ్చు
కావరానఁ బయ్యదేల కప్పుకోనేలే (కొనేవే ?) ॥ అల ॥ 147

## రామక్రియ

అలమేల్మంగినే నేను [1]ఆకె నెటువంట (టి?)దో
యెలుఁగెత్తి చెప్పవయ్యా యియ్యకొనే నేను ॥ పల్లవి ॥

మంతనము లాడెనట మగువ యెవ్వతొ నీతో
చెంతనుండి సన్నలూనుఁ జేసెనట
యింతులెల్లాఁ జెప్పుకొనే రీ సుద్దులే వాడలోను
యెంతటిదో చూపవయ్య యెరిఁగేను నేను ॥ అల ॥

చెట్టవట్టి తీసెనంట చెలి నీ చెక్కులు నొక్కి
గుట్టుతోడ నిన్ను వేఁడుకొనియనట
బట్టబయలాయను యీ పనులెల్లా నూరిలోను
అట్టిదానిఁ జూపవయ్య అడిగేను నేను ॥ అల ॥

1. "ఆకెయున్ + ఎటువంటిదో" లో 'యు' లోపించిన రూపము కావచ్చు.

గంటిసేసెనట మోవి కాఁగిలించుకొని నిన్ను
వొంటినే నీ పాదాలు నొత్తెనట
నంటున శ్రీవేంకటేశ నన్ను నిట్టె యేలితివి
దంటదానిఁ జూపవయ్య తగమెచ్చే నేను ॥ అల ॥ 148

## గౌళ

కాంతపై మిక్కిలి బత్తిగలిగిన చెలులాల
పొంత నీపె వేడుకలు పొసఁగఁగఁజేయరే ॥ పల్లవి ॥

వనములో కోవిలల వట్టి రట్టు సేయనేల
పెనఁగి తుమ్మిదల కోపించఁగనేల
పనివడి చందురునిపై నేరమెంచనేల
వినయాన విభునికే విన్నపము సేయరే ॥ కాంత ॥

గూటిలోని చిలుకలఁ గొసరి జంకించనేల
నీటునఁ జల్లగాలిని నిందించనేల
పాటించి వసంతునితో పంతాలు దూయనేల
మాటలాడి విభుని నెమ్మదిని రప్పించరే ॥ కాంత ॥

పంచనున్న పావురాల బదరి తిట్టఁగనేల
పంచసాయకుని నొడఁబరచనేల
యెంచఁగ శ్రీవేంకటేశుఁ డిదె వచ్చి యింతిఁ గూడె
మంచివాయఁ బనులెల్లా మనవులు చెప్పరే ॥ కాంత ॥ 149

## నాగవరాళి

చెలులాల యాతనిచిత్త మిఁక నెట్టున్నదో
తెలియఁజెప్పరే నా తెరఁగెల్లా మీరు ॥ పల్లవి ॥

చెలఁగి మాఁటాడితేను సిగ్గులు మోమున నిండీ
అలరి చూచేనంటే నాసలు రేఁగీ
తలఁచితే వేడుకతో తనువెల్లాఁ బులకించీ
యెలమి నా ముచ్చటలు యేమని చెప్పుదునే ॥ చెలు ॥

చనుఁగవ నొత్తితేను సంతోసము లుప్పతిలీ
పెనఁగితేఁ దమకము పెచ్చువెరిఁగీ
తనతో నే నవ్వితేను తరితీపు లెచ్చీని
తనివోని నావలపు దాఁచ నెట్టువచ్చునే ॥ చెలు ॥

కాయము సోఁకించితే గక్కనఁ గళలంటీని
చేయి చాఁచి చెనకితే చెమరించీని
యీయెడ శ్రీవేంకటేశుఁ డింతలోనే నన్నుఁ గూడె
చాయల నీకోరికలు సరుగ నీడేరెనే ॥ చెలు ॥ 150

**రేకు 1936 ఆహిరి**

ఎన్నెని[1] చెప్పేమయా నీ యింతి సుద్దులు
చెన్నగు నీగుణాలెల్లఁ జెప్పుకొంటానున్నది ॥ పల్లవి ॥

యెచ్చిన కోరికతోడ యెప్పుడు వత్తువోయంటా
కచ్చుపెట్టుకొని యాపె గాచుకున్నది
తచ్చి తచ్చి నీ పొందులే తలపోసుకొంటాను
ముచ్చటతో దేవరకే మొక్కుకొంటా నున్నది ॥ ఎన్నె ॥

మాఁగిన మోవి చూపి నీమతి గరఁగించేనంటా
కాఁగిటికి కంకణము గట్టుకున్నది
తోఁగుఁజెమటతో నిన్నుఁ దోడితెమ్మని చన్నుల -
వేఁగుతో నీ నెచ్చెలుల వేఁడుకొంటానున్నది ॥ ఎన్నె ॥

1. ఎన్ని+అని

తేఁకువతో నిన్ను రతిఁ దెప్పలఁదేలించుదాఁకా
యేఁకటతో వయసు మీదెత్తుకున్నది
వీఁకతో నీ వేలఁగా శ్రీవేంకటేశ నీ గురుతు
వాఁకముగా నీ రూపే వా(వ్రా?)సుకొంటానున్నది ॥ ఎన్నె ॥ 151

## పాడి

మఱి నేను వేడుకతో మాఁటలెల్లా నాడేఁగాని
యెఱుకగా నీ విప్పుడే యెఱిఁగించిరావే ॥ పల్లవి ॥

బత్తి నాపైఁ గలఁదో పరాకై తా నున్నాఁడో
చిత్తము దెలిసిరావే చెలియా
హత్తిన చుట్టరికము లన్నియును విన్నవించి
కొత్తఁగా వలపు తలకొనఁజేసి రావే ॥ మఱి ॥

యెడయు కిందు వచ్చీనో యేమని యానతిచ్చీనో
అడియాల మిటు దేవే అతివ
వొడఁబాటులన్నియును వొద్దికతో నెచ్చరించి
వుడివోని తరితీపు లొనగూర్చి రావే ॥ మఱి ॥

చేరి వాకిట నున్నాఁడో సింగారించుకొనీనో
నేరుపుతో దోడితేవే నెలఁత
యీరీతి శ్రీవేంకటేశుఁ డిదిగో నన్ను నేలె
గారవాన నిన్నీ దారుకాణింతు రావే ॥ మఱి ॥ 152

## దేసాళం

ఎంతని పొగడేమమ్మా యిటువంటి సొబగులు
యింతులలో నెంచిచూడ నీపెకే తగును ॥ పల్లవి ॥

చన్ను లెంత గనమే జవరాలికి । యీ -
కన్నులతీరు చూడరే కాంతలాల
పున్నమచంద్రుఁడుగదె పొలఁతి మోము
యిన్నేసి సింగారాలు యీపెకే తగునే ॥ ఎంత ॥

తురు మెంత వొప్పిదమే తొయ్యలికిని । తన -
కరముల చెలువము గంటిరటరే
మరునివిండ్లేకదే మంచి బొమలు
ఇరవైన చక్కఁదనా లీపెకే తగునే ॥ ఎంత ॥

నడు మెంత వొరపే నలినాక్షికి । చిన్ని -
యడుగులు చిగురుల యందమేకదే
అడరి శ్రీవేంకటేశు నలమేల్మంగ । యీ -
యెడయని మురిపెము లీపెకే తగునే ॥ ఎంత ॥ 153

## గౌళ

వీఁడివో నారమణుఁడు వింటాఁ దానున్నవాఁడు
పోఁడిమితోఁ జెలి నీవు పొంచి యెచ్చరించవే ॥ పల్లవి ॥

యెంచుకొంటే తన బత్తి యెంతైనా నాకుఁ గలదు
వంచెనతో మొక్కే మఱవకు మనవే
యించుకంత దడవైనా యెడయఁడు నన్నుఁ బాసి
మంచిదాయ యీమేలు మనసులోఁ బాయదే ॥ వీఁడి ॥

చూచుకొంటే తా నిచ్చిన సొమ్ములు నా మేన నివె
వేచందాలాఁ బొగడేను వినుమనవే
కాచుకొని నాతోనే కాఁపురముసేసీఁ దాను
యీచేఁతలకేకదే ఇంత వలచితిని ॥ వీఁడి ॥

చెప్పుకొంటేఁ దనపొందు సీమలో గంపలకొద్ది
యెప్పుడూ నీ చనవు నా కిచ్చెననవే
వొప్పుగా శ్రీవేంకటేశుఁ డొద్దిక నన్నేలెఁ దాను
తప్పకుండా నీసుద్దులే తలఁపౌను నాకును ॥ వీఁడి ॥ 154

## బౌళి

ఎన్నఁడు నేరిచెనో యింతేసి దంటతనాలు
కన్నులపండువుగాను కంటి మీకె చేఁతలు ॥ పల్లవి ॥

సేసవెట్టి పెండ్లాడిన చెలి నీవద్ద నుండఁగా
ఆస లేమి చూపీనే ఆకె నీకును
వాసివంతులెంచుకోదు వల పారడిఁబెట్టుక
వేసాలెల్లాఁ జేయఁగాను వెరగాయ నాకు ॥ ఎన్నఁ ॥

కాఁపురము సేసీ ఇంతి కదిసి సేవసేయఁగా
ఆడలేక మాటలాడీ నప్పటిఁ దాను
యీపె తగ వెఱఁగక యెమ్మెలఁ బొరలుకొంటా
పూఁపనవ్వులు నవ్వీని పొద్దువోదోకాని ॥ ఎన్నఁ ॥

పట్టపు టలమేల్మంగ పాదాలు నీ కొత్తఁగాను
యెట్టు నీతోఁ బొందుసేసీ నెంత చుట్టమో
యిట్టె శ్రీవేంకటేశ ఇందరి నీ వేలితివి
చుట్టి నిన్నుఁ గాఁగిలించీ చూడు మెంతసోద్యము ॥ ఎన్నఁ ॥ 155

## లలిత

నీకును నాపెకుఁ దగు నేము విన్నవించేదేమీ
జోకతోడ నీకె మోము చూచి నవ్వవయ్యా ॥ పల్లవి ॥

మనసు లెనసినట్టి మాఁట లెవ్వరికైనాను
విన వేడుకేకాని వెగటుగాదు
వనిత నిన్నేమనినా వక్కణ లడుగవద్దు
చనవిచ్చి మెచ్చి మెచ్చి సంతోసించవయ్యా ॥ నీకు ॥

చెల్లుబడియైనట్టి చేఁత లెన్ని సేసినాను
యెల్లవారి కింపేకాని యెరవు కాదు
వొల్లనే గోరనొత్తితే నొడ్డుకో నంతేసి వద్దు
చెల్లుబడి సేసుకొని చెక్కు నొక్కవయ్యా ॥ నీకు ॥

పొందుగలిగినచోట పూఁచి యెంత పెనఁగినా
అందమయ్యే తోఁచుఁగాని అలపుగాదు
చెంది నలమేల్మంగ శ్రీవేంకటేశ నిన్ను
కందువగా మోవి యిచ్చి కడు మన్నించవయ్యా ॥ నీకు ॥ 156

రేకు 1937 సామంతం

ఇదిగో విన్నవించితి మింతిలాగులు
అదనెరఁగి తలఁచి అలపార్చుకొనెను ॥ పల్లవి ॥

వొట్టిన నీపై విరహ మోరుచుకోలేక యింతి
గుట్టుతో జాజాలాడెఁ గొంతసేపు
అట్టె తన తమకము ఆఁపలేక ఇందాఁకా
దట్టమైన వనములోఁ దాపమార్చుకొనెను ॥ ఇది ॥

కమ్మి నీవు వచ్చేయాస గాలము గడపరాక
నెమ్మదిఁ గొంతవడి కిన్నెర మీటెను
కొమ్మల విన్నపా లియ్యకొమదాఁకా వేగిరించి
తమ్మికొలఁకుల నీఁది దప్పి దేర్చుకొనెను ॥ ఇది ॥

భావములో నీ రూపు పట్టి పెనఁగఁగరాక
చేవమీర నెదురుచూచె గొంతవొద్దు
శ్రీవేంకటేశ నీవు చెందగా నలమేల్మంగ
సేవసేసి పాన్పుపై సేద దేర్చుకొనెను ॥ ఇది ॥ 157

## బౌళి

ఎంతగద్దో నీ యాసోద మింకాఁ జూతము కాని
చెంత నాతఁ డెపుడూ నాచేతిలోనివాఁడు ॥ పల్లవి ॥

చనవునఁ బతితోను సరసము లాడేవు
మనవులు చెప్పేవు మాపుదాఁకాను
పనివూని ఇంతటికిఁ బరవంజూకొంటివి
తనివోని వలపులు తవ్వి పోసుకోవే ॥ ఎంత ॥

సారె సారె నవ్వుకొంటా సంగడిఁ గూచుండేవు
పారుపత్యాలు సేసేవు పతిమారుగా
వూరఁగల దొరతనా లొడిఁగట్టుకొంటివి
పారితెంచి పగటులు బండిఁబెట్టుకోవే ॥ ఎంత ॥

వుక్కుమీరి సేయరాని వూడిగాలు సేసేవు
కక్కసించి గుబ్బలను కదు నూఁదేవు
యిక్కడ శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్ను నేలె
తక్కక నీ కోరికలు తలకెత్తుకోవే ॥ ఎంత ॥ 158

## సామవరాళి

తలఁపులుఁ దలఁపులు తారుకాణలాయ నేఁడు
పలుమారు రతుల తెప్పలఁ దేలవమ్మా ॥ పల్లవి ॥

సన్నసేసీ రమణుని సంగడిఁ గూచుండవమ్మా
కన్నులకలికి వో కప్పురగంది
చిన్నిమోవిఁ దేనెలూరఁ జేరి మాటలాడవమ్మా
చెన్నుమీర నిట్టె వో చిలుకలకొలికి ॥ తలఁ ॥

పక్కన నాతఁడు నవ్వీ భావించి చూడవమ్మా
చక్కని చంద్రవదన [1]జవ్వాదివంకి
తక్కక నీకాఁగిటికిఁ దమకించి యున్నవాఁడు
పక్కఁ బండఁగదవమ్మా బంగారుబొమ్మా ॥ తలఁ ॥

చెలరేఁగి యాదరించీఁ జెలువునిఁ జూడవమ్మా
పులుపుమట్టెలరాణి కోకిలవాణి
యెలమి శ్రీవేంకటేశుఁ డీతఁ డిట్టె నిన్నుఁ గూడె
తలఁపు లీడేరెనమ్మా తలిరుఁబోఁడి ॥ తలఁ ॥ 159

## దేశాక్షి

చెలి యన్నిటికి నీకుఁ జేతులెత్తి మొక్కీ నిదె
లలి నీపెఁ గాఁగిలించి లాలించవయ్యా ॥ పల్లవి ॥

అలసి సొలసి నిన్ను నంగనలు జంకింతురు
వలపులు పైఁజల్లి వంచుకొందురు
గిలిగింతరతులను కెరలి పైకొందురు
[2]వులివచ్చి సరసాల వోరుచుకోవయ్యా ॥ చెలి ॥

కూరిమి గొసరి నిన్ను కొనగోర నూఁదుదురు
సారె సారెఁ బంతముతో సాదింతురు
దూరుదురు కేరుదురు తొడమీఁద నెక్కుదురు
వూరక వాడికబీరా లోరుచుకొవయ్యా ॥ చెలి ॥

---

1. జవ్వాదివంకి = 2. ఉలి+వచ్చి

కుమ్మెలుగాఁ గాఁగిలించి గుబ్బల నిన్నొత్తుదురు
కమ్ముకొని కెమ్మోవి గంటిసేతురు
నెమ్మది శ్రీవేంకటేశ నీ వీకెఁ గూడితివి
వుమ్మగిలుఁ జేఁత లివి వోరుచుకోవయ్యా ॥ చెలి ॥ 160

## వారాయణి

ఇందాఁకా రతికేలికి నెదురులు చూచితివి
పొందు లోనగూడెఁగదె పూఁచినట్టు నీకు ॥ పల్లవి ॥

మంతనాన నాతనితో మాఁటలెల్లా నాడితివి
సంతోసమాయఁగదవే సకియ నీకు
చెంతనుండి చేతులారా సేవలెల్లాఁ జేసితివి
పంతములు చెల్లెఁగదె పడఁతులలోనను ॥ ఇందాఁ ॥

తిలకిం చాతనితోడఁ దేరకొన నవ్వితివి
తలఁపు లీడేరెఁగదె తరుణి నీకు
వలపించి యిట్టె కైవసము సేసుకొంటివి
వెలసెఁగదవే నీవేడుక లన్నియును ॥ ఇందాఁ ॥

రాఁపుగ శ్రీవేంకటేశరతులెల్లాఁ జేకొంటివి
కాఁపురము దక్కెఁగదె కలికి నీకు
యేపున నోలలాడితి వెనసి కాఁగిటిలోన
నీ వగటు మించెఁగదె నేఁ డితని యెదుట ॥ ఇందాఁ ॥ 161

## భైరవి

ఇంకానేల యెడమాఁట లింతితోడను
లంకెలాయ నిద్దరికి లాలించవయ్యా ॥ పల్లవి ॥

మొక్కలాన నీసుద్దులు మునుపనె వినెఁ జెలి
చక్కఁగా నీతో నాడఁజాలదుగాని
అక్కర నీమతకము లడచుకొన్నది యింతి
చెక్కు నొక్కి వేఁడుకొంటేఁ జెప్పీ వినవయ్యా ॥ ఇంకా ॥

అగడైన నీ చేఁత లన్నియు నెరుఁగుఁ జెలి
తగవు దలఁచి లోలో దాఁచీఁగాని
మొగమోటమున నీకు మొక్కుచుఁ గొంకీఁగాని
జిగిమించ వేఁడుకొంటేఁ జెప్పీ వినవయ్యా ॥ ఇంకా ॥

మచ్చికైన నీ గుణాలు మరిగివున్నది చెలి
యెచ్చరించలేక కానుకిచ్చీఁ గాని
యిచ్చట శ్రీవేంకటేశ యీకె నిట్టె యేలితివి
చెచ్చెర వేఁడుకొంటేను చెప్పీ వినవయ్యా ॥ ఇంకా ॥ 162

**రేకు 1938 రామక్రియ**

చిన్నదాన నంటాను సిగ్గు అంతేసేఁటికి
పన్నుక నీ విలాసాలు పచారించవే ॥ పల్లవి ॥

చెలియ నీ మాఁటలకుఁ జెవి యొగ్గీ నాతఁడు
వెలయ నీ మనవులు విన్నవించవే
పలచని కెమ్మోవికి బాఁతిపడీ నాతఁడు
సొలయుచు నిట్టె చవి చూపఁగదవే ॥ చిన్న ॥

తక్కక నీ మోము చూడఁ దమకించీ నాతఁడు
నెక్కొని [1]యెట్టనెదుట నిలుచుండవే
వెక్కసపుఁ జన్ను లంటి వేగిరించీ నాతఁడు
గుక్కక మిక్కక దండఁ గూచుండఁగదవే ॥ చిన్న ॥

1. "యెట్టనెదుట" విచార్యము. 'యెట్టయెదుట' సహజము.

కచ్చుక నీ పొందులకు గాచుకున్నాఁ డాతఁడు
యిచ్చగించి కాఁగిటికి నియ్యకొనవే
ఇచ్చట శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్ను నేలె
మెచ్చి మెచ్చి పొగడుతా మేలమాడఁగదవే ॥ చిన్న ॥ 163

## మాళవిగౌళ

ఇన్నాళ్ళు నెఱఁగము నిటువంటివి
సన్న నిట్టె జరగునో సారె మీ ఇద్దరికి ॥ పల్లవి ॥

పొలసి పొలసి యేమీ (మి?) పొదిగీని యాపె నిన్ను
పిలిపించితివో నీవు ప్రియముతోడ
మొలక నవ్వులతో నీమొగము దప్పకచూచి
కలవో వొడఁబాట్లు కడు మీ యిద్దరికి ॥ ఇన్నా ॥

చేరి చేరి వూడిగాలు సేయఁగవచ్చీ నీకు
కారణమేమైనాఁ గద్దో కాఁగిటికివి
నేరుపుతో సలిగెలు నెరపీ నీముందరను
యీరీతి వేడుకాయనో యిట్టె మీ ఇద్దరికి ॥ ఇన్నా ॥

పెనఁగి పెనఁగి యాపె బెరసి నవ్వీ నీతో
చనవు నీ వొసఁగినచందమో యిది
యెనసితి శ్రీవేంకటేశ యింతలో నన్ను
మనసు లొక్కటాయనో మరి మీ యిద్దరికి ॥ ఇన్నా ॥ 164

## కేదారగౌళ

ఎటువంటి వేడుకలో యివి మీకే తెలుసును
చిటిపొటి మీ సుద్దులు చెప్పుకొనే మిపుడు ॥ పల్లవి ॥

తరుణితో నేమంటివో తలఁచుక తలఁచుక
శిరసు వంచుక నవ్వు సెలవులను
నిరతపుభోగముల నేరు పెటువంటిదో
గరిమతోడుత మోము కళదేరుచుండును ॥ ఎటు ॥

చేరి సరసమాడుతా చేఁత లేమి సేసితివో
వూరకె సిగ్గులతోడ నుమ్మగిలును
గారవించి మనసెంత కరఁగఁజేసితివో
కూరిమితో సంతోసించుకొని చెలరేఁగును ॥ ఎటు ॥

యెనసి కాఁగిటిలోన నెంత మెప్పించితివో
గొనకొని విన్నప్పుడూఁ గొనియాడును
చనవిచ్చి యేలితివి చందాన శ్రీవేంకటేశ
తనిసి నీ మన్ననల దా నిట్లా నుండును ॥ ఎటు ॥ 165

**ఆహిరి**

ఇదిగో యలమేల్మంగ యింత బత్తి నీమీఁద
పొదిగొన్న నీకు వలపులు గుమ్మరించీని ॥ పల్లవి ॥

పడఁతి నీ గుణాలకు పలుమారు మెచ్చిమెచ్చి
వుడివోని సంతోసాన నోలలాడీని
కడు నీ చక్కఁదనాలు కాంతలతోఁ జెప్పి చెప్పి
వెడఁగుఁ బులకలతో విఱ్ఱవీఁగీని ॥ ఇది ॥

నేరుపుల మీచేఁతలు నెమ్మదిఁ జూచి చూచి
కోరికలు కొనసాగ గుబ్బతిలీని
కూరిమితోడుత నీ కొలువులు సేసి చేసి
చేరి నీతో వేడుకలఁ జెలరేఁగీని ॥ ఇది ॥

సేసవెట్టీ నీపై నిదె సెలవుల నవ్వి నవ్వి
ఆసలఁ గాఁగిట నిన్ను నప్పళించీని
రాసికెక్క నీ వేలఁగా రతుల శ్రీవేంకటేశ
పోసరించి యన్నిటాను భోగించీని ॥ ఇది ॥ 166

## కాంబోది

అట్టె నిన్నుఁ జూచి చూచి అరుదందేరు చెలులు
నెట్టన నీ యెమ్మెలెల్లా నెరపేవు నీవు ॥ పల్లవి ॥

మొక్కలపుఁ జేఁతలును మొసగస మాఁటలును
యెక్కడ నేరిచితివే యింతేసి నీవు
చెక్కునఁ బెట్టిన చేయి సెలవుల నవ్వులును
గక్కన నప్పటి నెందు గడియించుకొంటివే ॥ అట్టె ॥

నిడువాలుఁ జూపులును నిక్కుబొమ్మ జంకెనలు
గుడిగొన నెందు దెచ్చుకొంటివే నీవు
వెడజారఁబయ్యెదయు వీడియు వీడని కొప్పు
అడియాలా లన్నియును నమరెనే నీకు ॥ అట్టె ॥

వుప్పతిలు రాజసాలు [1]వులివచ్చి సిగ్గులును
యిప్పు డెందుఁ జదివితి వింతేసి నీవు
అప్పుడు శ్రీవేంకటేశుఁ డలమేల్మంగను నేను
నెప్పున న న్నేలె మరి నీ వెన్నటిదానవే ॥ అట్టె ॥ 167

## దేసాళం

ఎన్నటి చుట్టరికమో యీపెకు నీకు
నన్ను నేలితి విపుడు నమ్మించి యిన్నిటాను ॥ పల్లవి ॥

1. ఉలి + వచ్చి.

చెనకి చెనకి నీతో చిరునవ్వు నవ్వుకొంటా
మనవు లెంత చెప్పీని మగువ
గునిసి గునిసి సిగ్గు కుప్పలు వోసుకొంటా
పెనఁగులాడె నప్పటి పెక్కుచందములను ॥ ఎన్న ॥

జిరసి జిరసి మోవి చవులు వుట్టించుకొంటా
మరగులేల పెట్టీని మాఁటలలోన
కరఁగి కరఁగి బత్తి కానుకలు వట్టుకొంటా
గురుతులెట్టు చూపీని గుబ్బలపై నీకు ॥ ఎన్న ॥

తగిలి తగిలి మొక్కి తమకము రేఁచుకొంటా
మొగమేమి చూపీ నీముందరనుండి
జిగి నలమేల్మంగను శ్రీవేంకటేశ యేలితి -
విగురుఁబోఁడి నీ [1]కీపె నిల్లాలయి వున్నది ॥ ఎన్న ॥ 168

**రేకు 1939** **కాంబోది**

ఎన్నఁడు నెఱఁగమమ్మా ఇటువంటిది
సన్నపుఁ బులకలెల్లా జాజుకొనెనే ॥ పల్లవి ॥

వుప్పతిల్లు వేడుకతో వొద్దఁ గూచుండి యీతఁడు
చెప్పరానిమాఁటలాడీఁ జెవిలోనను
చిప్పిలి మనసు చొక్కి చెమరించె మేనెల్లా
ఇప్పు డిదివో చెలియా ఇది యేటిదే ॥ ఎన్నఁ ॥

ఆయములు సోఁకించి యట్టె పచ్చడము గప్పి
సేయరాని చేఁత సేసె చేతులు చాఁచి
పాయపు మదము రేఁగి పక్కనఁ గుచ్చెల జారె
యేయెడఁ గన్నది గాదు యెట్టి కొత్తలే ॥ ఎన్నఁ ॥

1. 'ఈఁపెయున్ + ఇల్లాలు' లో 'యు' లోపించిన రూపము కావచ్చు.

వుప్పిళ్ళూరఁ బెనఁగుతా నుద్దండానఁ బానుపుపై
నవ్వరాని నవ్వు నవ్వీ నాతోడను
చివ్వన [1]నలమేల్మంగ శ్రీవేంకటేశుఁడు నన్ను
యివ్వల మన్నించి యేలె యిఁక నే నేమందునే ॥ ఎన్నఁ ॥ 169

## ముఖారి

ఇన్ని గురుతులు నీతో నీకె విన్నవించుమనె
వున్న దిదె తెరలోన నొద్దికాయఁ బనులు ॥ పల్లవి ॥

వనితతో నీ వేమో వావులు చెప్పితివట
చెనకుతా నేమేమో సేసితివట
వొనరఁగ నీ వేలివుంగర మిచ్చితివట
యెనసెఁ జొట్టరికము లింటికి రమ్మనెను ॥ ఇన్ని ॥

సముఖాన నుండఁగానే సన్నలు సేసితివట
చెమటలు కొవగోరఁ జిమ్మితివట
తమకించి కుచములు తప్పక చూచితివట
అమరు నన్నిటా సమ్మతాయను రమ్మనెను ॥ ఇన్ని ॥

వేడుకతోఁ జెలులచే వీడె మిప్పించితివట
జోడుగాఁ బెనఁగులాడి చొక్కితివట
యీడకు వచ్చి శ్రీవేంకటేశ యలమేల్మంగను
కూడితివట దినము గొంకక రమ్మనెను ॥ ఇన్ని ॥ 170

## కన్నడగౌళ

తారుకాణ వచ్చెనా తలఁచుకో నామాఁట
గారాబు టలమేల్మంగ కాఁగిటిలోవాఁడవు ॥ పల్లవి ॥

1. ఇక్కడ 'అలమేల్మంగను' అని ద్వితీయాంతముగా గాని లేక అలమేల్మంగతో కూడిన శ్రీవేంకటేశుఁడు అమనట్లు సమాసముగాగాని చెప్పుకోవలసి యున్నది. లేదా అలమేల్మంగ సంబోధనముగానైన కావచ్చు.

అప్పుడే చెప్పితిఁగా నీ వాపె మోము చూచితేనే
దెప్పరపు వలపుల దేలించునని
ముప్పిరి నది యంతటి [1] మొగమాయ మందులాఁడి
విప్పుచు నీతో విన్నవించరాదుగాక ॥ తారు ॥

పందెము వేసితిఁగా యేపాటిమాఁట నీ వాడినా
యిందుముఖి నిన్ను బయలీఁదించునని
యిందరిలో తొల్లె యది యెంత [2]యెలయింపులాఁడి
చెంది యివి వెల్లవిరి సేయరాదుగాక ॥ తారు ॥

సాకిరి వెట్టితిఁగా యచ్చట నవ్వితేఁ దాను
చేకొని శ్రీవేంకటేశ చెనకునని
యీకడ న న్నేలితి విది యెంత చేఁతలాఁడి
జోకతోడది నీగుట్టు చూపరాదుగాక ॥ తారు ॥ 171

## సాళంగనాట

మందెమేళా లమరునా మగువలకుఁ బతితో
పొందులు మన కెప్పుడూఁ బొసఁగునేగాక ॥ పల్లవి ॥

వినయముతో మొక్కి వేఁడుకొనఁగలఁగాక
చనవిచ్చితి వంటాను సాదించేనా
మనసారా నన్ను నేలి మన్నించినవాఁడవు
వొనరి నాతలఁపులో నుండేవుగాక ॥ మందె ॥

ఇచ్చకములాడి నిన్ను నెనయఁగఁగలఁగాక
పచ్చిసేసి నీతోను పంతమాడేనా
అచ్చపు వేడుకతో నే నాలనైతి నీకుఁ దొల్లె
నిచ్చ నాపై నీకరుణ నెరపేవుగాక ॥ మందె ॥

1. 'మొగమాయమందులాఁడి'=మగవారిని మాయలో ముంచే మందులు గలది' కావచ్చు. మందులాఁడి=అపురూపమైన ప్రయోగము. 'మందులమారి' సహజము.2. 'ఎలయింపులాడి' కూడ అపురూపమే.

సేవసేసి మెప్పించి చెనకఁగఁగలఁగాక
కావరించి పెనఁగుతా గద్దించేనా
యీవల శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
తావుకొనఁ గూడితివి తగు లీడేరీఁగాక ॥ మందె ॥ 172

## హిజ్జిజి

ఎంత [1]బాఁతేయనో నీకు యీపెతోడి పొందులు
చెంతనున్న వారికెల్లాఁ జెప్పఁ గొత్తలాయను ॥ పల్లవి ॥

వెక్కసపు మాఁటలాడి వేడుకలు వెడరేఁచి
చెక్కు నొక్కి వేఁడుకొని చెలియ నిన్ను
వొక్కటనే కూడపోసె నుందండాలు వినయాలు
తక్కరితనా లివెల్లా తనకే తగును ॥ ఎంత ॥

గోరికొన నిన్ను నూఁది గుట్టున నప్పటి నీకు
సారెకు మోవితేనెలు చవి చూపీని
కూరిమితో దండ గుచ్చి కుచ్చితము మచ్చికయు
దారకపుచేఁత లివి తనకే తగును ॥ ఎంత ॥

బొమ్మలను జంకించి పొంచి కాఁగిటనుఁ గూడి
చిమ్ముచు నలమేల్మంగ శ్రీవేంకటేశ
సమ్మతుల జంటసేసీ చలములు సరసాలు
తమ్మికంటి యీచందము తనకే తగును ॥ ఎంత ॥ 173

## ఆహిరి

సరసుఁడ వన్నిటాను జాణవు నీవు
యిరవుగా మా సంతోస మీడేరించవయ్యా ॥ పల్లవి ॥

---

1. బాఁతి + ఆయనో

నెట్టనఁ జెలి వలపు నీకు విన్నవించితి
యెట్టున్నదో నీ చిత్త మెరఁగ నేను
మట్టుమీరి నీ విచ్చినమాఁటపట్టు దలఁచుకో
పొట్టఁ బొరుగువారెల్లాఁ బొగడేరుగాని ॥ సర ॥

సరుగనఁ జెలిమారు సాగిలి నీకు మొక్కితి
కరుణించే దెపుడో కనే నిఁకను
మరిగించితి నీకొప్పై మన్ననలు మరవకు
నిరతపు నీ కీరీతి నిండె దిక్కులను ॥ సర ॥

అలమేలుమంగకాను కదివో నీ కొసఁగితి
మెలఁగి నీ గుణాలకు మెచ్చే నేను
యెలమి శ్రీవేంకటేశ యీకూట మిట్టె నెరపు
కలకాల మిద్దరికిఁ గలిగీ వేడుకలు ॥ సర ॥ 174

**రేకు 1940 దేపాళం**

అన్నిటా దొరవయితే నౌదువుగాని
విన్నవించితి నిప్పుడే వెలఁది చందములు ॥ పల్లవి ॥

సిగ్గరిపెండ్లికూఁతురు సేసవెట్టీ నిదె నీకు
వొగ్గి తలవంచవయ్యా వొద్దికతోను
కగ్గులేక యప్పటి నీకాలు దొక్కీ వేడుకతో
యెగ్గులు వట్టేవుసుమ్మీ యిందుకుఁగాను ॥ అన్ని ॥

కలికి నీ మరఁదలు కంకణము గట్టీ నీకు
లలిఁ జేయి చాఁచవయ్యా లాలనతోను
యెలయించి సన్నలనే యెంగిలిమోవి చూపీని
మలసి దూరేవుసుమ్మీ మన్నింతువు గాని ॥ అన్ని ॥

దేవు లలమేలుమంగ తెరదీసి చెనకీని
సేవ సేయించుకోవయ్యా శ్రీవేంకటేశ
వోవరిలోనికి దీసి వురమెక్కి నింతలోనె
యేవేళా దించేవుసుమ్మీ యిట్టె వుందువుగాని ॥ అన్ని ॥ 175

## రామక్రియ

రట్టడి మగవాఁడవు రమణి యీకె
దిట్టతనమున నీతో దీకొనఁగనోపునా ॥ పల్లవి ॥

సిగ్గుతోనున్న చెలిపై జేయిచాఁచి పెనఁగేవు
వొగ్గి నీతో సాముసేయనోపునా యీకె
అగ్గమై మోనాననున్న యాపెనేల రేఁచేవు
దిగ్గన ని న్నింతేసి సాదించనోపునా ॥ రట్ట ॥

కొలువులోనున్నదాని గోర నూఁది చెనకేవు
కెలపి ని న్నిందుకు జంకించనోపునా
నిలుచున్నాపెను ముట్టి నీ వేల గిలిగించేవు
నలుగడరా నీతో నవ్వనోపునా ॥ రట్ట ॥

[1]గుట్టుతో డలమేల్మంగ గుబ్బలేల పిసికేవు
అట్టె శ్రీవేంకటేశ ని న్ననవోపునా
నెట్టుకొన గూడితివి నీ వీకె నేల మీరేవు
చుట్టరిక మీడేరె సొలయఁగనోపునా ॥ రట్ట ॥ 176

## కాంబోది

అడుగరే యక్కలాల ఆతని మీరందరును
యెడయక నన్నుఁ గావ నిదేవేళ యనవే (రే?) ॥ పల్లవి ॥

---

1. గుట్టులోడి + అలమేల్మంగ. 'తోడకు' బదులుగా 'తోడి' వాడుట ఈ వాఙ్మయమున కలదు.

సన్నల నే కొసరితి సరసము లాడితి
విన్నపాలెల్లాఁ జేసితి వేడుకొంటిని
తన్ను దూరరాదు నాకు దయగలవాఁడు తాను
యెన్నిటఁ గరఁగునే యిఁకఁ దనమనసు ॥ అడు ॥

చెలులచేఁ జెప్పించితి చేతులెత్తి మొక్కితి
తెలియఁజెప్పితి వావి తెరదీసితి
యెలమి నే వలచితి యింగిత మెఱుఁగు తాను
మలసి తా నెప్పుడిఁక మన్నించీనే నన్నును ॥ అడు ॥

నగితిఁ దనతో నేను నమ్మిక లిప్పించుకొంటి
తగిలి కాఁగిలించితి తమిరేఁచితి
జిగి నలమేల్మంగను శ్రీవేంకటేశుఁడు తాను
తగవుతో నన్ను నేలె తా నిఁక నేమనీనే ॥ అడు ॥ 177

## ఆహిరి

చెలియ నా విన్నపాలు చిత్తానఁ బెట్టుమనవే
మలసి న న్నేకాలమూ మన్నించుమనవే ॥ పల్లవి ॥

యిచ్చక మాడుదుఁగాని యేమిటా వెంగెములాడ
కొచ్చి కొసరుదుఁగాని కోపగించను
పచ్చిగా నవ్వుదుఁగాని పంతములు నెరపను
తచ్చి తచ్చి నా గుణాలు తా నెరుఁగుననవే ॥ చెలి ॥

వాడిక చూపుదుఁగాని వాసి వంతు లెంచను
వేడుకలు వెంతుఁగాని వేసారను
వూడిగాలు సేతుఁగాని వుదుటున జంకించను
యీడు జోడైన నా బత్తి యెంచిచూడుమనవే ॥ చెలి ॥

చేరి కాఁగిలింతుఁగాని సిగ్గులు మరఁగుసేయు
గారవింతుఁగాని మరి [1]గయ్యాళించను
యీరీతి శ్రీవేంకటేశుఁ డే నలమేలుమంగను
తారుకాణగా నన్నేలె తలఁచుకొమ్మనవే ॥ చెలి ॥ 178

## పాడి

నిన్నుఁ బాయఁగలఁడటే నిమిషమైనా నీతఁడు
వున్నతి నీ కతలనే వోలలాడు నీతఁడు ॥ పల్లవి ॥

తాపపు విరహమేలే తలవంచుకొననేలే
నీపై బత్తిఁగలఁడు నీమగఁడు
మాపు దాఁకా చింతలేలే మమ్ము నింతడుగనేలే
యేపొద్దు నీ గుణములే యెంచుకొను నీతఁడు ॥నిన్నుఁ॥

లేకలు వా (వ్రా?) యించనేలే లేమల నంపఁగనేలే
వాకిటికి నింతలోనే వచ్చె నీతఁడు
జోకతో సగినాలేలే చూచి తమకించనేలే
నీకుఁగానే యాకారు నిచ్చ నిచ్చొ నీతఁడు ॥ నిన్నుఁ ॥

చెక్కిటిచే యిఁకనేలే సిగ్గులు వడఁగనేలే
ఇక్కడ శ్రీవేంకటేశుఁ డేలె నిన్నును
మొక్కులు మొక్కఁగనేలే ముసిముసినవ్వులేలే
మక్కువ నీ రతులే మరిగినాఁ డీతఁడు ॥ నిన్నుఁ ॥ 179

## లలిత

తనంతటిదాననా తరుణి నింతే నేను
పనివూని నాతో నేల పంతములాడీనే ॥ పల్లవి ॥

---

1. 'గయాళించు' రేకు.

చిగురువంటిది మోవి చెప్పి చూపె నంటిమా
[1]నగవు వెన్నెలలోని నాముువంటిది
మొగులువంటిది కొప్పు ముడుచుకున్నారము
జిగిమించి మమ్ము నేల చెనకీనే తాను ॥ తనం ॥

తలపోయ మా మొగము తామరపూవువంటిది
బలుచన్ను లివి నిమ్మపండ్లవంటివి
తొలుతనే యివె మా చేతులు తీఁగెలవంటివి
చలముల మాతో నేల సాములు సేసీనే ॥ తనం ॥

రయమున మా తొడ లరఁటి కంభాలవంటివి
బయలువంటిదివో చెప్పఁగ నడుము
నియతాన మన్నించి నేఁడు శ్రీవేంకటేశుఁడు
దయతో నన్నేల నేల తమకించీనే ॥ తనం ॥ 180

**రేకు 1941** **ఆహిరి**

లలితాంగి నింతటను లాలించవయ్యా
నెలకొన్న నీ మోవి తేనెలకు నోరూరీని ॥ పల్లవి ॥

తరుణి నీ మోము చూచి తలవంచి సిగ్గువడి
మరిగి తలఁచీ నిన్ను మనసులోనె
వరుస నీతో నవ్వి వలపుల సుడిగొని
నిరతితోఁ దమకించి నివ్వెరగందీని ॥ లలి ॥

అట్టె నీతో మాఁటలాడి ఆసలాసలనుఁ జొక్కి
గుట్టునఁ గోరికలతో గుబ్బతిలీని
యెట్టనెదుటనే వుండి యేఁకటలకుఁ దగులె (లై?)
చుట్టి చుట్టి తనుఁదానె సోద్యమందీని ॥ లలి ॥

1. 'నగవు వెన్నెలలోని నాము వంటిది' అని చదువుకొన్నను ఈపాదములోని భావము స్పష్టమగుట లేదు.

అలరి వద్దఁగూచుండి ఆయములెల్లాఁ గరఁగి
చెలరేఁగ కాఁగిటికిఁ జేయి చాఁచీని
యెలమి శ్రీవేంకటేశ యీరీతుల నీదేవులు
వెలయ నిన్నుఁ బెండ్లాడి వేడుకతో మించీని ॥ లలి ॥ 181

## శుద్ధవసంతం

అక్కచెల్లెండ్లము నేము ఆకె నాకు వింతగాదు
చక్కఁగా మాఁటలాడరే సంతోసించుకొంటాను ॥ పల్లవి ॥

చెప్పరే మీ రితనికి చెలియ సుద్దు లెల్లాను
విప్పుచుఁ జెవులు చల్లఁగా వినీఁగాక
యిప్పు డిట్టె నేనుండఁగా నేల దాఁచే రాపనులు
చొప్పుగా మొక మొకాలు చూచుకొంటాను ॥ అక్క ॥

మొక్కరే మీ రితనికి మోహపు దేవుల మారు
చొక్కుచుఁ గన్నులారాఁ జూచెఁగాని
యిక్కడ నన్నుఁ జూచి యేల వూరకున్నవాఁడు
చెక్కుల చేతులతోడ చేరి నవ్వుకొంటాను ॥ అక్క ॥

యియ్యరే కానుక లాపె యిచ్చి పంపినవెల్లా
చెయ్యారా నందుకొని చెలఁగుఁగాని
యియ్యెడ శ్రీవేంకటేశుఁ డేలినాఁడు నన్ను నిట్టె
వొయ్యనే మీరేల లోఁగే రూహించుకొంటాను ॥ అక్క ॥ 182

## హిందోళవసంతం

ఆతఁడే యెఱఁగఁడా అతివ నీ లాగులు
యీతల నీ మచ్చిక లింకా నెంత చెప్పేవే ॥ పల్లవి ॥

మనసులో తమకము మాఁటలనే కానవచ్చె
కనుచూపులనె యింపు గనుపట్టెను
వినయములనే బత్తి వెల్లవిరియై మించె
యెనసె నీ చుట్టరిక మింకా నెంత చెప్పేవే ॥ ఆతఁ ॥

చెప్పరాని మోహములు చిరునవ్వులఁ దెలిసె
ముప్పిరిఁ గళలు మోమున వెలసె
కుప్పలైన పులకల కోరికలు దేటపడె
యిప్పుడు నీ యనురాగ మేమి చెప్పేవే ॥ ఆతఁ ॥

సరసపు చెనకులు చనుగుబ్బ లెఱిఁగించె
మరిగిన మమత మర్మముల నిండె
యిరవై శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నిన్ను నేలె
యెరవుగా నీవలపు యిఁక నేమి చేప్పేవే ॥ ఆతఁ ॥ 183

## శ్రీరాగం

నేరము లెంచకుమయ్య నీ విన్నిటా ఘనుఁడవు
తారుకాణగా నిఁక దయసేయవయ్యా ॥ పల్లవి ॥

చెలిని మన్నించుమని సేసితి విన్నపాలెల్లా
పలుమారు మొక్కితి నీ పాదములకు
వెలయఁగఁ జెక్కునొక్కి వేఁడుకొంటిఁ జనవున
తలఁచి చిత్తానఁబెట్టి దయసేయవయ్యా ॥ నేర ॥

పెక్కులాగులను నీకుఁ బ్రియము లిదె చెప్పితి
ఇక్కడ నీచే నమ్మిక లిప్పించుకొంటి
అక్కరతో నీమీఁది ఆసలెల్లాఁ దెలిపితి
తక్కక చిత్తానఁ బెట్టి దయసేయవయ్యా ॥ నేర ॥

చెప్పరాని వినయాలసేవల కొడిగట్టితి
ముప్పిరి నీపై పదములు వాడితి
ఇప్పు డిట్టె శ్రీవేంకటేశ యీకె నేలితివి
తప్పక చిత్తానఁబెట్టి దయసేయవయ్యా ॥ నేర ॥ 184

## మధ్యమావతి

మీరేమి బుద్ధిచెప్పేరే మెలుఁతలాలా
నా రమణుని గుణాలు నాకే తెలుసును ॥ పల్లవి ॥

సంతోసాన నుండి సరసములాడవచ్చుఁగాక
పంతములాడవచ్చునా పతితోను
దొంతర రతుల గూడి తులఁదూఁగవచ్చుఁగాక
వింత వింత కపటాల విఱ్ఱవీఁగవచ్చునా ॥ మీరే ॥

చొక్కముగా సేవసేసి పొలయఁగవచ్చుఁగాక
కక్కసించవచ్చునా కాంతునితోను
చెక్కునొక్కి చనవునఁ జెనకఁగవచ్చుఁగాక
పెక్కులాగుల జంకించి పెనఁగఁగవచ్చునా ॥ మీరే ॥

కూరిమితో నవ్వు నవ్వి కొసరఁగవచ్చుఁగాక
బీరమాడవచ్చునా ప్రియునితోను
యీరీతి శ్రీవేంకటేశుఁ డీతఁడే నన్ను నేలె
దొరకపు చేఁతలను తప్పులెంచవచ్చునా ॥ మీరే ॥ 185

## మాళవిశ్రీ

మెచ్చరే యీకె నిందుకు మెలుఁతలాల
అచ్చమైన యాఁటదాని కన్నియు నమరునే ॥ పల్లవి ॥

కూరిమి గలది పతిఁ గొసరఁగఁదగునే
    వోరుపు గలది వొద్దనుండఁదగునే
    మేరతోడ మెలఁగేది మేలమాడఁదగునే
    వూరకె మీ రాపె నేల వుప్పతించేరే ॥ మెచ్చ ॥

ప్రియము గలిగినది పెనఁగఁగఁదగునే
    నయగారియైనది నవ్వఁదగునే
    క్రియ యెఱిఁగినది మొక్కి పొగడఁదగునే
    రయమున నాపె నేల రాఁపుసేసేరే ॥ మెచ్చ ॥

సేసవెట్టినాపెకు చేనకఁగఁదగునే
    ఆసగలదానికి నంటఁదగునే
    యీసరి శ్రీవేంకటేశుఁ డేలినాఁడు మమ్మిద్దరి
    వేసరక యాపె నేల వెంగేలాడేవే ॥ మెచ్చ ॥ 186

**రేకు 1942 శంకరాభరణం**

వింటిమే నీ చేఁతలు వీనుల పండువగాను
    కంటిమే మీ వొద్దికలు కన్నులు చల్లఁగాను ॥ పల్లవి ॥

నీటుకత్తెవు నౌదువు నేరుపరివి నౌదువు
    మాటలాడ వలఁతివే మగనితోను
    పాటించి యాతని నీవు పక్కవాయనీయవు
    మేటిసతులెల్లాను మెచ్చేరే నిన్నును ॥ వింటి ॥

దొరవూ నీ వౌదువే దొడ్డదాన వౌదువే
    బిరుదు గట్టుక వలపించాఁగలవే
    యెరవులేక యేపొద్దూ యింటఁ బెట్టుకుందానవు
    పొరుగిరుగులవారు పొగడేరు నిన్నును ॥ వింటి ॥

పంతగత్తెవు నౌదువే బలుదాన వౌదువే
వింతలుగాఁ గూడి పొందు వెలయింతువే
ఇంతలోనె శ్రీవేంకటేశుఁ డిట్టె నిన్నుఁగూడె
ఇంతులెల్లా సంతోసాన నెంచేరు నిన్నును ॥ వింటి ॥ 187

## పాడి

ఇచ్చకమే సేయవద్దా యింతులకుఁ బతితోను
కుచ్చి యీతని నేపొద్దూఁ గొనియాడఁగదవే ॥ పల్లవి ॥

వాసులకే పెనఁగేవు వంతులకే జానిఁగేవు
సేసవెట్టిన విభుఁడు చెనకఁగాను
ఆసలెల్లా రేఁచేవు అట్టె చన్నులు దాఁచేవు
బాసదప్ప కీతఁడు నీపై బత్తి చూపఁగాను ॥ ఇచ్చ ॥

కప్పురాన వేసేవు కాయమున రాసేవు
చిప్పిల నాతఁడు వీచేయి వట్టఁగా
చొప్పులెత్తి నవ్వేవు సొలసి కొప్పు దువ్వేవు
తప్ప కీతఁడు రతికిఁ దమకించఁగాను ॥ ఇచ్చ ॥

చేతులెత్తి మొక్కేవు సిగ్గున మాఁట గుక్కేవు
కాతరాన దానే నిన్నుఁ గాఁగిలించఁగా
యీతల శ్రీవేంకటేశుఁ డిట్టె నిన్ను నేలినాఁడు
ఘాతల వేఁడుకోనేలే యీతఁడు మన్నించఁగాను ॥ ఇచ్చ ॥ 188

## దేసాళం

ఇంకా నేల దాఁచేవు యీ సుద్దులు
కంకణాలు గట్టిన నీ కల్యాణపు సుద్దులు ॥ పల్లవి ॥

[1]ముంగిటికి వచ్చె నివె మోహపు నీ సుద్దులు
[2]అంగడిలోనికి నెక్కె నా సుద్దులు
కొంగుబంగారములాయ కోరికె నీ సుద్దులు
యెంగిలి మోవికి సోఁకె నీ సుద్దులు ॥ ఇంకా ॥

పొంచులకు లోనాయ పొరుగుల నీ సుద్దులు
యెంచితే నెన్నైనాఁ గల వీ సుద్దులు
కంచపు పొత్తు గలసె కడలేనినీసుద్దులు
దించరాని మోపులాయ [3] దిన దినసుద్దులు ॥ ఇంకా ॥

ఇసుకపాఁతరలాయ నిదివో నీ సుద్దులు
ముసి ముసి నవ్వులాయ ముందే సుద్దులు
యెసగి శ్రీవేంకటేశ ఇంతలో నన్నేలితివి
కొసరితే నిగిరించీ కూరిమి నీ సుద్దులు ॥ ఇంకా ॥ 189

బౌళి

ఇటువంటి వినోదము లిద్దరికిఁ దగునమ్మ
తటుకనఁ జూడరమ్మ తరుణులాల ॥ పల్లవి ॥

యెదురుఁ గొండలమీఁద నెక్కుకొని లకిమమ్మ
పొదిగొనఁ దొంగిచూచి పొంచుకుండఁగా
గుదిగొన వేదాద్రిగుహలోనఁ గూచుండి
అదివో చేతులుచాఁచీ నౌభళేశుఁడు ॥ ఇటు ॥

అందముగ భవనాశి యద్దరిని లకిమమ్మ
విందుగాఁ జెలులచే వీడె మంపఁగా
కుందణపు మేడలోన గూచుండి నవ్వు నవ్వి
అందుకొనీ వేడుకతో నౌభళేశుఁడు ॥ ఇటు ॥

---

1. 'ముఁగిటి' రేకు 2. 'అఁగడి' రేకు 3. ఇట్టి విరుద్ధ సమాసములు మా యీ వ్యావహారిక భాషకు

కడపవాకిటనుండి గరిమతో లకిమమ్మ
తడయక మాఁటలాడి తమి రేఁచఁగా
తొడమీఁద నిక్కించుక దోమటి పెండ్లియాడి
అడరీ శ్రీవేంకటాద్రి నాభళేశుఁడు ॥ ఇటు ॥ 190

## ఆహిరి

ఆఁటది బతిమాలితే నారజకత్తె యందురు
యేఁటికి నన్నుఁ గొసరే విన్నిటా జాణఁడవు ॥ పల్లవి ॥

జలజాక్షి యొకతె నీ సంగడిఁ గూచుండఁగాను
సొలయక వేరొకతెకుఁ జోటున్నదా
కలికి యొకతె నీకుఁ గైదండ కిచ్చుకుండఁగా
చలపట్టి పెనఁగితే చప్పనగాదా ॥ ఆఁట ॥

మగువ యొకతె నీతో మాఁటలాడుచుండఁగాను
తగుల వేరొకతెకుఁ దగవయ్యీనా
మృగనేత్రి నీ కొకతె మేకొని సేవసేయఁగా
జిగిమించి నీతోనవ్వ సిగ్గుగాదా ॥ ఆఁట ॥

వనిత యొకతె నిన్ను వసము సేసుకుండఁగా
చెనక వేరొకతెకుఁ జెల్లుబడౌనా
యెనసితివి శ్రీవేంకటేశ నీవె నన్నింతలో
విన్ను (ను?) నిఁక మెచ్చేదే నేరుపుగాదా ॥ ఆఁట ॥ 191

## రామక్రియ

నిన్నుఁ [1]జా చెప్పటనుండి నేఁడు నాకు వెరగయ్యీ
పన్నుకొని యెన్నేసి పగటులదానవే

1. చూచి + అప్పటనుండి.

చనవులు సేసుకొని సరసము లాడి యాడి
వినయానఁ జెక్కునొక్కి వేఁడుకొనేవు
మనసు రంజిల్లఁ జేసి మచ్చికలు చల్లేవు
యెనసి విభుని కెంత యిచ్చకురాలవే ॥ నిన్నుఁ ॥

సరుసనే కూచుండీ సారెకునుఁ గొప్పు దువ్వి
విరులు ముడిచి యిట్టె విడి (డె?) మిచ్చేవు
తెరవేసుకొని మోవితేనియలే కురిసేవు
యిరవై మగని కెంత యితవరి దానవే ॥ నిన్నుఁ ॥

వేవేగఁ గాఁగిలించి వేడుకలు వెడరేఁచి
కైవసము సేసుకొని కరఁగించేవు
యీవేళ శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్ను నేలె
నీవూ నీతని కెంత నెయ్యమైనదానవే ॥ నిన్నుఁ ॥ 192॥

**రేకు 1943** **సామంతం**

భూపతి చెరువుచెంతఁ బొంచుక రతులకును
యేపొద్దు సతులకును యెదురు చూచీనే ॥ పల్లవి ॥

నవ్వులసెలవులతో నానిన చెమటలతో
పువ్వుల దండలు వేరే బుజాలతోడ
జవ్వన పాయముతోడ జారిన తురుముతోడ
యెవ్వతెనో కూడివచ్చి యీడ నున్నాఁడే ॥ భూప ॥

అరవిరి బాగులతో నాయముల కరఁగులతో
గరిమల నెమ్మొగము కళలతోడ
సురత వాసనలతో చొక్కపు సింగారాలతో
పురిగొన్న వేడుకతో భోగించీనే ॥ భూప ॥

పుక్కిటి విడేలతోడ పులక జొంపాలతోడ
పిక్కటిలఁ దేనెలూరే పెదవితోడ
యిక్కువ శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్ను నేలె
వెక్కసపుఁ దమకాన వినోదించీనే ॥ భూప ॥ 193

## పాళంగవాట

[1]ఇప్పు డిదె కొలువున్నాఁ డింతులు దాను
వుప్పతిలు మహిమల నుద్దగిరి కృష్ణుఁడు ॥ పల్లవి ॥

గోవులఁగాచెఁ గొన్నాళ్ళు కొండ గొడుగగ
కావరించి మద్దులను గక్కన దొబ్బె
వావులు గలయ గొల్లవనితలఁ బొందుసేసె
వేవేలు చేఁతలవాఁడు వెన్నముద్ద కృష్ణుఁడు ॥ ఇప్పు ॥

మల్లులఁ గొందరి గొట్టె మరి కంసు బొరిగొనె
తొల్లె కోడెరాకాసుల దునిమివేసె
తెల్లమిగా వసుదేవ దేవకీనందనుఁ డాయ
వెల్లవిరై మెరసీని వెన్నముద్ద కృష్ణుఁడు ॥ ఇప్పు ॥

పొంతఁ బాండవులఁ గాచె భూ భార మణఁగించె
పంతముతో దేవతల బాలించెను
యింతట శ్రీవేంకటాద్రి నేలినాఁడు మమ్మిందరి
వింత వింత సొబగుల వెన్నముద్ద కృష్ణుఁడు ॥ ఇప్పు ॥ 194

## పాడి

తరుణిరో నామనసు తా నెరఁగఁడా
తెరదీసి నే నింత తెలుపఁగవలెనా ॥ పల్లవి ॥

1. ఇది ఒకపాటి అధ్యాత్మకీర్తన కావచ్చు.

వేడుకకు నవ్వితేను వెంగెమనీ యిదియేమే
వాడుమోము చూచితేను వంచుకోనేలే
చూడవే తా నంతే కడు సుద్దాత్ముఁ డైతేను
వోడక తా నొక్కరీతి నుండవలదా ॥ తరు ॥

దగ్గరఁ గూచుండితేను తప్పించుకో నదియేలే
వొగ్గి చెనకితే నట్టె సిగ్గు లేఁటికే
యెగ్గులుఁ దప్పులుఁ దాను యెరఁగనివాఁడైతే
దిగ్గన నా మాఁట సమ్మతించి వుండవలదా ॥ తరు ॥

చేరి మొక్కుమొక్కితేను చెక్కు నొక్కి వేఁడనేలే
గారవించఁగాఁ బెనఁగఁగ నేఁటికే
యీరీతినుండి శ్రీవేంకటేశుఁడు న న్నిప్పుడేలె
మేరమీర కిటులానే మెలఁగఁగవలదా ॥ తరు ॥ 195

వాట

[1]ఈతఁడే రఘురాముఁ డీతఁ డేకాంగవీరుఁడు
యీతఁడు చేసిన చేఁత లెన్నియైనాఁ గలవు ॥ పల్లవి ॥

ఖరదూషణాదులను ఖండ తుండములు సేసె
అరుదుగా వాలి నొక్కయమ్మున నేసె
సరవిఁ గొండలచేత సముద్రము బంధించె
ఇరవై విభీషణుని కిచ్చె లంకారాజ్యము ॥ ఈతఁ ॥

కూడపెట్టె వానరుల, కుంభకర్ణాదిదైత్యుల
తోడనే రావణుఁ జంపె దురము గెల్చె
వేడుకతో సీతాదేవిఁ గూడెను పుష్పక మెక్కె
యీడు జోడై సింహాసన మేలె నయోధ్యలోన ॥ ఈతఁ ॥

1. 196, 197 పాటలు అధ్యాత్మకీర్తనల్లో నుండ దగినవి.

పుడమియంతయుఁ గాచె పొందుగాఁ దనంతలేసి -
కొడుకులఁ గాంచెను కుశలవుల
యెడయక శ్రీవేంకటేశుఁడై వరములిచ్చె
అడరి తారకబ్రహ్మమై ఇదె వెలసె ॥ ఈతఁ ॥ 196

## గౌళ

తారకబ్రహ్మమంత్రము తానై వున్నాఁడు రాముఁడు
ధారుణిలోఁ జెలువొందె దశరథరాముఁడు ॥ పల్లవి ॥

కొండలంతలు వానరకోటులు గొలువఁగాను
దండితోఁ గొలువున్నాఁడు తగ రాముఁడు
అండనే సీతాదేవి యమరి కూచుండఁగాను
మెండుగ సింహాసనాన మెరసీని రాముఁడు ॥ తార ॥

వామదేవ కౌశిక వసిష్ఠాదులవిన్నపా -
లాముకొని వినుచున్నాఁ డదె రాముఁడు
గోమున భరత శత్రుఘ్నులు ఛత్ర చామరాలు
కామించి పట్టుకుండఁగా కడుమించీ రాముఁడు ॥ తార ॥

కనకపుష్పకము చెంగట వీరాసనముతో
ననిచి యానందాన నున్నాఁడు రాముఁడు
ఘన శ్రీవేంకటాద్రిపైఁ గల్పవృక్షము నీడ
హనుమంతుని చదువు లాలకించీ రాముఁడు ॥ తార ॥ 197

## లలిత

నెపములు వేసి వట్టి నేర్గాలేల యెంచేరే
వుపమల మీరెంత వుప్పతించేరే ॥ పల్లవి ॥

చలిమి బలిమిగల సతులకుఁ బతితోను
చలపట్టి నవ్వఁదగు సాదించఁదగు
కలికితనాల మీకుఁ గాతాళించ నేమిటికి
అలరి సవతులైతే నౌదురుగాక ॥ నెప ॥

ననిచియుండిన యట్టి నాతికి నీతనితోను
పెనఁగితే నెగ్గుగాదు బీరమూఁగాదు
మునుకొన్న సన్నలను మోములు చూచుకొనేవే
అనవలసితే మీరూ నందుర(రు?)గాక ॥ నెప ॥

సేసవెట్టి పెండ్లాడిన చెలికి శ్రీవేంకటేశుఁ
బోసరించి కూడవచ్చుఁ బొగడవచ్చు
వాసినింతులతో మీరు వరుసల దిగేరేమే
ఆసగలిగితే మీరూ నంటుదురుగాక ॥ నెప ॥ 198

**రేకు 1944** **వరాళి**

ఇన్నిటా మేలుది నీకు యీకెను మన్నించవయ్యా
విన్నవించితిమి నేము వెలఁది చందములు ॥ పల్లవి ॥

వినయములే కలితే వెంగెము లెన్ని యాడినా
పెనగొన్న తమకమే పెడరేఁచును
మనసే వొడఁబడితే మర్మ మెంత ముట్టించినా
గొనకొన్న వలపులు కొనసాగింపించును ॥ ఇన్ని ॥

సంగాతమే నిజమైతే జంకెన లెంతచూపినా
అంగవించి రతులకే యాసవుట్టును
కంగులేక మెలఁగితే గబ్బితనాన నుండినా
యెంగిలి మోవికినై యేకారింపించును ॥ ఇన్ని ॥

సరసమే నెరపితే సాదించి యెంత మీరినా
తరితీపు లుప్పతిల్లి తనివొందించు
యిరవై శ్రీవేంకటేశ యింతి విట్టె యేలితివి
నిరతపుఁగోరికలు నెరవేరింపించును ॥ ఇన్ని ॥ 199

## ఆహిరి

సేసిన చేఁతలు చెల్లె చెప్పిన మాఁటలు వింటి
రాసికెక్కె నీ సుద్దులు రక్షించు మమ్మును ॥ పల్లవి ॥

చిగురుమోవి వంచి సిగ్గువడ నేమిటికి
మొగమెత్తి చూడవయ్యా మొక్కే నీకు
అగడునిట్టూరుపులు అడఁచుకొనఁదగదు
నగవయ్యా వొకమాటు నాతో నీవు ॥ సేసి ॥

కొప్పు జారినందుకుఁగాఁ గొంచించ నేమిటికి
చెప్పవయ్యా యేమాఁటైనా జేరి వినేను
తొప్పఁదోఁగే చెమటలు తుడుచుకోనంతయాల
అప్పుడే విసరేఁగాని అండకు రావయ్యా ॥ సేసి ॥

కందువైన వాసనలు కప్పిపెట్ట నేమిటికి
ఇందవయ్యా జవాది ఇచ్చే నేను
ఇందరిలో శ్రీవేంకటేశ నన్ను నేలితివి
చెంది యొక్కమనసుతోఁ జెలరేఁగు మిఁకను ॥ సేసి ॥ 200

## పాడి

విన్ను నన్ను నెంచుకొంటే నీవే నేను । నీవు
మన్నించినదే గురుతు మరి యాడ సుద్దులు ॥ పల్లవి ॥

నీ తలనే వేగెనా నెలఁతలఁ బెండ్లాడేది
కాతరించేవారికెల్లాఁ గలదే ఇది
నాతో నేమి చెప్పేవు నన్నొడఁబరచనేల
యీతల నీ చేఁతలెల్లా నియ్యకొంటి నేను ॥ నిన్ను ॥

యెవ్వరు నెఱఁగనివా యిలలో నీ వలపులు
జవ్వనపువా రుండేటి జాడలే ఇవి
తవ్వనేల యిసుకపాఁతరలు సారె సారెకు
పువ్వులవంటి గుణాలు పొగడే నే నిపుడు ॥ నిన్ను ॥

మఱవఁగ వచ్చునా మనసులో తలపోఁత
పెఱరేఁచి నిన్ను రట్టుపెట్టకుండునా
యెఱుఁగుదు శ్రీవేంకటేశ నన్ను నేలితివి
మెఱసి నీ పొందులకు మెచ్చితి నన్నిటాను ॥ నిన్ను ॥ 201

## దేసాళం

ఒకటిపై కాఁతాళము వొకటిపైఁ జూపనేల
వెకలివై నెచ్చెలుల విన్నపాలు వినవే ॥ పల్లవి ॥

కొమ్మ నీవు నీ పతినే కొసరఁగవలెఁగాక
తుమ్మిదల నేఁటికి దూరేవే నీవు
చిమ్ముచు నీ విట్టె బత్తిసేసి చూపుదువుగాక
అమ్మరో మరునినేల ఆడిపోసుకొనేవే ॥ ఒట్టి ॥

వేడుక నాతని నింకా వేఁడుకొందువుగాక
కూడగొట్టు గాలినేల కోపగించేవే
వీడె మిచ్చి చెక్కు నొక్కి వేఁడుకొనవలెఁగాక
నీడనున్న కొవిలను నెరుసులే లెంచేవే ॥ ఒట్టి ॥

గట్టిగా శ్రీవేంకటేశుఁ గాఁగిట నింతువుగాక
గుట్టుతో చందరునేల గుంపించేవే
నెట్టన ని న్నితఁ డేలె నెమ్మది నుందువుగాక
వొట్టి వసంతుపై నేల వొలవేసేవే ॥ ఒట్టి ॥ 202

## మాళవిగౌళ

బత్తిసేయఁగా నీవు పరాకు సేయఁగరాదు
వుత్తలపు వలపు నోలలాడవయ్యా ॥ పల్లవి ॥

మనసు గరఁగి నీతో మాఁటలాడీ జవరాలు
వినవయ్యా నీవు గడువేడుకతోను
వొనర నప్పటనుండి వొద్దనే కాచుకున్నది
చెనకి సరసమాడి సేవగొనవయ్యా ॥ బత్తి ॥

చలిమి బలిమితోడ సన్నలెల్లాఁ జేసీని
తెలుసుకోవయ్యా నీవు తేఁకవతోను
కొలువులుసేసి నిన్నుఁ గూరిములు గొసరీని
పిలిచి లాలనతోడఁ బ్రియమందవయ్యా ॥ బత్తి ॥

మిక్కిలి కాఁగిటఁగూడి మెప్పించీ రతులను
తక్కక చేకొనవయ్యా దయతోను
యిక్కడ శ్రీవేంకటేశ యేలితివి న న్నింతలో
వొక్కమనసున నీవు వుండగదవయ్యా ॥ బత్తి ॥ 203

## శ్రీరాగం

విన్నవించవసగాదు వెలఁది భావములెల్లా
అన్నిటా నీవే యిఁక నాదరించవయ్యా ॥ పల్లవి ॥

చన్నులమీఁది పయ్యెద [1]జారినదీఁ దలఁచదు
సన్నలు నీతోఁ జేసె సంతోసానను
చిన్నిచెమట చెక్కులఁ జిందేదీ నెఱఁగదు
కన్నుల నిన్నుఁ జూచే కాంక్షలను ॥ విన్న ॥

తురుములోని విరులు తొరిగేదీ నెంచదు
నిరతి నీతో మాఁటాడే నిబ్బరానను
మురిపినఁ దనపోఁకముడి వీడినాఁ బట్టదు
సరుగ నీపై వలపుచల్లే వేడుకలు ॥ విన్న ॥

ముంచి పులకలు మేన మొలచినదీఁ జూడదు
అంచెల నిన్నుఁ గూడేటి యాసలను
కొంచక శ్రీవేంకటేశ కొమ్మ నిట్టె యేలితివి
చెంచెలించదు నీరతి సరసానను ॥ విన్న ॥ 204

**రేకు: 1945** **మధ్యమావతి**

వినయాన వేఁడుకొనే వెసఁ దెరవేయరే
చెనకఁగా నిందరిలో సిగ్గయ్యీ నాకును ॥ పల్లవి ॥

రాఁపుసేసి వలపులు రచ్చనేల పెట్టీనే
కాఁపురము నేరుతునా కన్నెదానను
పూఁపచన్ను లంటి యంటి పొందు లెంతసేసీనే
దాపునఁ దల్లి మరఁగుదాన నింతే నేను ॥ విన ॥

సన్నలాఁ జాయల మోవిచవు లెంత చూపీనే
వున్నతితో గుట్టుసేసుకుండే దానను
మున్నని చెక్కులమీఁద నునుగో రే లూఁదీనే
మిన్నక గోలతనపుమేలుదానను ॥ విన ॥

1. 'జారినదియున్' లోని 'యు' లోపముతో సిద్ధించిన రూపము కావచ్చు.

రచ్చలోన సిగ్గులెల్లా రాసు లేల పోసీనే
కచ్చుపెట్టి మొక్కే యిచ్చకపుదానను
యిచ్చట శ్రీవేంకటేశుఁ డేలినాఁడు నన్ను నేఁడు
మెచ్చుగాఁ బెండ్లాడిన మేనదాన నేను ॥ విన ॥ 205

## కాంబోది

చూడవోయి వలపెంత చొక్కులఁబెట్టే నన్ను
వేడుకలు మీఁద మీఁద వెదచల్లీ నిపుడు ॥ పల్లవి ॥

కోరి నీవు రాకుండఁగా కోపము రావలదా
వారక యాలోన నవ్వు వచ్చీఁగాక
గోర గీరఁగా నిన్ను గుంపించఁగవలదా
గారవపు నామనసు గరఁగీఁగాక ॥ చూడ ॥

వుద్దండాలు సేయఁగాను వొట్టు వెట్టవలదా
కొద్దితో నా గుణ మియ్యకొనీఁగాక
బద్దుల వినయాలకు పంగించవలదా
అద్దో నా వయసు ని న్నాసపడీఁగాక ॥ చూడ ॥

కడల నీ సుద్దులకుఁ గాఁతాళించవలదా
పొడము పులకలమై పొదలీఁగాక
యెడయక శ్రీవేంకటేశ నన్ను నేలితివి
జడియవలదా రతి చవిరేఁచీఁగాక ॥ చూడ ॥ 206

## వాదరామక్రియ

ఎదురు చూచితిమి యిందాఁకా నీకు
తుదకెక్కెఁ బనులు సంతోసమాయ నిపుడు ॥ పల్లవి ॥

చెలివిన్నపము నీకు చిత్తమునఁ బట్టెనా
వలపులు తారుకాణ వచ్చెనా నేఁడు
పిలిచిన పిలుపులు ప్రియమాయనా నీకు
చెలరేఁగి యింటికి విచ్చేసితి విపుడు ॥ ఎదు ॥

కాఁపురాలుసేయ నీకుఁ గడు వేడుకాయనా
ఆఁపరాని తమకము లాసరేఁచెనా
యేపున నీ వయసు యెచ్చరించెనా నిన్ను
చేపట్టి మా యింటికి విచ్చేసితి విపుడు ॥ ఎదు ॥

సరసపుఁ జేఁతలు చవు లాయెనా నీకు
నిరతి నీ కన్నకల నిక్కలాయనా
సరుగ శ్రీవేంకటేశ జలజాక్షి నేలితివి
సిరులతో నింటికి విచ్చేసితి విపుడు ॥ ఎదు ॥ 207

## ఆందోళి

చెలికత్తె మారు సేవసేసితే దోసము గాదు
పొలసి నీవే యాకెకు పూనుక వచ్చితివి ॥ పల్లవి ॥

చెప్పవే యీకె సుద్దులు చెలువుఁడు వినీఁగాని
చప్పఁగాకుండాను వో సకియా
అప్పటిఁ దమి రేఁచవే ఆ చుట్టపు వరుసనే
తప్పుగాదు నీవూ ముందే తగులైనదానవు ॥ చెలి ॥

చూపవే యాకె కానికె సూటి నందుకొనీఁగాని
నీ పొందు మరువకుండా నేరుపుతోను
యీపొద్దే వచ్చినపని యీడేరించుకోవే మొక్కి
వోపుడు వెంతటికైనా వలపైనదానవు ॥ చెలి ॥

ఇయ్యవే యాకె లేకలు ఇట్టె చదివీఁగాని
ఇయ్యెడ నీ వుపకార మెన్నికకెక్క
నెయ్యమున నన్ను నేలె నేఁడే శ్రీవేంకటేశుఁడు
చయ్యన నీవూఁ గూడవే సంగాతపుదానవు ॥ చెలి ॥ 208

## భల్లాటి

ఆనతియ్యవయ్యా వినే [1]నవీఁ గొన్నివేడుకలు
వీనుల పండుగగాను వినోదము లెల్లాను ॥ పల్లవి ॥

తచ్చి నీ మోహపు కాంత తలఁపాయనో నీకు
కచ్చు పెట్టి మోమునిండాఁ గళ రేఁగెను
గచ్చుల నాపెఁ గాఁగిట గాఁగిలించినట్టాయనో
మచ్చిక నీ మేనఁ జెమటలు గారీని ॥ ఆన॥

కోమలి నీ మై నించిన గురుతు చాచుకొంటివో
నాముహార సెలవుల నవ్వు దేరీని
ఆముక యాపె కెమ్మోవి యాస నీకు ముంచెనో
కామించి మదరాగము కన్నులఁ జూపట్టెను ॥ ఆన ॥

పడతి నప్పుడే నీవు భావమునఁ గూడితివో
కడుఁగడు మేనెల్లా గురుపారెను
యెడయక శ్రీవేంకటేశ నన్ను నేలితివి
వుడివోనివలపుల నోలలాడేవు ॥ ఆన ॥ 209

## ఆహిరి

అన్నిటాను మేలుదాననైతి నేను
కన్నులఁ జూడఁగ నాకుఁ గలిగెఁగా తాను ॥ పల్లవి ॥

---

1. 'అవియున్' లో 'యు' లోపించిన రూపము కావచ్చు.

యెడ నుండినానేమి యేమి సేసినా యేమి
వాడికతో మాయింటికి వచ్చెఁగా తాను
కోడెకాఁడయితేనేమి గురుతు లుండితే యేమి
జోడుగూడి నా మొగము చూచెఁగా తాను ॥ అన్ని ॥

యెంతపరాకైననేమి యెవ్వతెఁ దెచ్చినానేమి
అంతరంగముతో మాఁటలాడెఁగా తాను
పంతగాఁడయితేనేమి బయలీఁదించితే నేమి
యింతేసి నమ్మికలు నా కిచ్చెగా తాను ॥ అన్ని ॥

పెనఁగులాడితేనేమి పెచ్చు వెరిగితేనేమి
ననుపు సేసుక నాతో నవ్వెఁగా తాను
ఘనుఁడు తానె శ్రీవేంకటేశుఁడు నన్ను నేలె
చనవిచ్చి వలపులు చల్లెఁగా తాను ॥ అన్ని ॥ 210

**రేకు 1946** శ్రీరాగం

వలవ కెట్టుండునే నీవంక చూచి రమణుఁడు
నిలువెల్లా ఇంతేసి నించుకొన్నదానవు ॥ పల్లవి ॥

పలికితే మాఁటలను పచ్చితేనియలు గారీ
పొలసితే మెరుఁగులే పోగునియ్యాని
కులికి చూచితేను కుంకుమలే తొలఁగీని
నెలఁతరో నీ వెందు నేరుచుకొంటివే ॥ వల ॥

నవ్వితేను సెలవుల నంటున ముత్యాలు రాలీ
రవ్వఁగా గొసరితేను రంజించీని
చివ్వన జంకించితేను చీఁకట్లు గదిమీని
జవ్వనిరో నీ వెంత జాణవైతివే ॥ వల ॥

వొరసితేఁ జన్నులను వుదిరి బంగారు రాలీ
మొరసితేఁ జిందీని మోహరసాలు
సిరుల నన్నేలినాఁడు శ్రీవేంకటేశ్వరుఁడు
తరుణిరో యెన్నెన్ని చేఁతల వెలసితివే ॥ వల ॥ 211

**ఆరిబి**

నావాఁడనేయంటా నమ్మిక లిచ్చేవు నాకు
కైవసమైతేఁ జాలు కాదనేనా నిన్నును ॥ పల్లవి ॥

వేడుకలు వెదచల్లి వేగినంతా నాపె నిన్ను
వాడికలెల్లాఁ జూపి వావి చెప్పెను
వీడుదోడై విందువెట్టి వీడెము చేతికిచ్చె
వాడసతులకు నీవు వలచేవే యిఁకను ॥ నావాఁడ ॥

సంగాతాలు సేసి నీతో సరసములాడి యాకె
సింగారించి మర్మాలంటి చిమ్మిరేఁచెను
చెంగటఁ గూచుండి నీచిత్త మిట్టె కరఁగించె
అంగడివారి పొందు లసించేవా ఇఁకను ॥ నావాఁడ ॥

ఇచ్చకము సేసి నీకు నెంగిలిమోవి యిచ్చి
మచ్చువేసినట్టు నిన్ను మరిగించెను
యిచ్చట శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
తచ్చువకాంతలపొందు తలఁచేవా యిఁకను ॥ నావాఁడ ॥ 212

**దేశాక్షి**

విన్నపము సేయవమ్మా విభునికి సుద్దులు
చెన్నుగా నేమిసేతము చెప్పరమ్మా బుద్దులు ॥ పల్లవి ॥

యెనలేని వలపుల యీఁతలు
　　మునుకొన్న నిట్టూర్పుల మోఁతలు
　　పొనుగొని సిగ్గుల పూఁతలు
　　వనితకు మరుఁడు సేసిన చేఁతలు ॥ విన్న ॥

కలసేటి తమకపు కరఁగులు
　　మలయుఁ జెక్కిటి చేయి మఱఁగులు
　　సెలసి పయ్యెదజారు చెఱఁగులు
　　చెలియకే మరుఁడుసేసిన తెఱఁగులు ॥ విన్న ॥

మరిగిన విరహపు మందులు
　　[1]వెను(వెర?) కొన్నభావరతి విందులు
　　యిరవై, శ్రీవేంకటేశుఁ డిందులోనె వచ్చి కూడె
　　తరుణి కింతసేసిన తగు పొందులు ॥ విన్న ॥ 213

## గుండక్రియ

నీకేల మొగమోట నే నెంతటి దానను
　　కాకుసేసి యిందుకుఁగా కాఁతాళించేనా ॥ పల్లవి ॥

ఆపె నీవూఁ గూచుండి అంతనేల రమ్మనేవు
　　చేపట్టి కాఁపురములు సేతురుగాక
　　యేపున నన్నుఁ జూచి యేల ప్రియాలు చెప్పేవు
　　వోపుదు వెంతటికైనా వొద్దనేనా నేను ॥ నీకేల ॥

యిద్దరును నవ్వుకొంటా యేల నాతో మాటాడేవు
　　వొద్దిక సరసలాడి వుందురుగాక
　　బుద్ది దలఁచుక నన్నుఁ బొత్తులేల కలిపేవు
　　కొద్దిమీరి పంగించి కొసరేనా నేను ॥ నీకేల ॥

1. ప్రాస భంగము, 'వెరవు' కూడ కావచ్చు.

ఆలు మగఁడునుఁ గూడి ఆస నాకెంత వెట్టేరు
కోలుముందై రతిఁ బెనఁగుదురుఁగాక
యీలీల శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
పాలింతువుగాక ఇంకాఁ బంగించేనా నేను ॥ నీకేల ॥ 214

## ముఖారి

నిన్ను మెత్తునో యాపె నేరుపులు మెత్తునో
పన్నుగడలై ఇట్టె పరగీని వలపు ॥ పల్లవి ॥

వారక యాసతి నీకు వావి నేమౌనోకాని
సారెకు నవ్వులు నవ్వి చల్లీ వలపు
పోరచి నాకెకు నీకు పొందులెట్టివో కాని
పేరఁబెట్టి నీముందరఁ బెంచీని వలపు ॥ నిన్ను ॥

వువిదకు నీకుఁ దొల్లి వొడఁబా టెట్టిదోకాని
తవిరి సన్నలు సేసి తవ్వీ వలపు
జవళి మీలో మీకు సమ్మతు లెట్టివోకాని
రవళిఁ దమకముల రాసిపోసి వలపు ॥ నిన్ను ॥

కలసి యాపెకు నీకు కందువ లెట్టివోకాని
కెలసి కాఁగిటను బిగించీ వలపు
యెలమి శ్రీవేంకటేశ యిట్టె నన్ను నేలితివి
కలికితనాలఁ బొత్తు గలసీని వలపు ॥ నిన్ను ॥ 215

## వాదరామక్రియ

కోరినకోరికెలెల్లా కొమ్మయందే కలిగీని
చేరి కామయజ్ఞ మిట్టే సేయవయ్యా నీవు ॥ పల్లవి ॥

సుదతి మోవి తేనెలు సోమపానము నీకు
పొదుపైన తమ్ములము పురోడాశము
మదన పరిభాషలు మంచి వేదమంత్రములు
అదె కామ్యయజ్ఞము సేయవయ్యా నీవు ॥ కోరి ॥

కలికి పయ్యద నీకు కప్పిన కృష్ణాజినము
నలువైన గుబ్బలు కనక పాత్రలు
కలసేటి సరసాలు కర్మ తంత్ర విభవాలు
చెలఁగి కామయజ్ఞము సేయవయ్యా నీవు ॥ కోరి ॥

కామిని కాఁగిలి నీకు ఘనమైన యాగశాల
ఆముకొన్న చెమటలే యవబృథము
యీమేరనే శ్రీవేంకటేశ నన్ను నేలితి
చేముంచి కామయజ్ఞము సేయవయ్యా నీవు ॥ కోరి ॥ 216

**రేకు 1947** **సామంతం**

ఎంత నన్ను వేఁడుకొనే విప్పుడు నీవు
పంతములు మీరేటి పడతినా నేను ॥ పల్లవి ॥

యే పొద్దూ సేవ సేసేటి యిచ్చకురాలనేకాక
కోపగించుకొనియేటి కొమ్మనా నేను
చేపట్టి నీ వేమనినా చిత్తములోఁదానఁగాక
నీ పలుకు మీరేటి నెలఁతనా నేను ॥ ఎంత ॥

యే దెసా నీకు లోనై యెనసేటిదానఁగాక
కాదుగూడదనేటి కాంతనా నేను
మోదముతో నిన్నుఁ జూచి మొక్కేటిదానఁగాక
సాదించి జంకించేటి సతినా నేను ॥ ఎంత ॥

మేరతో నీ కాఁగిటిలో మెలఁగేటిదానఁగాక
సారెకుఁ గొసరేయట్టి సకినా నేను
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
చేరి మేలు మరచేటి చెలియనా నేను ॥ ఎంత ॥ 217

## వసంతం

మూసి మంతనములేల ముంచి వెల్లవిరిగాను
సేసవెట్టి పెండ్లాడితే చేరి వద్దనేమా ॥ పల్లవి ॥

తెరమరఁగున నుండి తేఁకువతో నాయకుని
విరుల నెంత వేసేవే వేమారును
అరిమురి నేఁడు నీకు నంత వలపుగలిగితే
సరసఁ గూచుండి మోవి చవి చూపరాదా ॥ మూసి ॥

అవ్వలిమోము సేసుక యంతలోనే రమణుని
నవ్వుచుఁ గొవగోరేల నాఁటించేవే
యెవ్వరూ నేమి చెప్పేరు యింత నీకు వేడుకైతే
చివ్వన గాఁగిట నించి చిమ్మరేఁచరాదా ॥ మూసి ॥

చెక్కటఁ జేయి వెట్టుక శ్రీవేంకటేశ్వరుని
నిక్కి యేమి చూచేవే నివ్వెరగుతో
నెక్కొని న న్నితఁడేలె నీకూఁ గొంత చుట్టమైతే
మొక్కు మొక్కి వేఁడుకొని ముచ్చటాడరాదా ॥ మూసి ॥ 218

## గౌళ

ఆస గలిగితే నీవూ నాతనిఁ జేసుకోరాదా
రేసు వుట్టి వలపేల రేఁచుకొనేవే ॥ పల్లవి ॥

యెలమి నెప్పుడు నా యింటనే వున్నాఁడంటా
సొలసి యాతని నేమి చూచేవే నీవు
పలుమారు నామీఁదనే బత్తి సేసీనంటాను
వెలినుండి నీవెంత వెరగందేవే ॥ ఆస ॥

మచ్చిక నాతోడనే మాఁటలాడీనితఁడంటా
కచ్చుపెట్టుక యేల యేఁకారేవే నీవు
ఇచ్చగించి నా విన్నపా లెప్పుడూ వినీనంటా
కొచ్చి కొచ్చి లోలో నేమి గుబ్బతిలేవే ॥ ఆస ॥

మేలువాఁడై నా యిచ్చలో మెలఁగి మన్నించీనంటా
వోలి నిందుకే యట్టు నోరూరేవే నీవు
యీలీల శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్ను నేలె
వేళ గాచుకొని యేమి వేసాలు సేసేవే ॥ ఆస ॥ 219

## ముఖారి

కంటి నీ సుద్దు లెల్లాను కానీ కానీవే
అంటి ముట్టినంతలోనె ఆలవయ్యేవా ॥ పల్లవి ॥

మనసు పట్టఁగలేక మాఁటలాడి యాతనితో
తనివి సేసుకొనేవు తగునే నీవు
చనవున నప్పటిని జవ్వాది వూసేనంటా
పెనఁగులాడేవానే ప్రియునితోను ॥ కంటి ॥

పాయరాని తమితోడ పకపక నవ్వుకొంటా
ఆయాలు గరఁచుకొనే వాసతో నీవు
యీయెడ నంతటాఁ బోక యింటికిఁ బిలిచెనంటా
చెయివట్టి పొందులు సేసేవానే నీవు ॥ కంటి ॥

కోలుముంద్రై వేడుకతో కొచ్చి కొచ్చి చూచి చూచి
తాలిమి సేసుకొనేవు తగిలి నీవు
మేలువాఁడై నన్ను నేలె మించి శ్రీవేంకటేశుఁడు
కాలు దొక్కి మొక్కేవొనే ఘనుఁడీతఁ డంటాను ॥ కంటి ॥ 220

## రామక్రియ

నిండు సోబనములాయ నీ వుత్తర శ్రీరంగేశ
మెండాయను వలపులు మెలుఁతలకెల్లాను ॥ పల్లవి ॥

ముంచి నీవు మాఁటలాడే మోవిపై తెనెలనే
కంచుము పొత్తు గలసె కాంతలకెల్లా
పొంచి నీవు చూచే చూపుల ముంగిటి ముగ్గులనే
పంచల పండుగలాయ భామలకెల్లాను ॥ నిండు ॥

చిత్తగించి నవ్వు నవ్వే సెలవిముత్తేలనే
కొత్త కొత్త సేప (స?) లాయ కొమ్మలకెల్లా
తత్తరపు కొనగోరితాఁకుల వజ్రాలనే
హత్తుక వుంకువలాయ నంగనలకెల్లాను ॥ నిండు ॥

గరిమ మనసు కోరికల చిగిరంపులవే (నే?)
సరిఁ బెండ్లి విడేలాయ సతులకెల్లా
నిరతి శ్రీవేంకటేశ నీ రతుల వేడుకలు
విరుల వసంతాలాయ వెలఁదుల కెల్లాను ॥ నిండు ॥ 221

## కాంబోది

నవ్వేవారి నెఱఁగదు నడుమఁ దనచేఁతకు
అవ్వలనుండే తాను ఆససేసీ నీకు ॥ పల్లవి ॥

వుడివోని వలపులు వుట్టి గట్టుక వున్నది
దడి గట్టుక సిగ్గులు దాఁచుకున్నది
పెడరేఁచి వినయాలు పేరబెట్టుక వున్నది
అడియాలా లన్నియును నందుకొనవయ్యా ॥ నవ్వే ॥

మించుఁ గనుచూపులు మీఁ దెత్తుక వున్నది
పొంచి ప్రియములు రాశివోసుకున్నది
కంచపు మోవి యట్టె కానుక వట్టుకున్నది
అంచెలఁ జేతులు చాఁచి అందుకొనవయ్యా ॥ నవ్వే ॥

ముసి ముసి నవ్వులు మూటగట్టుక వున్నది
కొసరు మాఁటలు గూర్చుకొని వున్నది
యెసఁగి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
'అసమున' నాపె పోర చెందుకొనవయ్యా ॥ నవ్వే ॥ 222

**రేకు 1948** **పాడి**

ఎన్నటి పొందో నీకు యీకె యెంత చుట్టమో
పన్నుకొని వుండఁగాను పరాకులేలయ్యా ॥ పల్లవి ॥

కడు వేడుకతో నీకు గతలు చెప్పీ నాపె
వుడివోని సంతోసాన నూఁకొనవయ్యా
అడియాలముగఁ జన్ను లదె కానుకసేసీని
బడివాయ కిట్టె తప్పక చూడవయ్యా ॥ ఎన్న ॥

వెలయఁగ మోవితేనె విందులు వెట్టీ నాపె
కొలువులో నిట్టె చవిగొనవయ్యా
చెలఁగి నవ్వు ముత్యాలు సేసలు చల్లీ నీకు
కలసి మెలసి నీవూఁ గైకొనవయ్యా ॥ ఎన్న ॥

1. ఆపె పోరచి+అందుకొనవయ్యా.

చొక్కపు రతులనే జూజములాడీ నాపె
వెక్కసమేల ౧పంద్యాలు వేయవయ్యా
ఇక్కడనే శ్రీవేంకటేశ నన్ను నేలితివి
చక్కగా మా యిద్దరితో సరసమాడవయ్యా ॥ ఎన్ని ॥ 223

## కుంతలవరాళి

ఎన్నేసి చేఁతలు సేసే విట్టే మగనితోను
నన్నుఁ జూడవే మెప్పించే నయాన నీతనిసి ॥ పల్లవి ॥

పక్కన నేల మొక్కేవే పాదము లేల తొక్కేవే
చక్కని పతితో సరసము లాడుతూ
వెక్కసిం చేమి నవ్వేవే విరులనేల రువ్వేవే
తక్కక నీ తోంటిపొందు తలఁపించుకొంటాను ॥ ఎన్నే ॥

చందన మేమి వూసేవే చన్ను లేల రాసేవే
చెంది రమణునిసేవ సేసుకొంటాను
కందువ లేమి ముట్టేవే కానుక లేల పట్టేవే
సందడిలో వలపులు చల్లుకొంటాను ॥ ఎన్నే ॥

చేతు లేల చాఁచేవే సిగ్గు లేల రేఁచేవే
యీతల శ్రీవేంకటేశు నెనసుకొంటా
కాతర మేలపెంచేవే కాఁగిట నన్నితఁడేలె
పోతరిం చ్చాతనిబత్తి పొగడుకొంటాను ॥ ఎన్నే ॥ 224

## సింధురామక్రియ

పిలువ వచ్చితి నేను ప్రియురాలి కడనుండి
యెలమి నా మాటవిని యింటికి రావయ్యా ॥ పల్లవి ॥

---

౧ 'పందెలకు' 'పంద్యాలు' చొక్కపు వ్యావహారికము.

పచ్చిదేరి వలపులు పడఁతికి నీకు నేఁడు
కొచ్చి కొచ్చి తమకము గుబ్బతిలీని
విచ్చన విడాయను వేడుకతో సరసాలు
యెచ్చుగుందు ఎఁక నేల యింటికి రావయ్యా ॥ పిలు ॥

నివ్వటిల్లె వయసులు నెలఁతకు నీకు నేఁడు
వువ్విళ్లూరీ మీలోని వొడఁబాటులు
చివ్వనఁ బురిగొనెను చిగిరింత సిగ్గులు
యెవ్వరూ నేమి చెప్పేరు యింటికి రావయ్యా ॥ పిలు ॥

అందుకొనె నాసలు అంగనకు నీకు నేఁడు
కందువ రతులు తారుకాణలాయను
పొందుగా శ్రీవేంకటేశ భోగించితి వీకెను
యిందరూ మెచ్చిరి నిన్ను యింటి కిట్టె రావయ్యా ॥ పలు ॥ 5

## లలిత

కంద మీకెసరితలు కన్నులారాను
యెందుండి వచ్చెనో నీపై నింపులు చల్లీని ॥ పల్లవి ॥

తేనెలుగార మాఁటాడీ తీగె యెలుఁగులు సాగ
కానుకిచ్చి నీ మనసు గరఁగఁజేసె
నానఁబెట్టి వలపులు నయగారితనమున
యీ నేరుపులనే నీకెంత తమిరేఁచీనో ॥ కంద ॥

చల్లని చూపులఁ జూచీ సరుసఁ గూచుండుకొంటా
మెల్లనె నవ్వులు నవ్వి మెప్పించె నిన్ను
తెల్లమిగా సన్నసేసి తెలుపుకొనె వావులు
చెల్లుబడి నింకా నెంత సేవలు సేసీనో ॥ కంద ॥

కుంకుమ గుబ్బల నొత్తి కొలువులు సేసుకొంటా
పొంకపుఁ జేఁతలనే పొద్దులు వుచ్చె
అంకెల శ్రీవేంకటేశ అట్టె నన్ను నేలితివి
సంకెలేక తనఖత్తి చవి యెంత చూపీనో ॥ కంద ॥ 226

## పాళంగం

మేలు మేలు యీ కీర్తి మిక్కిలిఁ గట్టుకొంటివి
నీ లాగులెల్లాఁ జూచి నీకు మొక్కే నేను ॥ పల్లవి ॥

యే లాటా లాపెతోడ నెటువలె నాడితివో
మేలమాడ నేర్తువంటా మెచ్చీ నిన్ను
లాలించి మనసేరీతి లలిఁగరఁగించితివో
పోలించి యందరిలోనాఁ బొగడీని నిన్ను ॥ మేలు ॥

యేకతాననుండి నీవు యెంత చనవిచ్చితివో
తూకొని వేడుకతో సంతోసించీ నిన్ను
జోకగా నేమిట నీవు చొక్కఁగఁ జేసితివో
యేకడా జాణఁడవంటా యెంచీని నిన్ను ॥ మేలు ॥

నెట్టుక రతుల నెట్టు నీవు గాఁగిలించితివో
జుట్టవేలఁ బలుమారుఁ జూపీ నిన్ను
గుట్టుతో శ్రీవేంకటేశ కూడితివి నన్ను నేఁడు
అట్టె నా వావి చెప్పి తా నాదరించీ నిన్ను ॥ మేలు ॥ 227

## నాదరామక్రియ

తానే ముందుగా వచ్చి తడవె నన్ను
ఆనుకొని వసంతములాడితి నే వెనక ॥ పల్లవి ॥

కొలువులో నుండఁగానే కుంకుమ నాపైఁ జల్లె
చిలుకుఁజిమ్మనఁగోవిఁ జిమ్మితి నేను
కలువలఁ గొనివేసె కమ్మటిఁ దా నామీఁద
వెలిఁదమ్మిగుత్తిఁ గొని వేసితి నేను ॥ తానే ॥

తగిలి వెంట నే వచ్చి తనజడవట్టితేనే
మగిడి నా చన్నులు నెమ్మదిఁ బట్టెను
చిగిరుబంతిఁగొని వేసితి నప్పటి నేను
మొగము చూడఁగానే మోవి గంటి సేసెను ॥ తానే ॥

పాఁగిన తమకమున పన్నీరు నాపయి నించె
చేఁగదేరఁ జేయివట్టి చిమ్మితి గోర
యేఁగివచ్చి శ్రీవేంకటేశుఁడు నన్ను మన్నించి
కాఁగిలించి పట్టుకొని కళలు రేఁగించెను ॥ తానే ॥ 228

**రేకు 1949 రామక్రియ**

చిన్నదానవైతేనేమి చేఁతలన్నీ నేరుతువు
పన్నుకొన్నసుద్దులు గంపల నింతువుగాని ॥ పల్లవి ॥

నించవే యాతనిమీఁద నెట్టుకొని వలపులు
పెంచవే నీలోనఁగల ప్రియములెల్లా
వంచవే యెట్టనెదుట వాలుక చూపు లప్పటి
కంచపు మోవి తేనెలు కాఁగులనింతువుగాని ॥ చిన్న ॥

కోరవే యాతనితోడికూటములే యేపొద్దు
చేరవే పానుపుమీఁద సిగ్గువడక
నేరవే యాతనిచేత నెయ్యపుసరసములు
గారవపు వేడుకలు గాదెఁబోతువుగాని ॥ చిన్న ॥

మొక్కవే యాతనికి నీ మొనగోరి చేతులను
తొక్కవే పాదము లిదె తొలుత పెండ్లి
ఇక్కడ శ్రీవేంకటేశుఁ డిటు నన్నూ నిన్ను నేలె
చక్కగా నాసలు కణఁజాలనింతువుగాని ॥ చిన్న ॥ 229

## పాడి

వెలఁది సొబగులివి విన్నవించితిమి
నెలకొని ఇఁకఁ గరుణించవయా ॥ పల్లవి ॥

చెలపల చెలపల చెమటలు గారీ
వలపునఁ బొడమిన వానలివి
సొలపుల సొలపుల చూపులు వొదలీ
తెలుపుగ వెన్నెల తేటలివి ॥ వెలఁ ॥

బుసబుసమను నూర్పులు చిగిరించీ
వసంతకాలపువరుసలివి
మిస మిసఁ గాంతులు మెరుఁగులు వారీ
యెసఁగిన విరహపు టెండలివి ॥ వెలఁ ॥

మది మదిఁ గోర్కుల మంచులు గురిసీ
మదనుని యలహేమంత మిది
యిదె యిదె శ్రీవేంకటేశ యింతిఁ గూడితి
వదలనికాఁగిళ్ళవాడికలివి ॥ వెలఁ ॥ 230

## తెలుఁగుఁగాఁ (గాం?) బోది

తనదేవులఁగానా తన కెదురాడేనా
తనిపి రతుల నిట్టె దప్పి దేర్చుమనవే ॥ పల్లవి ॥

చందురుని వెన్నెలల జాలినేల తోసీనే
మందానిలు వేఁడికేల మైకొలిపీనే
అంది కోవిల కూఁతకు నడ్డమేల తోసీనే
యిందుకు విచ్చేసి నన్ను నీడేరుచు మనవే ॥ తన ॥

చిలుకలపలుకులఁ జిమ్మిరేపించనేలే
అలినాదములకేల యప్పగించీనే
పలుగోరువంకలబారినేల పెట్టీనే
తలకొని నన్ను నేలి దయఁజూడు మనవే ॥ తన ॥

మనసిజతాపమున మరలింపించు మనవే
చనవిచ్చి వసంతునిఁ జల్లజేయు మనవే
యెనసి శ్రీవేంకటేశుఁ డిదె తానె వచ్చి నన్ను
మనికై నావద్దనుండి మన్నించు మనవే ॥ తన ॥ 231

## వసంతవరాళి

దేవరకు మోహించిన తెరవలు వచ్చినారు
వేవేలకు విన్నవించేవిన్నపాలవారము ॥ పల్లవి ॥

బత్తితోఁ జనుగుబ్బలు పడఁతి కానుక చూపీ
హత్తి చేయి చాఁచవయ్యా అవధరించి
తత్తరాన నివాళిచ్చీ తళుకు చూపులనె
యిత్తల నెచ్చరికతో నిటు చూడవయ్యా ॥ దేవ ॥

వేడుకతో మోవితేనెవిందులు నీకుఁ దెచ్చె
కూడి నోరారాఁ జేకొనవయ్యా
వాడిక నవ్వులనే సేవంతివిరు లొసగీని
తోడనే మేలు మీఁద నందుకొనవయ్యా ॥ దేవ ॥

చుట్టరికపు మాఁటలు పొరిది నీకుఁజెప్పీ
వొట్టుకొని వొక లేమ వూఁకొనవయ్యా
ఇట్టె శ్రీవేంకటేశ యిందరిని నేలితివి
గట్టిగా సేవలుగొని కరుణించవయ్యా ॥ దేవ ॥ 232

## మేఁచబౌళి

మఱి నే మెంతడిగినా మాకుఁ జెప్పదు
గుఱుతులు నీవే చూచుకొందువు రావయ్యా ॥ పల్లవి ॥

చేరఁడేసి కన్నులాపె చెంగలి చూపులది
నీరాకగోరి వాకిట నిలుచున్నది
చేరి నవ్వుకొంటా నీపసిఁడిగద్దెపై నున్నది
కోరి యాపెపే రడుగుదువు రావయ్యా ॥ మఱి ॥

పట్టెఁడేసి చన్నులది బంగారువంటిమేనిది
పట్టుపచ్చడము నీది పరచుకొన్నది
దిట్టయై నిన్నుఁ బిలిచి తెమ్మనియంటానున్నది
గిట్టుతో నీ వాకెఁ గనుఁగొందువు రావయ్యా ॥ మఱి ॥

దండి (డె?) మీఁటి నీమీఁది పదాలు వాడుతానున్నది
అండనె నీవు మగఁడవంటానున్నది
దండిగా శ్రీవేంకటేశ తగవిచ్చి కూడితివి
నిండు నిధానమవై నెమ్మది నుండవయ్యా ॥ మఱి ॥ 233

## భైరవి

తనమేలుదాననని తలఁపునఁ బెట్టుమను
వినయముతోఁ జెలి విన్నవించి రావె ॥ పల్లవి ॥

చిత్తమున నెట్టుండెనో చిమ్మితిఁ గొనగోరను
కొత్త సతుల సుద్దులు కోరి చెప్పఁగా
వొత్తి మాఁటలాడితి వొద్ద నందరు నుండఁగా
తత్తరపుఁ గాంతలను తప్పక చూడఁగాను ॥ తన ॥

కోపగించఁడుగదా గొణఁగుతాఁ దిట్టితి
గాఁపుల సతులతో సరసమాడఁగా
కాఁపురము సేయుమని గయ్యాళించి పెనఁగితి
పైపై దిమ్మరితనాలపడఁతుల నంటఁగా ॥ తన ॥

సంతోసించుకొనెనో సాగిలి నే మొక్కితి
చింతదీర నామీఁదనే సేస చల్లఁగా
ఇంతలో శ్రీవేంకటేశుఁ డేలఁగా దేవులనైతి
మంతనాన నన్నే కడు మన్నించఁగాను ॥ తన ॥ 234

**రేకు 1950** **దేశాక్షి**

విందువు రావయ్యా వేడుక నీకుఁ గలిగితే
అంది తలఁచుకోవయ్యా ఆపెనీలోపొందులు ॥ పల్లవి ॥

కొప్పు నిక్కఁ బెట్టుకొని గుబ్బలాఁడి యొక్కతె
అప్పటనుండి వాకిట నడిగీ నిన్ను
పిప్పిగట్ట విడేలు పెదవినిండాఁ జేసి
చెప్పీనదె నీ తన చిన్ననాటి సుద్దులు ॥ విందు ॥

కన్నులారుచుకొంటాను కతకారి తానొకతె
నిన్నుఁ జూడఁ దమకించీ నెయ్యముతోడ
చిన్ని చెక్కులవెంటాను చిప్పిల జవ్వాది గార
కిన్నెరలో వాయించీ మిక్కిలి నీపై చిందులు ॥ విందు ॥

వాడికమాఁటలుతోడ వాకిలి దెరచుకొని
యీడకు వచ్చినది నీయెదుటికిని
కూడితివి నన్నుఁ దొల్లె గుట్టున శ్రీవేంకటేశ
వీడె మిచ్చి మేచ్చీ నిన్ను వింత వింత లాగులా ॥ విందు ॥ 235

## పాడి

చెప్పఁబోతే వెరగయ్యీ చెలిమేలు దాఁచరాదు
వుప్పతిల్లు రతులను వోలలాడుమనవే ॥ పల్లవి ॥

కుప్పలాయఁ బులకలు కోమలి చెక్కులవెంట
రెప్పలనే యలపు దేరీ నిదివో
చిప్పిలి చెమట లెల్లాఁ జిమ్మిరేఁగఁ జొచ్చె మేన
యెప్పుడు వచ్చీనే విభుఁ డేమిసేసీనే ॥ చెప్పఁ॥

చిత్తమెల్లా నీరాయ సేసకొప్పు చెదరెను
హత్తిన గుబ్బలపై పయ్యెద జారెను
వత్తివలెఁ గెమ్మోవి వసివాడి తేనెగారీ
బత్తిసేసి తా నెప్పుడు పడఁతి నేలీనే ॥ చెప్పఁ ॥

నిట్టూరుపులతోడ నిండుకొనెఁ గోరికలు
దట్టమాయ లోలోని తలపోఁతలు
ఇట్టె శ్రీవేంకటేశుఁ డింతిఁ గూడె నిందు వచ్చి
జట్టిగొనె నింకా నెంత చనవు లిచ్చీనే ॥ చెప్పఁ ॥ 236

## మంగళకౌశిక

ఇన్నాళ్లూ నెఱఁగము నీ వింతటివాఁడవౌత
పన్నిక యెవ్వతె నిన్నుఁ బనుపరచినదో ॥ పల్లవి ॥

మాపుదాఁకా నేరుపులే మాటోఁ బచరించేవు
[1]యే పల్లిఁ జదివితివో యింతేసి నీవు
రాఁపుగా జాణతనాలు రామలతో నాడేవు
చేపట్టి యెవ్వతె నీకు సెలవులు వెట్టెనో ॥ ఇన్నా ॥

పూనుకొని యెందుకైనా పొసఁగ మాఁటాడేవు
యే నెలఁత నేరిపెనో యింతేసి నీకు
నానఁబెట్టి నానఁబెట్టి నవ్వులు నవ్వ వచ్చేవు
సేనగా నీ కలవాటు సేసినది యెవ్వతో ॥ ఇన్నా ॥

అందుకోలువలపులు అమ్మవచ్చే వప్పటిని
యెందు బేరాలాడితివో యింతేసి నీవు
కందువ శ్రీవేంకటేశ కాఁగిట నన్నేలితివి
పొంది నిన్ను నెవ్వతె పోరచి మరపెనో ॥ ఇన్నా ॥ 237

## శుద్ధవసంతం

ఎంత వేగిరకాఁడవు యేమందు నేను
వింత వింత రతులను వినోదించేవు ॥ పల్లవి ॥

వెలఁది నిన్ను దగ్గరి విన్నపాలు సేయఁగాను
చిలిమి బలిమి నాపెచన్నులంటేవు
పలుమారు వేడుకతో బాగాలు చేతికియ్యఁగా
మొలక నవ్వులతోడ మోవి యానేవు ॥ ఎంత ॥

పనివూని నీ కాపె పాదములొత్త రాఁగాను
చెనకి కుచ్చెలమీఁదఁ జెయి చాఁచేవు
వినయముతో నీకు విరులు ముడువఁగాను
మనసు పట్టఁగలేక మర్మము లంటేవు ॥ ఎంత ॥

---

1. ఏపల్లిన్= ఏబడి యందు.

వుక్కుమీరి యాపె నీకు వూడిగాలు సేయఁగాను
పిక్కటిలఁ గాఁగిటను బిగియించేవు
యిక్కడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
చొక్కుచు నాపెతోడ నా సుద్దులు చెప్పేవు ॥ ఎంత ॥ 238

## ఆహిరి

ఈకెను మన్నించవద్దా ఇంతటనైనా
చేకొని యీరీతి నీ సేవలెల్లాఁ జేసెను ॥ పల్లవి ॥

వినయముతో నీకు విన్నపము సేయుమని
తనమారు చెలి నంపెఁ దరుణి
చనవునఁ దనమారు సాగిలి మొక్కించుమని
కనకపుబొమ్మ నంపెఁ గనుఁగొనవయ్యా ॥ ఈకె ॥

నించి తనమారు యిట్టె నిన్ను సింగారించుమని
మించిన పూదండ యంపె మెలుఁత నేఁడు
పంచనుండి తనమారు పంతము నీ కిమ్మని
అంచెల ముంజేతి చిల్క నంపెను నీవద్దికి ॥ ఈకె ॥

నెలకొని తనమారు నీకుఁ బాదాలొత్తుమని
మెలుపున వజ్రాల మించు లంపెను
నిలిచి శ్రీవేంకటేశ నెట్టనఁ దానె వచ్చి
కళలంటి వేఁడుకొని కాఁగిలించె నిన్నును ॥ ఈకె ॥ 239

## సామంతం

జెప్పఁ జెప్పఁ గొత్తలాయ చేరి వినేవారికెల్లా
కుప్పలుఁ దెప్పలుఁ గాఁగ కొమ్మలాల వినరే ॥ పల్లవి ॥

ఆయాలంటి ఆయాలంటి యప్పటి వేఁడుకోఁగాను
కాయజ కేలికి నీకెఁ గరుణించవయ్యా ॥సరి॥

సన్నసేసి సన్నసేసి సారె నిన్నుఁ బిలువఁగా
యెన్నఁడు మన్నించేవు యేమయ్యా
చన్ను లొత్తి చన్ను లొత్తి సాములు నీతోఁ జేయఁగా
చెన్నుగా నీకె చనవు చెల్లించఁదగదా ॥సరి॥

సేవసేసి సేవసేసి చేతులెత్తి మొక్కఁగాను
యేవేళఁ జిత్తగించేవు యేమయ్యా
వేవేలు చందాలను శ్రీవేంకటేశ కూడితివి
యీవిధాన నేఁ డీకె నింత సేయఁదగదా ॥సరి॥ 390

**రేకు 1976** నాదరామక్రియ

అరవిరిబాగుల యతివ నీ వవుదువే
సారిది నీ వొయ్యారాలు చూడఁ గొత్తలాయనే ॥పల్లవి॥

నిదుర కన్నులతోడి నివ్వెరగులు
చెదరుఁ గురుల చిమ్మఁజీఁకటులు
వెదచల్లు నవ్వులవెన్నెలలు
తుదకెక్కి రతి గఱుతులు నీ కొనరెనే ॥అర॥

పచ్చిదేరేటి చెక్కులపై చెమటలు
ముచ్చటలాడుకొనేటి మోవివాడులు
కొచ్చి కొచ్చి సొలసేటి కొనచూపులు
అచ్చముగ నీమేని కన్నియు నమరెనే ॥అర॥

ముప్పిరి సమరతుల మోముకళలు
కుప్పలుగా రాలేటి కొప్పువిరులు

సన్నలు సేయనా మోవి చవులు నేఁ జూపనా
కన్నులారా నీవేరీతిఁ గంటివోకాని
యిన్నిటా శ్రీవేంకటేశ యేలితివి నన్ను నీవు
నిన్నుఁ జూచి కృప యెంత నించితివోకాని ॥ నీచేఁత ॥ 241

## సామంతం

ఇప్పుడు నన్నడిగేవు యెప్పుడు వచ్చితివని
కప్పురాన వేయనా నీ కతలెట్టివోకాని ॥ పల్లవి ॥

విన్నవించనా నేను వీనులు చల్లఁగా నీకు
కన్నులను మొక్కనా కమ్మటి నేను
సన్నసేసి చూపనా చవిగా నా మోవితేనె
వున్నతి నెందుఁ బరాకై వుంటివోకాని ॥ ఇప్పు ॥

చేతులారా వేఁడుకోనా చెక్కునొక్కి నే నీకు
కాతరాన నీవేళ గాచుకుండనా
రాతిరెల్లా నిట్టె జాగరాలు నీతోఁ జేయనా
యే తలపోఁతలతో నీవెటుంటివోకాని ॥ ఇప్పు ॥

పాదాలు నీకొత్తనా పానుపుపై నుండఁగాను
పోది సేసి విడె మిచ్చి పొందు సేయనా
యీదెస శ్రీవేంకటేశ యింతలో నన్నేలితివి
పాదుకొని నాపై నెంత బత్తి నుంటివోకాని ॥ ఇప్పు ॥ 242

## వాదరామక్రియ

మంతనాన న న్నిట్టె మన్నించుఁగాక
సంతతమూఁ జెక్కునొక్కి సరస మేమాడీనే ॥ పల్లవి ॥

చిగిరించె వలపులు చేగలెక్కెఁదమకము
నగుతా నాతో నెంత నాని సేసేసీనే
తగులాయ వావులు తతివచ్చె జవ్వనము
యెగసక్కేలకు నేల యెడమాఁటలాడీనే ॥ మంత ॥

పచ్చిదేరెఁజిత్త మిదె పదనెక్కెఁ దనువల్లి
కొచ్చి కొచ్చి నాతో నెంత గుట్టు చూపీనే
పెచ్చురేఁగెఁ గోరికలు పెనగొనెఁ బ్రియములు
తచ్చి తచ్చి మరి యాల తరితీపు సేసీనే ॥ మంత ॥

నమ్మికలు తుదకెక్కె నారుకొనెఁ బులకలు
కమ్మటి సిగ్గు లివేల కప్పవచ్చీనే
నెమ్మదిఁ గాఁగిటఁ గూడె నేఁడు శ్రీవేంకటేశుఁడు
వుమ్మడి సారెకు నేమి వొడివట్టీనే ॥ మంత ॥ 243

## తెలుఁగుఁగాంబోది

మగువ నిన్నేకాని మరి యన్య మెఱఁగదు
జిగి నీపై వలపులు చిత్తగించవయ్యా ॥ పల్లవి ॥

చన్నులమీఁది పయ్యెద జారినదీ నెఱఁగదు
కిన్నెర మీఁటి నిన్ను గిలిగించీని
చిన్ని చెక్కులఁ గారేటి చెమటలు నెఱఁగదు
యెన్నిక తానాల తోడ నెలుఁగెత్తి పాడీని ॥ మగువ ॥

తురుము వీడి విరులు తొరిగేది నెఱఁగదు
సిరుల నీపైఁ బదాలు చెప్పి చొక్కీని
పరుగన మొలనూలు సళ్లినదీ నెఱఁగదు
వరుస నీ గుణాలెల్లా వ్రాసి వర్ణించీని ॥ మగువ ॥

పొదలిన మేనెల్లా బులకించే దెఱఁగదు
సదరాన నిన్నుఁ గూడి సంతోసించీని
పెదవిపై కెంపులు బెరసిన దెఱఁగదు
యిదె శ్రీవేంకటేశ ని న్నెచ్చరిక సేసీని ॥ మగువ ॥ 244

## ఆహిరి

ఇట్టె కరుణించవద్దా యింతటనైనా
నెట్టుకొన్న వినయాన నెలకొన్నదానను ॥ పల్లవి ॥

మునుకొని చేతులెత్తి మొక్కితి నప్పుడె నీకు
చనుఁగవ యే లంటేవు సారెకునని
ననిచి పెట్టరానియానలెల్లా నీకుఁ బెట్టితి
గొనకొని చెక్కులపై గోర గీరకుమని ॥ ఇట్టె ॥

లలి మోవి తేనియలు లంచము లిచ్చితి నీకు
తిలకించి మానముపైఁ దిట్టకుమని
పిలిచినా చిలుక నీ పేరువెట్టి వేఁడుకొంటి
యెలమి నా సిగ్గులు బాయిట వేయకుమని ॥ ఇట్టె ॥

కదిసి వినయముతోఁ గాఁగిలించుకొంటి నిన్ను
పదరి యెన్నఁడూ నన్నుఁ బాయకుమని
యిదె శ్రీవేంకటేశ న న్నేలినందుకు మెచ్చితి
సదరాన నీవే భువి జాణఁడవని ॥ ఇట్టె ॥ 245

## వాగవరాళి

నీ చిత్తము నా భాగ్యము నేరుపు లింకే మున్నవి
చూచినట్టు వచ్చీనా సూటితో వలపులు ॥ పల్లవి ॥

యితవైతే మాఁటలు యెన్నైనా నాడఁగవలె
మతికి వెగటైతేను మానఁగవలె
కుతిలపు రారాఁపులఁ గొసరఁగఁబోతేను
చతురత లెన్నైనాఁ జవులు గాఁబోయీనా ॥ నీచిత్త ॥

చెల్లుబళ్లయితేను సేవలు సేయఁగవలె
వొల్లకుంటే గుట్టుతోడ నుండఁగవలె
పల్లదాన చనవులు పచారించఁబోతేను
వుల్లములో వేడుకలై యుండఁబోయీనా ॥ నీచిత్త ॥

చుట్టరిక మబ్బితేను సొలసి చూడఁగవలె
వట్టి పొందులైతే తలవంచుకోవలె
యిట్టె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
మట్టులేని నీ రత్యులు మరిచితేఁబోయినా ॥ నీచిత్త ॥ 246

**రేకు 1952** **కాంబోది**

కడు వలచినదానిఁ గాకు సేతురా
యెడయక మన్నించి యేలుదురుగాక ॥ పల్లవి ॥

చక్కెర పంటి మోవి చవిచూడవచ్చితేను
చుక్కలెట్టు నించితివి సుదతికిని
నిక్కి చూచి చేతు లెత్తి నీకు నిట్టె మొక్కితేను
జక్కవ చన్నులేల సారెఁ బిసికేవు ॥ కడు ॥

వేడుకతో నీకు నిట్టె విన్నపాలు సేయఁగానే
కూడఁబట్టి చెక్కులేల గోర గీరేవు
వాడికతోఁ బాదాలొత్తి వావులు చెప్పఁగాను
మేడెపురతుల నెంత మేలమాడేవు ॥ కడు ॥

వెన్నెల నవ్వులు నీతో వేమారు నవ్వేనంటా
పన్నిక మొలనూ లేల పట్టి తీసేవు
యిన్నిటా శ్రీవేంకటేశ యీకె నీకు దేవులంటా
మన్నించితి వింకా నేమి మర్మము లంటేవు ॥ కడు ॥ 247

## రామక్రియ

ఇంతిప్రతాపము నీవే యెఱఁగుకొనేవుగాక
వింతలుగా వేరే నేము విన్నవించవలెనా ॥ పల్లవి ॥

నెలఁత చిఱునవ్వులే నిండాఁ దమి రేఁచేవి
కలికితనాలే మతి గరఁగించేవి
తలిరు మోవె (వి?) వలపు తలకెక్కఁజేసేది
పలుమారు నేమిటికి పంతాలాడేవయ్యా ॥ ఇంతి ॥

వనిత చన్నుమొనలే వసము సేసుకొనేవి
కనుచూపులే వాఁడై కాఁడిపారేవి
ననిచిన కొనగోరే నాములై చొక్కించేది
[illegible]లేని బింకాలు యెందువోయీనయ్యా ॥ ఇంతి ॥

మగువకాఁగిలె సారె మరుగఁగఁ జేసేది
[illegible]జేతులే నీసేవ సేసేవి
[illegible]కటేశ తతినీకెఁ గూడితివి
జిగిమించె నీ నేరుపు చెప్పనేఁటికయ్యా ॥ ఇంతి ॥ 243

## కుంతలవరాళి

ఎరఁగము నీ సుద్దులు యిందాఁకాను
పెరరేఁపులనే యాస పేరఁబెట్టేవటవే ॥ పల్లవి ॥

చుట్ట చుట్టి వచ్చి నీవు చూచే వాతని మోము
పొట్టఁబొరుగున నీకుఁ బొందు గద్దటే
కట్టెదుర నుండి మతి గరఁగేవు సారె సారె
వట్టి మాకు లిగిరించ వలచితివటవే ॥ ఎరఁ ॥

మందలించి మందలించి మాటలాడే వప్పటిని
అందుకొన్న నీ తమక మాఁపలేవటే
విందు చెప్పే నెపమున వేఁడుకొనే విటు వచ్చి
చందమామ గుటుకలు చవిచూపేవటవే ॥ ఎరఁ ॥

నంటు చూపి నంటు చూపి నవ్వేవు సెలవుల
అంటిము ట్టితనికి నీ వాలవటవే
యింటిలో శ్రీవేంకటేశుఁ డేలినాఁడు నన్ను నేఁడు
జంటలైన రతులు తోడంటువెట్టేవటవే ॥ ఎరఁ ॥ 249

## ఆహిరి

అలుగను సేయను ఆరడి నేల పెట్టీనే
చెలియ నీవైనా బుద్ధి చెప్పవే యీతనికి ॥ పల్లవి ॥

మోము దప్పక చూచితి ముచ్చటతో నవ్వితి
ప్రేమముతో మాఁటలాడి పీఁట వెట్టితి
కామించి తా వేఁడుకొంటే కానిమ్మని ఇయ్యకొంటి
యేమిసేయుమనీనే యింకాఁ దాను ॥ అలు ॥

వీడెము చేతికిచ్చి వెసఁ బానుపు వేసితి
పాడి పాడి వేగినంతా పదా లొత్తితి
వాడుదేర నిట్టె యాలవట్టమూను విసరితి
యాడువెట్టుకొని యింకా నెంత వేఁడుకొనీనే ॥ అలు ॥

చేతులెత్తి మొక్కితి సేవలెల్లాఁ జేసితి
కాతరాన నిమ్మపండు కానుకిచ్చితి
యీతల శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్నుఁగూడె
యేతులు నే నెరఁగను యేల రట్టు సేసీనే ॥ అలు ॥ 250

## హిందోళం

చూడఁ జూడ వేడుకలు సుదతి విలాసాలు
మేడెపు రతి భావాలు మెచ్చఁగదవయ్యా ॥ పల్లవి ॥

వలపులు వెదవెట్టె వనిత నీమీఁదను
మొలచి తమకములు మోసులెత్తెను
యెలమిఁ దలపోఁతలు యెన్ను వెళ్లె నంతలో
చెలఁగి నీ మహిమలు చిత్తగించవయ్యా ॥ చూడఁ ॥

కువ్వలు వోసె వయసు కోమలి చన్నుల వీపై
నవ్వులు గాదెలునిండె నానాటికి
వువ్విళ్లూరి సరసము లొకటికినుమడాయ
చివ్వన నీ మహిమలు చిత్తగించవయ్యా ॥ చూడఁ ॥

పొందికలు దూరుపెత్తె పొలఁతి నీ కాఁగిటను
విందుసేసె మోవితేనె విభవానను
యిందరిలో శ్రీవేంకటేశ యీకె నేలితివి
చెందిననీ మహిమలు చిత్తగించవయ్యా ॥ చూడఁ ॥ 251

## శ్రీరాగం

ఆతని చిత్తము వచ్చినదే పదివేలుగాక
చేతులెత్తి మొక్కే నేను చిత్తముగించుమనవే ॥ పల్లవి ॥

చెల్లుబడి గలిగితే చెనకి కొసరవలె
వొల్లనే కొంకితే నూరకుండవలెను
పల్లదాన రమణుని బలిమి సేసితేను
యెల్లవారూ నాఁట దాని నెంత [1]గయ్యాళెనరా ॥ అత ॥

మన్ననలు సతమైతే మాఁటలెల్లా నాడవలె
విన్నప మందకుండితే విడువవలె
సన్నకు లోఁగానివాని సాదించఁజూచితేను
కన్నవారెల్లా నెంత గబ్బి యిది యనరా ॥ అత ॥

మనసు చిమ్మిరేఁగితే మచ్చికతో నవ్వవలె
తనిసితే నివ్వెరగందఁగవలెనూ
యెనసిన శ్రీవేంకటేశుతోఁ బెనఁగితేను
వినినవారెల్లా నవ్వు వేసాలది యనరా ॥ అత ॥ 252

**రేకు 1953** **శుద్ధదేశి**

నీ వేమి సేసినాను నీకుఁ జెల్లును
వేవేలు చందాలను వేఁడుకొనే నిన్నును ॥ పల్లవి ॥

మాఁటలు నాతో నాడుతా మల్లి చూచే వేమీ నీవు
ఆఁట దెవ్వతో చూచీనంటానో నిన్ను
చాటువెట్టుకొని కొంత సన్నలు సేసేవు నాతో
మాటిచ్చుకున్నాఁడవో మరియు నాపెకును ॥ నీవేమి ॥

వొద్దఁ బండ్డుండి యవ్వల నొగిఁ జోటిచ్చుకుండేవు
నిద్దరించేవేళ నాపె నీవుఁ గూడేవో
వొద్దికఁ బుక్కిట దాఁచుకున్నాఁడవు తములము
చద్ది గట్టిపెట్టితివో సరుగ నాపెకును ॥ నీవేమి ॥

1. గయ్యాళి + అనరా = గయ్యాళెనరా

పొంకముగా జాగరాలఁ బొద్దువుచ్చ వాపెను
కంకణము గట్టి తొల్లె కలసితివో
అంకెల శ్రీవేంకటేశ అంతలో నన్నేలితివి
ఇంక నీకు వెలుపులే దెరుఁగుదు నవ్వితి ॥ నీవేమి ॥ 253

## పాడి

మేలు మేలు జవరాలు మెఱసే ని సింగారాలు
కోలుముందై నీ కిన్నిటా గుఱుతులు సేసీనే ॥ పల్లవి ॥

చనుగుబ్బల మీఁదటి చంద్రవంకలు
కనుఁగొన చూపుల కడకెంపులు
తనువుపై చెమట చిత్తడి సోనలు
గొనకొన్న రతులకు గురుతులు సేసీనే ॥ మేలు ॥

నొసలిపైఁ జెదరిన నునుఁగురులు
ముసిముసినవ్వుల మురిపెములు
అసురుసురుల తోడి యలయికలు
కొసరేటి రతులకు గురుతులు సేసీనే ॥ మేలు ॥

ముదమునఁ దేరేటి మోముకళలు
పెదవిపై నిండిన ముప్పిరిబేంట్లు
యెదుట శ్రీవేంకటేశుఁ డిట్టె నిన్నేలఁగాను
గుదిగొన్న రతులకు గురుతులు సేసీనే ॥ మేలు ॥ 254

## శంకరాభరణం

పొద్దొక వన్నెలతోడఁ బొదలీ నీపె సిరులు
వొద్దికతోఁ జూడరమ్మా వూహించి చెలులు ॥ పల్లవి ॥

చెలి చెక్కులఁ గాసేవి చిరునవ్వు వెన్నెలలు
పలుకులఁ దొలఁకేవి పంచదారలు
పలువరుసనుఁ గనుపట్టినవి మాణికాలు
యిల నీకె చక్కఁదన మెంతని చెప్పుదమే ॥ పొద్దొక ॥

చన్నులపైఁ దేరేవి చాయల పైఁడినిగ్గులు
కన్ను లజళిపించెని కారుమించులు
చిన్ని మొగమున మెరసేవి మదనకళలు
యిన్నిటా నీపె భావము యెంతని చెప్పుదమే ॥ పొద్దొక ॥

నిక్కుఁదురుము [illegible] డినవి సింగారాలు
చొక్కపుమేన నిండేవి చక్కఁదనాలు
గక్కన శ్రీవేంకటాద్రి ఘనుఁడు మన్నించి కూడె
యిక్కడ నీపె చెలువ మెంతని చెప్పుదమే ॥ పొద్దొక ॥ 255

## సామంతం

సకలము నెరిఁగిన జాణఁ డితఁడు
మొక మెందాఁకాఁ జూచేవు మొక్కఁగదవే ॥ పల్లవి ॥

విన్నవించవే నీవు విభునికి మనవులు
సన్నలా చాయలా నేమి సాదించేవు
పన్నుక వద్దఁ గూచుండి పాదా లొత్తఁగదవే
చన్నుల నీతని నేమి సరిఁ దాఁకించేవు ॥ సకల ॥

నవ్వవే యాతనితోను నసుపులు సేసుకొని
పువ్వుల నేమివేసేవు పూఁచి పూఁచి
వువ్విళ్లూర మోవి యిచ్చి వొడఁబరచుకొనవే
చువ్వన నీతని నేమి చొక్కులఁబెట్టేవు ॥ సకల ॥

ఆకు మడిచియ్యవే అట్టె బాగా లొసఁగి
దాకొని వూరకే యంత తమిరేఁచేవు
యీకడ శ్రీవేంకటేశుఁ డేలె నిన్ను మెచ్చఁగదె
మేకుల నీతని నెంత మేలమాడేవు ॥ సకల ॥ 256

## శ్రీరాగం

ఇంక నిన్ను దూరను యియ్యకొంటి ని యానతి
కంకణము గట్టితి వీకాలమునాఁడే ॥ పల్లవి ॥

యెన్ని లేవు విన్నపాలు యిట్టె సేసేనంటే నీకు
మన్నించినదే గురుతు మాకు నీవు
సన్నలు చాలాఁగలవు సారెఁ బచారించేనంటె
వన్నెల మా యింటికి వచ్చుటే గురుతు ॥ ఇంక ॥

యెంతని చెప్పుదు మోహ మిట్టె నీకుఁ జూపెనంటే
యింతగా లాలించివదే యెక్కుడు నాకు
వంతుల కలివి యేది వాసులు వట్టేనంటే
చెంతనుండి నాతో పొందుసేసినదే గురుతు ॥ ఇంక ॥

యెక్కడ గొలఁది సేవలిట్టే నేఁ గావించేనంటే
యిక్కడ నన్నేలినదే యింపు నాకు
నెక్కొని శ్రీవేంకటేశ నీకు నే మొక్కేనంటే
లెక్క యేది నీ వేలినలీలలే గురుతు ॥ ఇంక ॥ 257

## తెలుఁగుఁగాంబోది

చెలువుఁడ యీకెనుఁ జిత్తగించుమిఁక
వెలసి నీకు నివి వేడుకలాయ ॥ పల్లవి ॥

తలఁచక తలఁచిన తరుణిరాక యిది
యిల నీకోరిక కిరవాయ
మొలవక మొలచిన ముసిముసి నవ్వులు
నెలకొని వలపుల నిలుకడలాయ ॥ చెలు ॥

చూడక చూచిన సొలపుల చూపులు
వీడని యాసకుఁ దోడాయ
కూడక కూడిన కుచములసోఁకులు
తోడనే రతులకు దోమటులాయ ॥ చెలు ॥

పెనఁగక పెనఁగినప్రియముల కాఁగిలి
తనివోనితమికిఁ దగులాయ
యెన[illegible] శ్ర[illegible]శ యీమగువ
అనిశము నీకును [illegible]రంబాయ ॥ చెలు ॥ 258

**రేకు 1954** **శుద్ధవసంతం**

ఎన్నాళ్లనుండి కాచుక యిందుకే వుంటివో నీవు
పన్నిన నీ కోరికలు ఫలియించె నిపుడు ॥ పల్లవి ॥

చేవదేర నాకె నీకు చేతులెత్తి మొక్కితేను
దేవులవు గమ్మంటా దీవించేవు
వావి చెప్పుమని నిన్ను వాలాయించి యడిగితే
బావనంటా సరసాలే పచారించేవు ॥ ఎన్నా ॥

ముదమున నాకె వీమోము దప్పక చూచితే
ఇదె పెండ్లి లగ్నమంటా నియ్యకొల్పేవు
చెదరక వూరకే నీచెంత నిలుచుండితే
యెదురేది నీకు నాకు లీ(నీ?) డుజోడా ననేవు ॥ ఎన్నా ॥

మక్కువల నాకె నీతో మంచి మాఁటాడితే మోవిఁ
జక్కెర చిందీనంటాఁ జవి చూచేవు
యిక్కడ శ్రీవేంకటేశ యెరిఁగి తా నవ్వితేను
గక్కన మెచ్చితినంటాఁ గాఁగిలించేవు ॥ ఎన్నా ॥ 259

## వరాళి

కాఁపురము సేయవయ్యా కలకాలము నీరీతి
దాఁపురాలై మీ పొందులు తారుకాణలాయను ॥ పల్లవి ॥

కచ్చుక నీరాక కీపె కాచుకున్నందుకు నీవు
విచ్చేసితి వింతలోనె వేడుకతోను
తచ్చి మీ తలపోఁతలు తాళమువేసి నట్టాయ
మెచ్చిరి చెలులెల్లాను మేలు మేలయ్యా ॥ కాఁపు ॥

మునుకొని యీాపె నీకు మొక్కులు మొక్కినందుకు
యెనసి కాఁగిలించితి వెదురుకొని
మొనసిన మీ చేఁతలు ముయికి మురియ్యై నట్టాయ
పొనుఁగక మీ గుణాలు పొగడి రిందరును ॥ కాఁపు ॥

పమ్మికొని యీాపె నీకు బాగా లిచ్చినందుకు
తమ్ముల మొసఁగితివి తమితోడను
నెమ్మి శ్రీవేంకటేశ మీ నేర్పు సరి బేసులాయ
సమ్మతితో మీకు నెల్లా సంతోసములాయ ॥ కాఁపు ॥ 260

## పాడి

సేయువే మగనిసేవ చేతులారాను
కాయజ కేలికి వచ్చి కాయ మెంత దాఁచేవు ॥ పల్లవి ॥

సిగ్గు లింతే సేఁటికే చిరునవ్వు లఁటికే
అగ్గలమై నీతో మాఁట లాతఁ డాడఁగా
వొగ్గి విడె మందుకోవే వొద్దఁ గూచుండఁగదవె
యెగ్గేల చిన్నదానవా యెన్నాళ్లైనాను ॥ సేయ ॥

శిరసు వంచ నేఁటికే చెక్కిట చెయి వెట్టనేలే
బెరసి యాతఁడు సతిఁ బనఁగఁగాను
పరిమళాలు పూయవే పాదము లొత్తఁగదవే
పెరిగి పెద్దవై ఇంకాఁ బిన్నదానవా ॥ సేయ ॥

పయ్యదకొంగుమాటేలే పరాకు సేసుకోనేలే
నెయ్యముతో నాతఁడు నిన్నుఁ జూడఁగా
చెయ్యారాఁ గూడిన శ్రీవేంకటేశుఁడేకదే
వుయ్యాల పిన్నదానవా వొదగె నీ చన్నులు ॥ సేయ ॥ 261

## కన్నడగౌళ

మన్నించుఁగాక వట్టి మరఁగులేలే
తిన్నని నా గుణాలివి తెలుసుకొమ్మనవే ॥ పల్లవి ॥

మొగము చూచినప్పుడే మునుకొనె నాసలు
నగినప్పుడే వెలసె ననుపులెల్లా
తగిలి మాఁటాడితేనే తలపోఁత లీడేరె
మగఁడాయ నాకుఁ దాను మనసేమి చూచీనే ॥ మన్నించు ॥

సరుసఁ గూచున్నప్పుడే జంటాయఁ జుట్టరికము
తెరదీసినప్పుడే పొందిక లమరె
సరసమాడినప్పుడే సతమాయ భోగములు
మరుతంత్రములతోడ మనసేమి చూచీనే ॥ మన్నించు ॥

మేనులు సోఁకినప్పుడే మెరసె సంతోసము
తేనె మోవిచ్చినప్పుడే తేరెఁ బనులు
తానె వచ్చి నన్నుఁ గూడె తగ శ్రీవేంకటేశుఁడు
మానాపతినైన నా మనసేమి చూచీనే ॥ మన్నించు॥ 262

## మంగళకౌశిక

ఎంత వేగిరకాఁడే యీతఁడు తాను
అంత బత్తి గలిగితే నప్పుడే రావలదా ॥ పల్లవి ॥

దివ్వెలెత్తుఁ బొద్దుకాడ దిక్కులనుండి వచ్చీ
నవ్వు లేమి నవ్వీనే నాతోఁడాను
పవ్వళించి యింటిలోన పనిలేదు పాటలేదు
పువ్వుల నేల వేసీనే పూఁచి పూఁచి నన్నును ॥ ఎంత ॥

వరవాతా లేచివచ్చి వద్దని నే మొక్కఁగానె
సరసము లే మాడీనే సారె నీతోను
యిరవై తెరవేసుక యిందుకే కాచుకవుండి
కెరలించి యేల గిలిగించీనే నన్నును ॥ ఎంత ॥

పట్టపగలె వచ్చి పాదా లొత్తమంటాను
చుట్టరిక మెంతోసేసి చూపీ నితఁడు
యిట్టె శ్రీవేంకటేశుఁ డితఁడె తా నన్ను నేలె
గుట్టుతోడ మరి యాల కొసరీని నన్నును ॥ ఎంత ॥ 263

## తెలుఁగుఁగాంబోది

మదనునిబలాలివి మర్మములు గరఁచీని
యెదుటనుండి చెలికి యిచ్చకమే సేయరే ॥ పల్లవి ॥

[1]చ (చె?)లరేఁగి పతిఁబాసి చింతతో నున్న సతికి
చిలుకలఁ జూపకురే చెలులాల
[2]వలపు లతనికెక్కి వసివాడివుండేవేళ
కలువపూవులు దెచ్చి కానుక లియ్యకురే ॥ మద ॥

విరహతాపముచేత విసుగుతా నుండఁగాను
సురటి విసరి గాలి సోఁకించకురే
మరిగి రతికిఁ బలుమరు నేఁకరేటి దాని
అరిది కోవిల వనాలందు నాడించకురే ॥ మద ॥

వుమ్మగిలి జవ్వనాన నుసురసురై వున్నది
తుమ్మెదలున్న పొదలు దూరించకురే
యిమ్ములఁ శ్రీవేంకటేశుఁ డిట్టె వచ్చి యీకెఁ గూడె
నెమ్మది సోబానఁ బాడి నేరుపులు చెప్పరే ॥ మద ॥ 264

**రేకు 1955 బౌళి**

ఇంకా నేల లోఁగేవు యెరిఁగిన పనులకు
సంకెలెల్లాఁ దేరెను చక్కనాయఁ బనులు ॥ పల్లవి ॥

పెదవి తేనెలుగారఁ బ్రియములు చెప్పీ నాపె
అదివో నీ యెదుటనె యప్పటనుండి
కొదదీర నిలుచుండి కొలువులు సేసీ నీకు
పదరక మరి యెంత పనికోకాని ॥ ఇంకా ॥

కమ్మటి నీ రాకలకే కాచుకుండె నిందాఁకా
వుమ్మడి నీ వలపులు వొడిఁబెట్టుక
చిమ్ముచు నవ్వులు నవ్వి చిత్తమెల్లాఁ గరఁగించె
ఇమ్ముల నీ తలపోఁత లెట్టున్నవోకాని ॥ ఇంకా ॥

1. [illegible] ము. 2. ఈ పాదము సరిగా నన్వయించుట లేదు.

కలయికలకు లాచి కనుసన్నలెల్లాఁ జేసి
చెలరేఁగి చెక్కులెల్లాఁ జెమరించఁగా
అలరి నన్నేలితివి యాకె యలమేలుమంగ
కలిగె శ్రీవేంకటేశ కలిమెంతోకాని ॥ ఇంకా ॥ 265

## వరాళి

ఎఱఁగ మిన్నాళ్లను యింతటి దానవౌత
గుఱుతు లన్నియు నేఁడుకూడ పెట్టుకొంటివే ॥ పల్లవి ॥

మొలకనవ్వుల ముసగసలు
కలికితనంబుల కనుచూపులు
తలిరు మోవిసన్నల తరితీపులు
నెలతరో నీ వెందు నేరుచుకొంటివే ॥ ఎఱఁ ॥

శిరసు వంపుల చిరుసిగ్గులు
సరసపుఁ జెనకుల చయ్యాటాలు
తురుము సింగారాల మురిపెములు
తరుణిరో యివి నీ వెత్తలఁ దెచ్చుకొంటివే ॥ ఎఱఁ ॥

కదలుఁ జన్నుల గరగరికలు
వుదుట మాఁటలోని వొడఁబాటులు
యిదె శ్రీవేంకటేశుతో యెనయికలు
మదిరాక్షిరో యెట్టు మన్నించుకొంటివే ॥ ఎఱఁ ॥ 266

## మాళవిగౌళ

ఆకెకూ నీకూఁ దెలుసు నన్నివనులును నేఁడు
యాకడ నింకా సుద్దు లేమడిగే వికను ॥ పల్లవి ॥

మంతనాన నీవాడిన మాఁటలు దలఁచుకొని
యింతి చిరునవ్వు నవ్వె నేఁటికోకాని
బంతి నీవూఁ దానూఁ బండే పానుపువంక చూచి
చింతతోడ మేను నిండా చెమటలే కురిసె ॥ ఆకె ॥

పలుమారు నీమీఁది పదములు వాడి పాడి
యెలమి సిగ్గున లోఁగె నేఁటికోకాని
బలువైన నీ గుణాలు పలకపై వా(వ్రా?)సుకొని
వలపులపులకలు వాములుగా వేసెను ॥ ఆకె ॥

మిక్కుటపు నీ సొమ్ములు మెడనిండాఁ బెట్టుకొని
యిక్కువతో మొక్కు మొక్కె నేఁటికోకాని
ఇక్కడ శ్రీవెంకటేశ యీకె యలమేలుమంగ
యెక్కె నీ వురముమీఁద నిన్నిటాను వెలసె ॥ ఆకె ॥ 267

## లలిత

ఇద్దరికి నిచ్చలివి యిరుమేలాఁ జనవులు
వొద్దికై రతికి నన్నే వొడఁబరచేవు ॥ పల్లవి ॥

సన్నలనే మోవితేనె చవులెల్లాఁ జూపె నాపె
చన్నులు దాఁకించి సరసములాడెను
యిన్నేసి నేరిచినది యింకా నేమి సేసునో
నన్నుఁ జూచి యీడ వచ్చి నవ్వులు నవ్వేవు ॥ ఇద్ద ॥

వాడికమాఁటలాడి వలపులు చల్లె నాపె
వేడుకతోఁ దా మరల వేసె నప్పటి
యీడనుండి యింత సేసె యేమి దలఁచుకున్నదో
వోడక నాతో పొందుల నోలలాడేవు ॥ ఇద్ద ॥

కందువకు వచ్చి నిన్ను కాఁగిలించుకొని నాపె
సందడిఁ బాదము దొక్కి జంకించెను
అందపు శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
యిందు నిన్నేమనునో న న్ననసి మన్నించేవు ॥ ఇద్ద ॥ 268

## ముఖారి

తనగురుతులు మేనఁ దారుకాణలై యుండఁగా
పెనఁగుచు నవ్వులేల పెంచీనే తాను ॥ పల్లవి ॥

మాట లెన్నైనాఁ గలవు మళ్లి మళ్లి యాడితేను
పేటలుగా నాన లేల పెట్టీనే తాను
నీటుల తన సుద్దులు నిన్ననే వింటి నేను
పాటించి న న్నేల వొడఁబరచీనే తాను ॥ తన ॥

తక్కులెన్నైనా గలవు తవ్వి తవ్వి పోసితేను
మిక్కిలి యంతేశి నమ్మించీనే తాను
గక్కున తనచేఁతలు కన్నులారాఁ గంటి నేను
కక్కసించి మనసేల కరఁచీనే తాను ॥ తన ॥

పొందులెన్నైనాఁ గలవు పొంచి పొంచి కూడేనంటే
ముందు ముందుగా నన్నేల ముట్టీనే తాను
చెంద నలమేల్మంగను శ్రీవేంకటేశుఁడు తాను
అందుకొంటి విడె మేల యడిగీనే తాను ॥ తన ॥ 269

## భైరవి

వేవేలు సతులుగలచేడుకకాఁడవు నీవు
దేవులఁ గనక నీకుఁ దెలిపితిఁ జుమ్మీ ॥ పల్లవి ॥

మంచిమాఁటలాడితేనే మగువలు చొక్కుదురు
పంచనలు సేతురు వలతురు
యించుకంత యెడసినా యెలయించి యెఁ(నేఁ?) సినాను
కంచుఁబదనులవారు కామినులు సుమ్మీ ॥ వేవే ॥

చెక్కు నొక్కి వేఁడుకొంటే చెలులు గరఁగుదురు
మక్కువఁ గాఁగిలిత్తురు మరుగుదురు
కక్కసించి యేలినాను కపటాలు నెరపినా
వుక్కుబదనులవారు వువిదలు సుమ్మీ ॥ వేవే ॥

తేజముతో నేలితేనే తెరవలు మొక్కుదురు
సాజాన సేవసేతురు సమ్మతింతురు
యీజాడ శ్రీవేంకటేశ యేలి తలమేల్మంగను
గాజుఁబదనులవారు కాంతులు సుమ్మీ ॥ వేవే ॥ 270

**రేకు 1956 లలిత**

ఇందులకే వెరగయ్యీ నిద్దరిఁ జూచి నాకు
కందువల మనసెట్టు గరఁగేవోకాని ॥ పల్లవి ॥

వెలఁది గుట్టుమానిసి వేడుకకాఁడవు నీవు
బలిమిసేసి కొఁ(కొం?) గేల పట్టేవోకాని
పలుకుఁ దేనెల దీకె, పంతపువాఁడవు నీవు
చెలరేఁగి పొందు లెట్టు సేసేవోకాని ॥ ఇందు ॥

కడుసిగ్గరిది యీకె గయ్యాళివాఁడవు నీవు
అదరి సరస మెట్లా నాడేవోకాని
కడఁగి కోమలి యీకె, గడుసువాఁడవు నీవు
జడియ నీ రతు లెట్టు జరపేవోకాని ॥ ఇందు ॥

యిచ్చకపుసతి యీకె యేలినవాఁడవు నీవు
నిచ్చాఁ గూడి యెట్లా మన్నించ్చేవోకాని
యిచ్చట నలమేల్మంగ యీకె శ్రీవేంకటేశుఁడ
మెచ్చి పెండ్లాడితి వెంత మెరయించేవోకాని ॥ ఇందు ॥ 271

## సామంతం

మే లెరిఁగి మెలఁగితే మెత్తురు నిన్నింతులెల్లా
పోలించి పోలించి వలపులు నించుకోవయ్యా ॥ పల్లవి ॥

పిలుచుకవచ్చి నీకుఁ బీఁటవెట్టి విడెమిచ్చి
చెలి చుట్టరికాలెల్లాఁ జేసె నీకును
మలయుచు యీ మేలు మరవక యేపొద్దూ
తలఁచుక తలఁచుక తమిరేఁచుకోవయ్యా ॥ మేలె ॥

మంతనానఁ బాదాలొత్తి మాఁటలాడి విందువెట్టి
కాంత వుపచారాలెల్లాఁ గావించె నీకు
దొంతిఁ బెట్టి యీ బత్తి తోడఁదోడ దాఁచుకొని
సంతోసించి సంతోసించి చవిసేసుకోవయ్యా ॥ మేలె ॥

కదిసి చన్నుల నొత్తి కాఁగిలించి చొక్కించి
సుదతి ఇచ్చకాలెల్లాఁ జూపె నీకును
ఇదివో శ్రీవేంకటేశ యేలితివి నన్ను నాకెఁ
బొదిగి పాదిగి కొంత పోది సేసుకోవయ్యా ॥ మేలె ॥ 272

## బౌళి

మారుకుమారు నీవూ మగువనుఁ జేయరాదా
దూరలేల కట్టేవు తొయ్యలిపై నీవు ॥ పల్లవి ॥

తప్పక చూచెనంటా తమకము రేఁచెనంటా
వుప్పతించి యాపె నేల వొడివట్టేవు
కప్పురాన వేసెనంటా కడు వలపించెనంటా
తప్పులేల మోపేవు తరుణిపై నీవు ॥ మారు ॥

చన్నులు దాఁకించెనంటా చవులు మురిపెనంటా
మిన్నక తిట్టుతా నేల మేల మాడేవు
సన్నలు సేసెనంటా చాలా నెలయించెనంటా
యెన్ని గొడిమెలు గట్టే వింతిమీఁద నీవు ॥ మారు ॥

మాఁటలఁ గొసరెనంటా మనసు గరఁచెనంటా
పాటించి యెంతేసి నెపాలు వేసేవు
గాఁటపు శ్రీవేంకటేశ కాఁగిట మెప్పించెనంటా
యేఁటలేల వేసేవు యీ సతిపై నీవు ॥ మారు ॥ 273

## ఆహిరివాట

చేతులెత్తి మొక్కే నిదె చెలియరో విభునికి
నీతితోడ నన్నిట్టె మన్నించి యేలు మనవే ॥ పల్లవి ॥

ఆసపడ్డదాని నింత అలయించకు మనవే
సేసవెట్టి జాగునేల సేసె ననవే
రాసికెక్కె నావలపు రవ్వసేయకు మనవే
మూసిన ముత్తెమువంటి ముద్దురాలననవే ॥ చేతు ॥

సిగ్గుతోడ నున్న దానిఁ జెనకకు మనవే
యెగ్గులేనిచోట నేఁప నేఁటి కనవే
వొగ్గి విడె మియ్యఁగాను వొడివట్టకు మనవే
కగ్గులేని తన వూడిగపుదాన ననవే ॥ చేతు ॥

ననిచినదానితోడ నాలితనమే లనవే
తనకు నాకును పొందుతగు ననవే
యెనసె శ్రీవేంకటేశుఁ డియ్యకొంటి ననవే
మనసు నమ్మిన మేనమఱఁదల ననవే ॥ చేతు ॥ 274

## మాళవిగౌళ

ఇటువంటి సతి పొందు లెంతని పొగడవచ్చు
తటుకన నీకు నబ్బెఁ దగు మీ యిద్దరికి ॥ పల్లవి ॥

చిందేటి పెదవి తేనె చిప్పిలఁగాఁ జెలి నీతో
మందలించి నోరు నిండా మాఁటలాడెను
చందమామవంటి మోము చక్క నెత్తి వేడుకతో
కందువ నీ ముందరను కలకల నవ్వెను ॥ ఇటు ॥

జారిన పయ్యదలోని చనుఁగవ గానరాఁగా
గారవముతోడ నీకుఁ గాను కిచ్చెను
బారెఁడేసి నెరిఁగొప్పు పాదాలపై సోఁకఁగాను
కూరిమితో నీకు నిట్టె గురుతుగా మొక్కెను. ॥ ఇటు ॥

బంగారువంటి చేతులఁ బట్టి నీ చెక్కులు నొక్కి
చెంగలించి విడెము నీ చేతి కిచ్చెను
అంగపుఁజెమటతో ని న్నలమి శ్రీవేంకటేశ
వుంగిటిగా రతుల ని న్నోలలాడఁజేసెను ॥ ఇటు ॥ 275

## కాంబోది

ఈ కాంత నేలిన యీతఁ డెంత భాగ్యవంతుఁడే
చేకొన్న సంతోసాన చెలరేఁగీ వీఁడివో ॥ పల్లవి ॥

కలికి కన్నుల చూపు కమ్మమోవి తరితీపు
చెలియ చక్కని రూపు చెప్పఁ గొత్తలు
మొలక చన్నుల వొప్పు ముంగురుల పెనుఁగొప్పు
చెలపచెమటచొప్పు చెలులాల చూడరే ॥ ఈకాంత ॥

మొగములోపలితీరు ముత్తెపు కుచ్చులపేరు
సొగసుఁ బయ్యెద జారు చొక్కమాయనే
నగవు లోపలి సిగ్గు నవకపు మేని నిగ్గు
మగువ మొక్కుల తగ్గు మంచిదే కదరే ॥ ఈకాంత ॥

కడుసింగారాలసొంపు కందువమాఁటల యింపు
నడపులలోని జంపు నయమేకదే
యెడయక శ్రీవేంకటేశుఁ డిట్టె యీకెఁ గూడె
విడువని రతిపెంపు వేడుకలై మించెనే ॥ ఈకాంత ॥ 276

## రేకు 1957 రామక్రియ

ఎంత కెంత నీపగటు యేమి చెప్పేది
మంతుకెక్కి నావలెనే మన్ననదానవా పల్లవి

సారెకు నా మగనితో బాణతనాలాడేవు
కూరిములు చల్లుకొంటాఁ గొసరేవు
చేరువనే కూచుండి సేవలుసేయవచ్చేవు
పేరుకొని నావలె పెండ్లికూఁతురవా ॥ ఎంత ॥

తప్పక చూచి యీతనిఁ దమి రేఁచవచ్చేవు
యెప్పుడూ నెదుటనుండి యేఁకారేవు
దప్పిదేర మోవి చూపి తలఁపించేవు పొందులు
చెప్పవే నావలె నీవూ సేసలు వెట్టితివా ॥ ఎంత ॥

గుట్టున శ్రీవేంకటేశుఁ గోరి చాగిలి మొక్కేవు
వొట్టుక చనుమొనల నూఁది పట్టేవు
యిట్టె న స్నేలినాఁడు యీతఁడు నీ కేమవునే
జట్టిగా నావలె నీవూఁ బట్టము దేవులవా ॥ ఎంత ॥ 277

## పళవంజరి

చూతముగా నీవు సేసే చుట్టరికములెల్లాను
నాతి నెన్నిచందముల నమ్మించేవోకాని ॥ పల్లవి ॥

నిక్కి చూచితి వింతిని నెయ్యముతో నవ్వితివి
నెక్కొని యేరీతుల మన్నించేవోకాని
మక్కువతోఁ జేకొంటివి మాఁటలెల్లా నాడితివి
తక్కక యెట్లా దయదలఁచేవోకాని ॥ చూత ॥

సంగడిఁ గూచుండితివి చనవులూ నిచ్చితివి
యెం(యిం?)గిత మెరిఁగి యెప్పు డేలేవోకాని
అంగవించి మెచ్చితివి యాసలఁ దేలించితివి
చెంగట సంతోస మెంత సేసేవోకాని ॥ చూత ॥

గరిమఁ బెండ్లాడితివి కాఁపురాలూఁ జేసితివి
నిరతి నెచ్చటఁ గరుణించేవోకాని
యిరవై శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి
నెరవుగా రతులెన్ని నేరిపేవోకాని ॥ చూడ ॥ 278

## పాడి

ఇదివో నా మోహము నీ కెంతని చెప్పుదు నేను
కదిసి నీ మోము చూచి కన్నుమూయఁజాలను ॥ పల్లవి ॥

ఒత్తి నిన్ను దూరనోప ఒట్టులు వెట్టఁగనోప
హత్తి నీతో నిచ్చకము లాడేఁగాని
కొత్తగాఁ గొసరనోప గోరికొన గీరనోప
చిత్తమురా సేవలిట్టె సేసేఁగాని ॥ ఇది ॥

పెనఁగి గుంపించనోప బీరము చూపఁగనోప
ననుపు సేసుక నీతో నవ్వేఁగాని
పొనుఁగుచు దాఁగనోప బొమ్మల జంకించనోప
వినయాన మొక్కి నిన్ను వేఁడుకొనేఁగాని ॥ ఇది ॥

సిగ్గుతో నలుగనోప శిరసు వంచఁగనోప
వొగ్గి మోవి తేనెకు నోరూరేఁగాని
వెగ్గళముగా నన్ను శ్రీవేంకటేశ యేలితివి
యెగ్గు లెంచనోప నిన్ను నిట్టె మెచ్చేఁగాని ॥ ఇది ॥ 279

## ఆహిరి

ఇంతి చందములు నీకు నిన్నీ విన్నవించితిమి
మంతు కెక్కఁజేసి కూడి మన్నించవయ్యా ॥ పల్లవి ॥

మొలకనవ్వులనే ముగ్గులు వెట్టుకున్నది
వెలఁది యింటికి నీవు విచ్చేయవయ్యా
తళుకుఁ జెక్కులనే యద్దములు గట్టుకున్నది
సొలసి యీపెవంక చూడవయ్యా ॥ ఇంతి ॥

అట్టె మోవితేనెలవిం దాఇతము సేసినది
చుట్టమవై వచ్చి చవి చూడవయ్యా
గట్టి చన్నుల వలపు కప్పము గట్టుకున్నది
దట్టపు వేడుక నవధరించవయ్యా ॥ ఇంతి ॥

వింతగాఁ గాఁగిలి నీకు విడిది గావించినది
సంతోసాన రతులెల్లా సలుపవయ్యా
ఇంతట శ్రీవేంకటేశ యిందు వచ్చి యేలితివి
చెంత నీపె సింగారాలు చిత్తగించవయ్యా ॥ ఇంతి ॥ 280

## గౌళ

నిండు వలపులతోడ నిన్ను నీ వెఱఁగవు
పండవే యాతని పక్క బాగాలిచ్చేవుగాని ॥ పల్లవి ॥

చినుకుఁజిత్తడియైన చెమట దుడుచుకోవే
వెనక నాతనితో నవ్వేవుగాని
కొనలు వెల్లి వీడిన కొప్పు చక్కఁబెట్టుకోవే
మునుకొని తలవంచి మొక్కుదువుగాని ॥ నిండు ॥

బలు చన్నులపై జారే పయ్యద గప్పుకొనవే
పొలుపి యాతని దిక్కు చూతువుగాని
పెలుచుఁ గెమ్మోవిమీఁదిబేంట్లు మూసుకోవే
అలరి యాతనితో మాఁటాడుదువుగాని ॥ నిండు ॥

నెట్టన రెప్పల తుద నిద్దుర లడంచుకోవే
గుట్టున నీతని మరిఁ గూడేవుగాని
యిట్టె శ్రీవేంకటేశుఁ డేలినాఁడు నన్ను నేఁడు
చుట్టరికము చెప్పవే చొక్కింతువుగాని ॥ నిండు ॥ 281

## వాదరామక్రియ

గురి గడవఁగరాదు కొమ్మ నీ రతులకును
విరివైన రతులకు వేడుక లివి గురి ॥ పల్లవి ॥

మచ్చికలకును( బచ్చి మాటలే గురి
యిచ్చికపు మాటలకు యింపులు గురి
నచ్చుకొట్టే యింపులకు నవ్వులు గురి
అచ్చపు టింపులకును ఆసలు గురి ॥ గురి ॥

కూడే యాసలకు( జెనకు లివి గురి
జోడైన చెనకులకు చూపులు గురి
వాడిక చూపులకు వాసులు గురి
మేడెపు వాసులకును మెచ్చులు గురి ॥ గురి ॥

మునుకొన్న మెచ్చులకు మోవులు గురి
పెనగొన్న మోవులకు ప్రియాలు గురి
నను( బ్రియాలకు వినయాలు గురి
వినయపు సతికి శ్రీవేంకటేశుడే గురి ॥ గురి ॥ 282

## రేకు 1958 దేసాళం

తా నెంత నీ వెంత తగిలి తగిలి నిన్ను( -
బూని వలపించి యీకె పొదలె( గదవయ్యా ॥ పల్లవి ॥

చిడుముడి( వూడిగాలు సేసిసేసి యాపె నీకు
కడు( జనవరి యాయ(గదవయ్యా
నడుమ నూరక నీతో నవ్వి నవ్వి రాజసాన
వెడ(గుగర్వాన విఱ(ట్టి?) వీ(గీ( గదవయ్యా ॥ తానెంత ॥

మక్కళించి యాపె నీతో మాట లాడి యాడి నీకు
గక్కనను( జుట్టమాయ( గదవయ్యా
చిక్కించుక కొలువులు సేసిసేసి నిలుచుండి
వెక్కసపు( బంతుములే వెలసె( గదవయ్యా ॥ తానెంత ॥

వాపికతోఁ జన్నుల నిన్నొత్తి యొత్తి యాపె నీకుఁ
గాఁపురాలు సేయ నేర్చెఁ గదవయ్యా
యేపున శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
నీ పొందులఁ దా నింటిలో నిలిచెఁ గదవయ్యా ॥తానెంత ॥ 283

## పాడి

సారె సారె నితనితో సరసము లాడేవు
యేరుపరచి నీ వల పింకా నెంత గలదే ॥ పల్లవి ॥

వేడుకతో వేగినంతా విచ్చనవిడి నీమాఁట -
లాడితి వితనికి నేమౌదువే నీవు
గోడ నిక్కి చూచి నిన్నఁ గొసరితివి సన్నల
నీడు జోడై వుందానవు యెన్నటి చుట్టమవే ॥ సారె ॥

మచ్చికతో వీడె మిచ్చి మంచముపై నుందానవు
చొచ్చి యెన్నాళ్లనుండి కాచుక వుంటివే
పచ్చిదేర మోము చూపి పకపక నవ్వేవు
ముచ్చట నిందు కెన్ని నోములు నోమితివే ॥ సారె ॥

కోరి శ్రీవేంకశ్వరుఁ గూడిన నీ భూమిమీఁద
పోరచిగా నెటువలెఁ బొడమితివే
యీరీతి నిన్ను మన్నించి యీతఁ డిట్టె యేలినాఁడు
గారాబాన నీ వెందుండి కలిగితివే ॥ సారె ॥ 284

## శ్రీరాగం

ఏమి చెప్పినాఁ జేసే యెగ్గు వెంచ నిఁక నిన్ను
గోమున నీవు గోరిన కోరిక లీడేరెను ॥ పల్లవి ॥

వింటిఁగా నీ సుద్దులెల్లా వీనుల పండువగాను
పొంటులు సోదించి నిన్ను పొలయనేల
కంటిఁగా నీ చేఁతలు కన్నుల పండువగాను
అంటి ముట్టి నిన్ను బాస లడుగనేలా ॥ ఏమి ॥

నమ్మితిఁగా నీ గుణాలు నవ్వుల పండువగాను
సమ్మతించ కిఁక నిన్ను జరయనేల
దొమ్మిఁ గాలు దొక్కితిఁగా దోమటి పండుగగ్గాను
చిమ్ముచుఁ గొనగోళ్లఁ జెనకనేలా ॥ ఏమి ॥

సేసుకొంటిఁగా నిన్నుఁ జేరి నిచ్చ పండుగగా
వేసాలకు నింకాను వేఁడుకోనేల
వాసితో న న్నేలితివి వచ్చి శ్రీవేంకటేశుఁడ
ఆసల నిన్ని పండుగ లాడుకొనేలా ॥ ఏమి ॥ 285

## సామంతం

ఇంతికిని నీకుఁ దగు నిటువంటి నేరుపులు
పొంతఁ గలకాలమును భోగించరయ్యా ॥ పల్లవి ॥

నిలిచి నవ్విన నవ్వు నివ్వెరగు నొందించు
పొలసి చూచిన చూపు చొక్కించును
పిలిచి యాడిన మాఁట ప్రియమెల్లాఁ బుట్టించు
తలఁచి మెచ్చిన మెచ్చు తమిరేఁచును ॥ ఇంతి ॥

చెనకి సేసిన చెలిమి చిత్తంబు గరఁగించు
వినయంబు గలపొందు వెలయించును
పెనఁగి పెట్టిన విందు బెరసి చవి పుట్టించు
ననుపైన సరసంబు నానాఁటఁ బొదలు ॥ ఇంతి ॥

తగిలి వలచిన వలపు తరితీపు వుట్టించు
మొగమోట నెయ్యంబు మొక్కించును
మిగుల శ్రీవేంకటేశ మెలుఁత నిటు గూడితివి
చిగురుఁ గోరికలు మిముఁ జెంగలింపించు ॥ ఇంతి ॥ 286

## సౌరాష్ట్రం

ఎఱఁగ మిన్నాళ్ల నీ కిటువంటివి
మెఱసి నీ వలపులు మితిమీరెనే ॥ పల్లవి ॥

చెక్కులపై పెఁ (పెం?) జెమట చెంపల జారుఁ దురుము
యెక్కడఁ గలిగెనే యింతి నీకు
ముక్కున నిట్టూరుపులు ముసి ముసి నవ్వులు
అక్కజమైన వింతలు అన్నియునుఁగంటిమే ॥ ఎఱఁగ ॥

కందువ మోవి కెంపులు కన్నుల కావి వన్నెలు
యెందుండి వచ్చెనే నీకు యింతలోననే
సందడి మోము కళలు చన్నులపై గురుతులు
అందమైన సొబగులు నమరి వుందానవే ॥ ఎఱఁగ ॥

తనువుపై పులకలు తమకపు వసివాడు
కనుపట్టె నీకు నేఁడు కారణమేమే
యెనసె శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్ను నాపె
మనసొక్కటాయ నీమచ్చిక లీడేరెనే ॥ ఎఱఁగ ॥ 287

## నాగగాంధారి

విన్నవించితిమి నీకు వెలఁది భావములెల్లా
మన్నించి నీ దేవులకు మచ్చిక చూపవయా ॥ పల్లవి ॥

చుట్టరికమైనవారు సోఁక నెంత యాడినాను
గుట్టుతో నుండుటగాని గుంపించరాదు
పొట్టఁబొరుగులవారు పూఁచి యెంత చెనకినా
అట్టె నవ్వుటగాని యాఁ గాదనరాదు ॥ విన్న ॥

నమ్మికైనవారు యెంత నట్టుకొట్టి సొలసినా
సమ్మతించుటేకాని జరయరాదు
యిమ్ములఁ జెలులైనవా రెగ్గు లెన్ని యెంచినాను
కమ్మటిఁ జేకొంటగాని కాఁతాళించరాదు ॥ విన్న ॥

బత్తిగలవారు యెంత పంతములు చూపినాను
హత్తి చొక్కుటగాని మారాడఁగరాదు
యిత్తల శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి
కొత్తగా మెచ్చుట్లగాని కొసరరాదు ॥ విన్న ॥ 288

**రేకు 1959** **రామక్రియ**

సతి నీకు మేలుది జాణవు నీవు
మతిలోన మరవక మన్నించవయ్యా ॥ సతి ॥

పలుకులనే యింతి పచ్చనిపందిలి వెట్టె
అలరి కూచుండి పెండ్లాడవయ్యా
సెలవి నవ్వులనే సేసపా లివె చల్లె
సొలవక యీకె మోము చూడవయ్యా ॥ సతి ॥

తిన్నని సిగ్గులనే తెరమరఁగులు వెట్టె
కన్నెకుఁ గంకణ మిట్టె కట్టవయ్యా
సన్నలా చాయలనె సరుస నీ కాలు దొక్కె
న్నులఁ బూజ గుండలు సారెఁ బూజించవయ్యా ॥ సతి ॥

కూరిమిసరసముల కొంగులముళ్లు వేసి
గారవించి మోవి పొత్తు గలయువయ్యా
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి వనితను
చేరి నిచ్చా సోబనాలఁ జెలఁగవయ్యా ॥ సతి ॥ 289

## ఆహిరి

చెప్పఁ గొత్తలాయఁగదె చెలియ నీ సుద్దులెల్లా
ముప్పిరిగొన్న వలపు మూల దాఁచ నేఁటికి ॥ పల్లవి ॥

చనుఁగొండల మీఁదట చంద్రోదయములాయ
ఘనముగా వెన్నెలలే కాయవుగాని
పెనగొన్న చిగురుపై పెనువాన లుప్పతిలె
యెనసియు వాడుదేరదేమోకాని ॥ చెప్పఁ ॥

అంచెలఁ జీఁకటితీగె లటునిటు నిండుకొనె
కొంచించక యట్టె పొద్దు గుంకదుగావి
పొంచి కెందామరలు గొబ్బున వికసించెను
ముంచుకొని తుమ్మెదలే మూఁగవుగాని ॥ చెప్పఁ ॥

గక్కన నద్దములోనఁ గళలు మెరువఁ జొచ్చె
వుక్కుమీరి మేఘము లెందున్నవోకాని
ఇక్కడ శ్రీవేంకటేశుఁ డిఁ (డిం?) తలోనె నిన్ను నేలె
పక్కన మరుఁడే నీకుఁ బంత్తమిచ్చెఁగాని ॥ చెప్పఁ ॥ 290

## వాదరామక్రియ

చూడరమ్మ చెలులాల సుదతి చెలువములు
వోడక వొండొంటితోడ నొనగూడి యున్నవి ॥ పల్లవి ॥

పొలుపైన మోము శశిఁ బోలించిన యందుకు
వెలఁది సెలవులను వెన్నెలగాసె
మెలుపునఁ బెనుఁ గొప్పు మేఘముఁ బోలినందుకు
చెలఁగి చెమటవాన చెక్కులఁ గురిసెను ॥ చూడ ॥

పడఁతి కెమ్మోవి దొండపండుఁ బోలించినందుకు
కడఁగి పలుకుఁ జిలుకలు మూఁగెను
జడిగొని యాపెనాభి సరసిఁ బోలినందుకు
అడరి చనుజక్కవ లండనె కలిగెను ॥ చూడ ॥

తరుణి పసిఁడిబొమ్మఁ దగఁ బోలించినందుకు
నిరతిఁ బదారువన్నియల మించె
సిరుల శ్రీవేంకటేశుఁ జెందఁ బోలించినందుకు
మరుని కొమారికపు మన్ననలు మించెను ॥ చూడ ॥ 291

## వరాళి

మాపుదాఁకా జోలి యేల మానఁగదవే
చేపట్టి యాతఁడు నా చిత్తములోఁ బాయఁడు ॥ పల్లవి ॥

అతనిపై తమకము ఆపఁగలేనే
యితవుగా నీ బుద్ధులు యేమి చెప్పేవే
మితిమీరి యతనికి మేలుదాననే
చతురత నీ మాఁటలు చవులుగావే ॥ మాపు ॥

మలసి యాతని పొందు మానఁగరాదే
వెలయఁగ నీవెంత వేఁడుకొనేవే
వలపుగాదని తోయవచ్చునటవే
పలుమారు నాతో నేల పట్టి పెనఁగేవే ॥ మాపు ॥

మన సాతనిపైఁ బెట్టి మరిగితినే
నను గిలిగించి యేమి నవ్వించేవే
యెనసె శ్రీవేంకటేశుఁ డిదివో నన్ను
మొనసి యెన్నేసి నీవు మొక్కులు మొక్కేవే ॥ మాపు ॥ 292

## శుద్ధవసంతం

ఏమి చెప్పుకొనేవే యింతులతో నీ యెమ్మెలు
వేమరు నీ గుట్టు వెల్లవిరిసేయ నేఁటికే ॥ పల్లవి ॥

కలికితనాల నీవు కాఁపురాలు సేయఁగాను
వలవ కెట్టుండునే రవ్వగా మగఁడు
చలిమి బలిమితోడ జాణతనా లాడఁగాను
సులబాన నీ కతఁడు చొక్కవలెఁగదవే ॥ ఏమి ॥

యెన్నికతో నేపొద్దూ యెదుటఁ గాచుకుండఁగాను
మన్నించ కెట్టుండునే మరి యాతఁడు
సన్నలనే మోవి తేనె చవులెల్లాఁ జూపఁగాను
మిన్నక నీ చేఁతలకు మెచ్చవలెఁగదవే ॥ ఏమి ॥

కమ్మి సింగారించుకొని కాఁగిటఁ బెనఁగఁగాను
సమ్మతించ కెట్టుండునే సరుగదాను
యిమ్ముల శ్రీవేంకటేశుఁ డితఁ డిట్టె నన్ను నేలె
నమ్మించి నీ కతలకు నవ్వవలెఁగదవే ॥ ఏమి ॥ 293

## శంకరాభరణం

వాసితో నుండఁగా నీవే వచ్చేవుగాక
ఆసతో సిగ్గువిడిచి అలయనేలా ॥ పల్లవి ॥

నిండు వావిసేసుకొని నీతో నాపె నవ్వఁగాను
అండనున్నవారు చూచి [1]యాఁకారనేల
కొండలు వంటి చన్నులఁ గోరి యాపె నిన్నొత్తఁగా
బండు బండై యట్టె తప్పక చూడనేలా ॥ వాసి ॥

మచ్చికతో నీవూ నాపె మాఁటలాడుకొనఁగాను
విచ్చనవిడి నాలించి వినఁగనేలా
కచ్చుపెట్టి యప్పటిని కాఁగిలించుకుండఁగాను
కుచ్చితాన లోలోనే గుబ్బతిలనేలా ॥ వాసి ॥

ఆకె నీతములానకు నట్టె చే యొగ్గఁగాను
ఆకడి వారితో మిమ్ము నాడుకోనేలా
యీకడ శ్రీవేంకటేశ యింతలో నన్నేలితివి
పైకొని నీ చేఁతలిఁకఁ బచారించనేలా ॥ వాసి ॥ 294

**రేకు 1960** **భైరవి**

ఆఁటదాని నన్ను నేఁటి కారడిఁ బెట్టేఁ దాను
గాఁటముగ నెదురాడి కాదనేటి దాననా ॥ పల్లవి ॥

వేడుక గలిగితేను విడిదికి రానీవే
యేడనైనా నాతోను యేల నవ్వీని
వాడిక వలసితేను వద్దఁ గూచుండనీవే
వోడక వన్నెల యింత వొరసి చూచీని ॥ ఆఁట ॥

తనకు నే బాఁతైతే తగఁ బెండ్లాడనీవే
తనియక యెన్ని జాణతనా లాడీని
పని గలిగితే నాకు బాగాలు వెట్టనీవే
చెనకి మోవి నవ్వులు సేసి యేమి చూపీని ॥ ఆఁట ॥

1. ఎఁకారుటకు వ్యావహారికము.

కరుణ నాపైఁ గలిగితే కాఁగిలించుకోనీవే
విరుల వేసి నన్నెంత వేఁడుకొనీని
యిరవై శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నేలె
మరిగి వుండనీవే మనసెంత రేఁచీని ॥ ఆఁట ॥ 295

## సామంతం

ఇన్నిటాను ఘనుఁడైన యేలి కితఁడు
మన్నించి నీ చేఁతలకు మరిగె నంటాను ॥ పల్లవి ॥

సిగ్గరితనాల నీవు శిరసు వంచకువే
అగ్గమై యాతఁడు చన్నులంటె నంటాను
బగ్గడితనాల నంత పదరి పలుకకువే
వొగ్గి నీపైఁ దమకించి వొడివట్టె నంటాను ॥ ఇన్ని ॥

మొక్కలితనాల బొమ్మముడి వెట్టుకోకువే
చిక్కించుక నిన్ను గోరఁ జిమ్మె నంటాను
తక్కరితనాలఁ బంతములు నెరపకువే
మిక్కిలి యాతఁడు నీతో మేలమాడె నంటాను ॥ ఇన్ని ॥

కలికితనాల నంత కడుఁ బెనఁగకువే
చెలఁగి నీ మోవి గంటిసేసె నంటాను
పెలుచుఁదనాన యిఁక బిగియకువే నిన్నేలె
లలి శ్రీవేంకటేశుఁడు లాలించె నంటాను ॥ ఇన్ని ॥ 296

## కాంబోది

తప్పులెంచ మరియాల తలవంచ్చుకొననేల
చెప్పఁగల ప్రియములు చెప్పరమ్మా ॥ పల్లవి ॥

చింతలెల్లాఁ బెడఁబాసె సెలవుల నవ్వుదేరె
    యింతలోనే విభుఁడు నీ యింటికి వచ్చె
పంతము లీడేరె నిఁక బంగారు పీఁట వెట్టి
    వింతలేక యీతనికి విడె మియ్యవమ్మా ॥ తప్పు ॥

తనివిఁ బొఁ (బొం?) దె మనసు తలకూడెఁ గోరికలు
    చెనకి నీమగఁడు నీచేతికిఁ జిక్కె
పనులెల్లాఁ జక్కనాయ పరపుపైఁ గూచుండి
    వినయాన మోవి తేనె విందువెట్టవమ్మా ॥ తప్పు ॥

సేసిన చేఁతలు చెల్లె సిగ్గులు మోమున నిండె
    ఆస[illegible]టేశుఁ డదె నిన్నేలె
రా[illegible]పు రతులను మెప్పించి
    మోసలేక వేఁడుకొని మొక్కు మొక్కవమ్మా ॥ తప్పు ॥ 297

## గౌళ

వద్దనేమా నేము మాతో వర్ణించే వాకెను
    పెద్దరికమున నింత పెంచితివి చాలదా ॥ పల్లవి ॥

చక్కనిదంటా నాకె చందము లేమి చెప్పేవు
    గక్కన నింపైతే మెడఁగట్టుకోరాదా
నెక్కొని యాకెఁ జూచి నివ్వెరగే లయ్యేవు
    అక్కరతోఁ బిలిచి మాఁటాడఁగరాదా ॥ వద్ద ॥

మాతో నాకె గుణాలేల మచ్చికఁ బచారించేవు
    చేతులెత్తి మెచ్చి సంతోసించఁగరాదా
రాతిటి యాకె రతులు రచ్చ నేల వేసేవు
    కాతరానఁ జిక్కి వుడుగర లియ్యరాదా ॥ వద్ద ॥

ఆకెనీవావులు యీడ నది యీల తడవేవు
చేకొని మీలో మీరే చెప్పుకోరాదా
యీకడ శ్రీవేంకటేశ యెనసితి నన్ను నేఁడు
జోకతో నేమి నవ్వేవు చోటియ్యరాదా ॥ వద్ద ॥ 298

## శంకరాభరణం

అందుకే వెరగయ్యీ నప్పటనుండి నాకు
సందడి నే పెండ్లాడీ సతులాల చూడరే ॥ పల్లవి ॥

తప్పక యేమి చూచీ నే తలవంచుకుండఁగాను
చెప్పీ నేఁటివో సుద్దులు చెవిలోనను
కప్పీఁ దనపచ్చడము కడు సిగ్గయ్యీ నాకు
ఇప్పు డితఁడు వలపు లెంత రేఁచీనే ॥ అందు ॥

చెక్కు లేల నొక్కీనే సెలవి నే నవ్వఁగాను
అక్కరతోఁ గూచుండీ నండకు వచ్చి
మక్కువతోఁ జన్నులంటీ మరి సోద్యమయ్యీ నాకు
యిక్కడ నితఁడు నన్ను నెంత రట్టుసేసీనే ॥ అందు ॥

చేతు లేమి చాఁచీనే చెంగట నే నుండఁగాను
కాతరాన సేసవెట్టిఁ గమ్మి కొప్పుపై
ఆతుమారాఁ గాఁగిలించీ నట్టె వెరగయ్యీ నాకు
యీతల శ్రీవేంకటేశుఁ డెంత మన్నించీనే ॥ అందు ॥ 299

## ఆహిరి

చుట్టపు వరుసలనే సోబనకాలము వచ్చె
యిట్టె కలకాలము నేలుకొనవయ్యా ॥ పల్లవి ॥

వెలఁదికి విరహపువేసఁగికాలము వచ్చె
[illegible] నిట్టూర్పుల గాలికాలము
వలపులచెమటల వానకాలమును మించె
యెల యింపు లిఁకనేల ఇంటికి రావయ్యా ॥ చుట్ట ॥

పడఁతి మై పులకల పైరుకాలము వచ్చె
కడుఁగోరికల మంచుఁగాలము మీరె
అడరి యెడమాఁటల ఆమనికాలమూఁ గూడె
తడవుసేయక యిట్టె దయఁ జూడవయ్యా ॥ చుట్ట ॥

సతి రతి చెనకుల జాజిరకాలము వచ్చె
కతలై నవ్వు వెన్నెలకాలమూ రేఁగె
తతిఁ గూడితివి యీకెఁ దగ శ్రీవేంకటేశ్వర
సతమై యీలాగులఁ జనవియ్యవయ్యా ॥ చుట్ట ॥ 300

రేకు 1961 వరాళి

ఇన్నాళ్ళు నెఱఁగము యిటువంటివి
సన్నలు మీలో మీకు సరివచ్చెనా ॥ పల్లవి ॥

చిమ్మిరేఁగి నీ కిందాఁకాఁ జేసె నాకె విన్నపాలు
వుమ్మడి నీ మనసందు కొడఁబడెనా
కమ్మటి నీ పాదాలొత్తె కదిసి సేవలు సేసె
సమ్మతించి నీ వందుకు సరుగ మెచ్చితివా ॥ ఇన్నా ॥

నేమమున నీతోడ నెత్తమాడెఁ జిక్కించుక
దోమటి నీ కిప్పుడు సంతోసమాయనా
వాములుగా నీమీఁద వలపులు చల్లి నవ్వె
ప్రేమముతోడుత నీవూఁ బ్రియము చేకొంటివా ॥ ఇన్నా ॥

గక్కనఁ జుట్టమువలెఁ గాఁగిలించు కొన(నె?)నాపె
చక్కెర మోవి యొసఁగి చవిగొంటివా
ఇక్కడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
మక్కువతో మ మ్మిద్దరి మన్నన నేలితివా ॥ ఇన్నా ॥ 301

## సామంతం

చెలులకునుఁ బతులకును సేయఁగల పను లివియ
నెలకొన్న పొందికలు నెరపవలె సకియా ॥ పల్లవి ॥

వలవఁగా వలవఁగా వాడికలు కడుఁ బుట్టు
తలఁచఁగాఁ దలఁచఁగా తమి రేఁగును
పిలువఁగాఁ బిలువఁగాఁ బ్రేమంబు లీడేరు
సొలయఁగా సొలయఁగా సొరిది మది గరఁగు ॥ చెలు ॥

చెనకఁగా జెనకఁగాఁ జెలరేఁగు వేడుకలు
యెనయఁగా నెనయఁగా నింపు గలుగు
పెనఁగఁగాఁ బెనఁగఁగాఁ బెరుగు జవ్వనమదము
తనియఁగాఁ దనియఁగాఁ దగులు నివ్వెరగు ॥ చెలు ॥

వొరయఁగా నొరయఁగా నుప్పతిలు సరసంబు
మరుగఁగా మరుగఁగా మలయు సుఖము
యిరవైన శ్రీవేంకటేశ్వరుఁడు నిను నేలె
పెరుగఁగాఁ బెరుగఁగా ప్రియురాలవైతివి ॥ చెలు ॥ 302

## పాడి

అటువంటి సతి నీకు నమరె నాయకుఁడ
తటుకన నీకె తగుఁ దగునయ్యా ॥ పల్లవి ॥

చలముల నూరకసారెకు దూరక
మెలుపున నానలు మీరక
కిలఁ కిలఁ బతితో కెలయుచుఁ గేరక
తలఁపులో మెలఁగు తరుణివో జాణ ॥ అటు ॥

పగటులు చూపక పంతాన నేఁపక
మొగిఁ దప్పులు కడు మోపక
అగడుసేసి వెడయాసలు రేఁపక
నిగిడి రతిఁ గలయు నెలఁతవో జాణ ॥ అటు ॥

జాగులు సేయక జంటలు వాయక
వేగిరపడి వొల వేయక
యీగతి శ్రీవేంకటేశ మాఁటు దోయక
బాగుగఁ గూడిన పడఁతివో జాణ ॥ అటు ॥ 303

## మాళవిగౌళ

నీ వొళ్ళఁ గడమలేదు నేరుపరివి నెాదువు
యీవేళ నీ మగఁడు నిన్నేమనీనోకాని ॥ పల్లవి ॥

చీరాఁ గట్టుకొంటివి సింగారించుకొంటివి
బీరముతోఁ బెద్దకొప్పు వెట్టుకొంటివి
గారవానఁ గన్నులను కాటుక దిద్దుకొంటివి
కోరి నీ మగఁ డెప్పుడు గూడీనోకాని ॥ నీవొళ్ళఁ ॥

వీడెమూ వేసుకొంటివి విరులు ముడిచితివి
వేడుక సొమ్ము వెట్టుక వెలసితివి
వాడుదేరఁ గస్తూరి వన్నెగాఁ బూసుకొంటివి
యీడనే నీమగఁ డెప్పు డేలీనోకాని ॥ నీవొళ్ళఁ ॥

వచ్చితి వింటికిఁ గొంగు వట్టివాటు వేసితివి
కొచ్చి నవ్వి పరపుపైఁ గూచుంటివి
అచ్చపు శ్రీవేంకటేశుఁ డప్పుడే నన్నుఁ గూడె
హెచ్చి యీ మగఁడే ని న్నెట్టెనసీనోకాని ॥ నీవాళ్ళఁ ॥ 304

## రామక్రియ

సెలవుల నవ్వనేల సిగ్గులు వడఁగనేల
సొలసీ నాపె మోము చూడఁగదవయా ॥ పల్లవి ॥

కొత్త కొత్త విన్నపాలు కోమలి సేసీ నీకు
చిత్తగించి వినవయ్య చెవులారను
బత్తితోడ నీకు నిమ్మపండు గానుక యిచ్చీ
హత్తి వేడుకతోడుత నందుకోఁగదవయా ॥ సెల ॥

గొప్ప గొప్ప చన్నులను కోరి నిన్ను నొత్తీని
వొప్పు గొని మెచ్చవయ్యా వొద్దికతోను
ముప్పిరిగొనఁగ తేనె మోవినే విందులు వెట్టీ
దప్పిదేరఁ జవిగొని తనివి నొందవయా ॥ సెల ॥

మంచి మంచి విడే లిచ్చి మచ్చిక నీపైఁ జల్లీ
కొంచక కాఁగిట నించి కూడవయ్యా
ముంచి శ్రీవేంకటేశుఁడ మునుపే న న్నేలితివి
పొంచి యాపె నీకు మొక్కీ బొందులు సేయవయా ॥ సెల ॥ 305

## శంకరాభరణం

ఎదుటనే వున్నాఁడు యిదె నీ రమణుఁడు
అదనిదె సరసము లాడవే యిపుడూ ॥ పల్లవి ॥

కలికితనంబుల కతకారీ
పలుకవే వో చిలుకలకొలికీ
తలిరు మోవిదంతపుబొమ్మా
సెలవుల నవ్వేవే చెలువునితోడా ॥ ఎదుట ॥

చక్కఁదనంబుల జవరాలా
నిక్కిచూడవే నీ పతిని
జక్కవ చన్నుల జగ బిరుదా
మొక్కఁగదవే [1]మొగనికి నిపుడు ॥ ఎదుట ॥

పొసఁగిన నేర్పుల పూబంతీ
కొసరవే రతుల చిగురుఁబోఁడి
వసమై నిన్నేలె వలపులను
వెసఁ బొగడవే శ్రీవేంకట విభుని ॥ ఎదుట ॥ 306

**రేకు 1962** **సామంతం**

కొమ్మ గడుజవరాలు కోమలపు మేనిది
నెమ్మది నుపలాలించి నెయ్యము చూపరాదా ॥ పల్లవి ॥

నిలుచుండి మాఁటలాడీ నెలఁత యప్పటనుండి
పిలిచి వద్దఁ గూచుండఁ బెట్టుకోరాదా
బలిసిన చనుఁగవభారము మోచుకున్నది
అలరి నీ భుజముల నానుకొనరాదా ॥ కొమ్మ ॥

నిండుఁ గొప్పు జారఁగానే నీకు విడె మిచ్చీని
అండనుండి గక్కన నీ వందుకోరాదా
మెండుగ వలపు లొడి మెరసి కట్టుకున్నది
దండితో నీవూఁ గొంత తాళుకోరాదా ॥ కొమ్మ ॥

---

[1] వ్యావహారికము కావచ్చు.

పచ్చి చెమటలుఁ బక పక నవ్వీ నీతో
మచ్చికఁ గాఁగిట నించి మన్నించరాదా
ఇచ్చట శ్రీవేంకటేశ యేలితివీకె నింతలో
కుచ్చి నీ పాదము లొత్తీఁ గోరి మెచ్చరాదా ॥ కొమ్మ ॥ 307

## పాడి

ఏమి సేసినాఁ దనతో నెగ్గు పట్టేనా
చేముట్టి బుజ్జగించినా సిగ్గువడీఁ జూడరే ॥ పల్లవి ॥

వినయాన వేఁడుకొంటి విందుగా మోవి చూపితి
పెనఁగి చేతులువట్టి పిలిచితి
ఘనుఁడు తనచేఁతలు కంటినంటా నే నెంత
చెనకినా మొగమోడి సిగ్గువడీఁ జూడరే ॥ ఏమి ॥

ముమ్మారు నాన వెట్టితి మొక్కితిఁ బాదాలకు
నమ్మించితి ననుపుగా నవ్వు నవ్వితి
పమ్మి తన గురుతులు పట్టి యడిగితినంటా
చిమ్మిరేఁగి లోలోనే సిగ్గువడీఁ జూడరే ॥ ఏమి ॥

కప్పితిఁ బయ్యదకొంగు కాఁగిలించుకొంటిని
తెప్పలుగా రతులనుఁ దేలించితి
అప్పుఁడు శ్రీవేంకటేశుఁ డాసుద్ది దడవేనంటా
చిప్పిలుఁ జెమటతోడ సిగ్గువడీఁ జూడరే ॥ ఏమి ॥ 308

## రామక్రియ

ఈకె నెట్టు దగిలితి వింతులెల్లా నుండఁగాను
నీకంటె మూరెఁ డెక్కుడు నీటుఁదనములను ॥ పల్లవి ॥

చెక్కుటద్దములు చూపి చెలి నిన్ను నెలయించె
జక్కవ చన్నులు చూపి చల్లె వలపు
నిక్కుఁ గొప్పు చూపి కొంత నీ మనసు గరఁగించె
ఇక్కువలంట్టి తమక మింకా నెంత రేఁచునో ॥ ఈకె ॥

సెలవుల నవ్వు నవ్వి సిగ్గులెల్లా విడిపించె
సొలపుఁ జూపులఁ జూచి చొక్కించెను
వెలయఁగొన గోరూఁది వేడుకలు పుట్టించె
మలసి కాఁగిటఁ గుచ్చి మరి యెంత సేసునో ॥ ఈకె ॥

కరములు పైఁ జాఁచి కళ లుప్పతిలఁజేసె
సరుసనే మోవి చూపి చవులు నించె
యెరవులేక శ్రీవేంకటేశ నన్ను నేలితివి
యిరవయి తానూఁ గూడి యిట్టె యెంత సేసునో ॥ ఈకె ॥ 309

**ముఖారి**

ఏ కాంత సేసినవో యీ చేఁతలు
ఆకె యెటువంటిదో ఆనతియ్యవయ్యా ॥ పల్లవి ॥

పుప్పొడి దాఁకినచోటు పువ్వులవేసినవాటు
చొప్పు నీ మేన నున్నది చూచుకోవయ్యా
చిప్పిలిపారేటియేరు చిమ్మనఁగోవిపన్నీరు
తెప్పలఁ దేలేవు నీవే తెలుసుకోవయ్యా ॥ ఏ కాంత ॥

కురులువట్టిన పట్టు కూడని చొల్లెపు చుట్టు
అరసి నీ చెలులనే అడుగవయ్యా
వురము ముద్రల పొత్తు వుదుటుఁజన్నుల వొత్తు
సరుగ నీకు నీవే విచారించుకోవయ్యా ॥ ఏ కాంత ॥

చెక్కున నుండిన రేక చిన్నికొనగోరి జోక
యిక్కువ లవిగో నీవే యెంచుకోవయ్యా
గక్కన శ్రీవేంకటేశ కాఁగిట నన్నేలితివి
తక్కక నీ వేడుకలు తలఁచుకోవయ్యా ॥ ఏ కాంత ॥ 310

## నాగవరాళి

అవి యేఁటియేకాంతాలో అడుగవయ్యా
తివిరీ నప్పటనుండి తెలుసుకోవయ్యా ॥ పల్లవి ॥

కన్నులఁ దప్పక చూచి కడు బొమ్మల జంకించి
సన్నలుసేసీ నాకె సారెకు నీతో
చిన్నిపెదవుల లోలోసిగ్గుతోనె మాఁటలాడి
ఇన్నేసి చేఁతలు సేసి యిట్టె యేఁకారీని ॥ అవి ॥

చుట్టి చుట్టి లాచి లాచి సోఁకఁ గప్పురాన వేశి
గుట్టుతోఁ గొలువులోనఁ గొసరీ నిన్ను
పట్టెఁడేసి చన్నులు పచారించి నీకుఁ జూపి
నెట్టన నప్పటనుండి నీకుఁ బొంచుకున్నది ॥ అవి ॥

చిప్పిలఁగ నవ్వు నవ్వి చేతులు నీపైఁ జాఁచి
చొప్పువేసీఁ జెప్పరాని చుట్టరికము
యిప్పుడు శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
కప్పి పయ్యదమాఁటునఁ గరఁగించీ నిన్నును ॥ అవి ॥ 311

## వాదరామక్రియ

ఊరకె వుండుమనవే వోరుచుకుందాన నేను
సారె సారె నీతో నేమి సరసమాడీనే ॥ పల్లవి ॥

మాఁట లెన్నైనాఁ గలవు మళ్ళి మళ్ళి యాడితేను
యేఁటవెట్టి నన్నెంత యెలయించీనే
గాఁటముతో నొక్కసతి కాచుకున్నది వద్దనే
ఆఁటదాన నన్ను నెంత ఆసలఁబెట్టీనే ॥ ఊర ॥

చేఁతలు కోటానఁగోటి సేసి సేసి చూపితేను
బాఁతిపడి యింత యాల భ్రమయించీనే
కాఁతాళానఁ దనతోను కాఁపురాలు సెసీనాపె
వూఁతవట్టుక నన్నెంత వొడఁబరచీనే ॥ ఊర ॥

చెలిమి చేటలకొద్ది చేరి చేరి కూడితేను
నలిరేఁగి నన్ను నెంత నమ్మించీనే
చెలికత్తెయంటాఁ జెప్పి శ్రీవేంకటేశుఁ డీకెను
చెలఁగి కూడి నన్నెంత చెక్కులు నొక్కీనే ॥ ఊర ॥ 312

రేకు 1963 దేసాళం

నీ తలనే వేగెనా నేఁ డిటువంటి వలపు
కాతరాన నందరికిఁ గలచాలే కదవే ॥ పల్లవి ॥

కొప్పు గడు జారినది కూడ ముడుచుకోవే
చిప్పిలునవ్వులతో సిగ్గువడక
తొప్పఁదోఁగీఁ జెమటలు దుడుచుకోఁగదవే
దప్పిదేరేమోవితోడఁ దలవంచుకొనక ॥ నీతల ॥

చుక్కబొట్టు చెదరెను సొంపుగా దిద్దుకోవే
గక్కనను చెక్కుచేతఁ గప్పుకొనక
చక్కఁగాఁ జిక్కువడిన సరు లమరించుకోవే
మక్కువ నీ చెలులను మాఁటువెట్టుకొనక ॥ నీతల ॥

కంకణాలు వదలెను కదియఁ బెట్టుకొనవే
కొంకుచుఁ బరాకు సేసుకొని యుండక
అంకెల శ్రీవేంకటేశుఁ డన్నిటాను నన్ను నేలె
యింకా నప్పటి నాతో నీడు వెట్టుకొనక ॥ నీతల ॥ 313

## ఆహిరి

ఏమని పొగడుదు నిన్నిపుడు నేను
ఆముకొని మేలుదాన నైతి నేను ॥ పల్లవి ॥

చల్లనిచూపుల నీవు సారె నన్నుఁ జూడఁగాను
వుల్లము గరఁగి చొక్కి వుందాన నేను
వెల్లవిరిగా నిట్టె వేడుకతో నవ్వఁగాను
చెల్లుబడిగా సంతోసించుకొంటి నేను ॥ ఏమని ॥

చక్కెరవంటిమాఁటలు చనవిచ్చి యాడఁగాను
అక్కరతోడుత ముదమందితి నేను
చొక్కుచు నన్నుఁ గదిసి చుట్టరికము సేయఁగా
మిక్కిలి నీ గుణాలకు మెచ్చుకొంటి నేను ॥ ఏమని ॥

మన్నన కాఁగిట నన్ను మరగించి కూడఁగాను
నన్నుఁ బాయకుందువని నమ్మితి నేను
యిన్నిటా నీవు శ్రీవేంకటేశ నా యింట నుండఁగా
మున్ను మున్నుగా నీకు మొక్కితి నేను ॥ ఏమని ॥ 314

## వరాళి

ఆసవెట్టి యాఁటదాని నలయించరాదందురు
వేసరక వేడుకతో వినోదించరాదా ॥ పల్లవి ॥

పెనఁగుచుఁ గొసరీనిపెఁ (పెం?) జెమట నీపైఁ గార
పనివడి యప్పటి గుబ్బల నొత్తీని
కనుచూపుల సొలసీ కడుఁ జొట్టరికముల
పొనఁగ కాపెతోఁ గొంత పొందుసేయరాదా ॥ ఆస ॥

చెక్కునొక్కి వేఁడుకొనీ చేతులగోళ్ళు దాఁక
ముక్కు నిట్టూర్పులు సోఁక ముచ్చట చెప్పీ
మిక్కుటపుఁ గొప్పు వంచి మీఁగాళ్ళపై నీకు మొక్కీ
అక్కరదీరఁ గాఁగిట నలమరాదా ॥ ఆస ॥

చెప్పీఁ బ్రియములు తమ్మచెదరులు నినుఁ జెంద
కప్పీఁ బయ్యద నీకు కంకణాలు జీర
ఇప్పుడు శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
తప్పక చూచి యాపెనూఁ దగఁ బిలువరాదా ॥ ఆస ॥ 315

## పాళంగవాట

ఎంతని పొగడవచ్చు నిటువంటి మీ గుణాలు
సంతతముఁ జూచి మాకు సంతోసము లాయను ॥ పల్లవి ॥

సరసురాలవు నీవు జాణకాఁ డాతఁడు మరి
సరవు లిద్దరికిని సమకూడెను
వొరపరిచేఁత నీది వొద్దికెల్లా నాతనిది
సరికి బేసికి మీ సంగాతాలు చెల్లును ॥ ఎంత ॥

వలపులు నీ సొమ్ము వాడికెల్లా నాతనిది
తలఁపులు మీలో మీకుఁ దారుకాణలే
పిలుపులు నీ పాలు ప్రియము లాతనిపాలు
కలిగిన మీ వేడుకలు ఫలియించెను ॥ ఎంత ॥

నగ నీవు నేరుతువు నను పాతఁడు నేరుచు
నిగిడి మీ రతులెల్లా నెరవేరెను
జిగి దేవులవు నీవు శ్రీవేంకటేశుఁ డాతఁడు
మిగులాఁ జుట్టరికము మెరసెను మీకును ॥ ఎంత ॥ 316

## పాడి

ఎఱఁగవా నా మనసు యిన్నిటా నీవు
జఱసేనా నీ మోవి చవిచూచేఁగాకా ॥ పల్లవి ॥

పెనఁగేటిదాననా ప్రియము లేల చెప్పేవు
వినయముతోనే మాఁట వినేఁగాక
చెనకేటిదాననా చేతు లేల పట్టేవు
మొనసి నీ పాదాలకు మొక్కేఁగాక ॥ ఎఱఁ ॥

జంకించేదాననా సన్న లేల సేసేవు
కొంకక నీ చేఁ త లియ్యకొనేఁగాక
మంకుచూపేదాననా మరేల వేఁడుకొనేవు
వుంకువగాఁ జనుగుబ్బలొత్తి పట్టేఁగాకా ॥ ఎఱఁ ॥

వొల్లకుండేదాననా వొడివట్టేల తీసేవు
చెల్లుబడిగా నీ సేవసేసేఁగాక
యిల్లిదె శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
మల్లాడక నీ రతులు మరిగేఁగాకా ॥ ఎఱ ॥ 317

## ఆహిరివాట

కడు వేడుక లీడేరెఁ గాంత నీవు గలందుకు
తడయ కెప్పుడూ నాదండ నుండఁగదవే ॥ పల్లవి ॥

ఆతని చక్కఁదనాలు అప్పటనుండిఁ జెప్పేవు
చూతము తోడితేవే సుదతి
పోతరించి వచ్చేనంటే పొంచి మావా రేమందురో
దూతికవు నీవే పొందులు సేయఁగదవే ॥ కడు ॥

వీడెమిచ్చి పంపేనంటా వెస నా చేతికిచ్చేవు
జోడు గూడఁ జేయఁగదే సుదతి
గోడ నిక్కిచూచేనంటే కొప్పుజారునో యేమో
యీడైన చెలికత్తెవు యిద్దరిఁ గూడించవే ॥ కడు ॥

తెరలోనున్నాఁడంటా దిష్టముగాఁ జూపేవు
సొరిదిఁ బెండ్లి సేయవే సుదతి
యిరవై శ్రీవేంకటేశుఁ డితఁ డిట్టె నన్ను నేలె
పరగు సంగాతివి సోబానఁ బాడఁగదవే ॥ కడు ॥ 318

**రేకు 1964** **ఆహిరి**

తగవైతే నింతటను దయదలఁచఁగవలె
జిగి మా విన్నపములు చిత్తగించవయ్యా ॥ పల్లవి ॥

వట్టిమాఁకు లిగిరించ వనిత మాఁటలాడీని
వెట్టికి నూఁకొనవద్దు వినవయ్యా
గుట్టుతో రాయి గరఁగఁ గొలువులు సేసీని
అట్టు నిట్టుఁ బరాకుగా కవధరించవయ్యా ॥ తగ ॥

కోటికిఁ బడగలెత్తి కుచములు నీకుఁ జూపీ
జూటుఁదనములు మాని చూడవయ్యా
తేటతెల్లములుగాను తెలిసీ వావులు నీకు
నీటున సిగ్గువడక నెయ్యము చూపవయ్యా ॥ తగ ॥

పోఁకకుఁ బుట్టెఁడు సేసి పొందుగా వలపు లమ్మి
యాఁకటలు దాఁచక అందుకోవయ్యా
కాఁకదీరఁ గాఁగిలించీ గక్కన శ్రీవేంకటేశ
)ఁకలు సేయక కూడి వెలయించవయ్యా ॥ తగ ॥ 319

## పాడి

సిగ్గువడ దించుకంతా చెలులెల్లాఁ జూడఁగాను
బిగ్గెఁ గాఁగిలించుకొనీఁ బ్రియమెంతోకాని ॥ పల్లవి ॥

వేవేలు చుట్టరికాలు వేడుకతో నెరపీని
వావి నాపె నీకేమిగావలెనోకాని
దేవులవలెఁ గడు హత్తిన సేవలెల్లాఁ జేసీ
భావించితే నెట్టి వొడఁబడికలోకాని ॥ సిగ్గు ॥

చెప్పరాని బత్తి నీపైఁ జేసి సేసి చూపీని
యెప్పుడూ మీ నేస్తము లేఁటివోకాని
వొప్పగుపెండ్లికూఁతురే వొద్దనే కాచుకున్నది
చెప్పరాని సలిగెంత చెల్లించేవోకాని ॥ సిగ్గు ॥

నాఁటుకొన్న తమితోడ నవ్వులెల్లా నవ్వీని
చాటువైన మీలో నేమి సన్నలోకాని
యీటున శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
మాటలాడీ నాపె నీపై మచ్చికెంతోకాని ॥ సిగ్గు ॥ 320

## గౌళ

[1]అమ్మలాల అక్కలాల అవిగో వింత సుద్దులు
నెమ్మది వింటిరటరే నిచ్చ నిచ్చ కొత్తలు ॥ పల్లవి ॥

---

1. 321, 322 పాటలు అధ్యాత్మకీర్తనలలో నుండదగినవి.

అల్ల వాఁడే శ్రావణ బహుళాష్టమిని నడురేయి
చల్లఁగా రోహిణివేళ జనించినాఁడు
వెల్లవిరి దేవకిదేవికి వసుదేవునికి
మొల్లమిఁ గొడుకైనాఁడు ముద్దులకృష్ణుఁడు ॥ అమ్మ ॥

పొంచి యశోదానందగోపులకు సుతునివలెఁ
బెంచఁగా రేపల్లెలోనఁ బెరిగీ వీఁడె
ముంఁగి యీతనికంటేనె ముందే బలభద్రుఁడు
అంచెల రోహిణీదేవి కవతరించినాఁడు ॥ అమ్మ ॥

మొదల దేవతలకు మూలభూతి యితఁడట
యెదుట లోకములెల్లా నేలీనటా
అదిగో శ్రీవేంకటేశుఁడై యలమేల్మంగాఁ దాను
చెదరక కాఁపురాలు సేసీనటా ॥ అమ్మ ॥ 321

## లలిత

మన చేతికిఁ జిక్కెను మగువలాల
వినయాన వేఁడుకోరే వీఁడె కాంతలాల ॥ పల్లవి ॥

పుబ్బుచుఁ గృష్ణుఁడు వాఁడే పుట్టులు గొట్టీ నదే
గొబ్బునఁ బట్టఁగదరే గొల్లెతలాల
అబ్బురపుఁ బాలు వెన్న లారగించి వారవట్టీ
దొబ్బి తీసుకోరమ్మా తొయ్యలులాల ॥ మన ॥

యింటింటి వాకిట వచ్చి ఇదె చక్కిలాలు దీసీ
అంటి పెనఁగులాడరే యంగనలాల
దంటయై గోపాలులుఁ దానూఁ బరువులు వెట్టీ
వెంటనే తగులరమ్మా వెలఁదులాల ॥ మన ॥

కాకుసేసి చన్నులంటి కాఁగిలించుకొనవచ్చీ
యేకతాలకుఁ దియ్యరే యింతులాల
యీకడ నలమేల్మంగ నేలి శ్రీవేంకటేశుఁడు
మీ కోరి కిచ్చె మొక్కరే మెలుఁతలాల ॥ మన ॥ 322

## శ్రీరాగం

ఇంత మేలువాఁడవై యింకా నేల జరసేవు
సంతోసముతోడనే చనవియ్యరాదా ॥ పల్లవి ॥

చెలిచిరునవ్వులనే చిత్తము గరఁగితివి
యెలమి నాపెతోఁ బంతా లే లాడేవు
కలికిచూపులకే కాయమెల్లాఁ జెమరించె
పెలుచుఁదనాల నేల పెనఁగులాడేవు ॥ ఇంత ॥

పెదవిపైమాఁటలకే పెద్దగా వలచితివి
యెదిరించి యాల యెలయించ వచ్చేవు
వుదుటు గుబ్బలకే వుబ్బి మొగమోడితివి
మదిరాక్షితో నేల మారుకొనేవు ॥ ఇంత ॥

అట్టి చే సన్నలకే ఆ సాసలఁ జొక్కితివి
దిట్ట సరసాలనే తిట్టఁ జూచేవు
గుట్టున శ్రీవేంకటేశ కూడితి వలమేల్మంగను
వొట్టుక యాకె నింతేల వొలలఁ బెట్టేవు ॥ ఇంత ॥ 323

## వాదరామక్రియ

ఎంత కాతరపు వాఁడె యెలయించీ నిదె నన్ను
వింత వింత రతులను వినోదించీ నితఁడు ॥ పల్లవి ॥

ఆనలు నేఁ బెట్టఁగానే యట్టె వొడివట్టీని
మోనాన నుండఁగానే మోవి యానీని
పూనుక వద్దనుండఁగా పువ్వాడి నామీఁదఁ జల్లీ
తా నెంత నే నెంత తమిరేఁచీ నితఁడు ॥ ఎంత ॥

తలవంచుకుండఁగానే దండఁ గూచుండ వచ్చీని
నిలుచుక వుండఁగానే నించీఁ గాఁగిట
బలిమిఁ బెనఁగఁగానే పట్టీ గుబ్బచన్నులు
వలపులు చల్లి చల్లి వావిచెప్పీ నితఁడు ॥ ఎంత ॥

పరపుపైనుండఁగానే పక్కఁబండి చెనకీని
గిరిగొని నవ్వఁగానే గిలిగించీని
యిరవై శ్రీవేంకటేశుఁ డే నలమేలుమంగను
గరిమ నన్నుఁ బెండ్లాడి కాలుదొక్కీ నితఁడు ॥ ఎంత ॥ 324

**రేకు 1965 శంకరాభరణం**

ఊరకే చందముసేసుకుందానఁ గాక
నేరుపుల నీ గుణాలు నే నెఱఁగనా ॥ పల్లవి ॥

యెగ్గులేని యాకెనీలో యెడమాఁటలు
సిగ్గరితనాలలోని చే సన్నలు
వొగ్గి యియ్యకొన్నట్టి వొడఁబాటులు
నిగ్గుదేరె మీ సుద్దులు నే నెఱంగనా ॥ ఊర ॥

తక్కక మీ రెంచుకొన్న తలపోఁతలు
చెక్కిటి చేతుల తోడిచిరునవ్వులు
దక్కి మీకు సరివచ్చె తారుకాణలు
నిక్కమైన నేస్తాలు నే నెఱంగనా ॥ ఊర ॥

తలకొన్న రతులలో తరితీపులు
కొలఁది మీరిన మతి కోరికలు
చెలరేఁగి న న్నేలిన శ్రీవేంకటేశ
నిలిచిన మీ చేఁతలు నే నెఱంగనా ॥ ఊర ॥ 325

## ముఖారి

ఎంతైనాఁ దనతో నే నెగ్గుపట్టేనా
చెంతనుండి నాచే సేవసేయించుకొనుఁగాక ॥ పల్లవి ॥

సేయఁగలవెల్లాఁ జేసి సిగ్గులు వడఁగ నేలే
చాయ సేసుకొని పొందు జరపుఁగాక
యే యెడనో వుండి వచ్చి యేల వాడఁబరచీనే
నాయందు కూరిమి చల్లి నవ్వుఁగాకా ॥ ఎంతై ॥

ముం దెవ్వతెనో పెండ్లాడి మొక మేమి చూచీనే
అందాలు సేసుక మాఁటలాడుఁగాక
విందు లెందో ఆరగించి విడెము లే లడిగీనే
అంది నా పానుపుపైనే యవధరించుఁగాకా ॥ ఎంతై ॥

చుట్టాల సురబి తాను చొక్కుల నేల పెట్టీనే
గుట్టుతోడ నా కాఁగిటఁ గూడుఁగాక
యిట్టె శ్రీవేంకటేశుఁ డేలి న న్నేల మెచ్చీనే
జట్టిగాఁదనకే మోవి చవిచూపుఁగాకా ॥ ఎంతై ॥ 326

## రామక్రియ

నీ వెఱఁగవా తగవు నెరజాణవు
హోవల నెగ్గుపట్టక హోరుచుకోవయ్యా ॥ పల్లవి ॥

చుట్టుకొన్న వలపులు సూటికి రాకుండితేను
తిట్టుదురు మగవానిఁ దెరవలు
గుట్టుతోడఁ దమకము గుబ్బతిలుకొంటాను
వొట్టులు వెట్టి సారెకు నుప్పతింతురు ॥ నీ వెఱఁగ ॥

వేడుకతోడఁ గాఁగిలివేళ కొదగకుండితే
యేడనైనా సొలతురు యింతులు
తోడఁ దోడ నాసలు దొమ్మిఁ జిమ్మిరేఁచితేను
జాడతోఁ జేతులు చాఁచి సాదింతురు ॥ నీ వెఱఁగ ॥

తలఁచిన తలఁపులు తారుకాణ రాకుండితే
బలిమిఁ బెనఁగుదురు పడఁతులు
యెలమి శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి
లలనలు యిటులైతే లాలింతురు ॥నీ వెఱఁగ ॥327

## శుద్ధవసంతం

తలఁచుకో నీమతికిఁ దారుకాణ యీ వలపు
తెలిపి చెప్పఁగఁబోతే తీగె సాగు వలపు ॥ పల్లవి ॥

కావలెనన్నవారికి కడుఁ దీపు వలపు
వేవేలకు దాఁచుకొంటే వెలవెట్టు వలపు
చేవదేరఁ బెనఁగితే చిగిరించు వలపు
భావించి పాదిసేసితే పంటవండు వలపు ॥ తలఁ ॥

నేరుపుగలవారికి నిధానము వలపు
కూరిమిఁ జేకొంటేను కోటిసేసు వలపు
వూరకే తలపోసితే నువ్విళ్ళూరు వలపు
గారవించి తెచ్చుకొంటే గాదెనిండు వలపు ॥ తలఁ ॥

కైకొన్నవారికి కాణాచి వలపు
యేకడఁ బాయకుండితే యీడేరు వలపు
దాకొని శ్రీవేంకటేశ తరుణిఁ గూడితి విట్టె
నీకూ నీపె కేకాలము నిండుకుండు వలపు ॥ తలఁ ॥ 328

## కాంబోది

కంటిలేవే చెలియా కతకారినీ చేఁతలు
దంటతనమున నింకా తారుకాణించనేలే ॥ పల్లవి ॥

కళలు మోమునఁ దేరె కన్నులఁ గెంజాయ మించె
తలకూడెఁ బను లిఁక దాఁచనేఁటికే
పిలువఁ బోతివి నీవు ప్రియుఁడు నిన్నింతసేసె
వలపు పట్టరానిది వట్టిమాఁట లేఁటికే ॥ కంటి ॥

వాసనలు మేన నిండె వడియఁ జొచ్చెఁ జెమట
సేసిన చేఁతలు చెల్లె సిగ్గు లేఁటికే
నా సుద్దులు చెప్పితివి వడుమఁ దాఁ బెండ్లాడె
ఆసలు కొండలవంటి వాతఁ డేమిసేసునే ॥ కంటి ॥

చిన్నలు చెక్కుల నిండె సెలవి నవ్వులు రేఁగె
పన్నుగడ లొక్కటాయ బయమేఁటికే
యిన్నిటా శ్రీవేంకటేశుఁ డీడకు వచ్చి నన్నేలె
చిన్నపాయ మింత సేసె చెప్పవలెనటవే ॥ కంటి ॥ 329

## కేదారగౌళ

పతివి నీతో నాకు పంతము గాదా
రతివేళ యిది సుమ్మీ రాఁపుసేయ కిఁకను ॥ పల్లవి ॥

నిన్నుఁ బాసి తమకము నిలుపఁ జాలక నేఁ
గన్నుల జంకించితిఁ గసరితిని
మన్నింతువు గనక నా మందెమేళ మిట్లుండె
చిన్నదానఁ జూమ్మీ నీ చిత్తము నే నెఱఁగ ॥ పతి ॥

విరహతాపముచేత విసిగి నీవు రావంటా
విరులఁ గొని వేసితి వేసరించితి
మరిగించితివిగన మదము నా కిట్లుండె
సరసమాడితిఁ జూమ్మీ చలము సాదించను ॥ పతి ॥

పాయపు టాసలచేత బలిమిఁ బైకొని యిట్టె
చెయి నీపై వేసితిఁ జెనకితిని
యీయెడ శ్రీవేంకటేశ యింతలో నన్నేలితివి
వేయిటికి మొక్కేఁ జూమ్మీ విన్నపము సేసితి ॥ పతి ॥ 330

**రేకు 1966 సామంతం**

నీ యంత నేరమా నే మెల్లాను
చేయారాఁ బతియిచ్చలోఁ జెలఁగేముగాకా ॥ పల్లవి ॥

ఆటలెన్నైనాఁ గలవు అట్టె జూజా లాడితేను
చోటు లెన్నైనాఁ గలవు చొచ్చివెళ్లితే
నీటు లెన్నైనాఁ గలవు [1]నిక్కి నిక్కి నిక్కిచూచితేను
యేఁటికింత రమణుని నెలయించేవే ॥ నీ యంత ॥

బాస లెన్నైనాఁ గలవు పలుమారుఁ జేసితేను
ఆస లెన్నైనాఁ గలవు అడిగేనంటే
వేసా లెన్నైనాఁ గలవు వేగినంతా సొలసితే
రాసికెక్కఁ బతి నెంత రవ్వసేసేవే ॥ నీ యంత ॥

---

1. ఒక నిక్కి వ్యర్థమనుకొంటాను.

చేఁత లెన్నైనాఁ గలవు చిక్కించుక చెనకితే
వా (వ్రాఁ?)త లెన్నైనాఁ గలవు వా (వ్రా?)సేనంటే
వూఁతగా శ్రీవేంకటేశుఁ డొద్దికతో నన్ను నేలె
కాఁతాళిం చేతని నేల కాఁగిలించేవే ॥ నీయంత ॥ 331

## ముఖారి

ఎట్టు మన్నించేవో యిటువంటిది నా వోజ
యిట్టె చిత్తానఁ బెట్టు యిది నా విన్నపము ॥ పల్లవి ॥

చూడకున్నా నా కన్నుల చూపులు నీపైఁ బారు
ఆడకున్నా నోరు మాఁటలాడు నీతోనే
యేడనున్నాఁ బాదాలు నీ యింటికే రప్పించును
యీడులేని నావలపు యింతసేసె నన్నును ॥ ఎట్టు ॥

తల వంచుకుండినాను తలఁపు నీపై నుండు
ఆలసినాఁ గూడించు నాస నీతోను
చెలఁగి సిగ్గున నున్నా సెలవులు నవ్వింపించు
యెలమి నా తమకము యెంతని చెప్పుదును ॥ ఎట్టు ॥

గుట్టుతోడనుండేనన్నా గుబ్బలు ని న్నొరయించు
ముట్టకున్నా నా చేతులు మొక్కించు నీకు
యిట్టె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
యెట్టిదో నా వేడుక యేమిసేతు నిఁకను ॥ ఎట్టు ॥ 332

## వరాళి

ఇన్నాళ్లుఁ బిన్నదిగాని యిప్పుడు వయసు వచ్చె
విన్నవించితిమి నీకు వేడుక చూడవయ్యా ॥ పల్లవి ॥

మొలచి గుబ్బచన్నులు మొన లెత్తెను
చెలరేఁగి కోరికలు చిగిరించెను
నలుగడ జవ్వనము నన లొత్తెను
చెలియతో వనకేలి సేతువు రావయ్యా ॥ ఇన్నా ॥

యింతి చెక్కు చెమటల యేరులు వారె
వింతనవ్వుల పూవులు విరియఁ జొచ్చె
చెంతనే గండుమీలు మించెను కన్నుల
చింతదీర జలకేలి సేతువు రావయ్యా ॥ ఇన్నా ॥

చక్కని మోమున నిండె చంద్రకళలు
మిక్కిలి మరుబలాలు మేనిపై వాలె
యిక్కడ శ్రీవేంకటేశ యీకె నిన్నుఁ బెండ్లాడె
గక్కన సురతకేలి గావింతువు రావయ్యా ॥ ఇన్నా ॥ 333

## రామక్రియ

ఎదిరిఁ దన్నెరఁగదు యెప్పుడూ వలపందురు
కదిసి యీమాఁట నేఁడు గానవచ్చె మాకును ॥ పల్లవి ॥

వెలఁది మట్టెలు నీవేలనే వుండఁగానే
చెలరేఁగి నన్ను నెంత చెక్కు నొక్కేవు
పలుసోఁకులు పెదవిఁ బాదుకొని యుండఁగానే
మలసి యప్పటి నాతో మాఁటలాడేవు ॥ ఎది ॥

కొమ్మ ముడిపువ్వులు నీ కొప్పులోన నుండఁగానే
ముమ్మాటికి చేతులపై మొక్కవచ్చేవు
కుమ్మెలై గుబ్బలొత్తిన గురుతు మై నండఁగానే
కమ్మటి సిబ్బితి లేక కాఁగిలించ వచ్చేవు ॥ ఎది ॥

ఎడఁతి కస్తూరిపూఁత [1]పచ్చడ మంటుండఁగానే
అడరి నామీఁదఁ గప్పి యాదరించేవు
యెడయ కిట్టె శ్రీవేంకటేశ నన్ను నేలితివి
నడుమ నాకె వుండఁగా నమ్మికిచ్చేవు ॥ఎది॥ 334

## పాడి

ఆతని చిత్తము వచ్చినట్టే మెలఁగవద్దా
కాతరించి మరి యాల కక్కసించేవే ॥ పల్లవి ॥

వలపుగలవారికి వాసులేమీ నెంచరాదు
పిలిచితే నొఁగాదని పెనఁగరాదు
మలసి యెవ్వతెతోనో మాఁటలాడె నాతఁడంటా
చలపట్టి పతినేల సాదించేవే ॥ ఆత ॥

చుట్టరిక మమరితే సూళ్ళువెదకరాదు
పట్టి కాఁగిలించుకొంటే పాయఁగరాదు
తొట్టి వూడిగపుదానితో నాతఁడు నవ్వెనంటా
ఇట్టె రమణుని నేరాలేల యెంచేవే ॥ ఆత ॥

వావులు గలసితేమ ఏర్దని తోయఁగరాదు
వోవరిలోఁ గూడె నిన్ను వొడ్డుకోరాదు
సోవగాఁ బొరుగు సతిఁ జూచి చన్నులంటెనంటా
శ్రీవేంకటేశ్వరు నేల చెక్కు నొక్కేవే ॥ ఆత ॥ 335

## కాంబోది

ఎప్పుడూ నీ కాఁగిటఁ బాయక యిట్టె వుండునమ్మా
తప్పక యింతేసి నీతోఁ దారుకాణించనేలే ॥ పల్లవి ॥

---
1. పచ్చడము + అంటి + ఉండఁగానే

చందమామవంటిమోము సతి నీకుఁ గలుగఁగా
విందువలెఁ జిరునవ్వు వెన్నెల మించె
కందువతోఁ బదారుగళలు దొలఁకఁజొచ్చె
అంది వలచి నీ మగఁ డంట కెట్లుండునే ॥ ఎప్పు ॥

మెఱుఁగుఁదీగెవంటి మేను నీకుఁ గలుగఁగా
గుఱిగా మేఘమువంటి కొప్పు వెలసె
మఱియు మోవిపండు మాఁగి తేనెగారీని
మఱఁగులేక నీపతి మన్నించ కెట్లుండునే ॥ ఎప్పు ॥

నిమ్మపండ్లవంటినీచన్నులు గలుగఁగా
కమ్మి జవ్వనవనము కడు నమరె
వుమ్మడిఁ జెమటవాన లూరి పోదిసేసీ నిదె
యిమ్ముల శ్రీవేంకటేశుఁ డెనయ కెట్లుండునే ॥ ఎప్పు ॥ 336

రేకు 1967 **సామంతం**

చెలికత్తె లిందరును సేసేరు విన్నపాలు
నెలఁత చక్కఁదనాలు నీకే తగునయ్యా ॥ పల్లవి ॥

కప్పురము దిన్న నోర కలికి కతలు చెప్పీ
వొప్పుగాఁ జెవులార విని వూఁకొనవయ్యా
కుప్పెసవరముతోడ గొప్పుగాఁ దురుమువెట్టె
చొప్పుగాఁ గమఁగొనలఁ జూడవయ్యా ॥ చెలి ॥

కంకణాలు వెట్టుకొన్నకరముల నీకు మొక్కీ
తెంకి నుండి నీ వందుకు దీవించవయ్యా
కుంకుమ గుబ్బ లదర కొసరి నీతో నవ్వీ
లంకెలుగా నాపెకు వలవఁగదవయ్యా ॥ చెలి ॥

గందము వూసుకొనిన కాఁగిట నీతోఁ బెనఁగీ
చెంది నీ వందుకు సంతోసించవయ్యా
ఇందరిలో శ్రీవేంకటేశ నన్ను నేలితివి
చందమాయఁ గాఁపురము చనవియ్యవయ్యా ॥ చెలి ॥ 337

## శంకరాభరణం

కాదనఁగఁ దగదు కాంతునికి
మోదపుసతులకు మోహములే ॥ పల్లవి ॥

పలుమరు సొలసిన పైపైఁ గొసరిన
చెలులకు నవి [1]యొచ్చ(చ్చె?)ము గావు
పలుకుల దూరిన పంతము లాడిన
చలములు గా వవి సహజములే ॥ కాద ॥

చనవున నొరసిన సన్నలఁ దిట్టిన
వనితల కవి కొదవలు గావు
చెనకుచుఁ గసరిన చేతులు చాఁచిన
పెనఁగుటలు గావు ప్రేమములే ॥ కాద ॥

పగటులు చూపిన పాదము దొక్కిన
మగువలు (ల?) కవి కడమలు గావు
తగిలె శ్రీవేంకటోత్తమ నిను మా యింతి
వెగటులు గా వివి వేడుకలే ॥ కాద ॥ 338

## శంకరాభరణం

ఇవివో నీ కాంత సుద్దు లేమని చెప్పేమిఁక
జవళి నీవూఁ గూడితే సంతోసాలయ్యాని ॥ పల్లవి ॥

---

1. యతిభంగము

వుడివోనితమితోడ నుమ్మగిలీ జవరాలు
    వొడలి చెమటలతో నోలలాడీని
    చిడుముడి కోరికల చిత్తమెల్లాఁ జంచలించి
    అదరి నిట్టూర్పుల నుయ్యాల లూఁగీని ॥ ఇవి ॥

విరహపు వేదనల వీడు దోడాడుకొంటాను
    సరి నెదురుచూపుల జాజరాడీని
    మరిగిన మమతలు మక్కళించి మక్కళించి
    తురుము వీడి చీఁకటిఁ దులఁదూఁగీని ॥ ఇవి ॥

చెలులతో నీ సుద్దులు చెప్పి చెప్పి పులకల
    వలపుల రతులకు వంతులాడీని
    యెలమి శ్రీవేంకటేశ యింతలో నిన్నుఁ బెండ్లాడి
    మొలక నవ్వు లెల్లాను ముప్పిరి వేసీని ॥ ఇవి ॥ 339

## వాదరామక్రియ

ఏమీ నెఱఁగవు యిన్నాళ్ళు
    నీమతకము లివి నెగడెనే కదవే ॥ పల్లవి ॥

వాడిక మాఁటల వలపుల చేఁతలు
    యేడ నేర్చితివే యీతనితో
    వేడుక నవ్వులు వేసాల సొలపులు
    చూడఁ జూడఁ గడు సోద్యము గదవే ॥ ఏమీ ॥

పాపట దువ్వులు పయ్యద మాఁటులు
    పైపై నెటువలెఁ బనుపడెనే
    చూపుల చొక్కులు సురతపు రేఁపులు
    నీపాలఁ గలిగి నెలకొనెఁ గదవే ॥ ఏమీ ॥

తీగెల యెలుఁగులు తెగని గర్వములు
సాగి యేసబలఁ జదివితివే
యీగతి శ్రీవేంకటేశుఁడు నన్నేలె
నీ గతు లతనికి బాగాయఁ గదవే ॥ఏమీ॥ 340

## మంగళకౌశిక

నా మొగ మేమి చూచేవు నడుమనే యిది యేమే
గామిడివై సాదించఁగలవా నీవూ ॥ పల్లవి ॥

కాతరించి పెనఁగేవు కవ కవ నవ్వేవు
ఆతఁడేడ నీవేడ అవునే నీవు
చేతులారా నీడుగాని చేఁతలు సేసితేను
నాతులెల్లా నిన్నుఁ జూచి నవ్వరా యిందరును ॥ నామొగ ॥

సరుసఁ గూచుండేవు సరసము లాడేవు
దొరతోడి పొందు కోపుదువటె నీవు
య(యె?) రవుల వారితోడ యెమ్మెలు చెప్పుకొంటేను
సరి సవతు లెల్లాను జాతులు సేయరా ॥ నామొగ ॥

చిమ్ముచు గోర నూఁదేవు సేసలు పైఁ జల్లేవు
నెమ్మి మగనిఁ జొక్కించ నేర్తువా నీవు
యిమ్ముల శ్రీవేంకటేశుఁ డితఁ డిట్టె నన్నుఁ గూడె
పమ్మక మీ యింటివారే పంగించరా విన్నను ॥నామొగ॥ 341

## సింధురామక్రియ

ఆలి మగని తగవులవిగ్గో చెప్పితి నీకు
వాలాయముగా మఱవక తలఁచుకొమ్మీ ॥ పల్లవి ॥

యెడసిన తమితోడ నెంతయినా సొలతురు
పడఁతులయ్యినవారు పతిని
అడరి నీవు రావలెనని చెలికత్తెలచే
యెడ మాఁటల దూరితి నెగ్గుపట్టేవు సుమ్మీ ॥ ఆలి ॥

కాఁకఁ బొరలినందుకు కైమీరి చెనకుదురు
యేఁకరిన సతులు త మ్మేలినవాని
తేఁకువతో ^ఁ^ నన్ను దిష్టించి చూడవలసి
పోఁక పూఁబాలవేసితి పొంచి వోరుచుకొమ్మీ ॥ ఆలి ॥

అంచెలఁ గూడేటి వేళ అట్టె యేమైనాఁ జేతురు
పొంచుకున్న వనితలు పొందైనవాని
యెంచఁగ శ్రీవేంకటేశ యెనసేవేళ నీ మోవి
యించుక గంటిసేసితి నేమీ ననకుమీ ॥ ఆలి ॥ 342

## రేకు 1968 రామక్రియ

కానవచ్చె నీ గుణాలు గక్కన నీ చేఁతలనే
పూని యిట్టి వలపుల పొద్దు జరపేవా ॥ పల్లవి ॥

వొనరి గోర నూఁదితే వొద్దంటా వేడుకొనేవు
గునిసి నిన్నెవ్వతైనాఁ గోపగించీనా
పెనఁగి కొంగువట్టితే ప్రేమ నొడఁబరచేవు
యెనయు వేరొకతెకు నిక్కువ చెప్పితివా ॥ కాన ॥

మంచిగంద మలఁదితే మగుడ నాకుఁ బూసేవు
ముంచి మోహపాకె మచ్చములు పట్టీనా
వంచనతోఁ జెనకితే లంచము మోవి ఇచ్చేవు
అంచల మీ యింటివారి కాసలు వెట్టితివా ॥ కాన ॥

పూవులదండ వేసితే పొంచి వొడిఁ బెట్టేవు
నీ వనిత యిందుకుఁగా నిన్ను నవ్వీనా
యీవేళ శ్రీవేంకటేశ యేలి నన్నుఁ బొదిగేవు
వావి నీనేగికత్తెకు వరుస ఇచ్చితివా ॥ కాన ॥ 343

## శ్రీరాగం

ఈఁరీతి నావలపులు యెంతని చెప్పుదు నీకు
కోరిన నా కోరికలు కొనసాగెనయ్యా ॥ పల్లవి ॥

చెలికత్త (త్తె?) లెల్లా నిన్నుఁ జెప్పఁగానే విని విని
వెలలేని వేడుకల [1]విఱ్ఱవీఁగీని
కలువరేకులనంటి కన్నుల నిప్పుడు చూచి
[2]తెలివితో నానందాన తెప్పలఁ [3]దేలీని ॥ ఈఁరీతి ॥

వొద్దనుండి ఇంతవడి వూడిగాలు నీకుఁ జేసి
పొద్దులు వుచ్చుక కొంత [4]భోగించీని
సుద్దులు నీతోఁ జెప్పి చుట్టరికాలు నెరపి
అదుక సరసమాడి ఆయము గరఁగితి ॥ ఈఁరీతి ॥

చిత్తమెరిఁగినదాఁకా సిగ్గువడి పానుపుపై
బత్తితో నీ కూటములు భావించుకొంటి
ఇత్తల శ్రీవేంకటేశ ఇట్టె నన్ను నేలితివి
నెత్తమాడి సంతోసాన నెమ్మది నవ్వితి ॥ ఈఁరీతి ॥ 344

## హిందోళం

ఇదివో నా కాఁపురము లెరఁగ విన్నవించితి
మదిలోన మఱవక మన్నించు నన్నును ॥ పల్లవి ॥

1. 'విఱ్ఱవీఁగితివి' అని ఉండవచ్చు. 2. 'తెలివితో' రేకు - ప్రాసభంగము. అర్థము విచార్యము.
3. 'తేలితివి' కావచ్చు. 4. 'భోగించితివి' అని యుండవలె.

తనువు సిగ్గుతోడుతఁ దగిలి యింటిలోనుండు
మనసు నీపైనుండు మరిగెఁ గాన
కనుచూపు లివి నీరాకల క (కె?) దురైవుండు
తనివోని వలపులు తలకెక్కియుండు ॥ ఇది ॥

చేతులు చింతతోడుత చెక్కులపైనే వుండు
ఆతుమ నీ దేవులయ్యే యాప(స?) లనుండు
వాతెర మోనము మీఁద వదలనట్టె వుండు
యి ౦౦ నాలిక నీ పేరెంచుకొంటా నుండును ॥ ఇది ॥

చన్నులు గుట్టుతోడుత సరిఁబయ్యదలోనుండు
కన్నెపాయము నీకుఁగాఁ గాచుకవుండు
ఇన్నిటా శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
సన్నలు చాయలును నీ సరసముల నుండు ॥ ఇది ॥ 345

## మాళవిగౌళ

చెప్పవే వినేఁగాని సిగ్గువడక
యిప్పుడు నామగనికి నే[1]మాదువే నీవు ॥ పల్లవి ॥

చెంతనుండి రేఁగి రేఁగి సేసేవు విన్నపాలు
యెంత చనవరివే నీ వితనికిని
కాంతలెల్లా నుండఁగాను గద్దెపై నెక్కవచ్చేవు
యింత గద్దా చుట్టరిక మిందరిలో నీకు ॥ చెప్ప ॥

మోము చూపి మోము చూపి [1]ముచ్చట లాడవచ్చేవు
గామిడివై కతలెన్ని గరచితివే
చేముంచి తీసుకొనేవు చెవిలో తట్టు పుణుఁగు
యేమే యీ సలిగెలు యెందుఁ దెచ్చుకొంటివే ॥ చెప్ప ॥

1. 'ముచ్చడ' రేకు.

సారె సారె నవ్వుతాను చన్నులనే వొరసేవు
కూరిమి నీతఁడు నిన్నుఁ గూడెనటవే
యీరీతి శ్రీవేంకటేశుఁ డీతఁడె నన్ను నేలె
నేరుపరి తనములు నీ కేడఁ గలిగెనే ॥ చెప్పు ॥ 346

### నాగవరాళి

ఇందాఁకా నెఱఁగనైతి నిట్టె నీ మంచితనాలు
అందమాయఁ బనులయ్యా ఔదువయ్యా జాణవు ॥ పల్లవి ॥

చెక్కు నొక్కి వేఁడుకోఁగా చిత్తము గరఁగె నాకు
మొక్కేమయ్యా నీకు ముదమలర
మిక్కిలి బుజ్జగించఁగా మించిన కోపము దీరె
ఇక్కువకు రావయ్యా ఇందవయ్యా విడెము ॥ ఇందా ( ॥

లాలించి కోఁ (కొఁ?) గిలించఁగా లలి మొక దాకిరాయ
ఆల నైతినయ్యా నీకు నన్నిటా నేను
మేలిములు నీ వాడఁగా మేలుదాననైతి నీకు
యేలుకోవయ్యా చనవియ్యవయ్యా నాకును ॥ ఇందాఁ ॥

చేవట్టి గారవించఁగా చింతలెల్లాఁ బెడఁబాసె
సేవ సేసేనయ్యా నీకు చేతులారాను
శ్రీవేంకటేశ కూడఁగా నెలవుల నవ్వవచ్చె
కైవసమై వుండవయ్యా కానీవయ్యా నమ్మితి ॥ ఇందాఁ ॥ 347

### బౌళి

ఎరవులు మరిలేవు యెవ్వరికిని
సరససల్లాపములు సమకొను నపుడు ॥ పల్లవి ॥

యియ్యకోలే వూఁకొంటే ఇన్ని విన్నవించవచ్చు
నెయ్యమైతే చనవులు నెరపవచ్చు
చెయ్యారాఁ జెనఁగితేను సిగ్గు విడిపించవచ్చు
తొయ్యలులకు నీవలె తొడఁగి లాలించితే ॥ ఎర ॥

చేకొని సమ్మతించితే చేఁతలన్నిఁ జేయవచ్చు
జోకమై పాయకుండితే చొక్కించవచ్చు
చేకొలఁదికి వచ్చితే చెనకి మెప్పించవచ్చు
యే కాంతకూ నీవలె యిచ్చగించి కూడితే ॥ ఎర ॥

వాలాయించితే రతుల వాడికలు చూపవచ్చు
మేలమాడితే నేరుపు మెరయవచ్చు
యీలీలనే శ్రీవేంకటేశ నన్ను నేలితివి
నీ లేమ నయిన నాకు నీవలె మన్నించితే ॥ ఎర ॥ 348

## రేకు 1969 సాళంగనాట

నిన్ను మెచ్చి పొగడేము నీ చెలులము గనక
యెన్నిక కెక్కితివమ్మా యిన్నిటాను నీవు ॥ పల్లవి ॥

వినయాలు నేరుతువే విభుని వలపించను
పెనఁగ నేరుతువే ప్రియము రేఁచ
చెనకఁగ నేరుతువే చిత్తమెల్లాఁ గరఁగించ
మినుకుల జవరాల మేలు మేలే నీవు ॥ నిన్ను ॥

సన్నసేయ నేరుతువే సరసుని రప్పించ
విన్నవించ నేరుతువే వేడుకపుట్ట
కన్నులార్చ నేరుతువే కడు నిచ్చకముగాఁగ
అన్నిటా జాణకత్తెవు అవునౌనే నీవు ॥ నిన్ను ॥

సేసవెట్ట నేరుతువే శ్రీవేంకటేశుఁ జొక్కించ
ఆసచూప నేరుతువే ఆయాలు సోఁక
రాసికెక్క నిన్ను నేలె రమణుఁ డితఁడె వచ్చి
బాసతోడి యిల్లాల బాపు బాపు నీవు ॥ నిన్ను ॥ 349

## హిందోళవసంతం

ఒకటొకటే గడించే వూరకున్న యాకె మీఁద
యెకసక్యా లిఁకనేల యెరుఁగుదుమయ్యా ॥ పల్లవి ॥

సరుసకు వచ్చెనంటా చన్నులు సోఁకించెనంటా
తరుణిపై గోరేల తాఁకించేవు
మరిగి యాపెపై నీకు మనసువారితేను
వరుసతోఁ బెండ్లాడఁగా వద్దనీనా నిన్నును ॥ ఒక ॥

పెడమళ్ళి చూచెనంటా పెద్దకొప్పు వెట్టెనంటా
పడఁతిపై నేఁటికి నెపాలు వేసేవు
వడిగా నీ కాపెమీఁద వలపు గలిగితేను
వాడివట్టి తియ్యఁగాను వోపననీనా ॥ ఒక ॥

నిన్నుఁ జూచి నవ్వెనంటా నిలుచుండి మొక్కెనంటా
కన్నె నేల పట్టి తీసి కాఁగిలించేవు
యెన్నఁగ శ్రీవేంకటేశ యేలితి వీకె నింతైతే
సన్నల నింకాఁ గూడఁగా చాలు ననఁగలదా ॥ ఒక ॥ 350

## రామక్రియ

వెక్కసపు నీ కతలు విని విని వెగటయ్యీ
యెక్క డెక్కడ నీ పగటు యెవ్వరిఁ బోలుదువే ॥ పల్లవి ॥

అతఁడు నీ మగఁడనే వాలనైతి నీ వనేవు
యేతులేమి చెప్పేవే యిందరితోను
రాతిరిఁ బగ లీతని రతికిఁ గాచుకుండిన
యీ తరుణిమణులలో [1]నెవ్వరిఁ బోలుదువే ॥ వెక్క ॥

నిన్నుఁ బాయలేఁ డనేవు నీకు వలచు ననేవు
యెన్నిలేవే నీమాఁట లిటువంటివి
వున్నతి నాతనివద్ది వూడిగాలవారిలోన
యెన్ని చెప్పే మంటే నీవు యెవ్వరిఁ బోలుదువే ॥ వెక్క ॥

నీకు ననుచు ననేవు నీ వావులు దెలిపేవు
యీకడ నీ మేకులకు నేది గురుతే
చేకొని న న్నేలినాఁడు శ్రీవేంకటేశ్వరుఁడు
యీ కులకాంతలలో నీ వెవ్వరిఁబోలుదువే ॥ వెక్క ॥ 351

## దేసాళం

తోడఁబెండ్లికూఁతురవా తొయ్యలి నీవు
బేడుకోలవై సందడిఁ బెండ్లాడ వచ్చేవు ॥ పల్లవి ॥

కడఁగి యాతఁడు వేరే కాంతఁ బేరఁ బిలువఁగా
యెడచొచ్చి పలికేవు యిదేమే నీవు
బడినే యాకెకు మరి బాగా లొసఁగఁగాను
నడుమఁ జేయొగ్గే విది నాయమౌనటే ॥ తోడఁ ॥

ఆముక చక్కనిదని యాకె నే పొగడఁగాను
నీ మోముఁ జూపవచ్చేవు నేరుపౌనటే
గోమునఁ దొడపై కాపెఁ గొంగువట్టి తియ్యఁగాను
యేమరించి కూచుండితి విది మేలే నీవు ॥ తోడఁ ॥

1. 'ఎవ్వరికి', 'ఎవుడు' వ్యావహారికము.

యెనసి యాతఁ డాకెతో నేకతాలు చెప్పఁగాను
విసే నంటా నీవేల వీను లొగ్గవే
మన సాకెపై నుండఁగా మరి శ్రీవేంకటేశ్వరుఁ
జనుఁగవ నొత్తికూడ [1]సంగతౌనా నీకు ॥ తోడఁ ॥ 352

## ముఖారి

ఎంతవని సేసితివో యిందాఁకా నీవు
చెంత నిన్ను గిజి గిజి సేసిన దెవ్వతయ్యా ॥ పల్లవి ॥

చెక్కులవెంటా నిండుఁ జెమటలు గారఁగాను
యెక్కడనుండి వచ్చితి వేమయ్యా
మక్కువతో నిన్నుఁ జూచి మనసు నీరై కరఁగె
అక్కడ నెవ్వతె నిన్ను నలయించెనయ్యా ॥ ఎంత ॥

వీఁపువెంటాఁ గొప్పువీడి విరులు రాలఁగాను
యేపున వడదేరీ మో మిదేలయ్యా
వోపిన నీ యలమటకొగిఁ గనికరమాయ
రాఁపుల నిన్నుఁ బెట్టిన రమణి యెవ్వతెయ్యా ॥ ఎంత ॥

సెలవులవెంటాఁ దమ్మచెదరులు రాలఁగాను
యెలమిఁ గప్రమడిగే వెంత కెంతయ్యా
అలరి శ్రీవేంకటేశ యట్టె నన్ను నేలితివి
పొలఁతి యెవ్వతె నిన్నుఁ బుత్తెంచెనయ్యా ॥ ఎంత ॥ 353

## పాడి

చెలులాల చూడరే చెలువుని మన్ననలు
యెలమి నా భాగ్య మిఁక నేమని చెప్పుదునే ॥ పల్లవి ॥

ఆనలువెట్టి పిలిచి యాసలెంత రేఁచీనే
తా నెంత నే నెంత తమకించీని
ఆనుకొని నా వలపు ఆరడి నేల పెట్టీనే
మోనముతోఁ జేతులెత్తి మొక్కుఁతా నుందానను ॥ చెలు ॥

కాలు దొక్కి మనసెంత కరఁగించి చొక్కించీనే
యేలినవాఁడు తాను యిల్లాల నేను
మూలనున్న నా సిగ్గు ముంగిట నేలవేసీనే
గోలతనమున వేఁడుకొంటా నుందానను ॥ చెలు ॥

కూడి [1]యంత సంతోసాన గుబ్బతిలఁ జేసీనే
వేడుకకు ముందే తాను వెనక నేను
యీడనే శ్రీవేంకటేశుఁ డెనసి యాల మెచ్చీనే
ఆడా నీడాఁ దనుఁ గొనియాడుతానుందానను ॥ చెలు ॥ 354

## రేకు 1970 సామంతం

వాకిట నేమి సేసేవు వనిత నీకు మేలుది
దాకొని నీ వొడఁబాటు తప్పకువయ్యా ॥ పల్లవి ॥

వెన్నెల బాయటనుండి వెలఁది నిన్నుఁ బిలిచీ
పన్నుకొని మరియేమో పని గద్దంటా
యిన్నిటా నే మడిగితే నించుకంతైనాఁ జెప్పదు
విన్నపమేమి సేసీనో విందువు రావయ్యా ॥ వాకి ॥

మేడలోననుండి నీకు మెలుఁత లేక లంపె
జోడుగూడి సంతోసపు సుద్దులకును
వోడక [2]ముద్దురతోనే వున్నవి నేమెరఁగము
జాడతోడ నీకు నీవే చదువుకోవయ్యా ॥ వాకి ॥

1. యెంత కావచ్చు. 2. 'ముద్ర'కు తద్భవము.

యింటిలోనుండి వుంగర మింతి నీకుఁ జూపుమనె
తొంటిమాఁట నీవే తలఁతు వనుచును
జంటై వచ్చి కూడితివి సరుగ శ్రీవేంకటేశ
అంటి యీకెతో నేకత మాడుకోవయ్యా ॥ వాకి ॥ 355

## పాడి

ఏమి సేసే విక్కడను ఇంతి మనోరథములు
వాములు వేసుకున్నది వైళమే రావయ్యా ॥ పల్లవి ॥

వంతులు వెట్టుక నీపై వలపులెల్లా నాడ
దొంతులు వెట్టుకున్నది తొయ్యలి
చెంతనే చెక్కుచేతితో చెమటల కాలువల
చింతలకు నీరు గట్టీఁ జిత్తగింతువు రావయ్యా ॥ ఏమి ॥

జాలితోడ విరహాన సారెకు నిట్టూర్పుల -
గాలి ముడియలు గట్టీఁ గామిని
తాలిమితోఁ గోరికలఁ దగిలించి రతులకు
గాలాలు వేసుకున్నది కనుఁగొందువు రావయ్యా ॥ ఏమి ॥

రాఁపుల నీవు వచ్చేటి రాకల కెదురుండి
చూపులఁ బౌఁజులు వెట్టీ సుదతి
యేపున శ్రీవేంకటేశ యేలితివీకెను మోవి -
తీపుల విందులు వెట్టీఁ దిలకింతువు రావయ్యా ॥ ఏమి ॥ 356

## దేసాళం

తా నూరకే యాపనులు దడవీఁ గాక
నేనేమైనాఁ దనమీఁద నేరాలు వేసేనా ॥ పల్లవి ॥

యెట్టుండినా నమ్మిక త న్నెగసక్యాలాడేనా
పెట్టరాని యానలేల పెట్టుకొనీనే
గుట్టుతోడఁ దలవంచుకొని వున్నదాన నేను
నట్టనడుమఁ దానేల నవ్వులు నవ్వీనే ॥ తానూ ॥

యెంతసేసినాఁ దనపై యిట్టే నిందలు మోపేనా
కాంతలఁ దెచ్చేల తారుకాణ సేసీనే
సంతోసాన నాలో నేనే సమ్మతించుకున్నదాన
చెంతనుండి మరి నేల సిగ్గులు వడీనే ॥ తానూ ॥

యేరీతి మెలఁగినాను యెగ్గుపట్టి దూరేనా
సారె నన్నే లొడఁబరచఁగ వచ్చీనే
కోరి శ్రీవేంకటేశుఁడు కూడినాఁడు దా నన్ను
గారవించి యాల యిచ్చకములు నెరపీనే ॥ తానూ ॥ 357

## శంకరాభరణం

సంతోసములాయ మాకు సరి మిమ్మిద్దరిఁ జూచి
వింత వింత నేరుపుల వెలయవే చెలియా ॥ పల్లవి ॥

వదలక నీ విభుఁడు వద (ద్ద?) కు వచ్చెఁగదవే
యెదురెదురే చూచితి విందాఁకాను
కొదదీర మాఁటపలుకులు నీతో నాడెఁగదే
కదలక యిందుకే యాఁకరుకొంటానుంట్టివి ॥ సంతో ॥

చనవిచ్చి యప్పటిని సరసములాడెఁగదె
యెనయుఁగఁ గోరితి విందాఁకాను
కనుఁగొని నిన్నుఁ గూడి కాఁపురము సేసెఁగదే
జానుగుచు సగినాలే చూచుకొంటానుంటివి ॥ సంతో ॥

చక్కఁగా నీ కాఁగిటికి సతమాయఁగదవే
ఇక్కువఁ గాచుకుండితి విందాఁకాను
నిక్కి శ్రీవేంకటేశుఁడు నిన్ను నేలెఁగదవే
చొక్కి యలమేల్మంగవు మొక్కుకొంటానుంటివి ॥ సంతో ॥ 358

## బౌళి

ఇంకనేల సిగ్గువడే విద్దరు నున్నా రీడను
కొంకక నన్ను మన్నించి కూడితివి నాఁడే ॥ పల్లవి ॥

కంకణాలచేత నాపె కానుక లిచ్చీ నీకు
అంకెలఁ బరాకుమాని అందుకోవయ్యా
సంకెలేక నీముందర చక్కఁగా నిలుచున్నది
పంకించక నీ మోము చూపఁగదవయ్యా ॥ ఇంక ॥

మూరెఁడు దురుము వంచి మునుకొని మొక్కీ నీకు
తేరకొనఁ జూచాకెను దీవించవయ్యా
కూరిమి గొసరి నీ కొలువులు సేసీని
సారెకును మెచ్చి మెచ్చి సంతోసించవయ్యా ॥ ఇంక ॥

వెలయ కప్రపు నోర విన్నపాలు సేసీ నీకు
లలిఁ జెవులారా విని లాలించవయ్యా
[1]అలమేల్మంగను నే నీ యాలను శ్రీవేంకటేశ
వలచి వచ్చినాపెను వడిఁ జేకొనవయ్యా ॥ ఇంక ॥ 359

## శ్రీరాగం

ఎంత గుట్టు నెరపేవే యెందాఁకాను
పొంతనే మగనితోఁ గాపురము సేయఁగదే ॥ పల్లవి ॥

1. 'అలమేల్ మంగను'. రేకు.

వుమ్మగిలుఁ జెమటలు వుప్పతిలీ నీమేన
కమ్ముకొన్నవలపు లెక్కడ దాఁచేవే
నెమ్మది నీ తలపోఁత నిట్టూరుపులే చెప్పీ
అమ్మరో నీ విరహ మెట్టడంచుకొనేవే ॥ ఎంత ॥

సురతపు టాసలు చూపులలోన నున్నవి
వరుస నీ తమక మేవంకఁ బెట్టేవే
నిరతపు నీ మర్మాలు నివ్వెరగులే చెప్పీ
సొరిది నీ మోమువాడుచొ ప్పెట్టు మాపేవే ॥ ఎంత ॥

చేవదేరి పులకలు చెక్కులను నిండుకొనె
కావరపు సిగ్గు లేడ గాదెఁబోసేవే
నీ వలమేలుమంగవు నిన్నేలె శ్రీవేంకటేశుఁ -
డీవల మదనచిన (న్న ?) లేగంపఁగమ్మేవే ॥ ఎంత ॥ 360

**రేకు 1971** **శుద్ధదేశి**

ఊరకే మన మిద్దరి నుప్పతించే మింతేకాక
వీరెప్పుడూను నొక్కటే వినరమ్మ చెలులు ॥ పల్లవి ॥

సెలవి నవ్వు నవ్వులు చిత్తము గరఁగించఁగా
పలుకు చుట్టరికెము పైకొలుపఁగా
కలికిచూపులు దమకములు రేఁచఁగాను
వలవ కెట్టుందురమ్మ వనితలుఁ బతులు ॥ ఊర ॥

తక్కక మోవి తేనెలు తరితీపు సేయఁగాను
మక్కువ సరసములు మరిగించఁగా
చక్కఁదనములు లోలో సరి నాస వుట్టించఁగా
చిక్కకెట్టుండుదురమ్మ చెలఁగి దంపతులు ॥ ఊర ॥

కొనగోరిచెనకులు గుట్టు విడిపించఁగాను
తనువులకాఁగిళ్ళు తగిలించఁగా
యెనసి శ్రీవేంకటేశుఁ డీ యలమేలుమంగను
ననుచ కే లుందురమ్మ నాయకీ నాయకులు ॥ ఊర ॥ 361

## లలిత

ఎంత సులబమో నీవు యీకె యింత సేయవచ్చె
చెంతఁ దన యగ్గలిక చిత్తగించవయ్యా ॥ పల్లవి ॥

కలికి నీ మనసెల్లాఁ గరఁగ మాఁటాడవచ్చె
సొలసి సొలసి నిన్నుఁ జూడవచ్చెను
వలపు నీపైఁ జల్లి వాడిక సేసుకోవచ్చె
పిలిచి యీపెను వద్దఁ బెట్టుకొనవయ్యా ॥ ఎంత ॥

తడవి చుట్టరికము దలఁపించఁగ వచ్చె
వొడివట్టి నినుఁ గడు నుబ్బించ వచ్చె
కడు వినయాలు సేసి కాఁగిలడుగఁగ వచ్చె
యెడయ కాపె నీడనే యెదురుకోవయ్యా ॥ ఎంత ॥

ఆయములు ముట్ట నీకు నాసలు రేఁచఁగ వచ్చె
కాయజకేలి నిన్నుఁ గలయ వచ్చె
యీయెడ శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
పాయక న న్నేలితివి భామనుఁ గూడవయ్యా ॥ ఎంత ॥ 362

## బౌళి

సేసినవె చేఁత లిఁకఁ జెలఁగరే మీ రిద్దరు
మోసపో వీవలపులు మియికి మియాను ॥ పల్లవి ॥

యీడు జోడై పెనఁగితి నింతులకుఁ బతులకు
వేడు కెంత గలిగినా వేసటగాదు
పాడి పంతా లొక్కపై పరగినవారికి
చూడఁ జూడఁ జేకొన్నదే చుట్టరిక మగునే ॥ సేసీ ॥

చిగిరింపుఁ జిత్తములఁ జెనకేటివారికి
తగిలి యెంత గూడినాఁ దనివిలేదు
పగటునఁ బొందు ˜ల్గి పాయకున్నవారికి
నగితే నెదురుబడి నాములెక్కును ॥ సేసీ ॥

బత్తితోడ నే పొద్దూఁ బాయకుండి (డు?) వారికి
చిత్తా లెంత గరఁగినా సిగ్గు వుట్టదు
హత్తి శ్రీవేంకటేశుఁడు అలమేల్మంగ నిన్నేలె
పొత్తుల రతులు మీకుఁ బోరచులౌను ॥ సేసీ ॥ 363

## ఆహిరి

ఏమి సేతుఁ జెలియా యెలయించీ నితఁడు
కామించి కామించి కరఁగీ నా మనసు ॥ పల్లవి ॥

చెలిమి సేసినవాఁడు చేరి యెప్పుడు వచ్చీనో
మలసి యేమని నాతో మాఁటలాడీనో
నలిరేఁగి యెటువలె నవ్వులు నవ్వీనో
తలఁచి తలఁచి కడుఁ దమకించీ మనసు ॥ ఏమి ॥

మొగము చూచినవాఁడు మోహమెంత నెరపీనో
తగులై యెట్లా నన్ను దయసేసీనో
మిగులాఁ జుట్టరికమై మెచ్చి యేమి యిచ్చీనో
చిగిరించి చిగిరించి చిమ్మిరేఁగీ మనసు ॥ ఏమి ॥

సేసవెట్టినట్టివాఁడు సేవ లెటులాఁ గొనీనో
వేసరక రతి నెంత వెలయించీనో
ఆసల శ్రీవేంకటేశుఁ డలమేల్మంగను నేను
లాసి లాసి కూడె వుల్లాసించీ మనసు ॥ ఏమి ॥ 364

## వరాళి

కంతుఁడుసేసినమాయ గడవరాదు
యెంతైనాఁ దప్పించుకొన నెట్టు వచ్చునే ॥ పల్లవి ॥

నిక్కి చూచిన చూపులే నిండా నాసలు వుట్టించు
మొక్కిన మొక్కులే కడు మొగ మోడించు
పక్కన నవ్విన నవ్వే భావములు గరఁగించు
యెక్కడాఁ దప్పించుకొన నెట్టు వచ్చునే ॥ కంతుఁ ॥

తలఁచిన తలఁపులే తగులాయములు సేసు
పలికిన పలుకులే పాదుకొలుపు
సొలసిన సొలపులే చుట్టరిక మొనరించు
యెలమిఁ దప్పించుకొన నెట్టు వచ్చునే ॥ కంతుఁ ॥

పెనఁగిన పెనఁగులే ప్రియములు వెడరేఁచు
ననిచిన ననుపులే నంటుకొలుపు
[1]చెన కెలలమేల్మంగను శ్రీవేంకటేశుఁడు గూడె
యెనసి తప్పించుకొన నెట్టు వచ్చునే ॥ కంతుఁ ॥ 365

## ముఖారి

వెలఁది చందములెల్లా విన్నవించితి మిదిగో
తలఁపెరిఁగి మన్నించి దయఁజూడు మిఁకను ॥ పల్లవి ॥

1. చెనకి + అలమేల్మంగను.

చెలులతో నీ కతలు చెప్పి గొంత తనివొందు
తలపోఁతలనుఁ గొంత తమకమార్చు
కలలోన నీ రూపు గని సంతసించుకొను
కలికిఁ గాఁగిట నెపుడు గలసేవోకాని ॥ వెలఁ ॥

పొదలి నీ కెదురు చూపులఁ గొంత చెలరేఁగు
కదియు రతి వేడుకలఁ గాఁకలార్చు
ముద మలర నీ పదంబులు వాడి మది గరఁగు
ఇది యెరి గి చన వెటుల నిచ్చేవోకాని ॥ వెలఁ ॥

నిను బయలు గాఁగిటను నించి కొంత పొద్దు జరపు
వినుకలినిఁ దనలోని విరహ ముడుపు
యెనసితివి శ్రీవేంకటేశ యలమేల్మంగను
ననుపులిఁక నెటువలెను నడపేవోకాని ॥ వెలఁ ॥ 366

**రేకు 1972 ముఖారి**

మేలు మేలు చెలులెల్లా మెచ్చిరి నీ చేఁతలకు
చాలా నేరుపుల నీతో సరి యెవ్వరమ్మా ॥ పల్లవి ॥

పెదవినే మాఁటలాడి పిలిచేవు రమణుని
కదలుఁ గన్నులఁ జూచి కరఁగించేవు
వెదచల్లునవ్వులను వేడుకలు రేఁచేవు
చదురుఁదనాల నీతో సరి యెవ్వరమ్మా ॥ మేలు ॥

సన్నలనే యాతనితో సాములెల్లాఁ జేసేవు
తిన్నని తురుము చూపి తేలించేవు
చన్నులంటి వలపులు చవులు వుట్టించేవు
సన్నుతించేనంటే నీతో సరి యు(యె?)వ్వరమ్మా ॥ మేలు ॥

వింతగా మొక్కుతానే శ్రీవేంకటేశు నుబ్బించేవు
పొంత నలమేల్మంగవై పోది సేసేవు
యింతలోనే నిన్ను నేలె యీతఁ డిన్నిటా వలచి
సంతతము నీతో నింత సరి య(యె?)వ్వరమ్మా ॥ మేలు ॥ 367

## దేసాళం

ఇంతటిదానవౌత యెఱఁగమమ్మా
పంతాన నీకంటే నేను బల్లిదురాలనమ్మా ॥ పల్లవి ॥

కన్నులార్చ నేరుతువే కత చెప్ప నేరుతువే
సన్నలు సేసేటి వేసాలు నేర్తువే
యిన్నిచేఁతలు సేసేకా యీతని దక్కఁగొంటివి
మిన్నక వూరకుండితే మెచ్చేరా సతులు ॥ ఇంత ॥

నసుపు సేయ నేర్తువే నవ్వులు నవ్వ నేర్తువే
పెనఁగులాడి బత్తి పెంచ నేర్తువే
చెనకి చెనకి యింత సేసితివి మగవాని
జానిగితే మెరసునా సుదతులపగటు ॥ ఇంత ॥

చెలిమి సేయ నేర్తువే చేరి కూడ నేరుతువే
వలపించి రతులకు వంచ నేర్తువే
అలమె శ్రీవేంకటేశుఁ డలమేల్మంగను నేను
కలపుకోలిట్లానే కావద్దా యింతులకు ॥ ఇంత ॥ 368

## పాళంగవాట

వట్టి చుట్టరికములు వడిగాఁ జేసే వదేమే
యిట్టె మేలువాఁడు యిన్నిటా నా కితఁడు ॥ పల్లవి ॥

యిత్తల నాతఁడు నేనూ నేకతములాడఁగాను
పొత్తుల మాఁటాడేవు పొద్దు వోదటే
మత్తిలి సరసములు మాలో నేమాడఁగాను
హత్తి తోరలించుకొనే వప్పటినేమే ॥ వట్టి ॥

జంటలై నే మిద్దరమూ జవాది పూసుకోఁగా
అంటించుకో వచ్చేవు అదో నీవు
నంటుతోడ మాలో నేము నవ్వులు నవ్వుకోఁగా
వెంట నీవూఁ దోడంటేవు వేడుకాయ నటవే ॥ వట్టి ॥

శ్రీవేంకటేశుఁడు నేనూఁ జేరి కాఁగిట నుండఁగా
వావి గలపఁ జూచేవు వైపౌనటవే
యీవేళ నలమేల్మంగ నీతని ద్రేవులనైతి
నీవూఁ దగులు సేసుకొనేవు మేలు మేలే ॥ వట్టి ॥ 369

## కాంబోది

నాతులెల్లాఁ బొగడేరు నలినలోచన నిన్ను
నీతులెల్లాఁ బచరించ నీవే నేరుతువే ॥ పల్లవి ॥

యితవైన చోటికి యేమి సేసినా సమ్మతి
రతికెక్కిన మీఁదట రారాఁపు లేదు
సతమైన పనులకు సాదించఁ బనిలేదు
చతురత లివియెల్లా సతి నీవే నేర్తువే ॥ నాతు ॥

మొగమోట లొనరితే ముందు వెనక లెంచరు
నగితేనే మనసులు నమ్మిక వుట్టు
తగవు దప్పకుండితే తాలిమి తానే కలుగు
నిగిడి యీ పనులకు నీవే నేరుతువే ॥ నాతు ॥

మచ్చికలు నెరపితే మర్మములు గరఁగును
ఇచ్చకము సేసితేను యెరవుగాదు
అచ్చపు శ్రీవేంకటేశుఁ డలమేల్మంగ నిన్నేలె
నిచ్చలు యీ సొబగులు నీవే నేరుతువే ॥ నాతు ॥ 370

## శంకరాభరణం

వేడు కిది దాఁచరాదు వెల్లవిరిఁ జేయరాదు
కూడిన తారుకాణలు గుట్టుతోనే వున్నవి ॥ పల్లవి ॥

ఆడుకోలుమాఁట గద్దు ఆతనికి నాకును
తోడితేవే విన్నవించే తోడనే నేను
జోడిం చొకరితోఁ జెప్పేసుద్దులు గావు
జాడతో నే నెరుఁగుదు సరిఁ దా నెరుఁగును ॥ వేడు ॥

సేసిన గురుతు గద్దు చేరి మా యిద్దరికి
రాసికెక్కఁ జూచెను రమ్మనఁగదె
మూసిమంతనములైన మొరఁగులవి
ఆసల నాయందు నున్నవా తనందు నున్నవి ॥ వేడు ॥

యేకతపు పొందు గద్దు యిద్దరికిని
జోకతో శ్రీవేంకటేశుఁ జూపఁగదవే
మాకె తెలుసు [1]నలమేలుమంగను నేను
యీకడ నా మగఁ డీతఁ డీతని దేవులను ॥ వేడు ॥ 371

## మాళవిగౌళ

కంటిమే నీ యెమ్మెలెల్లాఁ గన్నులారాను
యింటిలోనుండేసతుల కింత రట్టు వలెనా ॥ పల్లవి ॥

1. 'వలమంగను' రేకు.

చక్కనిదాన వౌదువే సరసురాల వౌదువే
పిక్కటిల్లుపిరు(దుల పెద్ద వౌదువే
పక్కన నీ మురిపెము పతి ముందర( జూపేవు
నెక్కొని యీ కాంతలెల్లా నీకొల(దివారా ॥ కంటి ॥

పుప్పొడి చల్లుకొంటివే పువ్వులు ముడిచితివే
కొప్పు నిక్క(బెట్టుకొని గురియైతివే
చొప్పుగా నీ సింగారాలే చూపే వీతని యెదుట
యిప్పు డీ కొమ్మలలో నీ వెవ్వరి( బోలుదువే ॥ కంటి ॥

సొలపుల( జూచేవే జూటవై మెరసేవే
కలికితనాలె యెంత కడు( జూపేవే
అలమె శ్రీవేంకటేశు( డలమేల్మంగను నేను
యెలనాగ విందగిలో నెవ్వరి( బోలుదువే ॥ కంటి ॥ 372

**రేకు 1973** **వరాళి**

చిన్నదాన( జెప్పేనంటే సిగ్గయ్యీ నాకు
తన్ను( దానే తెలుసుక దక్కి వుండు మనవే ॥ పల్లవి ॥

సొలపు(జూపుల తొల్లి చూచినచుట్టరికము
పలుమారు నెడతా(కి పాయని చుట్టరికము
తలపో(తలనే కడు దక్కిన చుట్టరికము
కలదు తనకు నాకు( గరుణించు మనవే ॥ చిన్న ॥

మా(టలనే మరిగిన మచ్చిక చుట్టరికము
నాటుకొన్న వలపుల నమ్మిన చుట్టరికము
తేటల సరసముల తెగని చుట్టరికము
పూ(ట పూ(ట కిట్లనే పొదలించు మనవే ॥ చిన్న ॥

యెనసిన కాఁగిళ్ళలో హెచ్చిన చుట్టరికము
మనసు మర్మములనే మాఁగిన చుట్టరికము
తన దేవి నలమేల్మంగను తానే శ్రీవేంకటేశుఁ
డొనర నన్నేలె నింకాఁ జనవు లిమ్మనవే ॥ చిన్న ॥ 373

## బౌళి

ఎక్కడనుండి వచ్చెనో యేఁకరి నీ రతులకు
చిక్కించుక కాఁపురము సేయవయ్యా ॥ పల్లవి ॥

లక్కవలెఁ గరఁగీని లలన నీ మాఁటలకు
చొక్కుచు నాపె వలపు చూడవయ్యా
మొక్కుచు వినయాన నీ ముందర నిలుచున్నది
అక్కర యెంత గలదో అడుగవయ్యా ॥ ఎక్క ॥

జిగురువలె నంటీని చెలియ నీ పొందులకు
తెగని చుట్టరికము తెలియవయ్యా
నగుతా సారెకు నీతో నను్పులే పచరించీ
చిగిరింపుఁ గోరికలు చెల్లించవయ్యా ॥ ఎక్క ॥

తీగెవలె నల్లుకొనీ తెరవ నీ కాఁగిటికి
జాగులు సేయ కది విచారించవయ్యా
యీగతి శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
బాగుగా నన్నేలితి వాపడఁతి నేలవయ్యా ॥ ఎక్క ॥ 374

## పాడి

కంటిమి వింటిమి మీ కతలెల్లాను
జంటలై మీ కోరికలు సాదించుకోరాదా ॥ పల్లవి ॥

చెలిమి సేసినవారు సిగ్గులు వడ నేఁటికి
నలిరేఁగి వేడుకతో నవ్వుట గాక
మొలచిన వలపులు మూసి దాఁచ నేమిటికి
చెలరేఁగి వెల్లవిరి సేసుకొనరాదా ॥ కంటి ॥

ఆస గలిగినవారు అనుమానించ నేఁటికి
తాసువలెఁ గూడి మాడి దక్కుటగాక
సేసవెట్టి పెండ్లాడుతా శిరసు వంచ నేఁటికి
పోసరించి వెరవక భోగించరాదా ॥ కంటి ॥

చనవు గలుగువారు జడియఁగ నేమిటికి
పెనఁగి రతులు పైపైఁ బెంచుటగాక
యెనసితివి శ్రీవేంకటేశ యలమేల్మంగను
నను వలెనే యాకెతో నంటు సేయరాదా ॥ కంటి ॥ 375

## నాదరామక్రియ

పొద్దువో దిదొకకత పూఁచి యానతియ్యవయ్య
గద్దరి నీ చేఁతలకు కాదు గూడ దనను ॥ పల్లవి ॥

కాంతఁ జూచి వచ్చితివా కన్నులారాను
మంతనాన నోరారా మాఁటాడితివా
సంతోసించి యాపె సరసము లాడెనా
వింతలెల్లాఁ జెప్పవయ్యా వినే నేను ॥ పొద్దు ॥

చుట్టమవై వచ్చితివా సుదతికిని
నెట్టన నీ కాఁగిట నించుకొంటివా
అట్టె విందులు నీకు నాపె వెట్టెనా
నెట్టుకొని చెప్పవయ్యా నిన్ను మెచ్చేను ॥ పొద్దు ॥

కాలుదొక్కి వచ్చితివా కలకంటిని
మేలువాఁడ వైతివా మిక్కిలి నీవు
యీలీల శ్రీవేంకటేశ యిట్టె నన్ను నేలితివి
ఆలిసుద్ది చెప్పవయ్యా అడిగేను నిన్నును ॥ పొద్దు ॥ 376

## పాడి

ఇంతి లాగులెల్లా నీకు నెరిఁగించితిమి నేము
మంతు కెక్కించి యీపెను మన్నించవయ్యా ॥పల్లవి॥

యెదురులు చూచీ నీకు; యింతులనుఁ గొంత దూరు
వుదుటు గుబ్బలపై నిట్టూర్పు చల్లును
చెదరుఁగురులు దువ్వు చెక్కుపైఁ జేయి చేర్చు
యిదివో నీ సతి సుద్దు లింకా నడుగవయ్యా ॥ఇంతి॥

నిలువెల్లాఁ జెమరించు నీపై పాటలు వాడు
తలఁచు నీ రూపము తమకించును
సొలసు నూరక నిన్ను చొక్కుఁదనలోనె తాను
వెలఁది వలపు రీతి విన్నవించితిమయ్యా ॥ఇంతి॥

నివ్వెరగుతో నుండు నీకు లేకలు వా(వ్రా?) సు
పవ్వళించి నీ రతులు భావించును
ఇవ్వల శ్రీవేంకటేశ ఇంతి నిట్టె యేలితివి
రవ్వలాయ నీకుఁగానే రమణిఁ జూడవయ్యా ॥ఇంతి॥ 377

## లలిత

ఎఱుఁగుదుఁ దన సుద్దు లిన్నియుఁ దొల్లె నేను
తఱచాయ ముచ్చటలు తలఁచుకొమ్మనవే ॥పల్లవి॥

ననుపులు నిజమైతే నవ్వులు సేనాసేన
మనసు లెనసితేను మాఁటలు పెక్కు
వినయము నెరిచితే వెలయు సంగాతము
తనతో నెదురాడేనా దగ్గరి రమ్మనవే ॥ఎఱుఁ॥

చూపులు నాఁటఁ జూచితే చొక్కులు కోటానఁగోటి
వోపికలు గలిగితే వాడి నిండును
కాఁపురాలు సతమైతే కైవసమౌ వలపులు
యే పనులు చెప్పినాను ఇయ్యకొంటి ననవే ॥ఎఱుఁ॥

సరసము లొనరితే చనవులు చెల్లుబడౌ
సరవులు చక్కనైతే చవులు వుట్టు
ఇరవై శ్రీవేంకటేశుఁ డిప్పుడు వచ్చి నన్నేలె
మరిగితి నిట్లానే మన్నించు మనవే ॥ఎఱుఁ॥ 378

**రేకు 1974** **రామక్రియ**

ఇన్నిటా మంచిదానవు యీతని నొరయనేలే
మిన్నక సేవలు సేసి మెప్పించవలెఁగాకా ॥పల్లవి॥

చక్కెర వంటిది మోవి జవ్వాదివంటిది తావి
జక్కవలఁ బోలును చన్నులు నీవి
వెక్కసా లే లాడేవే విభుఁడు చెనకెనంటా
చొక్కుచు వినయములే చూపవలెఁగాక ॥ఇన్ని॥

చిగురువంటిది మేను సింగమువంటిది కౌను
మొగము చంద్రకళల మూఁకలనాను
బిగియుచు దూరనేలే పెనుఁగొప్పు ముట్టెనంటా
జిగిమించఁ బ్రియాలెల్లాఁ జెప్పవలెఁగాకా ॥ఇన్ని॥

పుత్తడివంటిది రూపు పూవులవంటిది చూపు
గుత్తపుఁ బిరుఁదు కరికుంభాల దాపు
వొత్తనేలే శ్రీవేంకటోత్తముఁడు గూడె నంటా
పొత్తుల నీతని మేలు పొగడవలెఁగాకా ॥ఇన్ని॥ 379

**పాడి**

నాపై బత్తి గలఁడు నన్ను మన్నించీ నితఁడు
రేపు మాపుఁ జింత లిఁక రేఁచకురే మీరు ॥పల్లవి॥

చెలిమి సేసినవాఁడు సేవ గొనకుండునా
పలుమారు పతికిఁ జెప్పుకురే మీరు
వలపించినట్టివాఁడు వాడిక లెరఁగఁడా
బలిమిసేసి కొంగువట్టకురే మీరు ॥నాపై॥

యింటికి వచ్చినవాఁడు యెనయక వుండునా
అంటి ముట్టి సారె సొలయకురే మీరు
జంటయై పాయనివాఁడు చనవెల్లా నియ్యఁడా
దంటతనాన నేమీఁ దడవకురే మీరు ॥నాపై॥

నమ్మిక లిచ్చినవాఁడు నన్ను నేలకుండునా
కమ్మటిఁ గమ్మటిఁ బెనఁగకురే మీరు
ఇమ్ముల శ్రీవేంకటేశుఁ డిటు వచ్చి నన్నుఁ గూడె
చిమ్ముఁగొనగోళ్ల సన్న సేయకురే మీరు ॥నాపై॥ 380

**బౌళి**

నా మీఁది బత్తితోడ నన్నుఁ బాయకున్నాఁడవు
వేమరు నుపాయాలు విచారించుకోవయ్యా ॥పల్లవి॥

ఇంటికి రావైతివంటా యెక్కడనో వుంటివంటా
కంటకము లే మాడునో కలికి నిన్ను
దంటతనాన నేమని తప్పించుకొనేవు నీవు
కంటే మొకదాకిరి గన మాపె యెడకు ॥నామీ॥

చెమట మెఇ నున్నదంటా చెదరె నీ కురులంటా
తమకించి యేమనునో తరుణి నిన్ను
అమర నెట్లా మాటలాడుకొనేవో నీవు
సముకాన నిచ్చకుఁడవు నీవు ॥నామీ॥

నాకు మేలువాఁడవంటా నమ్మిక లిచ్చితివంటా
యీకె రతి నెంత యలయించునో నిన్ను
చేకొని న న్నేలితివి శ్రీవేంకటేశుఁడ
పైకొని యీపె నెట్టోడఁబరచేవో నీవు ॥నామీ॥ 381

## దేసాళం

ఆతఁ డెంత నీ వెంత అమ్మరో నీవు
చేతులెత్తి మొక్కు మొక్కి సేవ సేయఁ గదవే ॥పల్లవి॥

మెలఁగి యాతఁడు నీకు మిక్కిలి వలచునంటా
కలికితనాల నెంత గయ్యాళించేవే
కలకాలము నీతోనే కాఁపురము సేసెనంటా
నలి రేఁగిరేఁగి యేమి నవ్వు నవ్వేవే ॥ఆత॥

చెంది నీ చనువు లెల్లాఁ జెల్లించీనంటాను
మందె మేళమున నెట్టు మాఁటలాడేవే
సందడించి నీ యింటికి సారెకు వచ్చీనంటా
గొంది నుండి యేల రాకొట్టు గొట్టేవే ॥ఆత॥

యెనసి యాతఁడు నిన్ను నెగ్గు లెంచఁ డంటాను
పెనఁగి యేఁటికి మోవి పిప్పి సేసేవే
వినయాన నితఁడే శ్రీవేంకటేశుఁడు నిన్నేలె
గొనకొని యెందాఁకాఁ గోరి కొసరేవే ॥ఆతఁ॥ 382

## రామక్రియ

ఎవ్వ రెరుఁగుదురమ్మా యిటువంటి నీ సుద్దు -
లివ్వల నేఁ డప్పటి మా యింటికి వచ్చితివి ॥పల్లవి॥

కలికితనములనే కరఁగించితివి పతి
సెలవి నవ్వులు నవ్వి చిమ్మిరేఁచితి
మలకల మాఁటలాడి మరిగించుకొంటివి
యెలమి నీతని నింకా నేమి సేతువో ॥ఎవ్వ॥

చేతులెత్తి మొక్కి మొక్కి చేతికి లోఁ జేసితివి
యేతులెల్లాఁ జూపి చూపి యెలయించితి
కాతరానఁ గాలు దొక్కి కడుఁ జోకఁ జేసితివి
యీతల నీతని నింకా నెంత సేతువో ॥ఎవ్వ॥

సన్నల నీ మోవినే చవులు గొలిపితివి
పన్నిక చెనకులనే భ్రమయించితి
యిన్నిటా శ్రీవేంకటేశుఁ డీతఁ డిట్టె నన్నుఁ గూడె
యెన్నిక చేఁతల నీవు యెంత సేతువో ॥ఎవ్వ॥ 383

## మాళవిగౌళ

నవ్వేవారి నెఱఁగవు నాతిరో నీవు
పువ్వువంటి సిగ్గు దెచ్చి పొల్లు సేయవలదే ॥పల్లవి॥

హత్తి నేనూ నాతఁడు నంటి సరసమాడఁగా
పొత్తుగలయవచ్చేవు పొసఁగునటే
కొత్తగాఁ గన్నకలలు కోరి నేము చెప్పుకోఁగా
వొత్తి యర్థా లడిగేవు వుండఁబట్ట దటవే ॥నవ్వే॥

జాడతో నిద్దరము సేసలు చల్లుకొనఁగాను
తోడఁ బెండ్లాడ వచ్చేవు దొరసునటే
నీడల చక్కఁదనాలు నే మద్దములోఁ జూడఁగా
ఆడ నీ మొగము చూపే వమరున ॥నవ్వే॥

తేరకొన మాలో నేము తెరవేసుకుండఁగాను
[1]పొర చెడుగ వచ్చేవు పొద్దువోదటే
యీరీతి శ్రీవేంకటేశుఁ డిన్నిటా న న్నేలఁగాను
నేరిపేవు రతు లాతనికిఁ దగునటవే ॥నవ్వే॥ 384

రేకు 1975 సౌరాష్ట్రం

ఎట్టున్నదో నీ చిత్తము యెఱఁగమయ్యా
చుట్టపు వరుసలివి చూచుకొనేవయ్యా ॥పల్లవి॥

చెలిచే నప్పుడు నీవు చెప్పి పంపిన సుద్దులు
వెలఁది వేడుకతోడ వినెనయ్యా
వలపులు లేకలపై వాఁ(వ్రాఁ?) తలఁ జదువుకొని
నలిరేఁగి పకపక నవ్వెనయ్యా ॥ఎట్టు॥

అచ్చలాన నీ వుంగర మానవాలు చూచుకొని
ముచ్చటతోఁ జేతులెత్తి మొక్కెనయ్యా
మచ్చిక నీవు మన్నించే మన్నన దలఁచుకొని
కచ్చు పెట్టి సంతోసానఁ గడుఁ బొగడేనయ్యా ॥ఎట్టు॥

1. పొరచి+అడుగ

కడు బత్తి సేసి నీవు కాఁగిలించుకొన్నందుకు
కడఁకతోడ మనసు గరఁగెనయ్యా
యెడయక శ్రీవేంకటేశ నీ గుణ మెరిఁగి
బడివాయనని నీతో బతిమి వట్టెనయ్యా ॥ఎట్టు॥ 385

## సామంతం

మంచివాయఁ బనులెల్లా మడుఁగులో మైలలేలే
నించి నించి నీ మగఁడు నీతో నవ్వఁగాను ॥పల్లవి॥

బొమ్మల విండ్లేమిటికి పూఁచి యెక్కువెట్టేవే
కుమ్మరింపుఁజూపులనే గురుతులేల యేసేవే
వుమ్మగిలునిష్టూరము లొడిఁగట్టుకొననేలే
వుమ్మడి నీతఁడు నిన్ను నొడఁబరచఁగాను ॥మంచి॥

మాటల కత్తు లేఁటికి మరి యెంత నూరేవే
చాటు వెట్టుక గుబ్బల సాము లెందాఁకాఁ జేసేవే
గాఁటపుచలము లింత గాదెఁ బోసుకొనేలే
కూటమి కితఁడు వేఁడుకొని కొసరఁగను ॥మంచి॥

సిగ్గుల యరిగె లేల చేరి చాటు వెట్టేవే
బగ్గనఁ దమకముల పాఁజా లెంత చూపేవే
వొగ్గి కాఁగిటిలోఁ బంతా లూరకే నెరపనేలే
యెగ్గులేక శ్రీవేంకటేశుఁడు నిన్నేలఁగాను ॥మంచి॥ 386

## బౌళి

చూడఁ బిన్నదానవు జాటుఁదనాలు గనము
వాడికెతోఁ బతి నెంత వలపించేవే ॥పల్లవి॥

తెరమరఁగులలోని తేటమాఁటలు
విరులఁ బూఁచి వేసేవేడుకలు

పొరుగునఁ గొసరేటిపోరచులు
నిరతితో నెన్నఁడు నేరిచితివే ॥చూడ॥

కలికితనాల మించు కనుచూపులు
తలకొన్న చెనకుల తమిరేఁపులు
వులివచ్చిసిగ్గుల వొడఁబాటులు
కలిగించుకొంటి వెంత కత కరచితివే ॥చూడ॥

బడి బడి రతులలో పడితాళాలు
కడఁగి సరసాలలో గబ్బితనాలు
తొడరి శ్రీవేంకటేశు తోడి కూటాలు
కడలేని చేఁత లెందు గడిఇంచుకొంటివే ॥చూడ॥ 387

## రామక్రియ

నా మన సేమి చూచీని నంటునఁ దానే నేను
యేమీ నన నిఁక నేల ఇంటికి రమ్మనవే ॥పల్లవి॥

పాయని చుట్టరికము పరిసిపోదెంతైనా
నాయముతోడి నడక నమ్మవచ్చును
చేయి మీఁదిఇనచేఁత చెల్లుబడి గాక పోదు
యేయెడాఁ గొంకఁగనేల యింటికి రమ్మనవే ॥నా మన॥

మచ్చికతోడివలపు మానుపరా దెంతైనా
అచ్చలమైనసరస మాస రేఁచును
కొచ్చి కొచ్చి పెనఁగితే కూటములు చవివుట్టు
యెచ్చరిక సేయనేల యింటికి రమ్మనవే ॥నా మన॥

దట్టమైన వినయాలు దాఁగనియ్య వెంతైనా
నెట్టుకొన్న పొందులు నెరవేర్చును

జట్టిగొని శ్రీవేంకటేశ్వరుఁడు నన్నిపుడేలె
యిట్టె దిన దినమూ నింటికి రమ్మనవే ॥నా మన॥ 388

**వసంతవరాళి**

[1]ఎన్నేని విన్నవించే మిపుడు నీకు
అన్నీ నీవే తెలుసుక యాదరించవయ్యా ॥పల్లవి॥

అలివేణిమదిలోని ఆ(అ?) డియాసలు
పలుకుల వినయపు పరిబాసలు[2]
చెలరేఁగి పట్టిన దోసిటి సేసలు
చెలియ చందము లివి చిత్తగించవయ్యా ॥ఎన్నే॥

కమ్మకొన్న తమకపుకనుచూపులు
తమ్మలపు మోవితేనె తరితీపులు
పిమ్మట సన్నలు సేసే పెరరేఁపులు
నెమ్మది నీవె చూచి మన్నించఁగదవయ్యా ॥ఎన్నే॥

వొద్దికైననీపై మొగమోటలు
కొద్దిలేని నీ రతుల కూటములు
ముద్దరాలి నేలితివి ముప్పిరి శ్రీవేంకటేశ
పొద్దు వొద్దు దప్పకుండా భోగించవయ్యా ॥ఎన్నే॥ 389

**మాళవిగౌళ**

సరిలేని వలపులజాణకాఁడవు
యిరవై నేమెల్లా నీకు [2]నే నెచ్చరించవలెనా ॥పల్లవి॥

చెయివట్టి చెయివట్టి చెలి చుద్దులు చెప్పఁగా
యేయడ పరాకు నీకు నేమయ్యా

---

1. ఎన్ని+అని. 2. 'పరిభాష' కు తద్భవమా? 2. ఈ 'నే' ఎక్కువగా తోచుచున్నది.

ఆయాలంటి ఆయాలంటి యప్పటి వేఁడుకోఁగాను
కాయజ కేలికి నీకెఁ గరుణించవయ్యా ॥సరి॥

సన్నసేసి సన్నసేసి సారె నిన్నుఁ బిలువఁగా
యెన్నఁడు మన్నించేవు యేమయ్యా
చన్ను లొత్తి చన్ను లొత్తి సాములు నీతోఁ జేయఁగా
చెన్నుగా నీకె చనవు చెల్లించఁదగదా ॥సరి॥

సేవసేసి సేవసేసి చేతులెత్తి మొక్కఁగాను
యేవేళఁ జిత్తగించేవు యేమయ్యా
వేవేలు చందాలను శ్రీవేంకటేశ కూడితివి
యీవిధాన నేమి యీకె నింత సేయఁదగదా ॥సరి॥ 390

రేకు 1976 నాదరామక్రియ

అరవిరిబాగుల యతివ నీ వవుదువే
సొరిది నీ వొయ్యారాలు చూడఁగ్రొత్తలాయనే ॥పల్లవి॥

నిదుర కన్నులతోడి నివ్వెరగులు
చెదరుఁ గురుల చిమ్మఁజీఁకటులు
వెదచల్లు నవ్వులవెన్నెలలు
తుదకెక్కి రతి గఱితులు నీ కొనరెనే ॥అర॥

పచ్చిదేరేటి చెక్కులపై చెమటలు
ముచ్చటలాడుకొనేటి మోవివాడులు
కొచ్చి కొచ్చి సొలసేటి కొనచూపులు
అచ్చముగ నీమేని కన్నియు నమరెనే ॥అర॥

ముప్పిరి సమరతుల మోముకళలు
కుప్పలుగా రాలేటి కొప్పువిరులు

వొప్పి శ్రీవేంకటేశుఁ గూడున్న చొప్పులు
యిప్పు డీ శింగారాలు యివి నీకే తగునే ॥అర॥ 391

## ముఖారి

వచ్చి వచ్చి మూడీఁ జొచ్చి వాత వెళ్ల నేమిటికే
మచ్చిక నీతఁడు నన్ను మన్నించెఁ జూడఁగదె ॥పల్లవి॥

సంగడి నుండి పతికి చనవరి వైతివి
అంగము లంటి యంటి ఆలవైతివి
యెంగలి మోవి చూపి యితరివైతివి
అంగడి నీ దొరతనాలవి యేమి చెప్పేదే ॥వచ్చి॥

సుద్దులెల్లాఁ జెప్పుతానే చుట్టమవూ నైతివి
పెద్దగా నవ్వులు నవ్వి ప్రియమైతివి
బద్దులు మొక్కులు మొక్కి పాఁతదానవైతివి
చద్ది వేఁడినీ బీరాలు సారె నేమి చెప్పేదే ॥వచ్చి॥

వన్నెగా సేవలు సేసి వాడికకత్తెవైతివి
సన్నలు సేసిసేసి సతమతమైతివి
యిన్నిటి శ్రీవేంకటేశుఁ డేలె నన్నుఁ దొలుతనే
యెన్నిక నీ కాఁపురాలు యేమి చెప్పేదే ॥వచ్చి॥ 392

## ఆహిరి

నీ మేలులోనివారము నీ వేల సిగ్గు వడేవే
దోమటి నీ చేఁతలు సంతోసించేముగాక ॥పల్లవి॥

చెక్కుల మీఁదటఁ గారే చెమటలే చెప్పీని
నెక్కొని యాతని తోడి నీ పొందులు
జిక్కవ చన్నుల నుండే చందమామలే చెప్పీని
యెక్కడలేని యానలేల పెట్టుకొనేవే ॥నీ మేలు॥

వుమ్మగిలుచున్న నీ నిట్టూరుపులే చెప్పీని
వుమ్మడిఁ బెనఁగులాట వుదుటులెల్లా
కమ్ముకొన్న నీ మొగముకళ లివె చెప్పీని
యిమ్ముల నీ సొదుఁ దనా లేమి నెరపేవే ॥నీమేలు॥

తొడరి జారిన నీ తురుమిదె చెప్పీని
కడలేని రతుల నీ కలయికలు
యెడయని శ్రీవేంకటేశు వుంగరమే చెప్పీ
యెడ నెడ నీ పంతా లెన్ని చెప్పేవే ॥నీ మేలు॥393

## సామంతం

ఇటువంటి వాఁడవుత యెఱఁగమమ్మా నేము
నటియించి మన్ననలు నాకు నిచ్చీ నితఁడు ॥పల్లవి॥

యింత బత్తే కలిగితే నింటికి రావలెఁగాక
సంత వలపులు మీఁదఁ జల్లనేఁటికే
వింతవారెల్లా (జూడఁగా విడె మియ్య వచ్చీని
కాంతనైతినే నన్నుఁ గాకు సేతు రటవే ॥యిటు॥

మిక్కిలి చుట్టమైతేను మేలమాడవలెఁగాక
మిక్కుటపు నవ్వు నవ్వి మీర నేఁటికి
పక్కనఁ గొలువులోన పయ్యదకొంగువట్టీని
చక్కనిదాననైతేనే చండి సేతు రటవే ॥యిట॥

కూడ వేడుకైతేను గుట్టు సేయవలెఁగాక
యెడనైనాఁ జెనకీని యిది యేఁటికే
వేడుకతో నన్నేలి శ్రీవేంకటేశుఁడు చొక్కీని
యీడైనదాననైతేనే ఇంత సేతు రటవే ॥యిటు॥ 394

## ముఖారి

మెచ్చి మెచ్చి పొగడుటే మిక్కిలి నేరుపుగాక
పచ్చిదేర నాడనేల పలుమరు నిన్నును ॥పల్లవి॥

వొట్టులు నేఁ బెట్టితేను వొడివట్టి పెనఁగేవు
గుట్టున నూరకుండితేఁ గొసరేవు
తట్టి చేత నొడ్డుకొంటే తగిలి వేఁడుకొనేవు
యెట్టు గెలువఁగవచ్చు నిటువంటి నిన్నును ॥మెచ్చి॥

సిగ్గుతోడఁ గొంకితేను సేసలు పైఁ జల్లేవు
అగ్గమై సొలసితేను ఆదరించేవు
వొగ్గి నన్నుఁ గూడితివి వొద్దికై శ్రీవేంకటేశ
యెగ్గు లెట్టు లెంచవచ్చు నిటువంటి నిన్నును ॥మెచ్చి॥ 395

## శ్రీరాగం

ముందు ముందుగాఁ బతికి మొక్కతి ననరే మీరు
మందలించి తనమేలు మరచేనా నేను ॥పల్లవి॥

చల్లఁగానే మాఁటలాడి చవులెల్లా బుట్టించి
పెల్లున నన్నిటా వలపించెఁగా తాను
యెల్లవారిలోనా నిఁక నెట్టు నన్ను మన్నించినా
చెల్లుబడిగానే సంతోసించుకొనే నేను ॥ముందు॥

పువ్వులనే నన్ను వేసి బుజ్జగించి సన్నసేసి
రివ్వనఁ జొట్టరికము రేఁచెఁగా తాను
రవ్వగాఁ దన నా పొందు రతికెక్కిన వెనక
నవ్వుతా నొక్క మనసుననే వుండే నేను ॥ముందు॥

గుట్టున నుంకువ వెట్టి కూరిములు చల్లి చల్లి
అట్టె నన్నుఁ గాఁగిటఁ బెండ్లాడెఁగాను తాను
పట్టపు దేవిఁగా నిట్టె పాలించె శ్రీవేంకటేశుఁ
డెట్టు నన్నుఁ భాలించినా నియ్యకొనే నేను ॥ముందు॥ 396

రేకు 1977 సామంతం

ఊరకె జంకించెనంటా నుప్పతించేవు
గారవపుదాని కెంత గడిఇంచేవయ్యా ॥పల్లవి॥

చెప్పిన నీ మాఁటలెల్లాఁ జెవు లాలకించి వినె
కొప్పు వట్టి తీసితే మక్కువ జేకొని
కప్పుర విడె మిచ్చితే గక్కనఁ దా నందుకొనె
యిప్పు డింతకంటెఁ జెలి యేమి సేసునయ్యా ॥ఊర॥

పేరుకొని పిలిచితే ప్రియముతో నూఁకొనె
సారె నీవు నవ్వితేను సమ్మతించెను
చేరి నీవు చెనకితే చెతులెత్తి నీకు మొక్కె
యీరీతి దా నింతకంటె నేమి సేసునయ్యా ॥ఊర॥

చెక్కు నీవు నొక్కితేను చెంగలించి వొడఁబడె
గక్కనఁ గాఁగిలించితే కరఁగె మతి
చక్కని శ్రీవేంకటేశ సతినిట్టె యేలితివి
యెక్కువాయ నింతకంటె నేమి సేతు(సు)నయ్యా॥ఊర॥ 397

ముఖారి

తనంతనే వచ్చె మేలు తరవులు వెట్టనేల
తనిసి తనిసి లోలోఁ దలఁచుకొంటఁగాక ॥పల్లవి॥

చనవిచ్చి యాతఁడు నాసంగడి నుండఁగాను
మనవు లేమి చెప్పీనే మాఁటిమాఁటికి
నను( జూచి యాతఁడు నవ్వులు నవ్వఁగాను
వినయముతో నింకా వేఁడుకొనవలెనా ॥తనం॥

సరసములాడి నా చనుగుబ్బ లంటఁగాను
మరిగించుకొనేలే మాఁపు దాఁకాను
వరుస దప్పక నాపై వలపులు చల్లఁగాను
తరితీపు సేసి యెట్టి తమి రేఁచేవే ॥తనం॥

కైవసమై నన్ను నిట్టె కాఁగిలించుకొనఁగాను
వావు లేమి చెప్పీనే వంతు వెట్టుక
శ్రీవేంకటేశుఁ డిట్టె చిత్తగించి నన్ను నేలె
వేవేలకు నాడుకొన వేడుకాయఁగదవే ॥తనం॥ 398

## శ్రీరాగం

ఎన్నినోములు నోఁచితి వీతనికిఁ జెలియా
సన్నలా చాయలా నీకేసతమైనాఁడు ॥పల్లవి॥

తరుణి నీ తలఁచిన తలఁపు నీడేరెనే
వరుసతో విటుఁడు నీవాఁడాయను
సిరుల నీ చనవులు చెల్లించుకొంటివే
యెరవులే కితఁడు నీ యింటనే వున్నాఁడు ॥ఎన్ని॥

సేసిన నీ చేతఁలు చెల్లుబల్లాయనే
సేసవెట్టి నీ మగఁడు సేవగొనెను
వాసితో నీ వలచిన వలపు రతికెక్కనే
ఆసయిచ్చి నిన్నీతఁడు అన్నిటా మన్నించెను ॥ఎన్ని॥

కోరిన నీ కోరికలు కొనసాగి మించెనే
యీరీతి శ్రీవేంకటేశుఁ డిట్టె నిన్నేలె
తారుకాణై నీ చక్కఁదనము ఫలించెనే
మేర మీర కితఁడు నీమీఁద బత్తిగలఁడు ॥ఎన్ని॥ 399

## రామక్రియ

చెలియ నా విన్నపము చిత్తానఁ బెట్టుమను
తెలిపేనంటే నంత దిట్టఁగాను నేను ॥పల్లవి॥

ఆసపడ్డ ముద్దరాల నలయించవద్దను
సేసవెట్టి మరి రట్టు సేయకుమను
పాసి పోక మొక్కఁగాను పరాకు సేయకుమను
రాసి కెక్కె నా వలవు రక్షించుమను ॥చెలి॥

కాఁపురము సేయఁగాను కాకుసేయదగదను
చేపట్టి వదలరాదు చెప్పితినను
యేపొద్దూ నే మొక్కఁగాను యెరవు గాకుండుమను
నా పసలన్నీ నెరుఁగు నన్ను నేలుకొమ్మను ॥చెలి॥

నే నలమేలుమంగను నెపాలు చ(చె?) ప్పకుమను
పూని నాతో నవ్వె నిఁకఁ బోకుమను
తాను శ్రీవేంకటేశుఁడు తగులైతి నుండుమను
తానక మాయ పొందు తలపోసుకొమ్మను ॥చెలి॥ 400

## పాడి

ఒక్క మనసాయ నిఁక నుండవయ్యా
మిక్కుటపు నీ చేఁతలు మెచ్చితినయ్యా ॥పల్లవి॥

తగవులఁ బెట్టి పెట్టి తగిలి పెండ్లాడితివి
నగి నగి కొనగోరు నాఁటించితివి

మొగము చూపి చూపి ముట్ట వలపించితివి
అగడు సే సింకా నెంత ఆసలఁబెట్టేవయ్యా ॥ఒక్క॥

సరసము లాడి యాడి చవులెల్లా రేఁచితివి
పొరుగున నుండి వుండి పొందుకొంటివి
తెరవేసి తేరవేసి తేనెమోవి యానితివి
తరితీపు లప్పటి నెందాఁకాఁ జేసేనయ్యా ॥ఒక్క॥

మల్లి మల్లి చూచి చూచి మరిగించుకొంటివి
తెల్లమిగాఁ గూడి కూడి తేలించితివి
యెల్లగా శ్రీవేంకటేశ యిన్నిటా న న్నేలితివి
పల్లదాన మరియేమి బాఁతిపడేవయ్యా ॥ఒక్క॥ 401

## ఆహిరి

ఇన్నిటాఁ గనుఁగొంటిమి ఇంతి నీపైఁ గల బత్తి
వెన్నెల తేటనవ్వుల వెలయించే దెపుడో ॥పల్లవి॥

పొంగఁ బొంగఁ బొంగులాయ పొలఁతి కోరిక లవి
అంగడి బేరాలాయ నడియాసలు
ముంగిటి ముగ్గులాయ మునుకొన్న సిగ్గులు
అంగనను దయఁజూచి యాదరించే దెపుడో ॥ఇన్ని॥

చూడఁ జూడఁ బోఁజులాయ సుదతి కను చూపులు
వొడఁగట్టు దులాలాయ వొడఁబాటులు
వీడెపు బుక్కిళ్లాయ వినుకలి విరహాలు
యీడులేని జవరాలు నేలే దిఁక నెపుడో ॥ఇన్ని॥

ఊర నూర నూటులాయ నువిద తమకములు
గోర గీర నేరులాయ కూరిములు

యీరీతి శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి
తారుకాణ నీ మాఁటలు తలఁపించే దెపుడో ॥ఇన్ని॥ 402

**రేకు 1978** **సాళంగనాట**

చెలివై పుట్టితేనేమి సిగ్గు గొంత వలదా
పిలువని పేరటము పిరి దూరి వత్తురా ॥పల్లవి॥

పంగించి నా కాఁగిటిలో పతితో నేల నవ్వేవే
యెంగిలి రతులకు నీవేల లాచేవే
ముంగిట నితఁడు నా మోవితేనె లానినాఁడు
చెంగట నట్టిమాఁటకు చెవి యే లొగ్గేవే ॥చెలి॥

వేల నామట్టె లుండఁగా విభునేళ్ల పట్టేవే
కూళతనములకేల కొంగు లొడ్డేవే
తాలిమి నా చెమటల దడిసి తా నున్నాఁడు
యీలీలఁ బెనఁగులాట కెట్టు వచ్చేవే ॥చెలి॥

తొడపై శ్రీవేంకటేశుతో నేమి పొందు సేసేవే
వొడఁబడని మేలెల్ల వొడిఁగట్టేవే
అడరి నా కొప్పు పువ్వులందునే పూజగొన్నాఁడు
బడినే యీ వలపేల పైఁ జల్లుకొనేవే ॥చెలి॥ 403

**వరాళి**

ఇన్నిటా జాణవు నీవు యెంతని పొగడవచ్చు
నిన్నుఁ జూచి వేడుకకు నెట్టన నవ్వితిని ॥పల్లవి॥

చెంతనుండి విన్నపాలు సేసితి నింతేకాని
యింతిపై బత్తి గలవు యెరుఁగుదుము
కొంత గొంత కూరిములు గొసిరితి మింతేకాని
వింతలైన మీ వలపు వింటిమి నాఁడే ॥ఇన్ని॥

---

రేకు 1978 ఈ రేకు మధ్యలో కొంతభాగము డొంకలు పడియున్నది.

దే మరక వొకమారు యెచ్చరించితిమిగాని
కామినిపె (పై?) నీ తమి గంటిమి నేము -
చూ మరల రావని సొలసితి మింతేకాని
చేమంతు వనుచు సంతోసించితిమి నాఁడే ॥ఇన్ని॥

చొప్పుగాఁ జొట్టరికము చూపితి మింతేకాని
యిప్పుడఁతి నేలేవని యెంచుకొంటిమి
ముప్పిరి మా చెలికిగా మొక్కితి మింతేకాని
తిప్పక శ్రీవేంకటేశ తనిసితిమి నాఁడే ॥ఇన్ని॥ 404

## ఆహిరి

ఇవిగో నా కోరికలు ఇటువంటివి
వివరముగా నీకు విన్నపము సేసితి ॥పల్లవి॥

కన్నుల నిన్నుఁ జూచితే కడుఁ దమకము రేఁగు
మిన్నక తలవంచితే మించు నాసలు
చన్నులు నీపై నూఁదితే జల జలఁ జెమరించు
వున్నతి సిగ్గున నుంటే నుమ్మగిలు వలపు ॥ఇవి॥

ఆలించి నీమాఁట వింటే నట్టె తరితీపు వుట్టు
నాలిఁ బరాకు సేసితే నాఁటు వేడుక
మేలుమీఁద నవ్వితేను మేనఁ బులకలు నిండు
గోలతనాన లోఁగితే గుబ్బతిలు మనసు ॥ఇవి॥

సేవించితే నివ్వెరగు చెప్పఁగ వసము గాదు
భావించితే తలపోఁత ఫలియించును
ఈవల శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
దేవుల నయితి నింక తిరమౌను పనులు ॥ఇవి॥ 405

## బౌళి

నీ కెంత వేడుకోకాని నిండిన కొలువులోన
యీకడఁ జూచినవారి కెల్లిదమై తోఁచును ॥పల్లవి॥

వులివచ్చి నవ్వులతో నోరి యని పిలిచీని
అలివేణి వావి నీ కేమౌనోకాని
చెలరేఁగి రమ్మనుచు చేయివట్టి తీసీని
సులభాన నెటువంటి చుట్టమోకాని ॥నీ కెంత॥

యిక్కువలంటి నీతోను యేకాంతము లాడీని
మిక్కిలి నీకెంత నమ్మినదోకాని
పక్కనే నీ [1]కుడిబడి పనులెల్లాఁ జెప్పీని
గక్కక నిన్నెంత యేలుకొన్నదోకాని ॥నీ కెంత॥

మన్ననతో నలమేలుమంగవతె (లె?) నురమెక్కీ
తిన్నఁగా నెంత పట్టపుదేవులోకాని
అన్నిటా శ్రీవేంకటేశ యిటు నన్ను నేలితివి
తన్ను నేలుమనీ నెట్టి తగులుదోకాని ॥నీ కెంత॥ 406

## సింధురామక్రియ

పట్టెఁదేసి చన్నుల పాయపుదానవు
యెట్టు వేసాలు సేసేవే యిందరుఁ జూఁడగాను ॥పల్లవి॥

చెక్కిటి చేతితోడ సిగ్గులు వడేవేమే
అక్కరతో నాతఁడు మాఁటాడఁగాను
గుక్కుకొంటా వలపులు గుబ్బతిలే వది యేమే
చక్కెర మోవి చూపి సన్న సేయఁగాను ॥పట్టెఁ॥

సెలవుల నవ్వుకొంటా శిరసు వంచేవేమే
అలరి యాతఁడు చన్నులంటఁగాను
వులికి తీగెలు సాగ నూఁకొనే వది యేమే
పిలిచి యాతఁడు నిన్ను ఁబేరుకొనఁగాను ॥పట్టె॥

వెరగంది ముక్కుమీఁద వేలువెట్టే వది యేమే
తెరవేసు కాతఁడు నీ దిక్కు చూడఁగా
సరి నలమేలుమంగవు సాదించే వది యేమే
యిరవై శ్రీవేంకటేశుఁ డీతఁడు గూడఁగాను ॥పట్టె॥ 407

## శుద్ధవసంతం

నీ నేరుపేటిదే నిన్నుఁ జూచి వెరగయ్యీ
కానీవే నిన్నెఱుఁగుదు గడుసరిదానవే ॥పల్లవి॥

నడుమ నీ వూరకె నా మగనితోడుత -
నెడమాఁట లాడించే వెంతదానవే
వడిగా బువ్వలచెండు వాటుగా నాతని వేసి
కడు సన్నసేసే వెంత గయ్యాళిదానవే ॥నీ నేరు॥

వింతగా నాతఁడూ నేనూ వినోదము లాడఁగాను
వంతులకు వచ్చే వెంటువంటిదానవే
మంతన మాడుతాఁ దెరమాఁటునఁ గూచుండఁగాను
రంతుసేసే వేనాటి రట్టడిదానవే ॥నీ నేరు॥

యీకడ శ్రీవేంకటేశుఁ డిటు నాతో నవ్వఁగాను
పైకొనఁ జూచేవు నీ వేపాటిదానవే
కైకొని నలమేల్మంగ నెదపై నుండఁగాను
జోకతోఁ జెనకే వేమి జాటుదానవే ॥నీ నేరు॥ 408

1. ఉడిబడి = చిలిపి పనులు, చిల్లర పనులు కావచ్చు

రేకు 1979 దేసాళం

ఆతనికి నీకుఁ దగు నన్నిటా నమ్మా
రాతిరిఁ బగలుఁ గాఁపురము సేయవమ్మా ॥పల్లవి॥

గొప్పైన కన్నులదాన కోడె వయసుదాన
చిప్పిలు గళలదాన సింగారిదాన
యిప్పు డల్లాతఁడు మా యేలిక నిన్నుఁ జూచి
కప్పుర విడె మంపెఁ గైకొనవమ్మా ॥ఆత॥

పవడపు మోవిదాన భారపు గుబ్బలదాన
సవరపుఁ గొప్పుదాన చక్కనిదాన
యివల నిదిగో నీ యెదుటనే వున్నవాఁడు
రవళి నీ వొద్ది కిట్టె రః మ్మా ॥ఆత॥

తళుకుఁ జెక్కులదాన తలిరుఁ బాదాలదాన
సెలవి నవ్వులదాన సిగ్గరిదాన
అలమేలుమంగపతియైన శ్రీవేంకటేశుఁడు
మెలుపున నినుఁ గూడె మెచ్చఁగదవమ్మా ॥ఆత॥ 409

వరాళి

అడుగఁగరాదు నిన్ను నడుగకుండఁగరాదు
చిడుముడి తమకము చిమ్మిరేఁగీ నాకును ॥పల్లవి॥

చెక్కుల చెమట లవె చెంపలవెంట గారీ
యెక్కడనుండి వచ్చేవో యెఱఁగమయ్యా
గక్కన నీ మేననుండి గందపు బేఁటులు రాలీ
చక్కఁగా నే గరిడిని సాము చేసితివయ్యా ॥అడు॥

ఆముకొని నీ మేన నలపులు దేరీని
యేమిపని సేసితివో యెఱఁగమయ్యా

వేమారు నీ పెలవుల వెన్నెలనవ్వు గురిసీ
దోమటి సంతోస మేడ దొరికెనయ్యా ॥అడు॥

కందువ నీ మోమునఁ గమ్మి నివ్వెరగులు
యెందున్నదో నీ చిత్త మెఱఁగమయ్యా
అందపు శ్రీవేంకటేశ యలమేల్మంగను నేను
చెందితివి నన్ను నీ చేఁతలు గంటిమయ్యా ॥అడు॥ 410

## సామంతం

చెప్పితి బుద్దులు నీకు చెలిమికత్తెఁ గనక
యెప్పుడూ బాయకుండవే యెంత వేఁడుకొనేవు ॥పల్లవి॥

మంతనము లే మాడేవే మచ్చికఁ జెలులతోను
దొంతర నవ్వు లెంత తూరుపెత్తేవే
అంత వేడుకైతే బతియండఁ గూచుందువు రావే
ఇంతేసి యడియాసల నేల పొరలేవు ॥చెప్పి॥

తిలకిం చేమి చూచేవే తెరమరఁగుననుండి
వులివచ్చి సిగ్గుల నే లుమ్మగిలేవే
తలఁ పీతనిపైనుంటే తగిలి పొందుసేయవే
నిలువు నివ్వెరగుల నీ వేల యలసేవు ॥చెప్పి॥

మక్కువలేమి చూపేవే మాఁటలలోనే నీవు
చొక్కపు నయాల నేమి చొప్పు వేసేవే
దక్కి శ్రీవేంకటేశుఁడు తానే వచ్చి నిన్ను నేలె
అక్కరైతేఁ జెనకవే అదేల కొంకేవు ॥చెప్పి॥

## లలిత

మఱి యేమి విన్నవించే మాపుదాఁకాను
తలవాటి పనులెల్లా తానే యెఱుఁగునే ॥పల్లవి॥

మగఁడు లాలించితేను మచ్చిక తానే కలుగు
నగితేను మిక్కిలి నమ్మికవుట్టు
మొగము చూచితేను ముంచుకొను నాసలు
తగవు తానే యెఱుఁగు తలఁచుకొమ్మనవే ॥మతి॥

చేరి సేవలు గొంటేను చిత్తము తానే కరఁగు
సారె సరసమాడితే సంతోస మెక్కు
గారవించి మన్నించితే కాఁపురము లీడేరు
తారుకాణ లన్నియును తలఁచుకొమ్మనవే ॥మతి॥

ననుపులు నెరపితే నారుకొనుఁ బ్రియములు
పెనఁగితే మీఁద మీఁదఁ బెరుగుఁ దమి
యెనసె శ్రీవేంకటేశుఁ డింతలోనె తానే వచ్చి
తననా సంది పొందులు తలఁచుకొమ్మనవే ॥మతి॥ 412

శ్రీరాగం

తానే వచ్చి రమణుఁడు దయదలఁచుటే మేలు
[1]నేనా తన కెదురు నేరుపు లేమున్నవే ॥పల్లవి॥

ఆసలు ఘనమైతేను అట్టె ప్రియాలు చెప్పించు
వేసా లెక్కుడయితేను విట్టివీఁగించు
వాసులు మిక్కుటమైతే వట్టి యెగ్గులు వట్టించు
యీ సుద్దు లేమి చెప్పేనే యింతుల బతుకులు ॥తానే॥

చెలిమి వెగ్గళమైతే చేఁతలెల్లాఁ జేయించు
వలపులు దరచైతే వాడిక రేఁచు
పలుకులు దట్టమైతే పంతములెల్లా నిప్పించు
కలవెల్లా నిటులానే కాంతల బదుకులు ॥తానే॥

1. "నేనాతని కెదురు నేరుపు లేమున్నవే" కావచ్చు.

నగవు లధికమైతే ననుపులు వుట్టించు
మొగమోటలు మెఁ(మెం?) డైతే మొక్కింపించు
తగ శ్రీవేంకటేశుఁ డింతట నీడ నన్ను నేలె
జగములో నీడేరెనే సతుల బతుకులు ॥తానే॥ 413

## ముఖారి

కొమ్మకు నీ విట్టే పెండ్లికొడుకవై వచ్చితివి
ఇమ్ముల సిగ్గువడక యేలుకోవయా ॥పల్లవి॥

పుత్తడివంటిది యీ పొలఁతి చక్కఁదనము
చిత్తరువువంటిది మించిన రూపము
క్రొత్తమెఱుఁగువంటిది కోమలపు దేహము
చిత్తగించవయ్యా యీకె సింగారము ॥కొమ్మ॥

పూవుఁదీగెవంటిది పొలుపైన యీకె తీరు
వావిరి బైఁడిసలాకవంటిది రేక
సోవఁ జిగురువంటిది చూచితేను నిలువెల్లా
వేవేగఁ జూడవయ్యా యీ విలాసము ॥కొమ్మ॥

వన్నెల నాణిముత్తెమువంటిది తన పోలిక
వెన్నెల సోగవంటిది వింత భావము
యిన్నిటా శ్రీవేంకటేశ యింతి నిట్టె కూడితివి
వున్నతి మెచ్చవయ్యా యీ వొయ్యారము ॥కొమ్మ॥ 414

రేకు 1980 పాడిగం

ఇట తరవాతి పనులెల్లా నీ చేతివి
యెటువలె మన్నించివా నితవే నాకు ॥పల్లవి॥

వేవేలుగా గొసరితి విన్నపము సేసితి
నీ వేమి సేసినా మేలే నీ చిత్తము
వావులెల్లాఁ దెలిపితి వాడికల మెలఁగితి
భావించి నీ యాలనౌటే పదివేలు నాకును ॥ఇట॥

చేతులెత్తి మొక్కితి చిత్తము గరఁగించితి
నీ తలఁపెట్టున్నా మేలే నీ చిత్తము
కాతరాన వలచితి కన్నుల నిన్నుఁ జూచితి
ఆతుమలో నీ వుండుటే అన్ని యీవులు నాకు ॥ఇట॥

కాఁపురాలు సేసితి కంకణము గట్టుకొంటి
నీ పొందు లన్నియు మేలే నీ చిత్తము
యేపున శ్రీవేంకటేశ యిట్టె నన్ను నేలితివి
కాపాడేటి నీ కరుణ ఘన సంపద నాకు ॥ఇట॥ 415

## వాదరామక్రియ

నీ కొలఁది గాదు గదె నీ చేఁతలు
యీకడ నీ దంటతనా లెక్కుడాయఁగదవే ॥పల్లవి॥

కాచియుఁ గావవు నీ చక్కని చన్నులు
పూచియుఁ బూవవు నీ పూఁప నవ్వులు
చూచియుఁ జూడదు చాల సొంపు నీ మోవి
యేచి యిసుమంతదాన వెంత నేరిచితివే ॥నీకొల॥

కూడియుఁ గూడవు నీ కొప్పు విరులు
వీడియు వీడవు నీ వెడ సిగ్గులు
ఆడియు నాడని నీ వొయ్యారి మాటలు
యీడు లెట్టుకొని నాతో నేల పెనఁగేవే ॥నీకొలఁ॥

తనిసీఁ దనియదు చిత్తము రతుల
మొనసీ మొనయవు నీ మొన గోరులు
యెనసె శ్రీవేంకటేశుఁ డింతలో నన్ను
ననిచి యీతని నేల నంటుసేసుకొనేవే ॥నీ కొలఁ॥ 416

## శంకరాభరణం

ఇంక సిగ్గువడరాదు యిద్దరికి దొరసెను
లంకెలై యీ జవరాలి లాలించవయ్యా ॥పల్లవి॥

కొమ్మ చూచిన చూపులు కోరి నీ చూచే చూపులు
తుమ్మిద దంపతులై తూరి పెండ్లాడె
నెమ్మి నాకె చేతులును నీవు చాచిన చేతులును
తమ్మి చుట్టరికములై తవులు కొనెను ॥ఇంక॥

కలికి పలుకులును కందువ నీ పలుకులును
చిలుక నేస్తములై చెలువొందెను
మలసి యాపె నవ్వులు మఱి నీ చిరునవ్వులు
పొలప వెన్నెలలై పొత్తులు గలసెను ॥ఇంక॥

యీ వనిత కోరికలు యింపుల నీ కోరికలు
పావురపు జోళ్లై పాదుకొనెను
శ్రీవేంకటేశ మీ రతి జిప్పిలు మోవితేనెలు
భావింప దరితీపుల పై కొసరులాయను ॥ఇంక॥ 417

## శ్రీరాగం

ఆతఁడూ నే నొక్కటే యరసి చూడఁగనేల
కాతరించి చెలులాల కడవ నాడకురే ॥పల్లవి॥

మిక్కిలి నాతఁడు నాకు మేలువాఁడై వున్నవాఁడు
యిక్కువ బాసలు నా కిచ్చినవాఁడు

మక్కువ తోడుత నా మాఁటకు లోనైనవాఁడు
ఇక్కడ నా మగనితో నేల కొసరేవే ॥ఆతఁ॥

పరగ నా కాఁగిటికి బతిమి వట్టుకున్నాఁడు
మరుతంత్రముల నన్ను మరిగినాఁడు
ఇరవై యేపొద్దూ నా యింటిలోనే వున్నవాఁడు
యెరవుగా నిపుడు మీ రెంత సొలసేరే ॥ఆతఁ॥

అందరిలోనా నాకే ఆసపడి వున్నవాఁడు
కందువ నా మోవి పొత్తు గలసినాఁడు
అందపుశ్రీవేంకటేశుఁ డన్నిటా న న్నేలినాఁడు
సందడించి మీ రేమి సాదించవచ్చేరే ॥ఆతఁ॥ 418

## దేశాక్షి

ఇంతులాల చూడరే యీాకె బాగులు
వింత వింత సింగారాల వినోదించీ నిపుడు ॥పల్లవి॥

వెలఁది నవ్వులనే వెన్నెలలు గాసీని
తొలుతనే మొగము చంద్రుఁడు గనక
వలపుల చెమటల వానలు గురిసీని
మెలుపునఁ దురుమే మేఘము గనక ॥ఇంతు॥

కొనచూపుల దూరనఁ గోలలుగాఁబొంచి యేసీ
నును బొమ్మలే సింగిణులు గనక
తన మాఁటలను తియ్యఁదనములు వెదచల్లీ
నినుపుఁగెమ్మోవి తేనియపెర గనక ॥ఇంతు॥

వడిఁ గళల బదారు వన్నెలతో మెరసీని
అడరి తానే కనకాంగి కనక

గుడిగొని పెద్ద చనుఁగొండలతో చెలరేఁగీ
యెడయక శ్రీవేంకటేశు దీవి గనక ॥ఇంతు॥ 419

## హిందోళ వసంతం

ఎందాఁకా నీతని రాక లెంచి కాచుకుండితివి
చందమాయఁ బనులెల్లా సంతోసించవే ॥పల్లవి॥

చెలువుఁడు వచ్చెనంటాఁ జెప్పీ గూఁటిలో చిలుక
యెలమి నిట్టె నీవు యెదురుకోవే
సలువుటద్దానఁ బతి నీడ యిదె కానవచ్చీ
పిలిచి వినయముతోఁ బీఁట వెట్టవే ॥ఎందా॥

మచ్చికఁ జెలికత్తెలు మాఁటలాడే రాతనితో
విచ్చన విడి నీ వూను వినఁగదవే
వచ్చి కూచుండఁగా మోసీ వడి సకినల మంచ
మిచ్చుట విడె మియ్యవే మీతనికి నీవు ॥ఎందా॥

యిదె శ్రీవేంకటేశ్వరుఁ డిన్నిటాను నిన్ను ఁగూడె
వుదుటు రతుల నింక నోల లాడవే
కదలి సూత్ర బొమ్మలు కమ్మి సురట్లు విసరీ
పెదవి తేని[illegible] లాని ప్రియములు రేఁచవే ॥ఎందా॥ 420

## రేకు 1981 దేసాళం

సారిది నే మిందరము సోబానఁ బాడేము
బెరసి యీతని నీవు పెండ్లాడవే ॥పల్లవి॥

చెక్కులఁ జెమట గారె సెలవుల నవ్వు దేరె
మక్కువ నీ వీతనితో మాఁటలాడఁగా
తక్కక నీ వలపులు దాఁచ నిఁక నేమిటికి
పెక్కులేల వేడుకతోఁ బెండ్లాడవే ॥సారి॥

తనువెల్లాఁ బులకించె తలపోఁత లిగిరించె
మొనసి నీ వీతని మోము చూడఁగా
అనిశము నీ కోరిక లణఁచఁగ వలదిఁక
పెనగొన్న వేడుకతోఁ బెండ్లాడవే ॥సొరి॥

ముంచి మోవిపండు మాఁగె ముక్కున నూర్పులు రేఁగె
పొంచి శ్రీవేంకటేశుఁడు పొందుసేయఁగా
కొంచక మీ కూటములు [1] గుట్టుసేయ నిఁక రాదు
పెంచిన వేడుకతోఁ బెండ్లాడవే ॥సొరి॥ 421

## బౌళి

అందుకే విచారించే నప్పటనుండి
చెంది నాకు నొక బుద్ధి చెప్పవే చెలియా ॥పల్లవి॥

సొలసి యాతని నేఁచూ (నేఁజూ?) చితేను నా చూపులు
కొలఁది మీరఁగ నాఁటుకొనవుగదా
కొలువ(వు?) నేఁ జేసితేను కోరి నా చక్కఁదనము
తలఁపులోఁ జుట్టుకొని తమి రేఁచదుగదా ॥అందు॥

తగిలి మాఁటాడితేను తతి మోవితెనె గారి
సొగటువారి యతఁడు చొక్కఁడుగదా
నగితేను ముంచుకొని నాతోడి సంగాతము
జిగురువలె నంటుక చిక్కించుకోదుగదా ॥అందు॥

కదిసి కాఁగలించితే గట్టి నా చన్నులు దాఁకి
పదరి మదనకళ పట్టదుగదా
ఇదివో శ్రీవేంకటేశుఁ డేలె నన్నుఁ దానె వచ్చి
పొదిగితే మేనెల్లాఁ బులకించదుగదా ॥అందు॥ 422

---

[1] 'ఇఁక గుట్టుసేయరాదు' అనుటసహజమే. ఇక్కడ యతినిర్బంధము.

## రామక్రియ

చూచి చూచి నాకు నిట్టె సోద్యమయ్యీని
కాచుక తా నెందుండి కలిగెనోకాని ॥పల్లవి॥

చెలరేఁగి చెలరేఁగి సేవలెల్లాఁ జేసీని
కలికి నీ చిత్త మెట్టు గనెనోకాని
మలసి మలసి నీతో మారుకొని మాఁటలాడీ
యెలమి నీ వెంత చన విచ్చితివోకాని ॥చూచి॥

నానఁబెట్టి నానఁబెట్టి నవ్వు లెల్లా నవ్వీని
ఆనుక నీ కెంత చుట్టమాయెనోకాని
కానుకిచ్చి కానుకిచ్చి కతలెల్లాఁ జెప్పీని
సేనలుగానే సన్నలు సేసితివోకాని ॥చూచి॥

చేయి ముట్టి చేయి ముట్టి చెనకఁగ వచ్చీని
నీ యితవెరఁగ వెం(నెం?)త నేర్చునోకాని
యీయెడ శ్రీవేంకటేశ యిటు నన్ను నేలితివి
చాయల నాపెకూ నెంత సతమయితివోకాని ॥చూచి॥ 423

## లలిత

నీకంటె నాతఁడు మేలు నీ వాతనికంటె మేలు
చేకొని యాతని నిట్టె చెలఁగించఁగదవే ॥పల్లవి॥

నాలుక తుదలనే నయములు నవ్వులతోడివే సరసాలు
తాలిమి చేతివే గుణములు తగవులలోనివే మెచ్చులు
పోలిక వలనివే రూపులు పూచినకొలఁదులే పూఁపలు
జోలిఁబెట్టక పతిఁ జొక్కించఁగదవే ॥నీకంటె॥

పెనఁగుల లంకెలే పొందులు పెదవల మీఁదివే ప్రియములు
మనసులోనివే మర్మాలు మచ్చికగలయంతె మాఁటలు
ననుపుల వెంటవే యాసలు నమ్మిన చోటివే చనవులు
కనుఁగొని పతిమతి గరఁగించఁగదవే ॥నీకంటె॥

వాడికల పొంతవే వరుసలు వలపుల దండలవె మొగమోటలు
వేడ... యందలివె కోరికలు వినోదాల సంగడివె చెనకులు
కూడె నిన్ను నిన్నటాను కూరిమితో మన్నించి
యీడ శ్రీవేంకటేశ కింపు రేఁచఁగదవే ॥నీకంటె॥ 424

## ఆహిరి

చేకొని నాకు బుద్దులు చెప్పే వప్పట నుండి
జోకతోడ వేళలెల్లాఁ జూచి చెప్పుతా రావే ॥పల్లవి॥

యేకతాన బతివద్ది కేరీతి నే వత్తునే
ఆకడ నెవ్వతె బిల్వనంపుకున్నాఁడో
కాక, తన్ను నెట్లా నిక్కడికి రమ్మందునే
కైకొని యే పనులకు గాచుకున్నాఁడో ॥చేకొని॥

కామించి కామించి యీతని కెట్టు గదిసి వీడె మిత్తునే
ప్రేమ నెవ్వతెఁ దెరలోఁ బెట్టుకున్నాఁడో
ఆముకొని పెనఁగఁగ నది యెట్టు గూడెనే
చేముంచి యిప్పు డాతని చిత్త మేడ నున్నదో ॥చేకొని॥

గక్కన నే నెటువలెఁ గాఁగిలించుకొందునే
అక్కర నే కాంతఁ బెండ్లి యాడినాడో
ఇక్కడ శ్రీవేంకటేశుఁ డింతలోఁ దా నన్నేలె
తక్కక నామీఁద నెంత దయసేసినాఁడో ॥చేకొని॥ 425

## పాడి

వేగిరించనేఁటికే వెలఁది నీవు
జాగులేక వొరిచితే సతమయ్యీ నతఁడే ॥పల్లవి॥

విచ్చి చెప్పఁబోతేను వీడెమే కారముగాదా
యెచ్చి యాతనిపై నేరాలేల యెంచేవే
తచ్చితేను పెరుగులో తానే వెన్నవొడమదా
కుచ్చి కాఁగిలించుకుంటే గునిమయ్యీ నతఁడే ॥వేగి॥

కనుఁగొని సోదించితే కంటిలో నలుపుగాదా
తనివోక పతినేమి తప్పువట్టేవే
పనిగొంటే చెరకునఁ బంచదార వుట్టదా
ననిచి నవ్వితేను నయమయ్యీ నతఁడె ॥వేగి॥

భావించితే మోవిలోనె పచ్చితేనె వుండదా
శ్రీవేంకటేశ్వరు నేల సిగ్గు రేఁచేవే
కావలెనని దాఁచితే కాయలే పండ్లు గావా
వావిరి యిట్టే [illegible]డితే వసమయ్యీ నతఁడే ॥వేగి॥ 426

రేకు 1982

## సౌరాష్ట్రం

నీతో సరివారమా నీవే మన్నింతువుగాక
యిఁతల విచారించితే నిటువంటివారము ॥పల్లవి॥

నెరులు నిడుపుగాను నెమ్మది బెంతుముగాని
తురుము వేఁకమయ్యేది తోఁచ దెంతైనా
పిరుఁదు పిక్కటిలితే బీరాన నుండుటగాని
గరిమ మందగమన గది దెలియరాదు ॥నీతో॥

చన్నులు గట్టు లంటాను సారె గరింతుముగాని
సన్నపు నడిమి యలసత యెంచము
కన్నులు గొప్ప లంటాను కాఁడఁ జూచుటేకాని
మిన్నక తలచుట్టిగా మించేది దలఁచము ॥నీతో॥

చేలి మోవి తేనెయంటా చిప్పిలు టింతేకాని
వూరకె యన్ను వట్టేది వూహించలేదు
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి మమ్ము నేఁడు
కూరిమి మా సంతోసాలు గురుతు వెట్టరాదు ॥నీతో॥ 427

## పాడి

ఎందాఁకా నా మనవులు యేమి చెప్పేను
చెంది తానే నా సేవలు చిత్తగించు మనవే ॥పల్లవి॥

సేసలకు త నెదుట శిరసొగ్గితి నప్పుడే
ఆసలకు లోనైతి నారడిగాను
వాసులకుఁ బెనగితి వడి సవతులలోను
రాసికెక్కె నా వలపు రమ్మనవే పతిని ॥ఎందాఁ॥

వేడుకకుఁ దనతోను వెలయఁగ నవ్వితి
వాడికకు మేడలోన వచ్చి వుందాన
ఆడికకుఁ బాలైతి నందరిముందరా నేను
యీడ నన్ను మన్నించి యీడేరించు మనవే ॥ఎందాఁ॥

విందులకు మోవి తేనె వేమారుఁ జూపితి
పొందులకు మాటలాడి పొదిగితిని
ఇందులకే శ్రీవేంకటేశుఁడు వచ్చి నన్నేలె
కందువ నిట్టే నన్నుఁ గరుణించు మనవే ॥ఎందాఁ॥ 428

## గౌళ

ఎంతటి జాణ యీపె యెటువంటి వొయ్యారి
వింతలెల్లాఁ గంటి మిదె వినోదించవయ్యా ॥పల్లవి॥

చెక్కు చేయి మాఁటువెట్టి సిగ్గులు వడుకొంటాను
తక్కించీ నిన్నీకె యవద(ధ?)రించవయ్యా
లక్కబుట్టువంటి నోఁటు లలిఁ దెరచి మాఁటాడి
నిక్క కానుక లందిచ్చీ నీ వందుకోవయ్యా ॥ఎంత॥

విరులు కొప్పున రాల వికవిక నవ్వుకొంటా
కెరలించీ నిన్నుఁ జిత్తగించవయ్యా
సరిఁ జన్నులఁ బయ్యద జారిరాఁగా మూసుకొంటా
సురటి విసరీ నీకుఁ జొక్కి మెచ్చవయ్యా ॥ఎంత॥

కలికి కన్నుల నిన్నుఁ గాతరానఁ జూచుకొంటా
వలపించీఁ దొడపైఁ బవ్వళించవయ్యా
యెలమి శ్రీవేంకటేశ యిట్టె నన్ను నేలితివి
కొలువులో నున్న యాకె కోరికె చేకొనవయ్యా ॥ఎంత॥ 429

## వరాళి

ఎన్ని నేరుచుకొంటివే [1] యివీఁ గొన్ని
పన్నుకొన్న జాడలు పచ్చిదేరె నిపుడు ॥పల్లవి॥

చెలిమైతేఁ జెటెఁడేసి చిగురునవ్వు మూటెఁడేసి
బలిమి నెంత చల్లేవే పతి మీఁదను
వలపులు గంపెఁడేసి వాడికలు గుంపెఁడేసి
వెల(లి?) పరచ వచ్చేవు వింతలే నీ సుద్దులు ॥ఎన్ని॥

---

1. 'ఇవియన్' లోని 'యు' వర్ణము లోపించిన రూపము కావచ్చు.

తాలిములు మూరెఁడేసి తలఁపులు [1]బారఁడేసి
గాలి గఁ(గం?) టు వేసేవే కమ్మటి నీవు
మేలములు బండెఁడేసి మెచ్చులైతే కుండెఁడేసి
చేలలో వెదవెట్టేవు చెల్లునే నీ చేఁతలు ॥ఎన్ని॥

సంగాతాలు పట్టెఁడేసి సణఁగులు గొట్టెఁడేసి
జంగిలేల కల(లి?) పేవె సారె సారెకు
అంగవించి శ్రీవేంకటాద్రీశుఁడు నన్ను నేలె
యెంగిలి పొత్తేల కూడే వీతనితో నీవు ॥ఎన్ని॥ 430

## ఆహిరి

అలయకువే నీవు ఆతనిఁ దోడి తెచ్చితి
యెలమితో మీరిద్దరూ నెన్నఁడూ బాయకురే ॥పల్లవి॥

విరహ మేమిసేసీనే విభుఁడు నీవాఁడైతే
యిరవైన నీకోరిక లీడేరీఁగాక
మరుఁ డేమిసేసినే మనసు పదిలమైతే
పెరరేఁచి మిమ్మిద్దరి బెండ్లి సేసీఁగాక ॥అల॥

అలు లేమిసేసీనే ఆయములు గరఁగితే
కొలికికిఁ దెచ్చి రతిఁ గూరిచీఁగాక
వల పేమిసేసీనే వద్దఁ బాయకుండితేను
తలకొన్న సంతోసాల దగిలించీఁగాక ॥అల॥

చింత యేవి సేసీనే శ్రీవేంకటేశుఁ గూడితే
దొంతర వేడుకలెల్లా దొరకీఁగాక
మంతన మేమిసేసీనే మచ్చికలఁ బెనఁగితే
చెంత చెమటలు రేఁగి చిప్పిలీఁగాక ॥అల॥ 431

1. 'బారఁడు' శుద్ధ వ్యావహారికము.

### ముఖారి

మేలు మేలు యిన్నిటాను మెరసె నీ చేఁతలు
పోలించి చూడరమ్మ పొలఁతి భావములు ॥పల్లవి॥

చింతలేక సిగ్గులనే చెక్కిటఁ జేయి వెట్టీని
పొంతములుగాఁ జూఁచీని కొనచూపులు
బంతి గట్టకే నురిపీఁ బచ్చి మోవినవ్వులు
యెంతని చెప్పుదమమ్మా యీ కాంత భావములు॥మేలు॥

అలయకే చెమటలు అంగమెల్లా నించుకొనీ
పలుకుల చిలుకలఁ బౌఁచు వెట్టీని
వలిపె వలల వేసీ వడిఁ జన్ను జక్కవల
తలఁచరాదమ్మా యీ తరుణి భావములు ॥మేలు॥

గరువు చెప్పని సాము కుచ్చి కాఁగిటనే చేసీ
తొరలి శ్రీవేంకటేశు తోడి రతుల
పొరి మెయిఁ దీగెనే కుచ్చీఁ బులకల తోరణాలు
యిరవై నిలి[illegible]మ్మా యీ యింతి భావములు ॥మేలు॥ 432

రేకు 1983

### వరాళి

చెప్పవయ్యా ఇంకా నీపె చేఁతలు వినేఁగాని
ఇప్పుడు నీవద్దనున్న దెవ్వతెయ్యా యీపె ॥పల్లవి॥

వేడుకతో నల్ల నాఁడు వీదివెంట నీవు రాఁగా
ఆడరాని మాఁటాడిన ఆపెవో యీపె
జాడతోడ నీతోను సరి వెనఁగుకొంటాను
వోడక నిన్నుఁ జన్నుల నొత్తినాపె యీపె ॥చెప్ప॥

గుట్టున నెవ్వతెతోనో కోరి నీవు మాఁటాడఁగా
అట్టె కొంగువట్టి తీసినాపె యీపె

పొట్టఁబొరుగుననే నీ బుజాన రేకలు దీసి
రట్టు సేసినట్టు జగరాఁగా యీపె ॥చెప్పు॥

సేసవెట్టి పెండ్లాడిన చెలుచెల్లా నుండఁగాను
ఆసలు మీకు రేఁచిన ఆపె యీపె
రాసికెక్క శ్రీవేంకటరమణ నన్నేలితివి
వాసితో నిన్నుఁ జెనకేవాడికాపె యీపె ॥చెప్పు॥ 433

## శంకరాభరణం

పొదలె నిండుఁగళలపున్నమ నేఁడు
అదను దప్పక జాజ రాడుదువు రావయ్యా ॥పల్లవి॥

జలజాక్షి మోముననుం చంద్రోదయమాయ
నెలకొన్న నవ్వుల వెన్నెల గాసెను
కలికి కన్నుల నల్లఁగలువలు వికసించె
అలరి యీకెతో జాజ రాడుదువు రావయ్యా ॥పొద॥

యెనసి జవ్వనమున నేతెంచె వసంతకాల
మొనరి మోవిఁ జిగురు లుప్పతిలెను
గొనకొన్న తురుమునఁ గూడె తుమ్మిదమూఁక
అనుమానించక జాజ రాడుదువు రావయ్యా ॥పొద॥

కుంకుమ చెమట చనుఁ గొప్పెరల నిండుకొనె
కొంకక గోళ్లే బుట్టటకొమ్ము లాయెను
లంకెలై శ్రీవేంకటేశ లలనతోఁ గూడితివి
అంకెల నేపొద్దూ జాజ రాడుదువు రావయ్యా ॥పొద॥ 434

## ముఖారి

ఊరకున్నాపెను నీవే వొక్కక్కటే రేఁచితివి
గారవపు టీపెవల్లఁ గడమ లే దెందును ॥పల్లవి॥

కిలకిల నవ్వఁగాఁబో కెరవి నీ జవరాలు
కెలసి బొమ్మల జంకించె నిన్నును
బలిమిఁ జెనకఁగాఁబో పక్కనఁ దప్పించుకొని
సొలసి నిట్ట చూపులఁ జూచె నిన్నును ॥ఊర॥

పంతము లాడఁగఁబో పచ్చిదేర చెవిలోన
మంతనాన నొట్టువెట్టి మాఁటలాడెను
పొంత జన్ను లంటఁగాఁబో పొంచి కొప్పువట్టి తీసి
కొంత గొంతములు వాఁడిగోర నూఁదె నిన్నును॥ఊర॥

మోవి తెనెడుగఁగాఁబో మొక్కలాన బైకొని
కావరాన నీ మోవి గంటిసేసెను
యీవేళ శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి
కైవశమై వుండఁగాఁబో కడు మెచ్చె నిన్నును ॥ఊర॥ 435

## రామక్రియ

వినోదాన కోపవట విరహాన కోపేవా
యెనసి నీ వితని యిచ్చలో మెలఁగవే ॥పల్లవి॥

కొనగోరి తాకులకు కొచ్చి వొడ్డించుకొనేవు
యెనలేని మరునమ్ము లెట్టోరిచేవే
పెనఁగాతఁడు నవ్వితే బెట్టుగా నెగ్గుపట్టేవు
వెనక వచ్చే వెన్నెల వేఁడిగాదా చెలియా ॥వినో॥

పచ్చి మాఁట లాడితేను పతిమీఁద సొలసేవు
హెచ్చి చిలుకపలుకు లేఁపనా నిన్ను
ముచ్చట గురు లంటితే మునుకొని జంకించేవు
వచ్చి యలులు మూఁగితే వారించఁగలవా ॥వినో॥

కదిసి మోము చూపి వే కడు సిగ్గులు వడేవు
యెదురైన చందమామ యెంత సేసునో
వదలక శ్రీవేంకటేశ్వరుఁ డిట్టె నిన్నుఁ గూడె
పదరేవు వలపింక పైపైఁ బెరుగుఁగదే ॥వినో॥ 436

## పాడి

ఎన్నిలేవు పనులు నీ కెంచుక సేసేనంటే
మన్నింతువుగాక జోలి మరియేలయ్యా ॥పల్లవి॥

పలుకు దేనెల మోవి పచారించి వేఁడుకొనీ
చెలియ మనవు లింకఁ జేకొనవయ్యా
కొలువు లిందాఁకా జేసి కొసరి నిన్నుఁ బిలిచీ
యెలమి నీకె ఇంటికి రావయ్యా ॥ఎన్ని॥

చిగురుఁ జేతుల నిన్ను చెయివట్టి పెనఁగీని
మగువ చేఁతలకు సమ్మతించవయ్యా
మొగము చూచి నీకు మొక్కులెల్లా మొక్కీని
అగపడి యీకె చెప్పినట్టు సేయవయ్యా ॥ఎన్ని॥

కుంకుమ గుబ్బల నిన్నుఁ గుచ్చి కాఁగిలించుకొనీ
లంకెలఁ బాయక ఇఁక లాలించవయ్యా
తెంకికి నిన్నుఁబిల్చి తెరవేసుకొనె నీకె
అంకెల శ్రీవేంకటేశ ఆదరించవయ్యా ॥ఎన్ని॥ 437

## శ్రీరాగం

పంతము లే లాడీనమ్మా పలుమారు రమణుఁడు
చెంత నా కిచ్చకములే సేసీఁగాక ॥పల్లవి॥

మగువల మాఁటలే మదు(ధు?) రాలు
మొగము చూపులే మోహనాలు

నగిన చిరునవ్వులే నానఁబాలు
తగుల కెట్టుండునమ్మా తానాపె పసలను ॥పంత॥

వనితల వినయాలే వడఁగండ్లు
కొనచూపు లవియె చొక్కునందులు
వొనరిన సరసాలే వుడుగరలు
పెనఁగ కెట్టుండునమ్మా ప్రేమ నాపె కాఁగిట ॥పంత॥

వెలఁదుల కాఁగిళ్లే వీఁడు బట్లు
వెళగని రతులే పెను సాములు
యెలమి శ్రీవేంకటేశుఁ డేలె నన్ను
తలఁచ కెట్టుండునమ్మా తగ నాపె పొందులు ॥పంత॥ 438

**రేకు 1984** **వరాళి**

మీ కిద్దరికిఁ దగవు మేము చెప్పేవారమా
చేకొన్న మీ వూడిగము చెలులము నేము ॥పల్లవి॥

యింతులు పైకొంటేను యియ్యకొనవలెఁగాని
యెంతైనాఁ బెనఁగరాదు యెప్పుడూ నీకు
పంతము లాడుకొంటేను పై పై నవ్వవలెఁగాని
వంతులకు మారుకొనవచ్చునా నీకు ॥మీకి॥

చనవున్నఁ గొసరితే సమ్మతించవలెఁగాని
వెనక ముం దెంచరాదు వింతగా నీకు
చెనకి కాఁగిలించితే చెలరేఁగవలెగాని
మనసు సోదించరాదు మలసి నీకు ॥మీకి॥

మొక్కితేను పొందుసేసి మొగమోడవలెగాని
వెక్కసించరాదు మరి వేరే నీకు

ఇక్కడ శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి
చొక్కి వినోదించవలె సొంపుతో నీకు ॥మీకి॥ 439

## ముఖారి

పడఁతిరో నీ వేఁటికి పంతములాడ వచ్చేవు
అడియాలా లెల్లా గంటి వోఁ గాదనఁగలవా ॥పల్లవి॥

కొమ్మ బొమ్మవిండ్లను గురులేసీ నీమీఁద
చిమ్మి వొడ్డించుక సాముసేయఁగలవా
కమ్మటిఁ జిరునవ్వుల కప్రవసంతము చల్లీ
నెమ్మది నాకె ముందర నిలువఁగఁగలవా ॥పడ॥

నెలఁత చనుగుబ్బల నిమ్మపం డ్లెగరవేసీ
బలిమి నీ చేతలను పట్టఁగలవా
సళుపుల మాటల చలివంది లిదె పెట్టీ
కలసి యందుకు లోనుగాకుండఁగలవా ॥పడ॥

మగువ మోవి సన్నల మచ్చులు వేసీ నవిగో
తగులు వడక నీవు దాఁ . గలవా
నిగిడి శ్రీవేంకటేశ నీ వేకె గూడితివి
తగిలీ నిన్ను రతులఁ దప్పించుకోఁగలవా ॥పడ॥ 440

## రామక్రియ

పట్టెఁడేసి గుబ్బల పాయపు దానవు నీవు
దిట్టవై రతుల నిట్టె తేలించఁగదవే ॥పల్లవి॥

మచ్చరమే వద్దుగాని మాఁటల దూరఁగవచ్చు
కుచ్చితమే వద్దుగాని కొసరవచ్చు
వచ్చె పట్టవద్దుగాని వొరసి జంకించవచ్చు
ఇచ్చట నీతనిఁ జూచి ఇన్నటి మెరయవే ॥పట్టె॥

వుప్పతించవద్దుగాని వొడివట్టి తియ్యవచ్చు
చొప్పులెత్తవద్దుగాని సొలయవచ్చు
తప్పులెంచవద్దుగాని తగిలి గుంపించవచ్చు
యిప్పు డీతని ముందర నిన్నిటా మెరయవే ॥పట్టె॥

యెలయించవద్దుగాని హెచ్చి కాఁగిలించవచ్చు
చలపట్టవద్దుగాని సాదించవచ్చు
వెలయఁగ నిన్నిట్టె శ్రీవేంకటేశుఁడు గూడె
యెలమి నీతని చెంత నిన్నిటా మెరయవే ॥పట్టె॥ 441

## పాడి

చూడఁగదరే యీతని సుద్దులు వో చెలులాల
వాడలోన నీవీఁ గొన్ని వట్టివేసాలు ॥పల్లవి॥

వెంగెము లాడితినా వెస దనదిక్కు చూచి
చెంగి చెంగి తా నేల సిగ్గువడీనే
అంగడిఁ బెట్టితినా ఆరడిఁ దన చేఁతలు
యెంగిలి మోవి మూసుక యేల నవ్వీనే ॥చూడ॥

తప్పక చూచితినా తన మేని గురుతులు
అప్పుడే పచ్చడ మెంత కప్పుకొనీనే
తప్పులువట్టితినా తా నాడినమాటఁలు
వొప్పులుగాఁ దా నిదేమి వొట్టువెట్టుకొనీనే ॥చూడ॥

గోరికొన నూఁదితినా కొడిమలెల్లా గట్టి
చేరి వేఁడుకొని యాల చెక్కు నొక్కీనే
యీరీతి శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్ను నేలె
తారుకాణించి నా కెన్ని తగవులు చెప్పీనే ॥చూడ॥ 442

## రామక్రియ

కానవచ్చీ నీ గుట్టు కలదెల్లాను
దీని కేమి మీఁదటెత్తు తెలుసుకొమ్మీ ॥పల్లవి॥

కొంగు దాఁకించెనంటానే గుంపించేవు; నీ మోవి
యెంగిలి సేసితే నాకె నేమందువో
సంగడిఁ గూచుండితేనే సాదించవచ్చేవు; నీ -
యంగము గోర గీరితే నప్పు డేమందువో ॥కాన॥

నెట్టుకొని చూచెనంటా నెపాలు వేసేవు; ఆపె
యిట్టె నీ కొప్పు వట్టితి(తే?) నేమందువో
వట్టిమాఁట లాడితేనే వాసు లెక్కించుకొనేవు
తిట్టులు దిట్టితే నెంత తిరుగ నేమందువో ॥కాన॥

చనుఁగవ సోఁకెనంటా చలమున జరసేవు
యెనసి కాలు దొక్కితే నేమందువో
మునుపే న న్నేలితివి విమ్మల శ్రీవేంకటేశుఁడ
వెనక నీపెఁ బెండ్లాడి వేడుక లేమందువో ॥కాన॥ 443

## పాళంగవాట

బత్తిగల జవరాల పాయపు పెండ్లికూఁతుర
చిత్తమురా బతిసేవ సేయఁగదే యిఁకను ॥పల్లవి॥

యెడయక విభుఁడు నీ యింటి కిదె వచ్చినాఁడు
నిడువాలుఁ జూపులను నివాళియ్యవే
బడి నీతనిఁ గూడిన పండుగ దినము నేఁడు
గుడిగొన్న నవ్వుల ముగ్గులు వెట్టవే ॥బత్తి॥

సొలవక నీకు దన చుట్టరికమెల్లాఁ జెప్పి
వెలయ నీ మోవితేనె విందువెట్టవే
పొలుపైన తలపోఁత పొంతనాలు నొనగూడె
పలుకుల కప్పురాల బాగాలు వెట్టవే ॥బత్తి॥

మంతనపుఁ గాఁగిటికి మంచి లగినము వచ్చె
బంతిఁ బులకల శాస పైఁజల్లవే
యింతలో శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నిన్ను నేలె
వింత వింత రతులను వీడు దోళ్ళాడవే ॥బత్తి॥ 444

**రేకు 1985** **ముఖారి**

ఇప్పుడు విచ్చేసి వున్నాఁ డెదుటఁ దాను
తప్పక నన్నుఁ బాయక దయఁజూడుమనరే ॥పల్లవి॥

యెదురు చూపులవల్ల యెడమాఁటలవల్ల
అదనఁ దా వచ్చెననే యాసలవల్ల
పెదవులఁ దన పేరు పేరుకొనే యందువల్ల
యెదలో నమ్మివుందాన నిట్టె విన్నవించరే ॥ఇప్పు॥

తలపోఁతలవల్ల తమకంబులవల్ల
కలలోన నెనసే సంగతులవల్ల
వెలయఁ బెండ్లాడిన వేడుక లంటినవల్ల
యెలమిఁ గాచుకుందాన నిట్టె విన్నవించరే ॥ఇప్పు॥

వినుకలిఁ జొక్కేవల్ల వేడుక సిగ్గులవల్ల
ఘనుఁడు దా నంపిన లేకలవల్ల
నను దానె వచ్చి కూడినాడు శ్రీవేంకటేశుఁడు
యెనగొని వుందాన నిట్టె విన్నవించారే ॥ఇప్పు॥ 445

## మాళవిగౌళ

అన్నిటాను వెగ్గళైన ఆఁడువారము
యెన్ని లేవు మా సుద్దులు యేమిసేతుమయ్యా ॥పల్లవి॥

మొలక నవ్వు నవ్వితే మురిపెమువలె నుండు
సొలసితే రాజసము చూపి నట్టుండు
కలికనై మాఁటాడితే గయ్యాళించి నట్లుండు
యెలమి మావోజ లివి యేమి సేతుమయ్యా ॥అన్ని॥

దగ్గరఁ గూచుండితేను దంటతనమై యుండు
సిగ్గువడి వుంటే గర్వించిన యట్లుండు
వొగ్గి పెనఁగవచ్చితే వుద్దండములై నట్లుండు
యెగ్గు దప్పు లెఱఁగము యేమి సేతుమయ్యా ॥అన్ని॥

అదనఁ గాఁగిలించితే నారజమువలె నుండు
యెదుట నిలుచుంటేవే యెమ్మెలై యుండు
వెదకివచ్చి నన్ను శ్రీవేంకటేశ కూడితివి
ఇదివో మా కాఁపురము యేమి సేతుమయ్యా ॥అన్ని॥ 446

## వరాళి

ఒనరిన చోటికి వొలుపేమేలు
ననుపులు వచరించి నవ్వు నవ్వవే ॥పల్లవి॥

యింత యాలే వెగటు యిదేమే నీపగటు
అంతేసి వద్దే విరహపు సొగటు
చెంతనే విభుఁడు వచ్చి చెక్కు నొక్కి పీడె మిచ్చీ
సంతోసాన నందుకొని సంగడిఁ గూచుండవే ॥ఒన॥

యేఁటికే యీ పొలపు యి దేడదే యలపు
గాఁటమాయఁ గోరికల కలగలపు
యీటులోఁ బువ్వుల వేసి యీతఁడు పొందుకు లాసీ
చోటిచ్చి సరసమాడి చొక్కించవే ॥ఒన॥

యొందాఁకానే మరఁగు యెట్టిదే నీ చెఱఁగు
మందలించరాదే నీ మతి కరఁగు
చెంది నిన్ను నింతలోనె శ్రీవేంకటేశుఁడు గూడె
చందముగా మోవితేనె చవి చూపవే ॥ఒన॥ 447

## ఆహిరి

తన కెందురాడేనా తన మేలుదాన నేను
మనలో నొరయనేల మన్నించమనవే ॥పల్లవి॥

చెప్పఁ జెప్పఁ గొత్తలాయ చేరి తన సుద్దులెల్లా
అప్పుడే నే వింటిని రమ్మనవే నీవు
వుప్పుచిం దినుమడాయ వొద్దనేనా యెట్టైనా
తప్పు లెంచఁ బనిలేదు తనిసితి నేను ॥తన॥

చూడఁ జూడ సోద్యమాయ సొరిది దన చేఁతలు
యీడనుండే కంటి నిఁక నేమీ ననవే
పెడుకకు వెలలేదు వెంగెమాడేదానగాను
గోడలేని చిత్తుఋవు కొసరేనా నేను ॥తన॥

సేయఁ జేయ రాసులాయ చెల్లెఁ దన వలపులు
పాయక నే నియ్యకొంటిఁ బ్దరనేలే
ఆయి గిలిగించితేను అట్టె శ్రీవేంకటేశుఁ -
డీయడ నన్నేలినాఁడు యెరిఁగితి నేను ॥తన॥ 448

## కన్నడగౌళ

మఱి నీవే కరుణించి మన్నించితి వింతేకాక
గుఱుతులు చెప్పి నిన్నుఁ గొసరఁగఁగలమా ॥పల్లవి॥

వెలఁది భావము నీకు విన్నవించితిమిగాక
వలపులు గొనఁబెట్ట వసమా మాకు
తలకొన్న నేస్తముల తగవు చెప్పేముగాక
చెలరేఁగి తమి రేఁచఁ జెల్లునా మాకు ॥మఱి॥

తరుణి లో(తో?) నన్నమాఁట తలఁపించితిమిగాక
సరసము లాడించ సంగతే మాకు
సరుస మీ కిద్దరికి సాకిరై వుండేముగాక
సొరిది మీ గుట్టు చెప్పఁ జొప్పడునా మాకు ॥మఱి॥

యింతి జూట్టరికము నీ కెరిఁగించితిమిగాక
వంతున సరి వెనఁగవచ్చునా మాకు
యింతలో శ్రీవేంకటేశ యీకె నేలితివిగాక
పొంత మిమ్ము సోదించఁబోలునా మాకు ॥మఱి॥ 449

## పాళంగవాట

మగనితో నేమిటికే మందెమేళాలు
నగుతా నుండితేనే నను పొఁగాక ॥పల్లవి॥

చనుఁగవ నొరసేవు సంగడిఁ గూచుండుకొంటా
మొనగోరు మోపేవు మొక్కేనంటాను
పెనఁగులాడ వచ్చేవు ప్రియములు చెప్పుతానే
యెనలేని నీ బిరుదు లేల చూపేవే ॥మగ॥

తమలము చిందేవు తగిలి మాఁటాడుతానే
చెమటలు చిమ్మేవు చెనకుతానే
తమకము రేఁచేవు తగఁ బాదాలొత్తుతానే
అమరునే నీ చేఁతలు అన్నియును గంటిమి ॥మగ॥

యెంగిలి సేసేవు మోవి యేకతము లాడుతానే
కొంగువట్టే వప్పటిని కొసరుతానే
అంగవించి శ్రీవేంకటాధిపుడు నిన్నుఁ గూడె
కంగులేని నీ [illegible]పు కానవచ్చె నిపుడు ॥మగ॥ 450

**రేకు 1986** **ఆహిరి**

ఇచ్చకమే సేసితేను యీడేరు వలపులు
మచ్చికలే చూపవలె మగవానితోను ॥పల్లవి॥

శిరసు వంచకువే సిగ్గులు వడకువే
తెరదీసి నిన్నతఁడు తేరి చూచీని
మరఁగు వెట్టుకొకువే మరి తప్పించుకోకువే
విరుల చెండున నిన్ను వేసితే నేమాయను ॥ఇచ్చ॥

మొక్కులు మొక్కకువే ముంచి చేయి పట్టకువే
పక్కన నీ చన్నులు పట్టీ నితఁడు
మిక్కిలి జంకించకువే మీరి యాన వెట్టకువే
పిక్కటిల్లఁ గాఁగిటను బిగియించఁగాను ॥ఇచ్చ॥

పెనఁగు లాడకువే బెట్టి గోర నూఁదకువే
ననుపున నీతోను నవ్వేవేళను
యెనసె శ్రీవేంకటేశుఁ డిఁక నేమీననకువే
చనవిచ్చి తనమోవి చవి చూపీ నితఁడు ॥ఇచ్చ॥ 451

## కాంబోది

ఎట్టు మన్నించేవోకాని యిట తరవాతను
చుట్టరికము లెల్లాను చూపి చెప్పఁగా ॥పల్లవి॥

కప్పురము గానుకిచ్చి కడు వినయముతోడ
చెప్పెఁగా నీకుఁ బ్రియము చెలియా
అప్పటిని పొందులకు నాసపడి నీ మాఁటలు
వొప్పుగొని కడునమ్మివుండెఁగాఁ తాను ॥ఎట్టు॥

కదిసి వద్దఁ గూ డి కంకణాలు గల్లనఁగా
మొదలనే చేతులెత్తి మొక్కెఁగా నీకు
సదరాన నీతోను సరసము లాడి యాడి
మదనకేలికిఁ జొక్కి మరిగెఁగా నిన్నును ॥ఎటు॥

చెక్కులఁ జెమటగార సేవలెల్లాఁ జేసి సేసి
మిక్కిలి కాఁగిట నించి మెచ్చెఁగా నేఁడు
యిక్కడ శ్రీవేంకటేశ యేలితి విప్పు డీకెను
వెక్కసపు సంతోసాన వెలసెఁగా యిపుడు ॥ఎట్టు॥ 452

## సామంతం

అటు గనక నేస్తము లమరు మీ కిద్దరికి
కుటిలాలు లేవు మంచి గుణములే కాని ॥పల్లవి॥

మరిగినవారికి మచ్చికగలవారికి
యరపరికములేదు యేమి సేసినా
సరసమాడేవారికి చనవుగలవారికి
విరసములేదు మరి వేడుకే కాని ॥అటు॥

ఆసగలవారికి ఆతుమైనవారికి
యీసు లేదు మదిలోన యెట్టుండినా

వాసిగలవారికి వలపుగలవారికి
వేసట లేదు మరి వినోదమే కాని ॥అటు॥

యిచ్చకపువారికి మెనసినవారికి
మచ్చరము లేదు యెన్నిమాఁట లాడినా
యిచ్చట శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి
హెచ్చుకుందు లేదు మీకు నింపులేకాని ॥అటు॥ 453

## కాంబోది

ఒక్కచోటనే వున్నారు వొద్దిక నాతఁడూ నీవూ
చెక్కుల చేతులతోడ చింత లిఁక నేఁటికే ॥పల్లవి॥

మనసు లొడఁబడితే మాఁటలకుఁ జోటు గద్దు
తనువులు సోఁకితేను తమి రేఁగును
చెనకు లగ్గలమైతే సిగ్గులును నుప్పతిలు
చనవు సేసుక పతి సంగాతాలు సేయవే ॥ఒక్క॥

మొగమొగాలు చూచితే మోహములు పెనగొను
నగవులు వలపుల నానఁబెట్టును
తగులాయపుఁ జేఁతలు తాలిములు వొడమించు
వెగటులే కితనితో వినోదము లాడవే ॥ఒక్క॥

అలమి పైకొంటేను ఆయములు గరఁగును
తలపోఁత కోరికలు తనివొందించు
యెలమి శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్నుఁ గూడె
నెలకొనె నీ పంతాలు నిండుక వుండఁగదే ॥ఒక్క॥ 454

## ముఖారి

తన వేడుకే చూచీ దలఁచఁడు నా సిగ్గు
వినయముతోఁ జెలియ విన్నవించవే ॥పల్లవి॥

నెమ్మదిఁదాను నాకు నిక్కుఁగొప్పు వెట్టీని
యెమ్మెలదాననా నేను యేమైనాను
కమ్మటిని దనవద్ద గద్దెపై గూచుండమనీ
ఇమ్ముల నింతేసి నీటు ఇల్లాలికి దగునా ॥తన॥

సారె సారెఁ దనతోను సరిగా నవ్వమనీని
ఆరజపుదాననా నే నందరిలోన
చేరవచ్చి నాకు నిట్టె చెంపల గందాలువూసీ
యీరీతుల మరునా యిల్లాలికి ॥తన॥

మిన్నక నా సింగారాలు మెచ్చి మెచ్చి పొగడీని
వన్నెవెట్టుదాననా యేవంకనైనాను
నన్ను శ్రీవేంకటేశుఁడు నంటునఁ గాఁగిటఁ గూడె
పన్నుక యిల్లాలి కిది పచారించవచ్చునా ॥తన॥ 455

## వరాళి

ఎన్ని లేవు నీ[1]సుద్దులు యెంచఁ బనిలేదుగాక
పన్నుక యిన్నిటాఁ జెల్లుబడైనవేకావా ॥పల్లవి॥

అంటే నీ మాఁటలకు నడ్డమాడరాదుగాక
నంటున గుంచె దానితో నవ్వవా నీవు
దంటతనమున నీపై దప్పువేయరాదుగాక
యింటికాడఁ గాళాంజాపె కియ్యవా విడెము ॥ఎన్ని॥

సారె సారె నీ చేఁతలు చక్కఁబెట్టరాదుగాక
చేరి యాల వట్ట మాపెఁ జెక్కు నొక్కవా
తారుకాణ సేసి నిన్నుఁ దడవఁగరాదుగాక
కోరి యడపముదానిఁ గొనగోర నూఁదవా ॥ఎన్ని॥

1. 'సుదులు' రేకు

వేడుకతో నిన్ను వెల్లవిరి సేయరాదుగాక
వాడికఁ గట్టి కాపెను వలపించవా
యీడనె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
వూడిగాలవారినెల్లా వొక్కొకవేళంటవా ॥ఎన్ని॥ 456

**రేకు 1987 రామక్రియ**

వలపు లోడిఁగట్టుక వచ్చితి విప్పుడు నీవు
యెలమి నీ యాసోద మింకా నెంత గలదో ॥పల్లవి॥

కొంగు దాఁకీఁ బతి వద్దఁ గూచుండక ఇటు రావే
ముంగురులు పైఁ బడీని మొక్కఁబోకువే
యెంగిలి సోఁకివచ్చీని యేకతా లే మాడేవే
సంగతెరఁగ వాతఁడు సదరమా నీకు ॥వల॥

తమ్మ చెదరులు రాలీ తతిగొని నవ్వకువే
చిమ్ముఁజూపులు నాటీఁ గొబ్బి చూడకువే
చెమ్మఁజెమట లంటీని చెక్కులు నొక్కకువే
యెమ్మెలు సేసేవు ఆతఁ డెంత నీ వెంత ॥వల॥

వూరుపులు పైఁ బారీ నొద్ద బండుండకువే
గీరులు కొనీ సొమ్ములు కాఁగిలించకువే
చేరి నన్ను నేలినాఁడు శ్రీవేంకటేశుఁడు తొల్లె
దారకపు నీ బోఁటికి దక్కునా యీతఁడు ॥వల॥ 457

**పాడి**

పెనఁగుతా నాన లేల పెట్టించుకొనేవే నీవు
మనసు వచ్చిన మీఁద మరచీనా ఇఁకను ॥పల్లవి॥

చక్కదానవు నీవు చదురులాడ నేర్తువు
యిక్కడఁ బతి మోహించు టేమి సోద్యమే

జక్కవ గుబ్బలు మోపి సరసము లాడితివి
మక్కువ నీ న్నాతఁడు మరచీనా ఇఁకను ॥పెన॥

నెఱజాణ విన్నిటాను నీ గుణము కోటిసేసు
మెఱసి నీ బిన్నాణాలు మెచ్చవద్దటే
చిఱునవ్వు వెదచల్లి చిత్తము గరఁచితివి
మఱి యాతఁడు నీ పొందు మఱచీనా యిఁకను ॥పెనఁ॥

పాయపుదానవు నీవు పంపు సేసుకోఁగలవు
చే యంటి ప్రియా లీతఁడు చెప్పఁజెల్లునే
యీయెడ శ్రీవేంకటేశుఁ డీతఁ డిట్టె నిన్ను నేలె
మాయింట దా నుంటే నిన్ను మరచీనా యిఁకను॥పెనఁ॥ 458

## భైరవి

గుట్టు సేసి దాఁచరాదు గురిసేసి చూపరాదు
ఇట్టిది నా యాందోళము యింతి యేమిసేతునే॥పల్లవి॥

మచ్చిక కొండవంటిది మనసు మెయిలువంటిది
హెచ్చీ నిదే తుమకము లేమి సేతునే
ముచ్చట చెప్పీనంటే ముంచుకొనీ సిగ్గులు
పచ్చిదేరీ నుడిగితే భావ మేమిసేతునే ॥గుట్టు॥

చెలిమి తీగెవంటిది చింత వనమువంటిది
యెలఇంచీఁ గోరికలు యేమిసేతునే
తలఁచుకొంటే సెలవిఁ దలిగొనీ నవ్వులు
చెలరేఁగీ వేడుకలు చెలి యేమిసేతునే ॥గుట్టు॥

పాయము పువ్వువంటిది భావము పండువంటిది
యేయెడ చూచినా దామే యేమిసేతునే

పాయక శ్రీవేంకటాద్రిపతి నన్ను నేలినాఁడు
పాయమెల్లాఁ బులకించీ కాంత యేమిసేతునే ॥గుట్టు॥ 459

## ముఖారి

మచ్చిక గలిగితేనేమి మరఁగు వద్దా
పచ్చిదేర నేమిటికి బయలీఁదేవె ॥పల్లవి॥

కొలువు లోపల మోము కొచ్చి కొచ్చి చూచుకొంటా
మలసి సొలసి యేమి మాఁటలాడేవే
నలి నీ యెమ్మెలు చూచి నవ్వేవారి నెరఁగవు
యెలమి నీ పగటులు యెంత చూపేవే ॥మచ్చి॥

పొట్టఁబొరుగున నుండి బొమ్మల జంకించుకొంటా
ఇట్టె బీరాన నెంత యెలయించేవే
చుట్టుకొన్న వలపుల సుద్దులు దలఁచుకోవు
చుట్టరికాలనే యెంత సూడువట్టేవే ॥మచ్చి॥

సంగడినే కూచుండి చన్నుల నొరసుకొంటా
యెంగిలి మోవినే యెంత యింపురేఁచేవే
చెంగటనే నన్నుఁ గూడె శ్రీవేంకటేశుఁడు
ముంగిట నీ యాస లెన్ని మొలవఁ బెట్టేవే ॥మచ్చి॥ 460

## కేదారగౌళ

[1]తప్పు లెంచ నే నిన్నుఁ దరుణీ
యిప్పుడే చెప్పితిఁ జుమ్మీ యింతిరో నీకు ॥పల్లవి॥

గంద మిచ్చి రావే చెలి కాంతునికి
నింద లేమి వచ్చునో నే నోపనమ్మా

1. ఇది నాయిక చెలికత్తెల సంవాదము.

అందియ్యవే విడెము నీ వాతనికి, నీ పతి
చెంది తమ్మ వెట్టితే నేమందువో నీవు ॥తప్పు॥

కమ్మి వేళ చూచి రావే కలికి
నెమ్మి నాతో నవ్వు నేమో నే నోపనమ్మా
రమ్మని పిలువవే దూరక చేయివట్టి
అమ్మరో మేను సోఁకు నేమందువో నీవు ॥తప్పు॥

ఆముక యెదురుకోవే అదె వచ్చీని
నీమారు న న్నంటునేమో నే నోపనమ్మా
దోమటి శ్రీవేంకటేశుతోఁ గూడి రావే
ఆమఱఁగున నుండి యేమందువో నీవు ॥తప్పు॥ 416

## ఆహిరినాట

నా మేలువాఁడై యాతఁడు నావద్దనే వున్నవాడు
యీ మతకములు మరి యిఁక నీకుఁ దగునే ॥పల్లవి॥

ఆసలు రేఁచుకొంటా నాకెకు నీతనికిని
రాసికెక్క నే మాడేవే రాయబారాలు
సేసవెట్టిననాపతిఁ జేరి నే నెఱఁగకుండా
మూసి దాఁచి పొందుసేయ మన్నేడ నేర్చితివే ॥నా మేలు॥

సన్నలు సేసుకొంటా సారె సారె నిద్దరికి
యెన్నిమారు లందించేవే యెడమాఁటలు
పన్నుక నా కాఁగిటిలో పాయకుండిన యీతని
వన్నెల నెలయించ నే వంకఁ గలిగితివే ॥నా మేలు॥

కడనుండి నవ్వుకొంటా గలపే వొకరొకరిఁ
దడవక మానవే నీ తాపితనాలు

యెడయక శ్రీవేంకటేశుఁడు నన్నేలినాఁడు
అడరి నా ఉపరివ యెట్టు వచ్చితివే ॥నా మేలు॥ 462

**రేకు 1988 రామక్రియ**

లాలించి కూడఁగరాదా లలన కడుఁగోమలి
పాలించితి విఁక నేల పచ్చిసేసేవు ॥పల్లవి॥

వెన్నెలబాయట నాపె విన్నపాలు సేయఁగ్గానే
చన్నులేల టి(పి?) సికేవు సారె సారెకు
కన్నుల జంకించి యట్టె కాళ్లకు మొక్కరాఁగానే
నున్నఁగా [1]మాఁటి(టా?) డి మొలనూ లేల పట్టేవు ॥లాలిం॥

చేవల్లకు వచ్చి యాపె చేరి విడె మియ్యఁగానే
మోవి యేల యానేవు ముందుగా నీవు
పూవులను వేసి నిన్ను పూఁచి చెక్కు నొక్కఁగానే
కావరించుకొంటా నేల కాఁగినిం (లిం?) చేవు ॥లాలిం॥

జమళిఁ గూడి నీ కాపె సరిఁ గత చెప్పఁగానే
తమలము వెట్టి యం (యెం?) త తమి రేఁచేవు
అమర శ్రీవేంకటేశ యలమేల్మంగ ననఁగా
సమరతి నింతయేల సాము సేసేవు ॥లాలిం॥ 463

**పాడి**

ఎన్నఁడు నేరిచితివో ఇంతేసి కతలు
నిన్న మొన్నటి దానవు ని న్నెంచి చూచితేను ॥పల్లవి॥

సడఁగులు చల్లి చల్లి చట్రాత నా రొలిచేవు
తడయక సిగ్గులనే దడి గట్టేవు
అడఁకువ నయాల బయలు వందిలి వెట్టేవు
బడినుండి రమణునిఁ బనిగొనఁ గలవే [2]॥ఎన్నఁ॥

1. మాఁటు+ఇది = మాఁటిడి కూడా కావచ్చు. 2. తాడు+పేఁడేవు

యెలయింపు మాఁటలనె ఇసుకఁ [1] దాడు వేఁడేవే
సొలపుఁజూపులనే సొక్కు చల్లేవు
సెలవుల నవ్వులనే జిగురుఁగండె లోడ్డేవు
యెలమి నీ విన్నిటాను యీడేరుఁగలవే ॥ఎన్న॥

కతకారి తనాలనే గాలి మూటగట్టేవు
రతి మొయిలులేనివాన రప్పించేవు
యితఁడు శ్రీవేంకటేశుఁ డేలె నలమేల్మంగను
చతురత నీవూఁ గొత సాదించఁగలవే ॥ఎన్నఁ॥ 464

**సాం**

మమ్ము నేమి యడిగేవు మాపుదాఁకాను
చిమ్మిరేఁగె సంతోసాలు చిత్తగించవయ్యా ॥పల్లవి॥

మచ్చికలు చెలియాడే మంతనాలలో నున్నవి
ముచ్చటలు తేనెగారే మోవి నున్నవి
కచ్చుకొన్న వేడుకలు కనుచూపులో నున్నవి
విచ్చన విడిగా నీవు విచారించుకోవయ్యా ॥మమ్ము॥

చిడుముడి కోరికలు చెక్కు చేతిలో నున్నవి
అడియాసలు జాగరాలం దున్నవి
గుడి గొన్న సిగ్గులు గుబ్బలపై నున్నవి
తడఁబడక నీలోనే తలఁచుకోవయ్యా ॥మమ్ము॥

నాటుకొన్న సరసాలు నగవులలో నున్నవి
గాఁటపుఁ గళలెల్లా మొగాన నున్నవి
యీటుతో శ్రీవేంకటేశ యీకె యలమేలుమంగ
తేటల నీ వేలితివి తెలుసుకోవయ్యా ॥మమ్ము॥ 465

2. దాడు+వేఁడేవు

## దేసాళం

నా మాఁటలోనివాఁడవు నమ్మినదానను నేను
చేముంచి నా సేవలెల్లాఁ జిత్తగించవయ్యా ॥పల్లవి॥

చుట్టపు వరుస నిన్ను సొలసితి నింతేకాక
యెట్టు సేసినా నేరా లెంచేనా నేను
నెట్టుకొన్న వలపుల నీ దిక్కు చూచితిఁగాక
చుట్టి నీ మై గురుతులు సోదించేనా ॥నామాఁట॥

మంచితనమున నీ మర్మము లంటితిఁగాక
చంచుల నిన్నుఁ జెనకి సాదించేనా
కొంచక సంతోసాన గొబ్బున నవ్వితిఁగాక
నించి యెగసక్కెలెల్లా నీయందుఁ జేసేనా ॥నామాఁట॥

చెలిమికత్తెనై నీ చెరఁగు వట్టితిఁగాక
బలుములు సేసి నీతోఁ బచారించేనా
యెలమి శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
మలసి నన్నేలితివి మాఁట మీరేనా ॥నామాఁట॥ 466

## ముఖారి

ఇన్నిటా వేడుకకాఁడు యేమి సేసినాఁ జెల్లును
యెన్నికాయ దన సుద్దులేల సిగ్గువడీనే ॥పల్లవి॥

కూరిమితోఁ జూతుఁగాని కోపగించఁజాలనే
గారవింతుఁగాని యలుగఁగఁగాని
సారెఁ బొందుసేతుఁగాని జంకించఁజాలనే
యీరీతి నే గుణ మిదియేల సిగ్గువడీనే ॥ఇన్ని॥

మంచిమాఁ టాడుదుఁగాని మరి వెంగే లాడనే
కొంచక నవ్వుదుఁగాని గుంపించఁజాలనే
వంచించి మొక్కుదుఁగాని వడి నొడ్డారించనే
యెంచితే నా కత లివి యేల సిగ్గువడీనే ॥ఇన్ని॥

చుట్టమనై వుందుఁగాని సూడుఁబాడు బట్టనే
మెట్టి సేవసేతుఁగాని మేర మీరనే
పట్ట పలమేలు మంగపతి శ్రీవేంకటేశుఁడు
యిట్టె నన్నేలినాఁడు యేల సిగ్గువడీనే ॥ఇన్ని॥ 467

**బౌళి**

ఇంకా నేమి సేసీనో ఇది నీ కెంత ప్రియమో
పొంకముగాఁ జూచి చూచి పొగడేము నేము ॥పల్లవి॥

గుత్తపు గుబ్బల నొత్తి గోరు చెక్కుపైఁ బెట్టి
చిత్తమురా నీకు సేవ సేసెఁగా తొల్లె
తత్తరాన నిందుమీఁద తన మోవి తేనె యిచ్చి
బత్తు లెల్లాఁ జూపెగా నీపై నీపె నేఁడు ॥ఇంకా॥

మేడలోనఁ గాలు దొక్కి మెడదండ నీపై వేసి
జోడుగా జుట్టరికాలు చూపెఁగా తొల్లె
వేడుకతో నప్పటిని వెంటికలు దాఁక మొక్కి
కూడి పొత్తు గలపెఁగా కోరి నీతో నిపుడు ॥ఇంకా॥

తొడమీఁదఁ గూచుండి దొమ్మినిఁ గాలు దాఁకించి
చిడుముడిఁ జేఁతలెల్లాఁ జేసెఁగా తొల్లె
అదరి శ్రీవేంకటేశ యలమేలుమంగను నేను
తడవి నన్నేలితివి తా మెచ్చెఁగా ఇందుకు ॥ఇంకా॥ 468

**రేకు 1989** **ఆహిరి**

విన్నపము [1]లాలకించి వినవయ్యా
యెన్నికఁగా నీకె పొందు నీడేరించవయ్యా ॥పల్లవి॥

తలఁచు నెప్పుడు నిన్నుఁ దమకించు రతులకు
పిలుచు మచ్చికతోడఁ బేరుకొని
చెలులతో నీ సుద్దులు చెప్పుకొను బలుమారు
కలికి చందము లివి కరుణించవయ్యా ॥విన్న॥

నిక్కి నిక్కి చూచును నీ రాకలో కోరు
మొక్కు నీవున్న దిక్కుకు మొగమై యుండి
అక్కున నదుముకొను నట్టె నీ వుంగరము
గక్కన నింతి నింతట గారవించవయ్యా ॥విన్న॥

నీ రూపు పటాన వ్రాసు నివ్వెరగుతో నిలుచు
సారె నీ మోవి తేనెకు నోరూరును
యీరీతి శ్రీవేంకటేశ యీక యలమేలుమంగ
కూరిమి నేలితివి మక్కువఁ బాయకవయ్యా ॥విన్న॥ 469

**శ్రీరాగం**

ఏమందు నే నిఁక యీతనితోను
కామించి నాకుఁగానే కాచుకవున్నాఁడే ॥పల్లవి॥

పొట్టఁ బొరుగున నుండి పువ్వుల చెండున వేసి
చుట్టపు మాఁటలాడీ సోరణగండ్ల
యిట్టె సిగ్గుతోడ నే నివ్వలిమోమైతేను
పట్టి చమ్మనఁగోవుల పన్నీరు చిమ్మీనే ॥ఏమం॥

1. ఇక్కడ 'ఆలకించు' నకు శ్రద్ధ, ఏకాగ్రత ప్రభృతులు అర్థముకావచ్చు. ఆలక్కించి రేకు. ఆలక్షించుకు తద్భవమేమో?

మునిముంగిటికి వచ్చి ముచ్చట నవ్వులు నవ్వి
తనుఁదానే పాటవాడీ తలుపుదండ
పానిగి గడె దెరచి బుద్దులు నేఁ జెప్పితేను
పనిగలవానివలె బాగా లిచ్చీనే ॥ఏమం॥

పుయ్యాలమంచ మెక్కి పూచుమని కాఁగిలించి
యియ్యెడఁ జెలఁగీ నట్టింటిలోనను
పయ్యాడి యలమేల్మంగపతి శ్రీవేంకటేశుఁడు
వొయ్యనే రతుల న న్నోలలారిచీనే ॥ఏమఁ॥ 470

## సామంతం

ఎంత భాగ్యవంతుఁడవో యిన్నియును నొనగూడె
మంతనాన నీకె నిట్టె మన్నించవయ్యా ॥పల్లవి॥

చెలిమి చేటఁడు చల్లె చెలియ నీమీఁదను
కలికితనాలు నీకు గంపలఁ బెట్టె
వలపులు నీ యెదుట వాములుగాఁ గూడపెట్టె
యెలమి నీ కోరికె లీడేరెనయ్యా ॥ఎంత॥

నగవులు మూఁట గట్టె నలినాక్షి నిన్నుఁ జూచి
పగట్టుఁ జేఁతలు నీకు బండ్లఁ బెట్టె
మొగమిచ్చ లెల్లా నీ ముందర దొంతి వేరిచె
తగులాయములు నీకు దలకూడెనయ్యా ॥ఎంత॥

వావులు గాదెఁ బోసె వనిత నీ పొందుసేసె
మోవి సన్నలు నీమీఁద మోపు గట్టెను
యీవేళ శ్రీవేంకటేశ యీకె యలమేలుమంగ
దేవులాయ నీ వేడుక తిరమాయనయ్యా ॥ఎంత॥ 471

## రామక్రియ

చూచి చూచి నాకైతే సోద్యమయ్యీని
యీ చేఁతలెల్లా మీకు నిద్దరికే చెల్లును ॥పల్లవి॥

సారె సారె నాపె నీపై సణఁగులు చల్లఁగాను
వోరుచుక యెట్టున్నావో వోయమ్మ నీవు
బీరాన నప్పటి నీతో పెనుఁబంతా లాడఁగాను
యీరీతి నేమీ ననవు యెంత మొగమోటమో ॥చూచి॥

వెడ వెడగా నిన్ను వెక్కసాన సాదించఁగా
వొడఁబాటు లెట్టాయనో వోయమ్మ నీకు
జడియక నీమీఁద జంకెనలు చూపఁగాను
యెడనెడ నవ్వు నవ్వే వేఁటి చుట్టరికమో ॥చూచి॥

పెక్కుమారు లింతసేసి ప్రియములు చెప్పఁగాను
వొక్కటైతి వే గుణమో వోయమ్మ నీది
ఇక్కడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
యిక్కడి కాపెఁ దెచ్చేవు యెంత జాణతనమో ॥చూచి॥ 472

## వరాళి

ఇన్నిటికి సెలవుగా నిదిగో నీకు మొక్కేను
మన్నించి నాపై కరుణ మఱవకువయ్యా ॥పల్లవి॥

కలికితనాల నిన్ను కడుఁగడుఁ గొసరితి
కలకల నవ్వి నవ్వి కరఁగించితి
మొలక చన్నుల నొత్తి మొగమోడించితి నిన్ను
యెలమి నా వుద్దండాలు యెన్నిలేవయ్యా ॥ఇన్ని॥

సారెకు వలపు చల్లి చనవు సాదించితి.
కూరిమిగొసరి నిన్ను గుంపించితి

పేరుకొని నా యెంగిలి పెద్దవులఁ బిలిచితి
యీరీతి నా తమకము యేమి చెప్పీనయ్యా ॥ఇన్ని॥

చక్కదనములు చూచి సరసము లాడితి
పెక్కులాగుల రతులఁ బెనఁగితి
యిక్కువలంటి శ్రీవేంకటేశ నన్ను నేలితివి
యిక్కడ నా కోరికలు యీడేరెనయ్యా ॥ఇన్ని॥ 473

## పాళంగనాట

ఇందరు నెరిఁగినవి యీ పనులు
పొందులెల్లా నీడేరె బోగించఁగదవే ॥పల్లవి॥

కొనచూపుల నవిగో కొసరులు
వొనరె ముక్కున నసురుసురులు
మునుకొనెఁ జెమటల ముసురులు
తనిసి రతి చిన్నలు దాఁచ నిఁకనేఁటికే ॥ఇంద॥

మోవిపై నవె నవ్వుల మొరఁగులు
కావరపు మనసులో కరఁగులు
తేవలఁ గొప్పు జారిన తెరఁగులు
చేవఁదేరెఁ బను లిఁక సిగ్గువడనేఁటికే ॥ఇంద॥

గుబ్బలపై నిండె నవె గుఱుతులు
గుబ్బి పచ్చి మాఁటల కఱతలు
గొబ్బున శ్రీవేంకటేశు కూటములు
అబ్బె నీకు య[redacted]ఁత లడఁచఁగనేఁటికే ॥ఇంద॥ 474

**రేకు 1990** 

## వాదరామక్రియ

తానే వచ్చీఁగాని తడవకువే పతిని
చేనంటి మునుపే నాకు సేస వెట్టినాఁడు ॥పల్లవి॥

తలఁపులకొలఁదివే తగులాయాలు
వలచినకొలఁదివే వాడికలు
పిలుపులకొలఁదివే ప్రియములు
బలిమి సేయఁగ ఁబోతే పచ్చిదేరుఁ బనులు ॥తానే॥

ఆడినకొలఁదివే యాస మాఁటలు
కూడినకొలఁదివే కూటములు
వేడుకకొలఁదివే వినోదాలు
వాడుకొనఁబోతేను వసగావు పనులు ॥తానే॥

నవిచినకొలఁదివే నగవులు
యెనసినకొలఁదివే యింపు సొంపులు
చెనకి నన్నేలినాఁడు శ్రీవేంకటేశుఁడు
పెనఁగగఁబోతేను పెచ్చురేఁగుఁ బనులు ॥తానే॥ 475

## ముఖారి

నిన్నుఁ జెప్పి చూపితేను నెరజాణ విన్నిటాను
నన్ను నెన్నిచందాల నిమ్మిఁంచేవయ్యా ॥పల్లవి॥

మొలకచన్నులదాన మోవితేనెలదాన
నలిరేఁగి నాతో నేమి నవ్వేవయ్యా
చిలుకుఁజూపులదాన సిగ్గరితనాలదాన
పలుమారు నెంత వొడఁబరచేవయ్యా ॥నిన్నుఁ॥

కొంచెపు నది(డి?)మిదాన కోమలపు మేనిదాన
పొంచి పొంచి యింతయేల పొదిగేవయ్యా
అంచ నడపులదాన అన్నువ పాదాలదాన
వంచనతో మొక్కే నేల వలపించేవయ్యా ॥నిన్నుఁ॥

కొడిదేఁడు మోముదాన కోవిల యెలుఁగుదాన
చిడుముడి నెందాఁకాఁ జెనకేవయ్యా
యెడయక శ్రీవేంకటేశ నన్ను నేలితివి
కడుమేలుదాన నెన్ని కతలు చెప్పేవయ్యా ॥నిన్నుఁ॥ 476

## పాడి

కాతరపుదాన నేను ఘనుఁడు తాను
ఘాతలు నింత కోపితే కరుణించుమనవే ॥పల్లవి॥

కొప్పువట్టి తియ్యరాదు కొనగోర నూఁదరాదు
చెప్పి తన పొందు లెట్టు సేయుమనీనే
ముప్పిరిఁ దిట్టఁగరాదు మోవి గంటిసేయరాదు
అప్పటి సరసమెట్లాడు మనీనే ॥కాత॥

తమ్ములము వెట్టరాదు తతిఁగాలు వేయరాదు
నమ్మించి తనతో నెట్టు నవ్వుమనీనే
కిమ్ముల రా కొట్టరాదు కిందు పరచఁగరాదు
కమ్మటి తన మేనెట్లు కాఁగిలించుమనీనే ॥కాత॥

చేముట్టి చెనకరాదు చేరి పనిగొనరాదు
ఆముకొని యెట్టు పెండ్లాడుమనీనే
యీమేర శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్ను నేలె
కామించి తనకు నెట్టు కత చెప్పుమనీనే ॥కాత॥ 477

## శ్రీరాగం

ఎంచితే నొకటి కొక టెక్కుడాయ సింగారము
మించిన యీపె వొరపు మిక్కిలి సింగారము ॥పల్లవి॥

చెలివదనమునకు చిరునవ్వు సింగారము
పలువరుసకు ముద్దుఁబలుకు సింగారము

కలికి కన్నులకు చింక చూపులు సింగారము
నిలువు [1]దారుమునకు నెరులు సింగారము ॥ఎంచి॥

గరిమ మొగమునకు కళలు సింగారము
వురమునకు చన్నుల వుదుటు సింగారము
సరుస బొమ్మలకును జంకెనలు సింగారము
సిరి దొలఁకు మేనికి సిగ్గులు సింగారము ॥ఎంచి॥

పెనుఁ బిరుఁదుకు మురిపెములు సింగారము
వొనరిన [2]వేతులకు వొయ్యారాలు సింగారము
ననిచి శ్రీవేంకటేశునకు నీకు దేవులాయ
పెనగొన్నరతు లివి పెండ్లి సింగారము ॥ఎంచి॥ 478

## రామక్రియ

చూడఁ బిన్నవాఁడు గాని సుద్దులెన్నైనాఁ గలవు
వీడుదోడైన దేవళ్ల [3]విట్ఠలేశుఁ డితఁడు ॥పల్లవి॥

పిల్లఁగోవి రాగాలు బెరియించి గొల్లెతల -
వుల్లములు గరఁగించీ నుబ్బులు రేఁచి
పల్లదాన వెన్నెల బయట యమునలోన
వెల్లవిరిఁ గూడిన యావిట్ఠలేశుఁ డితఁడు ॥చూడఁ॥

కొలనిలో నీళ్లాడే కొమ్మలను వలపించి
చెలఁగి మానాలు చూచి చీరలిచ్చి
కొలఁదిమీర వారి కోరిక లీడేరఁజేసి
వెలసి యుండిన యా విట్ఠలేశుఁ డితఁడు ॥చూడఁ॥

వోడక మధురలో నువిదచే గందమంది
యీడులేని తన మహిమెల్లాఁ జూపి

1. దారుమునకు? 2. వేతులకు? 3. 'విఠ్ఠల' రేకు 4. చెంతల రేకు

జాడతో శ్రీవేంకటాద్రి శైలముపై నిలుచుండి
వేడుకకాఁడైన యావిట్ఠలేశుఁ డితఁడు ॥చూడ॥ 479

## దేసాళం

మొక్కరమ్మ చెలులాల మోహనాకారుఁడు వీఁడె
వెక్క సపుచేఁతల శ్రీవేంకటేశుఁడు

సంతోసాన నాదె పెండ్లి చవికెలోఁ గూచున్నాఁడు
మంతనము లాదు(డు?) కొంటా మగువలతో
పొంతనే సరసాలాడీ భూపతి చెరువు దండ
వింత సింగారాలతో శ్రీవేంకటేశుఁడు ॥మొక్క॥

జోడైన రత్నాల సొమ్ములు(లు?) వెట్టుకున్నాఁడు
వాది (డి?) కైన వూడిగపువారితోఁ గూడి
వీడెములు సేసుకొంటా వికవిక నవ్వుకొంటా
వేడుకకాఁడైనాఁడు శ్రీవేంకటేశుఁడు ॥మొక్క॥

తలకొన్న కమ్మఁ బూవు దండలతో నున్నవాఁడు
లలిఁ బూసివ(న?) పరిమళాలు మించగా
పలురతుల దనిసి బాగుగా దేవుళ్లఁ దాను
విలసిల్లీ నిదిగో శ్రీవేంకటేశుఁడు ॥మొక్క॥ 480

## రేకు 1991 రామక్రియ

అల్లవాఁడె గద్దెమీఁద నంగనలు గొలువఁగా
వుల్లాసముతో నవ్వీని ఉద్దగిరి కృష్ణుఁడు ॥పల్లవి॥

పచ్చఁబట్టు దట్టివాఁడు బాలకృష్ణుఁడు
పచ్చి దేరే పెదవుల బాలకృష్ణుఁడు
బచ్చన చక్రముచేతి బాలకృష్ణుఁడు
పచ్చారి వలపులనే బాలకృష్ణుఁడు ॥అల్ల॥

బలురోలఁ గట్టువడె బాలకృష్ణుఁడు
బలిమి మద్దుల దోసె బాలకృష్ణుఁడు
పలు గోపికలఁ గూడె బాలకృష్ణుఁడు
బలరాము తమ్ముఁడు బాలకృష్ణుఁడు ॥అల్లి॥

పట్టినాఁడు వెన్నముద్ద బాలకృష్ణుఁడు
పట్టుఁగొమ్మ సురలకు బాలకృష్ణుఁడు
బట్ట బయట మెరసె బాలకృష్ణుఁడు
పట్టపు శ్రీవేంకటాద్రి బాలకృష్ణుఁడు ॥అల॥ 481

## పాడి

ఏఁటికి సిగ్గులువడే వింతలోనే నన్నుఁ జూచి
చాటువ నా నీతనితో సరసము లాడవే ॥పల్లవి॥

చనవుగలదానికి సాదించవచ్చును
ననుపుగలదానికి నవ్వవచ్చును
వినయపుదానికి వేవేలు నాడవచ్చు
చెనకి పతిముందర చేఁతలు నెరపవే ॥ఏఁటి॥

బలిమిగలదానికి పంతము నెరపవచ్చు
కొలువుదానికిఁ గడు గొసరవచ్చు
వలపుగలదానికి వాడిక మెరయవచ్చు
పలుమారు విభునికి బత్తిసేయవే ॥ఏఁటి॥

ఆసగలదానికి ఆయము లంటఁగవచ్చు
వేసాలదానికి వేఁడుకోవచ్చు
యీసరి శ్రీవేంకటేశుఁ డేలినాఁడు నన్ను నేఁడు
సేసవెట్టి నీవు గొంత చెలిమిసేసుకోవే ॥ఏఁటి॥ 482

## ముఖారి

ఎంతలేదు నీ యాసోద మేమి చెప్పేది
వింత వింత రతులనే వినోదించేవు ॥పల్లవి॥

యెడమాఁటలాడేటి ఇంతితో సారెసారెకు
తడవి తడివి జాణతనా లాడేవు
కడనుండి వేరొకతె కానుకియ్య వచ్చితేను
నడుమ నూరకె నీవు నవ్వునవ్వేవు ॥ఎంత॥

పేరటమువచ్చి నాపె పెండ్లిపాట వాఁడగాను
కూరిమి గొసరి యేల కొంగువట్టేవు
నేరుపుతోడ నొకతె నీవేడుక చూడఁగాను
పోరచి వలపు చల్లి పువ్వుల వేసేవు ॥ఎంత॥

సాకిరై వచ్చినయట్టి సతి వద్ద నుండఁగాను
మేపులకు సాపెతోను మేలమాడేవు
యీకడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
పై కొసరువారి కేల బాఁతిపడేవు ॥ఎంత॥

## సామంతం

ఎన్నఁడూ నెరఁగము ఇటువంటి కొత్తలు
ఇన్నిటా నీ కీపె పొందు లెట్లబ్బెనయ్య ॥పల్లవి॥

కరఁగి కరఁగి సారె కాంత నీతో మాఁటలాడీ
యెరవొ సతమో యీకె యెవ్వతెయ్యా
కెరలి కెరలి లోలో కిల కిల నవ్వు నవ్వీ
తెరలోని కెందుండి తెచ్చుకొంటివయ్యా ॥ఎన్న॥

తగిలి తగిలి నీకుఁ దమకము రేఁచీని
చిగురో చేఁగో యీపెఁ జెప్పవయ్యా

మొగమెత్తి మొగమెత్తి మోవి నీకుఁ జూపీని
సొగిసి నీ కెన్నాళ్ల చుట్టరికమయ్యా ॥ఎన్న॥

వీడె మిచ్చీ వీడె మిచ్చి వేఁడుకొనీ జెక్కు నొక్కి
వేడుకో వాడికో యీపె విధ మేదయ్యా
యీడనే శ్రీవేంకటేశ యిటు నన్ను నేలితివి
వాడలో నీ వీకె నెట్లా వలపించితివయ్యా ॥ఎన్న॥ 484

## శ్రీరాగం

ఎంతని చెప్పీ మిఁక ఇంతి నీపైఁ గల బత్తి
పొంత నీ చక్కఁదనాలు పూఁచి పూఁచి వా(వ్రా?) సును॥పల్లవి॥

తరుణి నీతో పొందు తలఁచుక తలఁచుక
గరిమతో నాడుకొను కాంతలతోను
సొరిది నీ గురుతులు చూచుకొని
వెరగంది పలుమారు వేడుకతో నవ్వును ॥ఎంత॥

జలజాక్షి నీ గుణాలు సరిఁ బొగడి పొగడి
చెలరేఁగి మేనెల్లాఁ జెమరించును
యెలమి నీ మన్ననలు యెంచుకొని యెంచుకొని
నిలువుఁ బులకలతో నిట్టూరుపు నించును ॥ఎంత॥

కొమ్మ నీపై వలపుల గుబ్బతిలి గుబ్బతిలి
ఇమ్ముల నీకుఁ జేతులెత్తి మొక్కును
నెమ్మది శ్రీవేంకటేశ నీవు వచ్చి కూడితివి
కమ్మి యీకె సంతోసాన గడు నోలలాడును ॥ఎంత॥ 485

## పాడి

[1]చుట్టపు వరుస నన్నీ సుదతి సింగారమాయ
దట్టమై యొకటి కొకటి దాపులాయఁగదవే ॥పల్లవి॥

తొలుతనే సతి మోవి దొండపండై యుండఁగాను
పలుకుఁ జిలుక లందు పరఁగుఁగదే
తళుకుఁ గన్నులు మంచి తామరలై వుండఁగాను
అలరు నెరిఁ దుమ్మిద లమరుఁగదే ॥చుట్ట॥

సరసనే నెమ్మోము చెందురుఁడై వుండఁగాను
గరిమ నవ్వు వెన్నెలఁ గాయు గదవే
గురు కుచములు పెద్దకొండలై వుండఁగాను
సిరుల నడు మనేటి సింహము చేరుగదే ॥చుట్ట॥

కడలేని యీకె మేను కనకమై వుండఁగాను
వుడివోని మించు వన్నె లుండుఁగదవే
జడియక పిరుఁ దిది చక్రమై వుండఁగాను
బడి శ్రీవేంకటేశుఁడు పట్టుకుండుఁగదవే ॥చుట్ట॥ 486

**రేకు 1992** **గౌళ**

అందుకే సంతోసమాయ నన్నిటా నాకు
కందువ నిట్టె మమ్ముఁ గరుణించవయ్యా ॥పల్లవి॥

యెచ్చటనుండి నీవు యేమేమి సేసినాను
వచ్చితివిగా నేఁడు మా వాకిటికిని
విచ్చనవిడిని నీవు వేడుకకాఁడవై వున్నా
మచ్చికతోఁ గూచుండి మాఁటలాడితివిగా ॥అందు॥

1. ఈ పాటలో 'ఉండఁగా' అను పదము రెండవ చరణము మూడవ పాదము, మూడవ చరణము మూడవ పాదము తక్క, తక్కిన స్థలములం దంతటా డద్విరుక్తి లేకుండానే రేకులో వున్నది

కామించి నీ వెన్నెన్ని కతలఁ బొరలినాను
నామోము చూచి ఇట్టె నవ్వితిగా
వేమరు నీ చేతలు వెల్లవిరులైనాను
ఆముకొని కాఁగిలించి యాదరించితివిగా ॥అందు॥

ఆసలఁ జొక్కి నీ వెంత ఆయములు గరఁగినా
సేసలెట్టి పెండ్లాడి చేకొంటివిగా
నీ సుద్ది శ్రీవేంకటేశ నిండుకొని వుండినాను
వాసితో నన్నేలి నావాఁడవైతివిగా ॥అందు॥ 487

## సామంతం

ఒక్కచోటనే వున్నారు వొద్దికై మీ రిద్దరును
అక్కజపు రతి నోలలాడుదురుగాక ॥పల్లవి॥

వలపులు దల కెక్కె వావులు కాలు దొక్కె
చెలియరో పతితోడ సిగ్గు లింకేలే
సెలవుల నవ్వు దేరె చెమటలు మేనఁ గారె
పలుమారు జాగులు పచారించ నేఁటికే ॥ఒక్క॥

చిగురుఁ గెమ్మోవి మాఁగె చిత్తపు టాసలు రేఁగె
బిగియుచు గుట్టుతోడఁ బెనఁగనేలే
మొగమున వసివాడె మోహములు దలకూడె
తగులాయములు లోలో దాఁచ నేఁటికే ॥ఒక్క॥

కనుచూపు వాడికాయ కాఁగి లిట్టె [1]వేడికాయ
మొనగోరి చెనకుల్లమోనములేలే
యెనసె శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్ను నేఁడు
చనవరి మొక్కులతో సన్నలు మరేఁటికే ॥ఒక్క॥ 488

---

1. 'వేడుక' శబ్దము అను (వ్రాసకోసరము 'వేడిక'గా మారినదేమో?

## దేసాళం

ఎదుటనే వుండఁగాను యెడమాఁట లేమిటికే
కదిసి పెనఁగులాడే కలయికలే మేలే ॥పల్లవి॥

మచ్చికలు నెరపితే మనసు లేకము లౌను
ఇచ్చకము తెచ్చితేనే యింపులు వుట్టు
ముచ్చటలు గలసితే ముదురు నడియాసలు
మెచ్చులుగా బతితోడి మేలములే మేలే ॥ఎదు॥

నగవు లుప్పతిలితే ననుపులు సమకూడు
మొగమోట గలిగితే మొనయు దమి
తగులాయా లొనరితే దట్టమౌను వలపులు
మగవానితో మంచిమాటలే మేలే ॥ఎదు॥

చూపులు తారసించితే సొంపులు మిక్కుటమౌను
కాఁపురాలు దొరకితే గట్టియౌఁ బొందు
పైపై నీమీఁది బత్తిఁ బాయక నన్నేలినాఁడు
చేపట్టి శ్రీవేంకటేశు సేవలే మేలే ॥ఎదు॥ 489

## ఆహిరి

చెలియ మంచిగుణాలు చిత్తమునఁ బట్టినా
వెలయ నిన్నియు విన్నవించితి నే నీకు ॥పల్లవి॥

మొగము చూచి నీతో ముచ్చటలే యాడుఁగాని
యెగసక్కే లాడనేర దెంతైనా సతి
నగుతాను వద్దనుండి ననుపే నడపుఁగాని
వెగటులు చూపి మోపి వేసరించఁ జాలదు ॥చెలి॥

మంతనాన సేవసేసి మచ్చిక నెరపుఁగాని
పంతములు నీ ముందర బచారించదు

సంతోసాన మోవి చూపి చవులు గొలుపుఁగాని
వింత సేసుకొని నిన్ను [1]వెంగన సాదించదు ॥చెలి॥

కందువకు నిన్నుఁ దీసె కాఁగిలించుకొనుఁగాని
మందెమేళమున నీకు మట్టుమీరదు
ఇందుకే శ్రీవేంకటేశ యీకె నిట్టె యేలితివి
సందడి నీ రతులకు జవదాటదు ॥చెలి॥ 490

## దేసాళం

వేగమే యానతీవమ్మా విన వేడుకయ్యీ నాకు
యీగతి నున్నవి నీ ఇంగితాకారములు ॥పల్లవి॥

కాంతునిమై గురుతులు కంటివో యేమైనాను
చెంతనుండి నవ్వేవు చిరునవ్వులు
వింత సుద్దు లేమైనా వింటివో యాతనిమీఁద
ఇంతలోనే చెలులతో నేకాంతా లాడేవు ॥వేగ॥

చేతికి నంగమచ్చాలు చిక్కెనో నీకేమైనా
కాతరాన సొలసేవు కమ్మటి నీవు
నీ తలపున నేమైనా నెపములు వారెనో
పోతరించి లోలోఁ దలపోసుకొనేవు ॥వేగ॥

నిక్కముగా నాతని నిజము దెలిసితివో
గక్కన శ్రీవేంకటేశు గాఁగిలించేవు
ఇక్కువలు గరఁగి నీ యెన్నిక లీడేరెనో
వుక్కుమీరి కలలెల్లా నుప్పతిలీ నీకును ॥వేగ॥ 491

## వరాళి

కాదని తొలఁగరాదు కైకొని మెలఁగరాదు
యీదెస నాతని చిత్త మెట్టుండునో ॥పల్లవి॥

1. 'వెంగావ' అని వుండవచ్చునేమో? వెంగావ = వ్యంగ్యముతో

ఒత్తి మాఁటలాడితేను వొకటొకటె తోఁచును
మత్తిలి నవ్వు నవ్వితే మందెమేళమౌ
బత్తి సేయఁగాఁ జేయఁగా పైపై మొగచాటౌను
ఇత్తల పతితోఁ బొందు లెటువలె జేతునే ॥కాద॥

సారె సరస మాడఁగా చలములు మీరి వచ్చు
చేరి చేరి చూడఁగాను సిగ్గులు నిండు
మేరమీరి కొసరఁగా మిక్కిలి వేసటలౌను
నేరుపులు వచరించ నే నెట్టు నేరుతునే ॥కాద॥

చెనకి కాఁగిలించితే చిత్తము నీరై కరఁగు
పెనఁగితే తమకములు పెచ్చు వెరుగు
యెనసె శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నేఁడు
పను లీతనివి యింత పచారించవచ్చునే ॥కాద॥ 492

**రేకు 1993 శంకరాభరణం**

తానే వచ్చీ నాతఁడు తడవకురే మీరు
తానకమై నా కోరిక తగుల కేలుఁ(లుం?) దునే ॥పల్లవి॥

వలచిన కొలఁదినే వాడికలు సమకూడు
తలఁచినకొలఁదినే తమి రేఁగును
పలికినకొలఁదినే పంతములు నీడేరు
కలది గలంతేకాక కడమ లే లవునే ॥తానే॥

నగినకొలఁదినే నాఁటుకొనుఁ బ్రియములు
సొగిసినకా(కొ?)లఁదినే చుట్టరికము
మొగమిచ్చకొలఁదినే మొనయు సరసములు
తగులైనకూటములు తతులేల దాఁటునే ॥తానే॥

కూడినకొలఁదినే కూరిములు కొనసాగు
యీడైనకొలఁదినే ఇంపులు వుట్టు
వేడుకతో న న్నిట్టె శ్రీవేంకటేశుఁ డేలినాఁడు
వీడని జంటలు యెట్టు విచ్చి చెప్పవచ్చునే ॥తానే॥ 493

పాడి

పతివద్ద గూచుండవే బాగాలు చేతి కియ్యవే
తతి గొన్న నీ వలపు దాఁచిపెట్టవచ్చునా ॥పల్లవి॥

వొగ్గి మాఁట లాడితేనే వొడఁబాటై వుండుఁగాక
[1]డ(ద?)గ్గర కల్లంతనుంటే తమి వుట్టీనా
యెగ్గులేని చుట్టరిక మెంచినట్టె వచ్చుఁగాక
సిగ్గులు వెగ్గళమైతే చిత్తము గరఁగునా ॥పతి॥

ననుపుగా నవ్వితేనే నమ్మికలై వుండుఁగాక
వొనరని సరసాలు వొద్దికయ్యీనా
మనసు వచ్చిన పొందు మచ్చికలు రేఁచుఁగాక
పెనఁగులాటలైయైతే ప్రియములు వుట్టీనా ॥పతి॥

యెరవుగాని కాఁగిలి ఇతవులై వుండుఁగాక
పొరపొచ్చపు రతులు పొసఁగుండీనా
ఇరవై శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్ను ఁగూడె
సిరులు మీ వేడుకలు చెప్పి చూపవచ్చునా ॥పతి॥ 494

గౌళ

ఇప్పటనుండియు నిన్ను ఇంతేసి దూరఁగనేల
చెప్పనేల నీవేమైనాఁ జేయువయ్య చేఁతలు ॥పల్లవి॥

---

1. యతిభంగము.

వెంగెము లాడినఁగాక వెరచేవా సతులకు
అంగము సోఁకినగాక అలసేవా
కొంగువట్టితేఁగాక కొసరుకు లోనయ్యేవా
చెంగట నేమైనా నీవు సేయవయ్యా చేఁతలు ॥ఇప్పు॥

కన్నులనుఁ దిట్టననుఁగాక కడుఁ గరఁగేవా
చన్నుల నొత్తినఁగాక సమ్మతించేవా
చిన్ని గో రూఁదినఁగాక చేతికి వసమయ్యేవా
చెన్నుమీర నేమైనాఁ జేయవయ్యా చేఁతలు ॥ఇప్పు॥

కాలు దొక్కితేఁగాక కాఁగిట నీవు గూడేవా
కేలు పై ఁజాఁచినగాక కిందుపడేవా
యీలీల శ్రీవేంకటేశ యేలితివి నను నేఁడు
చేల కొంగిచ్చి యేమైనఁ జేయవయ్య చేఁతలు ॥ఇప్పు॥ 495

## దేసాళం

వింత వింత బాగులెల్లా వెలయ నీవల్ల గంటి
అంతరంగములు నాతో నానతియ్యవయ్యా ॥పల్లవి॥

తలఁపునఁ బారెనో యే తరుణి నీకేమైనా
కలలోన వచ్చెనోకాక యేమైనా
పలుకున నాపేరు పక్కునఁ దొరలెనో
చెలఁగి నా మోము చూచి సిగ్గువడేవు ॥వింత॥

కన్నులఁ గన్నట్టాయనో కామించినయాపె చూపు
విన్నట్టి వుండెనో నీ కీవేళ నా మాఁట
చిన్ని మోవితేనెకు మచ్చికల నోరూరెనో
నన్నుఁ జూచి నిలువునే నవ్వుకొనేవు ॥వింత॥

కాఁగిట నిట్టె తోఁచెనో కడల మున్నిటిరతి
లోఁగిటనే వున్నదో పోలుచ నీపొందు
చేఁగదేరఁ గూడితివి శ్రీవేంకటేశ నన్ను
వీఁగక నావంక చూచి వెరగు నొందేవు ॥వింత॥ 496

## రామక్రియ

చెప్పినట్టె నీ సేవ సేసేఁగాక
ఇప్పు డిందరిలోనా నేఁటి బాసలయ్యా ॥పల్లవి॥

పచ్చిదేరెఁ బనులెల్లా పడఁతి నీవద్ద నదె
విచ్చనవిడాయ నిఁక వెరపులేదు
మచ్చికలు మేన నవె మరఁగున దాఁచరాదు
యెచ్చుకుందు లేదు యిఁక నేఁటి బాసలయ్యా ॥చెప్పి॥

వెల్లవిరాయఁ జేఁతలు వీడె మిచ్చీ నాపె నీకు
తొల్లి నీ కోరినట్టాయ దొరకె మేలు
కల్లలెల్లా నిజమాయ కద్దులోలనఁగరాదు
యెల్లవారు గన్నపని కేఁటి బాసలయ్యా ॥చెప్పి॥

పట్టిన పంతము చెల్లె పాదము లొత్తీ నాపె
చుట్టరిక మీడేరె సోదించనేల
యిట్టె శ్రీవేంకటేశ యేలితవి నన్ను నేఁడు
యెట్టయిన మేలె యిఁక నేఁటి బాసలయ్యా ॥చెప్పి॥ 497

## పాళంగవాట

గుట్టుతో మండుటే మేలు కోమలులకు
చుట్టపు వరుసరతిఁ జొక్కించేనయ్యా ॥పల్లవి॥

సరుసఁ గూచుండఁగాను చన్ను లొరసునో యేమో
సిరులు మించఁ గొలువు సేసేనయ్యా

మరలి చూడఁగాను మర్మములు సోఁకునేమో
వరుసతోడుత దలవంచుక మొక్కేనయ్యా ॥గుట్టు॥

చేరి వీడె మియ్యఁగాను చెమట లంటునో యేమో
వూరకే వుయ్యాలమంచ మూఁచేనయ్యా
కోరి కొప్పు దువ్వఁగాను కొనగోరు దాఁకునేమో
నేరుపుతోఁ గుంచెవేసి నిలుచుండేనయ్యా ॥గుట్టు॥

చేముట్టి పెనఁగఁగఁగాను చిత్తము గరఁగునేమో
దోమటి దొడికి కాలు దొక్కేనయ్యా
యీమేర శ్రీవేంకటేశ యిట్టె నన్ను నేలితివి
నాములెక్క నిక్క నీతో నవ్వేనయ్యా ॥గుట్టు॥ 498

**రేకు 1994** **దేసాళం**

[1]ఆతనికి నీవు మేలు ఆతఁడు నికు మేలు
చేతులెత్తి మొక్కి ఇట్టె సేవసేయవే ॥పల్లవి॥

మనసు లెడసినాను మంచిమాఁటలె మేలు
ననుచకుండినాను వినయమే మేలు
పెనఁగులాడినాను ప్రేమపు నవ్వులే మేలు
అనిశము పతితోడ నాఁటదానికి ॥ఆత॥

కోపము గలిగినాను కొసరుఁజూపులె మేలు
తోపు నూపుడైనా సంతోసాలే మేలు
రాఁపు లెక్కుడైనా నూరకె వోరుచుటే మేలు
చేపట్టిన పతితోడ చెలియకును ॥ఆత॥

---

1. 'మేలు' శబ్దము సహజముగ ప్రేమ, మంచి మొదలగు నర్థములందు ప్రసిద్ధము. పల్లవి మొదటి పాదములోని రెండు 'మేలు' శబ్దములు లక్షణతో 'ప్రియురాలు, ప్రియుఁడు' అను నర్థములలో ప్రయోగించినట్లు కనపడుచున్నది. తరువాత పాట అంతటా 'మేలు' శబ్దము 'మంచి' అను నరమ ప్రయోగించినట్లు కనపడుచున్నది.

వేవేలు నేరములైనా వేడుకతో నుంటే మేలు
కావరించి యొరసినా కాఁగిలే మేలు
భావించి నిన్నేలినాఁడు పట్టపుదేవులఁజేసి
శ్రీవేంకటపతి మేలు చేరీ మగువ నీకు ॥ఆత॥ 499

## ఆహిరి

వేసరకు చెలియా వేగమె వచ్చీ నాతఁడు
ఆసల దానే నిన్ను నాదరించీఁగాని ॥పల్లవి॥

వెలవెట్టి కొంటే రాదు వేడుకైన వలపు
తలఁపు కొలఁదినే తగులుఁగాని
బలిమికి లోఁగాదు బాఁతియైన వలపు
చెలఁగి మంచిమాఁటల చేకూడుగాని ॥వేస॥

పట్టి తీసితే నబ్బదు బాగైన వలపు
చుట్టపు వరుసనే సొగియుఁగాని
బట్టబయటను లేదు పాదుకొన్న వలపు
దట్టపు వినయాలనే తలకొనుఁగాని ॥వేస॥

వొడిఁబెట్టితే నుండదు వుదుటైన వలపు
వుడివోని రతులనే వొద్దికొఁగాని
యెడయక శ్రీవేంకటేశుఁ డిదె నిన్ను నేలె
విడువ కిట్ల నుంటే వినోదమౌఁగాని ॥వేస॥ 500

## శ్రీరాగం

ఉల్లములో తలపోఁత నోలలాడుచున్నదాన
వెల్లవిరిగాఁ జెప్పవే వేడుకయ్యీఁ జెలియా ॥పల్లవి॥

వచ్చునాకో ఆతఁడు నా వాకిటికి నెప్పుడైనా
[illegible]ాకో నాతోను మేలము లాడి

యిచ్చునొకో చనవు నా కిందరిలోనా నేఁడు
హెచ్చెఁ గోరికలు నాలో నేమందునే చెలియా ॥ఉల్ల॥
కందునొకో యాతనిఁ గన్నులయెదుట నేను
విందునొకో మాఁటలు వీనులారను
పొందునోకో నాకాఁగిట బుజ్జగించి ఇట్టె తాను
సందడించీఁ దక(దమక) మెంచఁగరాదే చెలియా ॥ఉల్ల॥
యెక్కునొకొ నా సేవ లిన్నియును నాతనికి
చొక్కునొకొ నా రతుల సులభానను
దక్కునొకొ యనఁగానే తానె శ్రీవేంకటేశుఁడు
ఇక్కడికె విచ్చేసి యేలె నన్నుఁ జెలియా ॥ఉల్ల॥ 501

## పాడి

వలచిన యాఁటదాని వద్దంటే దోసముగాదా
వెలలేని మన్ననల వెలయించరాదా ॥పల్లవి॥
సేసకొప్పువంచి మొక్కి చెలి యెదుట నున్నది
ఆసతోఁ గాఁగిట నించి యలమరాదా
రాసికెక్క ముత్యాల యారతి నీకు నెత్తిని
వాసి వన్నెతోడ నాపె వద్దఁబెట్టుకోరాదా ॥వల॥
కంకణాల చేతులను కానుక నీకు నిచ్చీని
అంకెలను గారవించి యందుకోరాదా
సుంకుమోవ నవ్వు నవ్వి చుట్టరికాలు చూపీని
పొంకముగా నాపె తోడి పొందు సేయరాదా ॥వల॥
వినయాన మోవితేనెవిందు నీకుఁ జెప్పీని
చెనకుచుఁ గాఁపురాలు సేయరాదా
యెనసితివి శ్రీవేంకటేశ నన్ను నింతలోనె
మనిసిచ్చి యాపెతోడ మాఁటలాడరాదా ॥వల॥ 502

## భైరవి

నగి నగి మిక్కుటమై నా గుణాలె ఇంతసేసె
తెగరాని నా వలపు తిద్ద నెట్టు వచ్చునే ॥పల్లవి॥

వొత్తిన మరుబాణాలు వొడ్డుకొనవచ్చుఁగాక
చిత్తమే చీఁదరగొంటే సేసేదేమే
మత్తిలి వెన్నెలకాఁక మాఁటుకొనవచ్చుఁగాక
హత్తి చన్నులే వేఁగైతే ననేదేమే ॥నగి॥

తగ్గక తుమ్మిద దాడి దప్పించుకొనవచ్చుఁగాక
సిగ్గులే చిమ్మిరేఁగితే సేసేదేమే
వొగ్గక కోవిలకూఁత లోరసించవచ్చుఁగాక
కగ్గి కోరికె కోఁ (కొం?)డైతే గరిసించేదేమే ॥నగి॥

సోయగపు వసంతుని జానుగఁగవచ్చుఁగాక
పాయమే చలపట్టితే పదరేదేమే
యీయెడ శ్రీవేంకటేశు నిట్టె కూడవచ్చుఁగాక
ఆయములే కరఁగితే నట్టె సాదించేదేమే ॥నగి॥ 503

## సామంతం

ఎంతని విన్నవించేను ఇవి దనకు
చెంతనే వా వోజ ఇది చిత్తమే యెరుఁగును ॥పల్లవి॥

జవ్వనమే విరివాయ జంకెనలు యెరవాయ
నవ్వులే తరవాయ నాకుఁ దనకు
దివ్వెలెత్తుఁ బొద్దులాయ దిన మొకసుద్దులాయ
రవ్వలు సేయక ఇఁక రమ్మనవే విభుని ॥ఎంత॥

వినుకులే కతలాయ విరహమే వెతలాయ
        ననుపు సమ్మతులాయ నాకుఁ దనకు
        మన సోళజొత్తులాయ మాఁటలే కొత్తలాయ
        పెనగొనిఁ దమి తలఁపించవే విభుని ॥ఎంత॥

మోవి తేనె విందులాయ మొరఁగులే మందులాయ
        నా వలపే పొందులాయ నాకుఁ దనకు
        వావులు చక్కట్లాయ భావము లొక్కట్లాయ
        సేవించే నెచ్చ[illegible]వే శ్రీవేంకటవిభుని ॥ఎంత॥ 504

**రేకు 1995 భైరవి**

మచ్చికతో నన్నుఁజూచి మన్నించెఁగాక
        ఇచ్చకురాలనైతి ఇఁక నాకుఁ దగునే ॥పల్లవి॥

చనువుగలవారికి సాదించినాఁ దగు
        ననిచినవారికి జెనకఁదగును
        యెనసినవారికి నేమిసేసినాఁదగు
        నసుబోఁటివారికి నగఁదగునటవే ॥మచ్చి॥

చెలిమిగలవారికి చేరి పెనఁగఁగఁదగు
        బలువుగలవారికి పైకొనఁదగు
        కలసినవారికి కన్నుల జంకించఁదగు
        అలవోక మాకెల్లా నంటఁదగవటవే ॥మచ్చి॥

వేడుకగలవారికే(కి?) వేగిరించినాఁదగు
        వాడికెగలవారికి వంతులుదగు
        యీడనే శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నేలె
        కూడి మావంటివారికి కొంకఁదగునటవే ॥మచ్చి॥ 505

## వరాళి

ఈడు జోడైన పోలిక లిందులోనే తెలిసీని
జాడలు చూడవే వొక్క సంగతయ్యే వున్నవి ॥పల్లవి॥

పొలఁతి నెమ్మొ మదె పున్నమచంద్రుఁడు వాఁడ
కళ లెందు నెప్పుడో కంద మిఁకను
కలికి కన్నులు నివె కలువ రేఁకులు నివె
బలిమి యెందు వంకనో భావించవే ॥ఈడు॥

అంగన తురుము నిదె అలుల పౌజు లవె
సింగార మెందున్నదో చెప్పవచ్చీని
సంగడి చన్నులు నివె చక్రవాకములు నవె
యింగితాకారము లిందే యేరుపరచఁగదే ॥ఈడు॥

మగువ రూపము నిదె మంచి పైఁడిబొమ్మ యదె
తగఁ జక్కఁదన మేదో తానే తోఁచీని
జిగి నీపె కాఁగి లిదె శ్రీవేంకటేశుఁడు గూడె
తగులైన నేరుపులు తారుకాణసేయవే ॥ఈడు॥ 506

## పాళంగనాట

ఎంత వేడుకో తనకు యెవ్వరుంటా నెరఁగదు
దొంతర వలపులను తొంగి చూచీ నిన్నును ॥పల్లవి॥

నవ్వుతానే నీ మోము నలినాక్షి చూచి చూచి
పువ్విళ్లూరీ లోలోనే వుమ్మగిలుతా
పువ్వులు కొప్పులోనివి బుజముపై రాలఁగాను
జవ్వనపు మదముతో జంకించీ నిన్నును ॥ఎంత॥

మాఁటలాడుతానే నీ మర్మములు ముట్టి ముట్టి
గూఁటఁబెట్టీ సిగ్గులెల్లా గుబ్బతిల్లుతా
గాఁటపుఁ బయ్యద చన్నుఁగవపైనే జారఁగాను
తాఁటించి రాజసముతోఁ దమిరేఁచీ నిన్నును ॥ఎంత॥

సన్నలు సేసుకొంటానే సరసము లాడి యాడి
కన్నులనే చొక్కిని కరఁగుకొంటా
ఇన్నిటా శ్రీవేంకటేశ ఇంతలో నీవు గూడఁగా
పన్ని మోవితేనె లూరఁ బచారించీ నిన్నును ॥ఎంత॥ .507

## రామక్రియ

ఏనాటి[1] చుట్టరికమో యీాపె నీకు
నానఁబెట్టీ వలపులు నయముతో నిపుడు ॥పల్లవి॥

మొలకసిగ్గులుతోడ ముసిముసి నవ్వు నవ్వి
కలికి చూపులఁ జూచీ కాంత నిన్ను
పలుకుఁదేనెలు చింది పలుమారు మాఁటలాడి
తలఁపించీఁ దనపొందు తా నెవ్వతోకాని ॥ఏనాటి॥

చెదరుఁ గురులతోడ సేఁసకొప్పు గొంత వంచి
కుదురు గుబ్బల నొత్తీ కోమలి నిన్ను
ముదురు గోళ్లచేత మొక్కులు నీకు మొక్కి
యెదుటనే నిలుచున్న దెవ్వతోకాని ॥ఏనాటి॥

కరఁగుఁ జెమటతోడ కాఁగిట నిన్నుఁ బట్టి
మెరుఁగుఁజెక్కుల మెచ్చీ మెలుఁత నిన్ను
గురిగా శ్రీవేంకటేశ కూచితివి నన్నుఁ దొల్లె
యెరిఁగించీఁ దనరాక ఇదెవ్వతోకాని ॥ఏనాటి॥ 508

1. 'ఏనాటి' కావచ్చు.

## లలిత

అన్నిటా బలిమికాఁడ వౌదువు నీవు
సన్నుతించి నీకు నేము సాగిలి మొక్కేమయ్యా ॥పల్లవి॥

వింటిమి నీ సుద్దులు విరిచిన మద్దులు
బంటపంతపు చాణూరుపై గుద్దులు
గొంటరి నీ బుద్దులు గునిసేటి ముద్దులు
ఇంటింటి వారెల్లా [1]నివె యెంచుకొనేరయ్యా ॥అన్ని॥

చూచితి నీ చేఁతలు సుగందపు పూఁతలు
లాచి యమునలో నీ మేలపు యీఁతలు
తాఁచి నాఁగేటి కీఁతలు తగు జాతర మేఁతలు
యే చాయఁ జూచినా సతు లెంచుకొనేరయ్యా ॥అన్ని॥

తెలిసితి నీ పొందులు తేర విదురువిందులు
నలి నుట్లు గొట్టిన గోనాల గొందులు
యెలమి శ్రీవేంకటేశ ఇట్టె నన్ను నేలితివి
యిలలో నీ గరిమలే యెంచుకొనేరయ్యా ॥అన్ని॥ 509

## గౌళ

సరికి బేసికి మీరె జాణలైతిరి
తిరమాయ వలపులు దిష్టముగా నిపుడు ॥పల్లవి॥

కలువల నాకె వేసె కాలు దొక్కితివి నీవు
యెలమి సాకిరులు నేమేమి చెప్పేము
కలికి గుట్టు తోడిది గద్దరికాఁడవు నీవు
వలసినట్టు సేసితే వద్దనేవా రెవ్వరు ॥సరి॥

1. "నిన్నె" కు బదులుగా "నీవె" పడిన దనికూడ భావించవచ్చు.

కొద్ది మీరి నవ్వె నాపె కొంగువట్టితివి నీవు
యిద్దరికి దగవు నే మెట్టు చెప్పేము
పెద్దరికపు సకియ ప్రియమువాఁడవు నీవు
తిద్దుకొని మీకు మీకే తేరుదురుగాక ॥సరి॥

గక్కనఁ గొసరె నాపె కాఁగిలించితివి నీవు
యెక్కువ తక్కువలు నే మేమి చెప్పేము
యిక్కడ నీ దేవులని యేలితివి శ్రీవేంకటేశ
చక్కనాయఁ బనులెల్లా సాదించ నేమిటికి ॥సరి॥ 510

**రేకు 1996** **శ్రీరాగం**

నంటున నిన్ను మరిగె నా మనసు
జంటలాయ నిద్దరికి సరియాయ మనసు ॥పల్లవి॥

చిగిరింపుఁ గోరికల చిమ్మిరేఁగె [1]వలపు (మనసు?)
మొగము చూపులవల్ల మోసులెత్తె మనసు
తగులువిరిమాఁటలఁ దగులాయ మనసు
నగవుల సరసాల ననుపాయ మనసు ॥నంటు॥

కొనగోరి చెనకుల గుదిగొనె మనసు
వినయపు చేఁతలనే వియ్యమందె మనసు
పెనగొన్న యాసలనె పిక్కటిల్లె మనసు
యెనసే తమకమున యేపురేఁగె మనసు ॥నంటు॥

పల్లదపుమన(ద?)మున పచ్చిదేరె మనసు
వెల్లవిరి సన్నలనె వెలసెను మనసు
యెల్లగా శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
వుల్లపు సంతోసాన వుప్పతిల్లె మనసు ॥నంటు॥ 511

1 ఈ పాదము కడపటిది తప్ప తక్కిన స్థలము లందంతటా మనసు అనియే కలదు.

## వాదరామక్రియ

కొత్త పొందో పాఁత పొందో కొసరి చూచీ నిన్ను
పొత్తులవాఁడవు నీవు పొలఁతుల కెల్లాను ॥పల్లవి॥

వుడివోని వలపులు వొడి నించుక వున్నది
కడు నాసలు కన్నులఁ గప్పుకున్నది
బెడిదపు వినయాలు పెదవిఁ బెట్టుకున్నది
సడిఁబెట్ట కాపె దిక్కు చక్కఁ జూడవయ్యా ॥కొత్త॥

అందపు జవ్వనము పయ్యదలో దాఁచుకున్నది
పొందులెల్లా మనసునఁ బూఁచుకున్నది
సందిట రతిభోగాలు సవరించుక వున్నది
మందలించి యాపెతోడ మాఁటలాడవయ్యా ॥కొత్త॥

కోరికలు పెంచి పెంచి కొప్పు ముడుచుకున్నవి
కూరిములు లోలో గుది గుచ్చుకున్నవి
యీరీతి శ్రీవేంకటేశ యేలితి వింతలో నన్ను
దార దప్ప కాపె నిట్ట(ట్టె?) దయసేయవయ్యా ॥కొత్త॥ 512

## పాడి

పుట్టక తొల్లె యెన్ని బూమెలదాన వైతివి
దట్టపు నీ కోరికలు తలఁచినట్టాయెనే ॥పల్లవి॥

కప్పురాన లేసేవు కాఁగిటికి లాసేవు
వుప్పతిల్లి పతిమీఁద నొల వేసేవు
చెప్పరాదె నీ పగటు చేఁత లంతకూ వెగటు
ఇప్పుడు నీ నేరుపులు యేమని చెప్పుదునే ॥పుట్ట॥

కొచ్చి కొచ్చి దూరేవు కొనగోర గీరేవు
పచ్చిగా నవ్వి పానుపుపైకిఁ జేరేవు
మెచ్చిరే నీ సుద్దులు మేరమీరె నీ బుద్దులు
చెచ్చెర నీ గుణములు చెప్పఁ గతలాయెనే ॥పుట్టి॥

మురిపేన సొలసేవు ముందరనే పొలసేవు
గరిమ నానారతుల గలసేవు
యిరవై శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నేలె
విరువులై నీ గుణాలు వెల్లవిరులాయెనే ॥పుట్టి॥ 513

## రామక్రియ

కాంత సిగ్గరికత్తె గయ్యాళించ నేరదు
సంతోసముతోడ నిట్టె చనవియ్యవయ్యా ॥పల్లవి॥

చెలి యానఁ బెట్టఁగాను చేతులెత్తి మొక్కఁగాను
బలిమితో చన్ను లేల పట్టేవయ్యా
పలుమారు వేడుఁకోఁగా పంతము లియ్యఁగాను
కెలనఁ గూచుండి యెంత గిలిగించేవయ్యా ॥కాంత॥

పెనఁగులాడఁగాను ప్రియములు చెప్పఁగాను
కొనగోరఁ జెక్కులేల చెనకేవయ్యా
మునుకొని వొడ్డుకోఁగా మోవి లంచమియ్యఁగాను
యెనగొని నిమ్మపంటనేల వేసేవయ్యా ॥కాంత॥

సారె సారె సొలయఁగా సంగడిఁ గూచుండఁగాను
చేరి వుద్దండాలేల సేసేవయ్యా
యీరీతి శ్రీవేంకటేశ యీకె నిన్నుఁ బెండ్లాడఁగా
కోరికె లీడేరె నేమి కొలఁది వెట్టేవయ్యా ॥కాంత॥ 514

## దేసాళం

అవధారు వినవయ్యా అంగనతగవులు
జవళిఁ గూడి సతికిఁ జనవియ్యవయ్యా ॥పల్లవి॥

కాంతలకు సాజము గబ్బితనపుఁజేఁతలు
పంతాన మగఁడు యెగు(గ్గ?) పట్టఁదగదు
వింత బొమ్మజంకెనలు వేడుకకు మూలము
సంతోసాన జెలరేఁగి సమ్మతించవలెను ॥అవ॥

రట్టడి సతులకును రారాఁపులు సాజము
గుట్టుతో విభుఁడు మారుకొనదగడు
చిట్టంటుఁజెనకులు సింగారాలు మేనికి
చుట్టరికము తోడనే చొక్కి మెచ్చవలెను ॥అవ॥

చండిపెట్టుక నవ్వేది సతులకు సాజము
పెండిలికూఁతురును గుంపించఁదగదు
అండనె శ్రీవేంకటేశ యట్టె కూడితి వీకెను
మెండగు మీ వలపులు మెరయఁగవలెను ॥అవ॥ 515

## మాళవిగౌళ

పట్టరాని తమితోడ బాఁతి పడే మింతేకాక
యెట్టు సేసినా నీకు యెరపు సతమయ్యీనా ॥పల్లవి॥

వేసదారి మాఁటలాడి వేడుక నవ్వులు నవ్వి
ఆసల నెంత వెట్టేవే ఆతని నీవు
ఆ సుద్దు లటు వెట్టవే యటువంటివాఁడుగాఁడు
నా సొమ్మయినవాఁడు నీ సన్నలకు లోనయ్యీనా ॥పట్ట॥

సొలసి సొలసి చూచి చొక్కులనెల్లాఁ బెట్టి
యలయించనేమిటికే యాతని నీవు
చలము లేక మానవే సమ్మతించఁ డాతఁడు
తొలుతే నన్నేలె నీ పొందులకుఁ జిక్కీనా ॥పట్టు॥

కప్పురము మోవిఁ జూపి కాఁగిటికి లాఁచి లాచి
అప్పటిఁ గొసరేవేవే యాతని నీవు
యిప్పుడు శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్ను నేలె
వొప్పగు నా రమణుఁడు వొద్దిక నీకయ్యీనా ॥పట్టు॥ 516

రేకు [illegible] సామంతం

ఏమని చెప్పఁగవచ్చు నిదివో నీ సుద్దులు
ఆముకొన్న నీ నటన లారడాయఁగదవే ॥పల్లవి॥

మొక్కు మొక్కరాఁగాను మునిగొప్పు జారెఁగదె
నిక్కి చూచితే సిగ్గులు నిండెఁగదవే
కక్కసించి నవ్వఁగాను కడుఁ జెమరించెఁగదె
ఇక్కడఁ బతి సంగాతా లింత సేసెఁగదవె ఏమ॥

చెలుములు సేయఁగాను సేసలు పైఁబడెఁగదె
సొలయఁబోతే మతి చొక్కెఁగదవె
వెలిఁ గానుకియ్యఁగా చన్నులు గానవచ్చెఁగదె
యెలమి నీ చేఁతలే నిన్నింత సేసెఁగదవే ॥ఏమ॥

కదిసి కాఁగిలించఁగా కళలు రేఁగెఁగదె
అదన మో వియ్యఁగాఁ [1]గంటేయఁగదవె
వదలక శ్రీవేంకటేశ్వరుఁడు తానె కూడె
యెదుటనే నీ భాగ్యా లింతసేసెఁగదవే ॥ఏమ॥ 517

1. గంటి+ఆయ

## ఆహిరి

ఎంత నన్ను వలపించె నిదివో నా ప్రాణేశ్వరి
వింత వింత సుద్దు లివి వింటివా వో చెలియా ॥పల్లవి॥

చూచినట్టె వున్నది సుదతి చక్కని రూపు
యేచి నవ్వినట్టున్నది యెదుట నాతో
కూచున్నయట్టె వున్నది గొబ్బున నాసంగడిని
యీచాయ నా తలపోఁత లేమందునే చెలియా ॥ఎంత॥

పట్టినట్టె వున్నవి పడఁతి చన్నులు చేత
అట్టె నాతో మాఁటలాడినట్టున్నది
ముట్టినట్టున్నది తన మొనగోర నా చెక్కులు
ఇట్టట్టని చెప్పరాదు యేమందునే చెలియా ॥ఎంత॥

కూడినట్టె వున్నది కొమ్మను కాఁగిటిలోన
తోడఁ బండినట్టున్నది దొరకి నాకు
వేడుకైనట్టున్నది శ్రీవేంకటేశుఁడ నేను
యీడ నిన్నీ నిజమాయ నేమందునే చెలియా ॥ ఎంత ॥ 518

## శ్రీరాగం

ఇంకనేలే విచారాలు యెంచినట్లల్లానాయ
కొంకులేని మనలోని కోరికె ఫలించెనే ॥పల్లవి॥

చిత్తము చిమ్మిరేఁగె సిగ్గులు వెల్లివిరిసె
హత్తిన సంతోసాల అలుగువారె
కొత్త వలపులు నిండె గుదిగొనెఁ దమకము
బత్తిగల జవరాలి భాగ్య మాయనే ॥ఇంక॥

వేడుకలు పిక్కటిల్లె విభవాలు దలకొనె
వాడిక వినోదాలు వంతు కెక్కెను
యీడు జొక్కొట్టాయ యియ్యకోలాయఁ బంతాలు
కూడి నాపె నోములు చేకూరి మించెనే ॥ఇంక॥

నగవురు గారుకమ్మె ననుపులు నెట్టుకొనె
మొగమునఁ గళలెల్లా ముంచుకొనెను
నిగిడి శ్రీవేంకటేశుని పొందులు సతమాయ
తగులైన దేవుల తలఁపు లీడేరెనే ॥ఇంక॥ 519

**ముఖారి**

మునుకొన్న సిగ్గులతో మోము వంచ నేమిటికే
దిన దిన భోగముల తెప్పఁదేలగదే ॥పల్లవి॥

చెలుములు సేయఁగానే చిగిరించు మోహములు
పలుకులవల్లఁ గొంత పదనెక్కును
సెలవుల నవ్వులను చిత్తములు గరఁగును
కొలువులు సేసి పతిఁ గొసరఁగఁగదవే ॥మును॥

సరసము లాడఁగానే చవులెల్లా నుప్పతిలు
మరిగించుకొంటేను మర్మము లంటు
సరి నెదురు చూపుల జడిగొను వేడుకలు
బెరసి విభుని రతిఁ బెడరేఁచఁగదవే ॥మును॥

చన్నుల నొరయఁగానే సంతోసా లొనఁగూడు
సన్నలా చాయలనే యాసలు వుట్టును
ఇన్నిటా శ్రీవేంకటేశుఁ డిట్టె వచ్చి నిన్నుఁ గూడె
పన్నిక యాతని నెడవాయకుండఁగదవే ॥మును॥ 520

## భైరవి

విచ్చి చెప్ప నెట్టు వచ్చు విరహుల గరిమలు
కచ్చు పెట్టి తమ్ముఁ దామె కలయుటఁగాక ॥పల్లవి॥

పట్టరానిది వయసు పాయరానిది కూటమి
నెట్టన దాఁచరానిది నిండు వలపు
గుట్టు లేనిది నగవు గురి లేనిది మనసు
యెట్టు వేగించఁగ వచ్చు నిఁక విరహులకు ॥విచ్చి॥

చెప్పఁగరానిది సిగ్గు చిక్కించరానిది బుద్ది
తప్పించుకోరానిది తగులాయము
తిప్పరానిది గుణము తెగరానిది మమత
అప్పటి నెట్టోర్వవచ్చునమ్మ విరహులకు ॥విచ్చి॥

పెంచరానిది యలుక బిగియరానిది పొందు
కొంచించరానిది తలకొన్న నమపు
యెంచఁగ శ్రీవేంకటేశుఁ డీకె నిట్టె కూడెఁ గాక
వంచించి యెట్టు గెలువవచ్చు విరహులకు ॥విచ్చి॥ 521

## కాంబోది

ఎన్నేసి వుపచారా లెంత సేసేరే నాకు
మన్నించి యాతఁడు నాకు మగఁడాయ నిపుడు ॥పల్లవి॥

అనిశముఁ జెప్పరప్ప ఆతని సుద్దులే నాకు
విన వేడుకయ్యీని వేమారును
వనితలాల నేను వలతు నాతనిని
నను మన్నించు నాతఁడు నంటుతోడను ॥ఎన్నే॥

---

1. యేడమండి+అయినా

వాడికతోఁ జూపరమ్మ వదల కాతని నాకు
చూడ వేడుకాయ్యాని సొంపుగా నేఁడు
జాడతో నాతని పొందు సారె మరగిన దాన
[1]యేడ నుండెయినా వచ్చి యెనయు నన్నతఁడు. ॥ఎన్నే॥

పిలిచి తేగదరమ్మ బెరయు శ్రీవేంకటేశుఁ
గలయ వేడుకయ్యీ నా కాఁగిట (దెచ్చి
మెలుపున నాతనికి మేనమరఁదల నేను
బలువుగా నాపయిని బత్తిగలఁ డతఁడు ॥ఎన్నే॥ 522

**రేకు 1998** **పాడి**

ఆతనికి నీవే వొక ఆలవైతివా
యేతలఁ జూచినా సతు లెందరైనాఁ గలరు ॥పల్లవి॥

వింతలుగా రమణుఁడు వేమారు వినీనంటా
మంతనము లేమాడేవే మాపుదాఁకాను
సంతోసాన నాతఁడు సమ్మతించి వున్నాఁడంటా
దొంతి వెట్టి వలపేల తూరుపెత్తేవే ॥ఆత॥

వుప్పిళ్లూర నాతఁడు వొద్దికఁ జూచీనంటా
నవ్వు లేమి నవ్వేవే నడుమ నీవు
నివ్వటిల్ల నప్పటిని నీకు మేలువాఁడంటాను
తవ్వి తవ్వి తమి యెంత తలకెత్తేవే ॥ఆత॥

శ్రీవేంకటేశుఁడు నీకు చేతిలోనివాఁడంటా
భావించి యేమి చూచేవే పలుమారును
యీవల నాతఁడే నన్ను యేలినాఁడు తొలుతనె
చేవదేరె నింకా నేమి సేసలు చల్లేవే ॥ఆత॥ 523

## బౌళి

ఎక్కడనుండి వచ్చెనో యీపె నీకు
గక్కన యీ చేఁతలను కడు నందగారి ॥పల్లవి॥

మొగము చూపుకొంటాను ముందుర నిలుచున్నది
వెగటుగా నవ్వీ నెంత వెడవికారి
చిగురుమోవి తేనెలు చిందఁగానే మాఁటలాడీ
పగటున నిది యెంత బయకారి ॥ఎక్క॥

కన్నుల సొలసుకొంటా కానుక నీ చేతికిచ్చీ
సన్నలా చాయలా నెంత సటలకారి[1]
చిన్న చెక్కుల మీఁదటి చెనకులు కొనగోర
మిన్నక చిమ్మీ నెంత మేఁటి నయగారి ॥ఎక్క॥

వాలాయించి మెచ్చుకొంటా వలపులు చల్లి చల్లి
కాలు దొక్కీ ని న్నెంతకతకారి
యీలీల శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
వోల వేసీ దా నెంత నీ కుపకారి ॥ఎక్క॥ 524

## ఆహిరి

నెలఁతలజాడ లివి నేర మెంచేవు గనక
పలుమారు ననఁగా నీ బత్తిగలఁజూమ్మీ ॥పల్లవి॥

కూరిమి గలిగినది గుట్టుతోనే వుండుఁగాని
చేరి పతితో సారెఁ జెప్పుకొనదు
గారత(వ?) పు జవరాలు కడు సిగ్గువడుఁగాని
మేరమీరి యందరిలో మేలము లాడదు ॥నెలఁ॥

---

1. 'సటకారి' యనుట సహజము.

చక్కఁదనము గలది సాజాననే వుండుఁగాని
పక్కనను రూపు చూపి భ్రమయించదు
నెక్కొన్న చుట్టమైనది నేరుపులే చూపుఁగాని
కక్కసించి పెనఁగుతా గయ్యాళించదు ॥నెల॥

మంచిగుణము గలది మరి ఇచ్చలాడుఁగాని
ముంచి రతి మందెమేళములు సేయదు
యెంచఁగ శ్రీవేంకటేశ యిన్నిటా నన్నేలితివి
వంచెనతోడిది యేగర్వములునటించదు ॥ నెలఁ ॥ 525

## సామంతం

జవ్వనాలు మీ సొమ్ము సరసాలు మీ సొమ్ము
వువ్విళ్లూరే వలపులు వొడిఁగట్టుకోరయా ॥పల్లవి॥

చిలుకుఁ జూపు లాపెవి, చిమ్ముఁ జెనకులు నీవి
పలుకుఁ దేనె లాపెవి, బాసలు నీవి
యెలమి సరికి బేసి కిద్దరూ బలవంతులే
కొలఁదిలేనివలపు కూడపోసుకోరయా ॥జవ్వ॥

ప్రియము లాపెవి, సేసే పెను వినయాలు నీవి
నయము లాపెవి, కడునంటులు నీవి
నియతపు నేరుపులు నీకు నాకె కొక్కరీతే
జయమాయ వలపులు సందిఁబెట్టుకోరయా ॥జవ్వ॥

అడియాస లాపెవి, ఆదరింపులు నీవి
యెడయని పొం దాపెది, యింపులు నీవి
అడరి శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
కడలేని వలపులు గంపకెత్తుకోరయా ॥జవ్వ॥ 526

## ముఖారి

అద్దములోఁ జూచుకోవే అలమేల్మంగా
నిద్దపు సింగారాలు నీకే కానవచ్చీని ॥పల్లవి॥

మొలక చన్నులమీఁది ముద్దు చంద్రవంకలు
తళుకుఁ జెక్కులమీఁది తమలంపు టంట్లు
నిలువుఁ దురుముమీఁది నెయ్యపుఁ జేపట్లు
బయలు నీ వలపెల్లాఁ బచ్చిసేసెఁగదవే ॥అద్ద॥

చిగురుమోవిమీఁది చిన్ని చిన్ని కెంపులు
జిగిమించు నొసలిపై చిరుత చెమటలు
మొగములో వసివాడు ముసి ముసి నవ్వులు
పగటు నీ వలపులు పచ్చిసేసెఁగదవే ॥అద్ద॥

చక్కని నీ మేనిమీఁది జవ్వాది కరఁగులు
మొక్కలపు కుచ్చలపై మొలనూలి జారులు
వెక్కసపు కాఁగిట శ్రీవేంకటేశు కూటములు
పక్కన నీ వలపులు పచ్చిసేసెఁగదవే ॥అద్ద॥ 527

## మాళవిగౌళ

నీవూ గొన్ని బూటకాలు నెరపే వింతేకాక
యీవల నెంతైనా నా యీడుకు రాఁగలవా ॥పల్లవి॥

అంది వీడె మిచ్చెనంటా నాతఁడు మన్నించునంటా
యిందరిలో నీ సుద్దు లేమి చెప్పేవే
గందము నా కిచ్చినాఁడు కాఁగిలించుకున్నాఁడు
మందలించి ఇఁక నీవు మానుపఁగఁగలవా ॥నీవూ॥

సన్న సేసెనంటా మోవి చవులు చూపెనంటా
పన్నుక నీ యెమ్మె లెంత పచారించేవే
నన్నుఁ బెండ్లాడినాఁడు నాతో నవ్వుతా నున్నాఁడు
వున్నతి నీ నేరుపుల నొద్దనఁగఁగలవా ॥నీవూ॥

నిక్కి నిక్కి చూచెనంటా నీపై బత్తిఁగలఁడంటా
వెక్కసాన నీ వెంత విఱ్ఱవీఁగేవా(వే?)
యిక్కడ శ్రీవేంకటేశుఁ డిన్నిటా నన్నేలినాఁడు
చక్క నెలమేలుమంగను సాదించఁగఁగలవా ॥నీవూ॥ 528

**రేకు 1999 గౌళ**

ఊరకున్నాపెను నీవే వొక్కొక్కటే రేఁచితివి
తారుకాణ మా మాఁట తలఁచుకో యిఁకను ॥పల్లవి॥

మగువలు మాఁటాడితే మట్టున నిలుచునా
తగులుక వుల్లములు దాఁకుఁగాక
నగదొరకొంటేను నడుమ నిలుచునా
చిగురు చేఁగలు సేసి సిగ్గు రేఁచుఁగాక ॥ఊర॥

కొచ్చి చూడదొరకొంటే కొద్ది వెట్టవచ్చునా
నచ్చుకొట్టి మర్మాలెల్లా నాఁటుఁగాక
అచ్చలానఁ జే చాఁచితే నంతట నిలుచునా
పెచ్చువెరిఁగి వలపు పెద్దసేసుఁగాక ॥ఊర॥

మేను సోఁకఁ బెనఁగితే మితి మేరలున్నవా
సోన చెమటలు గారఁ జొక్కించుఁగాక
ఆనుక శ్రీవేంకటేశ యలమేల్మంగ పతివి
తానకమై యీకె పొందు తలఁపించుఁగాక ॥ఊర॥ 529

## బౌళి

ఏఁటికి నెగ్గులు వట్టే వీపెతో నీవు
మాఁటలనే లాలించి మన్నింతువుగాక ॥పల్లవి॥

ఇంతి నీతో మొగమోట మేమీ ననదాయఁగాక
రంతుల దిట్టఁ జెల్లదా రచ్చలో నిన్ను
చెంత నీ దేవి గనక సిగ్గువడి వుండెఁగాక
యెంత నిన్ను సాదించినా యేలనేవా నీవు ॥ఏఁటి॥

ఆలి మగని వరుస నట్టె వూరకుండెఁగాక
గేలిసేయ బాడి గాదా కెరలి నిన్ను
మేలుది గనక నిన్ను మీరలేక మొక్కెఁగాక
వాలాయించి జంకించితే వద్దనేవా నీవు ॥ఏఁటి॥

ఇచ్చక మెరిఁగి రతి నెనసి చొక్కించెఁగాక
కొచ్చి సోదించుకోవద్దా కొసరి నిన్ను
అచ్చపు శ్రీవేంకటేశ యలుమేలుమంగ యీకె
పచ్చిగా నిన్నుఁ జేసితే పంగించేవా నీవు ॥ఏఁటి॥ 530

## ముఖారి

తనకు దేవుల నేను తా నాకు మగఁడు
వినయాన నన్ను నెంత వేఁడుకొనీనే ॥పల్లవి॥

సిగ్గులువడితిఁగాక చేరి యలిగితినా
వొగ్గి కై దండిచ్చితిఁగా కొరసితినా
దగ్గరి కూచుంటిఁగాక తట్టి గోర నూఁదితినా
వెగ్గళించి పతి యెంత వేఁడుకొనీనే ॥తన॥

కొంగు దీసుకొంటిఁగాక కోపగించితినా
యెంగిలంటిఁగాక మోవి ఇయ్యనైతినా
తొంగి చూచితిఁగాక పొందులు సోదించితినా
వెంగెము లీ వెంట నెంత వేఁడుకొనీనే ॥తన॥

సరసమాడితిఁగాక చలము సాదించితినా
మరిగి పైకొంటిఁగాక మలసితినా
ఇరవై శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్ను నేలె
విరులు ముడిచి యెంత వేఁడుకొనీనే ॥తన॥ 531

## వరాళి

నీకు నవ్వులైతిఁగాని నీపై బత్తి గలదాన[1]
యీకడ నీకె సుద్దు లెట్లియ్యకొందునయ్యా ॥పల్లవి॥

పల్లదాన నాపె నిన్ను పచ్చి తిట్టు తిట్టఁగాను
వెల్లవిరిగా నే నెట్టు విందునయ్యా
వుల్లసానఁ బాదము ని న్నూరకె తాఁకించఁగాను
యెల్లవారిలోనా నే నెట్టు చూతునయ్యా ॥నీకు॥

యెదురుగా వచ్చి నీకు నెంగిలి మో వియ్యఁగాను
వుదుటున నే నెట్టు వోరుతునయ్యా
గుదిగొన్న వేడుకతో కొప్పువట్టి తియ్యఁగాను
సదరాన నేనెట్టు సమ్మతింతునయ్యా ॥నీకు॥

పువ్వుల చెండున నిన్నుఁ బూఁచి యాపె వేయఁగాను
వువ్విళ్లూరి నే నె ట్టూరకుందునయ్యా
ఇవ్వల శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిదె
చివ్వన నాపె పొందెట్టు చెల్లింతునయ్యా ॥నీకు॥ 532

1. పాదాం[illegible]ములో ప[illegible]రాలుగా గీచే గీత ఇక్కడ ఎగిరిపోయింది.

### సౌరాష్ట్రం

ఏల న న్నొడఁబరచీ యెంతవడిఁయైనాను
వాలాయించి కూడేనంటే వద్దనేనా నేను ॥పల్లవి॥

గక్కనఁ దనతో తారుకాణలకు నోపఁగాని
తక్కక తానన్నమాఁట తానే యెరుఁగు
పక్కనఁ దనచేఁతలు పట్టియ్యనోపఁగాని
మిక్కుటపు గురుతులు మేనిపైనే వున్నవి ॥ఏల॥

తలకొని నే నంతేసి తప్పువేయ నోపఁగాని
తలఁచితే తనసుద్ది తానే యెరుఁగు
సొలసి తను నంతేసి సోదించనోపఁగాని
కలదెల్లా ముంజేతి కంకణాన నున్నది ॥ఏల॥

సరుగఁ దన గుణాలు చక్కదిద్దనోపఁగాని
తరవాతి పనులెల్లా తానే యెరుఁగు
ఇరవై శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
సిరులఁ దనవలపు శిరసుపై నున్నది ॥ఏల॥ 533

### పాడి

నీకు విన్నవించితిమి నీ దేవుల సుద్దు లివి
చేకొని మన్నించి ఇట్టె చిత్తానఁ బెట్టవయ్యా ॥పల్లవి॥

ఇందుముఖి, నీవు దనఇంటికి వచ్చేవంటా
కందువ నప్పటనుండీ[1]ఁ గాచుకున్నది
సందడించి తనపై సేసలు వెట్టేవంటాను
చెందిన వేడుకలతో సింగారించుకున్నది ॥నీకు॥

1. "అప్పట నుండియున్"లో యు లోపించిన రూపము కావచ్చు.

మంతనానఁ దనతోను మాఁటలాడే వంటాను
పొంత బానుపు వేసుక పొంచుకున్నది
సంతతము నీ రతుల సాముసేసీనంటాను
వింత కాఁగిటి గరడి వెలఇంచుకున్నది ॥నీకు॥

వేవేలుగ నీకుఁ దానే విందులు వెట్టీనంటా
మోవిపంటి బోనాలు మోచుకున్నది
యీవేళ శ్రీవేంకటేశ యిట్టె యీకె నేలితివి
చేవదేరే యాన[illegible]ానఁ జిమ్మిరేఁగి వున్నది ॥నీకు॥ 534

**రేకు 2000** **దేసాళం**

సాకిరులేల పెట్టేవు సతివల్ల నేరమేది
కాకుసేయఁ బనిలేదు కరుణించు మిఁకను ॥పల్లవి॥

సుదతికిఁ బతితోడ సొలసితే నేమాయ
వుదుట మీరఁగఁ దిట్టనొద్దుగాని
సదరాన బొమ్మలను జంకించితే నేమాయ
యెదుటనుండి యలిగి యేఁపవద్దుగాని ॥సాకి॥

కూరిములు సారె సారెఁ గొసరితే నేమాయ
వారించి యానలు వెట్టవద్దుగాని
బీరముతో గొంగువట్టి పెనఁగితే నేమాయ
దారకాన దెరలోన దాఁగవద్దుగాని ॥సాకి॥

గుట్టుతోడఁ గాఁగిలించి కూడితే నేమాయ
వట్టి నేరము లెంచఁగవద్దుగాని
యిట్టె శ్రీవేంకటేశ యేలితి వీకెను నీవు
చుట్టమైతే నేమాయ సోదించవద్దుగాని ॥సాకి॥ 535

## సామంతం

ఆపె వల్ల వెలి తించుకంతా లేదు
యేపునఁ జేసే సేవ విన్నియునుఁ జేసెను ॥పల్లవి॥

సన్నలనే చూపదా సతి తా నుండేటి మేడ
కన్నులనే మొక్కదా కడలనుండి
విన్నవించదా వావి వేడుకతో నేకతాన
కన్నెను నీ వేలుకోని కద(డ?) మింతేకాక ॥ఆపె॥

తామెరల వేయదా తలఁపించి తలఁపించి
మోము చూపి పొలయదా ముందర నిల్చి
సాముసేసి పెనఁగదా సరసమాడే నెపాన
కామించి [1]చిత్త మెప్పుడు గరఁగీనోకాక ॥ఆపె॥

ఆకున వా(వ్రా?)సి చూపదా అట్టె తన విరహము
వాకుచ్చి చెప్పదా లోలో వలపెల్లాను
యీకడ శ్రీవేంకటేశ యీకె గూడితి వింతలో
నీ కరుణ కిట్లానే నిలిచెనోకాక ॥ఆపె॥ 536

## ఆహిరి

ఇంతి చందములు నీతో నెంతని విన్నవించేము
వింత విలాసము లివి వెల్లవిరులాయెను ॥పల్లవి॥

చింతల చీఁకటులను చిమ్మిరేఁగి వలపులు
చెంతనున్న చెక్కిటికి చేయి వచ్చెను
మంతనపుఁగోరికల మట్టుమీరి చూడఁగానే
వింతైన నిలువుఁగొప్పు వీఁపుమీఁద వాలెను ॥ఇంతి॥

---

1. 'నీ చిత్త' అని వుండుట బాగేమో.

విరహపు టడవుల వేసవి యెండలు గాసి
వెరగంది ముక్కుపైకి వేలు వచ్చెను
బెరసే తమకమున పెం జెమటవాన వుట్టి
సరుస చనుఁగొండలసంది నేరువారెను ॥ఇంతి॥

చిత్తజ కేలిని నీవు శ్రీవేంకటేశ కూడఁగా
కొత్తఁగా మేనికి కొనగోరు వచ్చెను
హత్తిన సంతోసాన ఆయములెల్లాఁ గరఁగి
పొత్తుల మోవితెనె బువ్వాలు గలసెను ॥ఇంతి॥ 537

గౌళ

కలిగె నీకు నేఁడు కాంత రతివేళను
అలపు మీరఁగ నిట్టె యవధరించవయ్యా ॥పల్లవి॥

పడఁతి చెమట నీకు పన్నీటి జలకాలు
తడియొత్తు లాపె యందపు గుబ్బలు
జడిగొను మేని వాసనలు పరిమళాలు
చిడుముడి సిగ్గులే చీనాంబరములు ॥కలి॥

అంగన నిట్టూరుపులే యాలవట్టములు నీకు
రంగగు మాఁటలే కప్పురపుఁ బల్కులు
పొంగారు మోవితేనెలే పొత్తు గూడిన బోనాలు
చెంగటి తమ్ములములే చేకొన్న విడేలు ॥కలి॥

కొమ్మ కాఁగిలే నీకు కుందనపుఁ బెను మేడ
చిమ్ము గోరి తాఁకులే మించిన సొమ్ములు
ఇమ్ముల శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి
నెమ్మది మీ వలపులే నిండు నిధానములు ॥కలి॥ 538

## రామక్రియ

చూడఁ బిన్నదానవు సుద్దులు కోటానఁగోటి
వేడుకతో నీ విభుఁడు వెరగందెఁగదవే ॥పల్లవి॥

దవ్వులనుండే మొక్కలు తలపోఁత చొక్కులు
నివ్వటిల్ల నెన్నఁ డివి నేరిచితివే
పువ్వుల వేసే వాట్లు [1]పాట్టఁబొరుగునీట్లు
మువ్వంక నీ పతి చూచి మోహించెఁగదవే ॥చూడఁ॥

కడకంటి చూపులు కడుఁ దరితీపులు
వెడవెడగా నెంత వెద చల్లేవే
చిడుముడి మరఁగులు చెమటల కరఁగులు
బడినే నీ పతి చూచి పాయలేడుగదవే ॥చూడఁ॥

కావరపు మాటలు కాఁగిటి రతి తేటలు
లావుగా నెంతేసి కలయఁబెట్టేవే
మోవిపై పలు సోఁకులు మొనగోరి తాఁకులు
శ్రీవేంకటపతి చూచి చేరి కూడెఁగదవే ॥చూడ॥ 539

## వరాళి

మగని చిత్త మెరిఁగి మట్టుతో సేవ సేయవే
వెగటు గాకుండితేనే వేడుకలు మించును ॥పల్లవి॥

పలుమారు మాఁటాడితే బయటఁబడును గుట్టు
మలసి నవ్వు నవ్వితే మందె మేళమౌ
నిలిచి చూచితేను నిండును మొగమోటము
వెలి వెళ్లి తిరిగితే వెరపెల్లఁ బాసును ॥మగని॥

---

1. 'పాటఁ బొరుగు' రేకు

సారె నింటికి వచ్చితే జడియుఁ బెద్దరికము
పూరకె పెనఁగఁబోతే వొళ్లలసును
యీరాని వడిగితేను యేచి వలపు విరుగు
నేరుపులు చెప్పఁబోతే నిగుడు నారజము ॥మగ॥

వినయ మెదుగా నైతే వేసటలై తోఁచును
మనసు సోధిం(దిం?) చఁ బోతే మర్మా లంటును
యెనసె శ్రీవేంకటేశుఁ డింతలోనే నిన్ను నేఁడు
చనవు వెగ్గళమైతే సంతోసాలు రేఁగును ॥మగ॥ 540

శ్రీః శ్రీః శ్రీః

2001 2002 సంఖ్యలు గల రెండు రేకులు మాత్రమే మిగిలి యుండుటచే ఆ రేకుల పాటలను ఈ సంపుటములోనికే వ్రాయవలసి వచ్చినది.

## రేకు 2001 శ్రీరాగం

చెలియా రమణునికి చెప్పవే యీ సుద్దులెల్లా
తలకొన్న నేరుపులు తానే నేరుచును ॥పల్లవి॥

చూపులనే మరుగని చుట్టరిక మేఁటికే
రాఁపుగాఁ దమకించని రతు లవి యేఁటికే
యేపునఁ జొక్క జేయని యెడతాఁకు లేఁటికే
చాపలానఁ బెనఁగని సరసము లేఁటికే ॥చెలి॥

మనసు గరఁగనట్టి మాఁట లవి యేఁటికే
చనవుమై సోఁకని సరియాఁక లేఁటికే
ననుపు పెడరేఁచని నవ్వు లవి యేఁటికే
తనివిఁ బొందించని తరితీపు లేఁటికే ॥చెలి॥

కలియించఁ జాలని కత లిన్నీ నేఁటికే
తలఁపు నాఁటని చక్కఁదన మది యేఁటికే
యెలమి శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
అలరి మర్మములంటే యాఁకట మరేఁటికే ॥చెలి॥

## గౌళ

ఉవిద చూడవే యీతఁ డొక టొకటె గడించి
కవ గూడీ నేఁ దనకు కామించిన దానను ॥పల్లవి॥

మొగము చూచితిఁగాక మొనసి జంకించితినా
నగితిఁగాక గోరు నాఁటించితినా
తగులనాడితిగాక తను నే దూరితినా
యెగసక్కేలంటా నేల యెగ్గులు వట్టీనే ॥ఉవి॥

తలవంచుకొంటిఁగాక తనతో గర్వించితినా
అలసి కూచుంటిఁగాక అలిగితినా
సొలసి మొక్కితిఁగాక సోఁకఁబెనఁగితినా
చలమరినంటానేల సాదించీనే ॥ఉవి॥

తెరవేసుకొంటిఁగాక తేరి యెలఇంచితినా
అరసి మోవిచ్చితిగా కౌఁ గాదంటినా
యిరవై శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నేలె
యెరపు లేదంటా నెంత ఇమ్ముఁ గొనీనే ॥ఉవి॥ 2

## దేసాళం

మొగచాటు సేయకురే ముదితలాల పతికి
తగవెంచి చూచుకొని తానే పచ్చీఁగాని ॥పల్లవి॥

విడువక మూఁకొంటే విరుదా బసురువేసు
తడవుగా వీడెమైతే తాలిక గట్టు
వుడుగక మాఁటాడితే వూఁకొన వేసటవును
తడవకురే పతిని తానే వచ్చీఁగాని ॥మొగ॥

పలుమారుఁ గొసరితే పచ్చిదేరు వలపులు
తలపట్టి మొక్కఁ బోతే చండిపడును
కెలసి సారె నవ్వితే కేరడములై తోఁచు
తలఁపించి దూరకురే తానే వచ్చీఁగాని ॥మొగ॥

చెక్కు నొక్కి వేఁడుకొంటే చెమటలే చేయి నిండు
వెక్కసానఁ బెనఁగితే వీడుఁ దురుము
యిక్కడ శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
తక్కించకురే దినమూ తానే వచ్చీఁగానీ ॥మొగ॥ 3

## పాడి

ఏడనుండి వచ్చితివే యీడకు నీవు
వాడిక సేసుక యేమి వద్దఁ గూచుండేవే ॥పల్లవి॥

పవ్వళించియున్నవాని పాటలు వాడి లేపి
యివ్వల నూరకే యెంత యెలయించేవే
దివ్వెలెత్తుఁ బొద్దుకాడ తెరలోనవున్నవాని
రవ్వఁగా బిలిచి చదరంగా లేమాడేవే ॥ఎడ॥

ఆకడి మోమైనవాని నట్టె చెక్కునొక్కి తీసి
కాకరి మాఁటల నేమి కత చెప్పేవే
నాకడనుండినవాని నవ్వు నవ్వి కొనగోర
రేక దీసి తమి యెంత రేఁచవచ్చేవే ॥ఏడ॥

అలసియున్నవాని నట్టె కౌఁగిలించుకొని
మలసి మోవిచ్చి యెంత మరిగించేవే
యెలమి శ్రీవేంకటేశుఁ డిప్పు డిట్టె నన్ను (గూడె
వలపులు రేఁచి యేమి వావులు చెప్పేవే ॥ఏడ॥ 4

## శుద్ధవసంతం

వట్టి జంపు లిఁక మాతో వద్దు వద్దయ్యా
చుట్టరికా [1]లిద్దరివీఁ జూచుకోవయ్యా ॥పల్లవి॥

పంతమాడవచ్చుఁగాని పాయరాదు సతులను
రంతులేల మా యింటికి రావయ్యా
చెంతనుండి కొంతవడికి సిగ్గువడవచ్చుఁగాని
మంతుకెక్కిన వలపు మఱవరాదయ్యా ॥వట్టి॥

తేలఁజూచి యాఁడువారిఁ దిట్టు దిట్టవచ్చుఁగాని
లోలో తమకము నిలుపరాదయ్యా
పాలుపడి రాజసము పచరించవచ్చుఁగాని
వోలి విరహపుకాఁక లోరువరాదయ్యా ॥వట్టి॥

బిగిసి చెలులతోడఁ బెనఁగవచ్చుఁగాని
తగులైన పొందికలు దాఁచరాదయ్యా
అగపడి శ్రీవేంకటాధిప నన్నేలితివి
జిగిమించె నీ కతలు చెప్పరాదయ్యా ॥వట్టి॥ 5

## ఆహారి

పొందుసేయ నేర్చిన యీ పురుషుఁడే వలెఁగాని
ఇందుముఖులభాగ్య మెంత చేసుకోరాదే ॥పల్లవి॥

---

1. 'ఇద్దరివియును' లో యులోపించిన రూపము కావచ్చు.

చెలిమిసేయ నేర్చితే చిత్తమే కామధేనువు.
పలుక నేర్చితే నోరే పారిజాతము
సొలయనేరిచితేను చూపులే చింతామణులు
యెలమిఁ గాంతలభాగ్య మేమి సేసుకోరాదే ॥పొందు॥

సంతోసించ నేరిచితే సరసమే నిధానము
వంతునఁ గూడనేర్చితే వాడికే పెండ్లి
చెంత నవ్వనేర్చితే సిగ్గులే రత్నాలరాశి
యింతటాఁ జెలులభాగ్య మెంతసేసుకోరాదే ॥పొందు॥

పైకొన నేరిచితేను పాయమే బంగారుకొండ
యీకడ మెచ్చనేర్చితే యీపు సంజీవి
జోకతోడ శ్రీవేంకటేశుఁడు యిందరినిఁ గూడె
యేకాల మింతుల భాగ్య మెంత సేసుకోరాదే ॥పొందు॥ 6

**రేకు 2002** **శంకరాభరణం**

సతులకుఁ బతులకు సాజము లివి
సతమాయ వేడుకలు సరసము లాడవే ॥పల్లవి॥

తలపోతఁ లన్నియును తగులైనందాఁకనే
చలము పయ్యెదకొం[illegible] జారుదాఁకనే
నలువంక కసరులు నవ్వినయందాఁకనే
బలిమి యంతటి మీఁదఁ బచరించఁదగదు ॥సతు॥

మొనసిన గుంపెనలు మొక్కినయందాఁకనే
చెనకులు కొనగోరఁ జిమ్ముదాఁకానే
తనివోని యాసలు దగ్గరినయందాఁకానే
పెనఁగులాటలు మరి బెరయించదగదు ॥సతు॥

కడలేని సిగ్గులు కాఁగిలించినందాఁకానే
పొడిమెలఘూఁట లియ్యకొన్నదాఁకానే
యెడయక శ్రీవేంకటేశుఁ డిట్టె నిన్ను నేలె
వెడచేఁత లంతటిపై విచారించఁదగదు ॥సతు॥ 7

## గౌళ

ఏల పచ్చి సేసేవు న న్నిందరిలోనా
యేలినవాఁడవు నీవు ఇల్లాల నేను ॥పల్లవి॥

గుట్టుతోడిదానవని గొర నన్నూఁదకుమని
నెట్టుకొని మొక్కితిఁగా నేను నీకు
చిట్టకాలు మానుమని సిగ్గువరచకుమని
గట్టిగా నీ చెక్కు నొక్కి కడు వేఁడుకొంటిఁగా ॥ఏల॥

పెనఁగులాడకుమని పిసుకకు చన్నులని
వినయము సేసితిఁగా వేమారు నీకు
వొనర బొంకకుమని వొట్టులు వెట్టకుమని
యెనసి నే నిట్టే సేవలెల్లాఁ జేసితిఁగా ॥ఏల॥

యెప్పుడూఁ బాయకుమని యిన్నిటా వలతునని
చెప్పితిఁగా ప్రియములు సేనమారులు
యిప్పుడే శ్రీవేంకటేశ యేలితివి నన్ను నీవు
మెప్పించి రతుల నీతో మేలము తాడితిఁగా ॥ఏల॥ 8

## లలిత

పట్టకు పట్టకు నీ పాదాలకు నే మొక్కేను
జట్టి గొన్న నీ మేలుకు సంతోసించుకొంటిని ॥పల్లవి॥

యీవేళ నీ చెక్కు నొక్కి యెంతేసి వేఁడుకొనేవు
నీవు నన్ను మన్నించేది నే నెరఁగనా
ఆవటించి నాపై యాన లదేల పెట్టుకొనేవు
చేవదేరే నీ వలపు చిత్తజుఁ డెరఁగఁడా ॥పట్టు॥

కుచ్చి కాఁగిలించి నన్ను కోరి యెంత లాలించేవు
మచ్చి నీ మన్ననలు మఱచితినా
తచ్చి తచ్చి వూరివారి దారుకాణించ నేఁటికి
ముచ్చట నీ వోజలు మొగాన గానరాదా ॥పట్టు॥

వెలయ నీ మోవితేనె విందు లెంత వెట్టేవు
కలకాలము నీ పొందు కాణాచికాదా
యిలలో శ్రీవేంకటేశ యిన్నిటా నన్నేలితివి
వెలసిన నీ గుణాలు వినయాలేకావా ॥పట్టు॥ 9

## రామక్రియ

నీకంత గలిగితేను నీవు నా యీడుకు రావే
చేకొని నీ యెమ్మె లేమి చెప్పవచ్చేవే ॥పల్లవి॥

పంతములే వలసితే పను లీడేరించవలె
వంతులకుఁ బెనఁగితే వాసి వలెను
చెంతల మాఁటాడితేను చెల్లుబడి గావలె
ఇంతిరో నాతోడి సాటి కేలవచ్చేవే ॥నీకంత॥

దొరతనమే కలిగితే తోడ సరిఁదూగవలె
సరసము లాడేనంటే జాణ గావలె
వగుస వం తడిగితే చలపించనేరవలె
తరుణిరో నాతో నెంత తగవుకు వచ్చేవే ॥నికంత॥

రచ్చకెక్కఁ జెనకితే రతులఁ జొక్కించవలె
యిచ్చగించి నవ్వితేను యింపుగావలె
యిచ్చట శ్రీవేంకటేశుఁ డిన్నిటా నన్నేలినాఁడు
నెచ్చెలిరో నన్ను నేమి నిక్కిచూడ వచ్చేవే ॥నీకంత॥ 10

## వాదరామక్రియ

తెలిసితే నీయందే తేటతెల్లమౌ నిది
అలమేలుమంగ నీయందే కనుకొనవే ॥పల్లవి॥

యెంచరాదు పంచరాదు యెన్నిగలవే చుక్కలు
ముంచితేఁ జేటలకొద్ది ముత్తియములు
పెంచక పెరగె నవె పెనుఁజీఁకటి తీగెలు
అంచె నీ యారచి కత కారునెల్లు [1]గళువు ॥తెలి॥

అనరాదు వినరాదు అగ్గువాయఁ దెమ్మెరలు
కనకపుఁ గొండ లెక్కెఁగదె చంద్రుఁడు
మొనసి మరుని బాణముల గెంజాయలు రేఁగె
యెనసిన యీ యారచి కేడాది గళువు ॥తెలి॥

కుచ్చరాదు తచ్చరాదు గుంపులాయను నవల
పచ్చిదేరెఁ గదవే పాయమెల్లాను
యిచ్చట శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్ను నేలె
యిచ్చల నీ యారచికి నెన్నాళ్లైనా గళువు ॥తెలి॥ 11

## పాడి

ఎంత వేడుకకాఁడే యిదివో తాను
చెంత నిందరూఁ జూడఁగా జెనకీ నన్ను ॥పల్లవి॥

---

1. 'గడువు' కావచ్చు.

వూరఁగల వలపెల్లా నొడిఁగట్టుకొనివచ్చి
నారుకొన నాతో నేమి నవ్వు నవ్వీనే
తేరకాఁడు మోవితేనె లారగించి యన్నువట్టి
పొరితెంచి వద్ద నేమి పవ్వళించీనే ॥ఎంత॥

తరుణుల వావు లెల్లా తలమోచుక యలసి
పొరుగుకు వచ్చి దప్పిఁ బొరలనేలే
వొరసి చనుఁగొండల వొత్తున మేను కుమ్మొలై
యిరవై మా యింట గస్తూరేమి మెత్తుకొనీనే ॥ఎంత॥

నెట్టుకొన్న రతులెల్లా నేరుచుక చెలరేఁగి
గుట్టుతో నాపై నెంత గుదిగుచ్చీనే
యిట్టె శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్నుఁ గూడె
చుట్టి తనచేఁత లిందుఁ జూపనేల వచ్చీనే ॥ఎంత॥ 12

[1]కట్ట ౧ కి 1 రేకులు ౧౨ శ్రీః శ్రీః శ్రీః

1. ఈ వ్రాత నా జూచినంతలో ఈ ఒక్కరేకులోనే కనపడుచున్నది. దీని భావము అర్థమగుటలేదు.

## 1- వ అనుబంధము

## అకారాదిగ రాగ - సంకీర్తన సంఖ్యా సూచి

| రాగములు | సంకీర్తన సంఖ్యలు |
|---|---|
| ఆందోళి | 208 |
| ఆరిబి | 212 |
| ఆహిరి | 21, 25, 50, 73, 80, 86, 93, 101, 124, 134, 151, 166, 174, 178, 181, 191, 200, 210, 239, 245, 250, 280, 290, 300, 314, 319, 364, 393, 402, 405, 425, 431, 448, 451, 469, 490, 500, 518, 525, 537 |
| ఆహిరినాట | 92, 106, 138, 274, 318, 462 |
| కన్నడగౌళ | 171, 262, 449 |
| కాంబో(భో)ది | 7, 37, 48, 60, 72, 81, 112, 146, 167, 169, 177, 206, 222, 247, 276, 297, 329, 336, 370, 452, 454, 522. |
| కుంతలవరాళి | 62, 224, 249 |
| రాగములు | సంకీర్తన సంఖ్యలు |
| కేదారగౌళ | 165, 330, 461 |
| గుండక్రియ | 95, 214 |
| గుజ్జరి | 46 |
| గుమ్మకాంభోది | 87 |
| గౌళ | 20, 26, 33, 55, 71, 107, 118, 135, 149, 154, 197, 219, 281, 298, 321, 429, 487, 495, 510, 529, 538 |

| రాగములు | సంకీర్తన సంఖ్యలు |
|---|---|
| తెలుఁగుఁగాం (కాం)బోది | 231, 244, 258, 264 |
| తోండి | 68 |
| దేవక్రియ | 100 |
| దేవగాంధారి | 84, 109 |
| దేశా(సా)క్షి | 117, 147, 160, 213, 235, 419 |
| దేసాళం | 18, 28, 35, 45, 64, 89, 121, 142, 153, 168, 175, 189, 202, 283, 313, 352, 357, 368, 382, 409, 421, 466, 480, 489, 491, 496, 499, 515, 535 |
| నాగగాంధారి | 288 |
| నాగవరాళి | 150, 246, 311, 347 |
| నాట | 196 |
| నాదరామక్రియ | 12, 24, 32, 42, 51, 83, 96, 207, 216, 228, 243, 282, 291, 31[illegible], 324, 340, 376, 391, 416, 475, 512 |
| నారాయణి | 94, 161 |
| పళవంజరం | 58, 278 |
| పాడి | 2, 15, 29, 39, 65, 69, 105, 110, 116, 123, 128, 136, 152, 179, 188, 195, 201, 223, 230, 236, 254, 261, 279, 284, 303, 308, 317, 320, 335, 354, 356, 375, 377, 380, 401, 426, 428, 437, 442 |

## 2 - వ అనుబంధము

## అకారాదిగ సంకీర్తన రాగ సంఖ్యాసూచి

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| అందుకే విచారించే | బౌళి | 422 |
| అందుకే వెరగయ్యీ | శంకరాభరణం | 299 |
| అందుకే వెరగయ్యీ | గౌళ | 20 |
| అందుకే సంతోస | గౌళ | 487 |
| అక్కచెల్లెండ్లము | శుద్ధవసంతం | 182 |
| అటు గనక | సామంతం | 453 |
| అటువంటి సతి | పాడి | 303 |
| అట్టె నిన్నుఁ జూచి | కాంబోది | 167 |
| అడుఁగఁగరాదు | వరాళి | 410 |
| అడుగరే యక్కలాల | కాంబోది | 177 |
| అది యెవ్వతె | ముఖారి | 43 |
| అద్దములోఁ జూచు | ముఖారి | 527 |
| అన్నిటా దొరవయితే | దేసాళం | 175 |
| అన్నిటాను మేలు | ఆహిరి | 210 |
| అన్నిటాను వెగ్గలైన | మాళవిగౌళ | 446 |
| అన్నిటా బలిమికాఁడ | లలిత | 509 |
| అప్పటనుండి నాకు | బౌళి | 56 |
| అప్పటనుండి వెరగయ్యీ | సామంతం | 115 |
| అమ్మలాల | గౌళ | 321 |
| అరవిరి బాగుల | నాదరామక్రియ | 391 |
| అలమేల్మంగనే | రామక్రియ | 148 |
| అలమేలుమంగపతి | బౌళి | 27 |

**2001-2002 రెండు రేకులలోని పాటల**

**అకారాది సూచి**

| | | |
|---|---|---|
| ఏల పచ్చి | గౌళ | 8 |
| చెలియా రమణునికి | శ్రీరాగం | 1 |
| తెలిసితే నీయందే | నాదరామక్రియ | 11 |
| నీ కంత గలిగితేను | రామక్రియ | 10 |
| పట్టకు పట్టకు | లలిత | 9 |
| పొందుసేయ | ఆహిరి | 6 |
| మొగచాటు | దేసాళం | 3 |
| వట్టి జంపు | శుద్ధవసంతం | 5 |
| సతులకు (బతులకు | శంకరాభరణం | 7 |

## 2001-2002 రెండు రేకులలోని
## అకారాదిగ రాగ సంకీర్తన సంఖ్యా సూచి

| రాగములు | సంకీర్తన సంఖ్యలు |
|---|---|
| ఆహిరి | 6 |
| గౌళ | 2,8 |
| దేసాళం | 3 |
| నాదరామక్రియ | 11 |
| పాడి | 4,12 |
| రామక్రియ | 10 |
| లలిత | 9 |
| శంకరాభరణం | 7 |
| శ్రీరాగం | 1 |
| శుద్ధవసంతం | 5 |




❀ ❀ ❀

